వశపఱచుకోనుటకై యనార్య దేవతలను గ్రహించి యాదరించి పూజింప సాగిరి. వీరు వేటకాంధ్ర దేవతయగు 'మురుగ' ను స్కందకుమారుడనియు, షణ్ముఖుడనియు, కుమారస్వామియనియు పేరువెట్టి శివునికుమారుని( జేసిరి" అని చిలుకూరి వీరభద్రరావు గారు పేర్కొన్నారు. ఆంధ్ర శాతవాహనుల మూలపురుషుడైన శాతవాహనుడు యక్షునకు బ్రాహ్మణ కన్య యందు జన్మించినట్లు ఒక కథ ప్రచారంలో ఉంది. అందువల్ల అటవికులైన బోయల్లో వైదిక మతాన్ని చొప్పించడానికి కార్తికేయారాధనే అత్యున్నత మార్గంగా పిళ్ళైగారు భావించారు.

బాలసుబ్రహ్మణ్యం పిళ్ళైగారు ఈ నవలలో గొప్ప తార్కికతను ప్రదర్శించారు. జయసింహ వల్లభుడు, అర్కభాట్టారకుల మధ్య జరిగిన సంభాషణ పిళ్ళైగారి తార్కిక పరిజ్ఞానానికి నిదర్శనం. జయసింహుడు 'మనమందరం తెలుగు ప్రజలం. తెలుగుదేశం అంతటిని ఒకే రాజ్యంగా చెయ్యాలి. తమిళులైన పల్లవుల్ని తెలుగు ప్రాంతం నుండి తరిమివేయ్యాలి' అని ఆర్కాభట్టారకుడితో చెబుతాడు. దీనికి సమాధానంగా అర్క భట్టారకుడు "మీ పెద తండ్రి గారు ఉదారస్వాభావముతో తెలుగునేలను మీ తండ్రిగారికి ధారవోసి స్వతంత్ర రాజ్యముగా వెలయించినాడు కనుక సరిపోయింది కాని లేనిచో ఈ పాటికి ఈ తెలుగునేల బాదామి సామ్రాజ్యమును కన్నడిగులతో కలిసిపోయి యుండెడిది కాదా? మన భాగ్యవశమును హర్షవర్ధనుడు ఓడినాడు కనుక సరిపోయింది. కానీ, అతడే గెలిచి యుండిన యెడల ఈ తెలుగువారును, ఆ కన్నడిగులను అందరమును కన్యాకుబ్జ సామ్రాజ్యమును చేరిపోయి ఆ ఉత్తరాది భాషల వారికి దండములు పెట్టెడివారము కదా? మేము తెలుగువారమై యుండియు, నిన్నటివరకు పల్లవరాజ్య ప్రజలుగా నుంటిమి. ఈనాడు వేంగిరాజ్య ప్రజల మైతిమి. పల్లవరాజ్యమును స్వాధీనము చేసికొనవలెనను కోరిక మీకు లేదా. మీ కోరిక నెరవేరినచో తమిళుల గతియేమి? వారు ఏ రాజ్యము వారు? వారు వేంగిరాజ్య ప్రజలగుదురా? కనుక జాత్యభిమానము, భాషాభిమానము ఇక చెల్లవు. బలమున్నవాని జాతియే ప్రజలజాతి. బలమున్న వాని భాషయే ప్రజల భాష" అని జయసింహ వల్లభునితో చెప్పిన మాటలు పిళ్ళైగారు తార్కిక ఆలోచనకు నిదర్శనం.

పులిరాజు చాళుక్య ఆడపడుచైన జయశ్రీని వివాహం చేసుకుంటాడు. పొన్నిదొర పల్లవ రాకుమారి అయిన వకుళను పెండ్లాతాడు. ఈ విధంగా అటవికులైన బోయదొరలు నాటి పాలకులైన పల్లవ, చాళుక్యులతో వివాహ సంబంధాలు కలిగి ఉండడాన్ని బట్టి అప్పటికి ఇంకా కులవ్యవస్థ ద్రవస్థితిలోనే ఉందని స్పష్టమవుతుంది. "చాళుక్యయుగంలో సామాజికంగా ఆసక్తికరమైన పరిణామాలు జరిగినాయి. అందొకటి–తరచుగా జరిగిన యుద్ధాల వల్ల, ఆగ్రహారాల ద్వారా, వ్యవసాయి విస్తరణ వల్ల బోయలవంటి ఆటవిక జాతులు నాగరిక సాంప్రదాయక సమాజంలో భిన్న కులాలలో చేరినారు" అని డా. బి.యస్.యల్. హనుమంతరావు గారు చెప్పిన మాటలు నాటికాలంలో అనేక అటవిక జాతులు నాగరిక సమాజంలో చేరిన విషయాన్ని దృఢపరుస్తున్నాయి.

7వ శతాబ్దిలో దక్షిణ భారతదేశంలో పల్లవులు, చాళుక్యులు, రాష్ట్రకుటులు, పశ్చిమ గంగులు ప్రధాన రాజావంశాలు. వీరి సామ్రాజ్య విస్తరణాకాంక్షకి దక్షణ భారతదేశం మొత్తం ఒక పెద్ద యుద్ధశిబిరంగా తయారైంది. ఈ ప్రధాన రాజ్యాలు తమ రాజ్య రక్షణ కోసం సరిహద్దులలో సామంతరాజ్యాలను ప్రోత్సహించారు. బాణులు, వైదుంబులు, నోలంబులు, ముదిగొండ, వేములవాడ చాళుక్యులు మొదలైన సరిహద్దు సామ్రాజ్యాలు ఈ విధంగానే ఏర్పడ్డాయి. శత్రురాజులు తమపై దాడిచేసినప్పుడు ప్రధానరాజ్యాలు ఈ గడి సామంతుల్ని రక్షణ కవచాలుగా ఉపయోగించుకునేవారని తెలుస్తుంది.

"చాళుక్యులు చీటికి మాటికి పల్లవ రాజ్యముపై దండెత్తుచున్నారు. పల్లవుల ఉత్తర సరిహద్దు దుర్గము అడ్డెక్కి దానిని దాటిన తరువాత చాళుక్య సైన్యము ఎకాఎకిని కందుకూరుపై పడుచున్నది. మధ్యలో బోయకొట్టములు వంటి మరియొక అడ్డంకి ఉండుట మంచిది. బోయలు తమ స్థావరమును కాపాడుకొనుటకు ప్రాణము లొడ్డి పోరాడుదురు వారు మేటిధనుష్కులు చాటుదెబ్బతీయుటలో నిపుణులు. సత్యాశ్రయుడు మొదటి దండయాత్ర చేసినపుడు ఈ బోయదొరలు చాటు దెబ్బకొట్టి చాళుక్యసైన్యమునకు పెద్దనష్టము కలిగించిన విషయము అందరెరిగినదే.

బోయదుర్గములు పటిష్టమగుట పల్లవులకు లాభదాయకము. కావున వారికి కావలసిన సహాయముచేసి వారిని కృతజ్ఞతాపాశముతో కట్టివేసుకోవలె" అని జయవర్మ ఆలోచించి, బోయలను ఆదరించాడు. జయవర్మ పథకం నాటి పాలకుల స్వార్థాన్ని తెలియజేస్తున్నాయి.

7వ శతాబ్దిలో పాలకులు నిరంతరం యుద్ధాలలో మునిగితేలారు. వీరి దండయాత్రల వల్ల పాడిపంటలు నాశినమయ్యాయి. యుద్ధాలు చెయ్యడానికి అధిక మొత్తంలో ధనం అవసరమైంది. ఈ ధనం కోసం పాలకులు సామాన్య ప్రజలు, చేతివృత్తుల వారు, వర్తకుల నుండి విపరీతంగా పన్నులు వసూలు చేశారు. "పూర్వమెప్పుడో ఆరింట ఒక భాగము పన్నుగా ఉండెడిది. అది నాలుగింట ఒక భాగమునకు హెచ్చెను. ఇప్పుడు మూడింట ఒక భాగమునకు హెచ్చిపోయెను. ప్రజలకు సుఖశాంతులు నిప్పచ్చర మాయెను. ఇది ఇప్పటి భరతఖండ స్వరూపము, స్వభావము" అని చెప్పిన అర్కభట్టారకుడి మాటలు ఆనాటి ప్రజల దుర్భర పరిస్థితులని తెలియజేస్తున్నాయి. అందుచేతనే 'రాజు సామీప్యం' ఈతి బాధలలో ఒకటిగా పేర్కొన్నారు.

సాధారణంగా నవలల్లో వ్యవహారిక, మూండలిక భాషలను ఉపయోగిస్తారు. కాని ఈ నవలను పిళ్ళెగారు సరళ గ్రాంధికంలో రాశారు. "నేడు వ్యవహారిక భాష ప్రాంతీయ, మాండలిక, వర్ణ, వర్గ, వాద భేదాలతో కొట్టుమిట్టాడు చున్నది. పరస్పర విద్వేషములను కూడా సృష్టించుచున్నది. పత్రికలలో అతి జుగుప్సాకరమైన వ్యాఖ్యానాలు జరుగుచున్నవి. కనుక ఇప్పుడు నేను ఈ నవలను సరళ గ్రాంథికములో వ్రాయుటకు పూనుకొన్నాను" అని పిళ్ళెగారు ఈ నవల సరళ గ్రాంధికంలో రాయడానికి కల కారణాన్ని పేర్కొన్నారు. రచయిత మాటలు కొంత వరకు వాస్తవంగా కనిపిస్తున్నాయి. తెలంగాణ మాండలికంలో రాసిన నవలలు కోస్తా, రాయలసీమ ప్రాంతాల వారికి, అదే విధంగా రాయలసీమ మాండలిక నవలలు మిగిలిన రెండు ప్రాంతాల వారికి చదవి, అర్థం చేసుకోవడం ఇబ్బందిగా ఉ ంటుంది. పిళ్ళెగారి ఈ నవలను తెలుగువారందరికి అర్థమయ్యేలా సరళ గ్రాంధికంలో రాశారు.

ఈ నవల్లో పిళ్ళెగారు స్త్రీ పాత్రలను అత్యున్నతంగా చిత్రించారు. మొదటి వీరనబోయని మరణాంతరం బోయకొట్టాల బాధ్యతను అతని భార్య మంగసాని నిర్వహిస్తుంది. చాళుక్యరాజు జయసంహ వల్లభుడు బోయకొట్టాలపై దాడి చేసినప్పుడు మంగసాని తన మాటలూ, చేతల ద్వారా అతనిని ప్రసన్నం చేసుకొని, బోయలను కాపాడుతుంది. రెండవ వీరనబోయనికి అతని పిన్న తల్లి అన్నె మసాని మార్గదర్శిగా ఉంటుంది. రెండవ వీరనబోయని భార్య జయశ్రీ బోయల్లో చాళుక్య నాగరికత చొప్పించడానకి ప్రయత్నింస్తుంది. ఆమె ప్రభావం వలన బోయలు పల్లవులతో యుద్ధం చేయ్యవలసి వస్తుంది. పొన్ని బోయని భార్య, పల్లవరాకుమారి అయిన వకుళ బోయల్లో కలసిపోయి, బోయస్త్రీలతో సైన్యం తయారు చేస్తుంది. కడియరాజు బోయకొట్టాలపై దాడి చేసినప్పుడు అతనిని ఓడించడంలో ప్రధాన పాత్ర పోషిస్తుంది. "ఒక చాళుక్య వనిత ఆనాడు ఒక బోయయువకుని పెండ్లాడి వానిని చాళుక్యునిగా మార్చివైచినది. ఈ నాడు ఒక పల్లవ వనిత బోయదొరను పెండ్లాడి తానే బోయవనితగా మారుచున్నది. ఓ స్త్రీ నీవు ఎంతకైనను తగుదువు ఏమైనను చేయగలవు. ఏ రూపమునైనను ధరింపగలవు. నీకు అసాధ్యమేదియు లేదు. నీకు జోహార్లు" అని పొన్నిబోయడు అన్న మాటలు ఈ నవలలో స్త్రీల సామార్థ్యానికి నిదర్శనం.

ఈ నవల ద్వారా పిళ్ళెగారిని గొప్ప సంఘసంస్కర్తగా చెప్పవచ్చు. బ్రాహ్మణులు ఒక స్త్రీ చేత సహగమనం చేయిస్తున్నప్పుడు, కసవనబోయడు అడ్డుపడి ఆమెను కాపాడుతాడు. ఆ సందర్భంలో కసవనబోయడు అక్కడ ఉన్న బ్రాహ్మణులను "మీరు ఏ మహారాజుకైనను మొఱపెట్టుకొనుడు. నాకు లెక్కలేదు. నా బొందిలో ప్రాణమున్నంత వరకు నా నేలపైన ఇటువంటి క్రూరకర్మ జరగనివ్వను" అని హెచ్చరిస్తాడు. ఈ సందర్భంలో పిళ్ళెగారు కసవనబోయని పాత్రను రాజారామ్మోహన్ రాయ్ కి ఆదర్శం అన్నట్లుగా చిత్రించారు.

సహగమనాన్ని అడ్డుకున్నప్పుడు బ్రాహ్మణులు 'మా ఆచారవ్యవహారాల్లో ఇతర కులస్తుల ప్రమేయాన్ని ఒప్పుకోము' అని వీరనబోయని అడ్డుకుంటారు. అప్పుడు వీరనబోయడు 'ఈ బ్రాహ్మణ శరీరం శూద్రులు పెట్టిన

తిండితో బలిసింది. మీకు దానాలూ, సంభారాలూ, మాన్యాలూ ఇవ్వడానికి శూద్రులు కావాలి. మీ వ్యవహారాలు విచారించడానికి శూద్రులు పనికి రారా? మా రాజ్యంలో బ్రాహ్మణులకు ఒక ధర్మం. ఇతరులకు మరొక ధర్మం లేదు. అందరికీ ఒకే ధర్మం' అని బ్రాహ్మణులతో అన్న మాటలు పిళ్ళెగారి సర్వసమానత్వ భావనకు నిదర్శనం.

ఈ నవల్లో పిళ్ళెగారు ముమ్మెనవాలు(త్రిశూలం), కుడుకలు, కంచుకములు, సాతు, గొల్లెనలు, బచ్చులు, తాపలు, గోతములు దుత్త, బానసము(వంటగది), ఒజ్జలు, బొక్కెనలు మొదలైన అచ్చ తెలుగు పదాలు ఉపయోగించారు. "నేడు మనం మాట్లాడే భాషలో అన్యదేశ్యపదాలు కోకొల్లలు. అన్యదేశ్యాలు లేకుండా మనం కాస్సేపుకూడా మాట్లాడటం దుష్కరం. నవల ప్రాచీనకాలానికి చెందినదవటంవల్ల అన్యదేశ్యాలు సుతరామూ వాడకుండా దేశ్య తత్సమ తద్భవాలతోనే కథ నడిపించారు. మన భాషలోని దేశ్య శబ్దాలు అనేకం నేడు అటకెక్కాయి. అటకెక్కిన దేశ్యపదాలను ఆత్మీయంగా స్వీకరించి నవలలో పిళ్ళెగారు ఉపయోగించారు" అని గాడేపల్లి దివాకరదత్తు గారు ఈ నవల ముందు మాటలో పేర్కొన్నారు.

ఏ కావ్యానికైనా సామెతలు, జాతీయాలు మరింత శోభను చేకూర్చుతాయి. ఈ నవల్లో పిళ్ళెగారు 'ఆబోతులు ఆబోతులు పోట్లాడుకొనగా మధ్య దూడలు నలిగినట్లు' 'ఏనుగు పోటు కంటె ఇరుపోటు మేలందురు' 'చెట్టు లేని చోట ఆముదపుచేట్టే మహావృక్షము' 'పాలు త్రాగిన రొమ్మునే గ్రుద్దెడివారు' 'తిన్న ఇంటి వాసములు లెక్కపెట్టెడి వారు' మొదలైన సామెతలను ప్రయోగించారు. అదేవిధంగా 'యథా రాజా తథా ప్రజా' 'కడుపున అగ్గిపోసినట్లు' 'చెప్పుకింద తేళ్ళవలె' మొదలైన జాతీయాలు ఉపయోగించారు. ఈ విధంగా పిళ్ళెగారు ఈ నవలను అచ్చమైన తెలుగు కావ్యంగా రూపొందించారు.

ఈ నవల పిళ్ళెగారి వర్ణన నైపుణ్యాన్ని, భాషా ప్రయోగ సామర్థ్యాన్ని మన కళ్ళ ముందుంచుతుంది. బోయలు చాళుక్యుల పాలనలో ఉన్నప్పటికీ, వారికి మొదట ఆదరించిన పల్లవులంటె ఇష్టం. ఈ విషయాన్ని రచయిత 'మాటలు చాళుక్యుల వైపు ఎదలు పల్లవుల వైపు' అనే చిన్న వాక్యంలో వ్యక్తం చేశాను. వకుళ వ్యక్తిత్వాన్ని 'వకుళ శక్తియందు అపర దుర్గ, భక్తియందు ప్రహ్లాదమూర్తి' అనే ఒక్క వాక్యంలో ధ్వనింపజేశారు. ఈ నవలను పిళ్ళెగారు తన తెలుగు భాషా పరిజ్ఞానానంతా ఉపయోగించి అత్యంతాద్భుతంగా రచించారు.

"తూర్పు చాళుక్య రాజ్యస్థాపనతో మధ్యయుగం ప్రారంభమవుతుంది. రాజకీయ అనైక్యత, అంతర్యుద్ధాలు, వ్యవసాయ ఆర్థిక విధానం, పురోహితుల ప్రాబల్యం, మూఢవిశ్వాసాలతో కూడిన మతం విద్యాలకు ఆధారం కావడం వంటి మధ్యయుగ లక్షణాలీకాలంలో స్పష్టంగా కన్పిస్తాయి" అని డా. బి.యస్.యల్. హనుమంతరావు గారు చెప్పిన మాటను నవలగా రాస్తే అది బోయకొట్టములు పంద్రెండు.

బోయకొట్టములు పంద్రెండు అసలుసిసలైన తెలుగు వీరుల వీరగాథ

"ఈ నవలలోని–

ఇతివృత్తం కావ్యేతివృత్తం,

భాష కావ్య భాష,

శైలి కావ్య శైలి,

కల్పనలు కావ్య కల్పనలు,

ఇది తెలుగువారు తప్పక చదవవలసిన వచన మహాకావ్యం" అని అన్న గాడేపల్లి దివాకరదత్తు గారి మాటలు ఎంత మాత్రం అతిశయోక్తి కాదు.

# ఉపయుక్త గ్రంథాలు


1. కరణం బాల సుబ్రహ్మణ్యం పిళ్ళై – బోయకొట్టములు పండ్రెండు, అమర్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, మదనపల్లి, డిసెంబర్ 2013
2. ఆచార్య జి. నాగయ్య – తెలుగు సాహిత్య సమీక్ష (మొదటి సంపుటి), నవ్య పరిశోధక ప్రచురణలు, తిరుపతి, ఆగష్టు 2004
3. శ్రీ వేటుకూరి ప్రభాకర శాస్త్రి – సింహావలోకనము, మంజరి ప్రచురణలు, ముక్యాల, 1955
4. నన్నెచోడుడు – కుమార సంభవం, జొన్నలగడ్డ మృత్యుంజయరావు, తెలుగు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్, 1994
5. డాక్టర్ బి.యస్.ఎల్. హనుమంతరావు – ఆంధ్రుల చరిత్ర, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్, జూలై 2014
6. పి.వి.కె. ప్రసాదరావు – ఆంధ్రప్రదేశ్ సమగ్ర చరిత్ర, ఎమెస్కో బుక్స్, విజయవాడ, జనవరి 2008
7. డా॥ పింగళి లక్ష్మీకాంతం – ఆంధ్ర సాహిత్య చరిత్ర, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాద్, 1974
8. డా॥ దివాకర్ల వేంకటావధాని – ఆంధ్ర వాఙ్మయ చరిత్రము, ఆంధ్ర సారస్వత పరిషత్, హైదరాబాద్, 1961
9. ఆరుద్ర – సమగ్ర ఆంధ్ర చరిత్ర (మొదటి సంకలనము), తెలుగు అకాడమి, హైదరాబాద్, 2012
10. శ్రీరంగం శ్రీనివాసరావు(శ్రీశ్రీ) – మహా ప్రస్థానం, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్, జూన్ 2006
11. కె.కృష్ణారెడ్డి – భారతదేశ చరిత్ర (ప్రాచీన యుగం), ఓరియంట్ బ్లాక్ స్వాన్ ప్రైవేట్ లిమిటెడ్, హైదరాబాద్, 2016
12. డా.నెలటూరు వేంకటరమణయ్య – పల్లవులు–చాళుక్యులు, వేదము వేంకటరాయ శాస్త్రి అండ్ బ్రదర్స్, మద్రాసు, 1969

# తెలుగు మాండలికాలలో సాంస్కృతిక పదాలు : బంధు వాచకాల సేకరణ - సమస్యలు

**డా॥ సి.హెచ్. చంద్రయ్య**
పోస్ట్ డాక్టరల్ ఫెలో
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాద్, తెలంగాణ.
చరవాణి : 9441671609
Email : chamanapally1976@gmail.com

మనిషి సంఘజీవి. ఒక మనిషి నుండి మరొక మనిషికి ఎన్నో అవసరాలు ఉంటాయి. సమాజంలో ఒకరి నుండి లేదా ఇతరుల నుండి సమాచారాన్ని తీసుకోవడానికి, అలాగే సమాచారాన్ని ఇవ్వడానికి భాష అవసరం అవుతుంది. ఒకరి మనోభావాలను, కోరికలను, ఉద్రేకాలను ఇతరులతో పంచుకోవడానికి భాష ఉపయోగపడుతుంది. 'భాస్' అనే ధాతువు నుండి 'భాష' పుట్టింది. 'భాష్యతి ఇతి భాష' అంటే భాషించబడేది భాష. భాషించడమంటే మనసులోని భావాలను కంఠధ్వనుల ద్వారా తెలియజేయడం. ప్రపంచంలో వేల భాషలు ఉన్నాయి. వాటిని రకరకాల భాషా కుటుంబాలుగా విభజించారు భాషా శాస్త్రవేత్తలు. అందులో తెలుగు ద్రావిడ భాషా కుటుంబానికి చెందినది. ద్రావిడ భాషలో 23 భాషలు ఉన్నాయి. ద్రావిడ భాషలో మరలా 23 భాషలను మూడు ఉప కుటుంబాలుగా విభజించారు. అందులో తెలుగు మధ్య ద్రావిడ భాషా కుటుంబానికి చెందినది. తెలుగు నాగరిక భాష కలిగి ఉంది. అంటే లిఖిత భాష అన్న మాట. ప్రతి భాషకు మాండలికం ఉన్నట్లే తెలుగు భాషకు కూడా నాలుగు మాండలికాలు ఉన్నాయి. లిపి సాహిత్యం లేని ఆటవికులు మాట్లాడే భాషలను ఆంగ్లంలో 'డయలెక్ట్' అనేవారు. కానీ భాషా శాస్త్రంలో ఈ పదం ఒకే భాషలో ఉన్న రకాల్ని సూచించడానికి మాత్రమే వ్యవహరిస్తున్నారు.

ఒకే కాలానికి చెందిన భాషలో కూడా రకరకాల భేదాలు ఉంటాయి. అదే విధంగా ఒక భాష వ్యవహర్తలందరూ ఒకే విధంగా మాట్లాడరు. భాష వ్యవహారంలో కులాన్ని బట్టి, ప్రాంతాన్ని బట్టి, వృత్తిని బట్టి, విద్యార్హతలను బట్టి వ్యక్తులు మాట్లాడే భాషలో తేడాలు ఉంటాయి. ఒకే భాషకు ప్రజల వ్యవహారంలోను, పదాలలోను, వాటి ఉచ్చారణలోను, ప్రత్యయాలలోను, పదాల అర్థాలలోను భేదాలు ఉండి రకరకాలుగా ఉంటుంది. ఒకే భాషకు ఉన్న ఇటువంటి రకాలను 'మాండలికాలు' అంటారు. మాండలికాలలో అన్ని రకాల వర్గాలకు మాండలిక భేదాలు ఉన్నట్లే బంధు వాచకాల్లోనూ భేదాలు ఉన్నాయి.

తెలుగు మాండలికాలలో బంధు వాచకాలు : సమాజంలో వ్యక్తులు ఒకరినొకరు పిలవడానికి, పలకరించడానికి కొన్ని పేర్లను ఉపయోగిస్తాం. వస్తువులను, జంతువులను గుర్తించడానికి పేర్లు పెడతాం. అలాగే మనుషులకూ పేర్లు ఉన్నాయి. మనిషి ఇంకొక మనిషిని పిలవడానికి పేర్లు ఉన్నాయి. మనిషి తన సొంత మనషులను పిలవడానికి బంధు వాచకాలు పెట్టుకున్నాడు. ఈ బంధు వాచకాల ద్వారా అతని బంధువులను పిలవడం జరుగుతుంది. బంధువుల గురించి తెలిపే పదాన్ని బంధు వాచకం అంటాం. మన రాష్ట్రంలో నాలుగు రకాల మాండలికాలు ఉ

న్నాయి. మన రాష్ట్రాన్ని తెలంగాణ, ఆంధ్ర, కళింగాంధ్ర, రాయలసీమ అనే నాలుగు ప్రాంతాలుగా విభజించారు భద్రిరాజు కృష్ణమూర్తి గారు. నేను కేవలం ఒక్కో ప్రాంతం నుండి ఒక్కో జిల్లాను తీసుకొని బంధు వాచకాలను సేకరించాను. ఇందులో దాదాపుగా అన్ని బంధు వాచకాలను తీసుకున్నాను. అవి ఏ ప్రాంతంలో ఏయే పేర్లతో పిలవబడుతున్నాయో వాటిని సేకరించారు. తెలంగాణ నుండి కరీంనగర్‌ను, ఆంధ్ర నుండి గుంటూరును, కళింగాంధ్ర నుండి శ్రీకాకుళంను, రాయలసీమ నుండి కడపను తీసుకున్నాను.

**బంధువాచకాలు:**

| ఆరోపం | తెలంగాణ | ఆంధ్ర | కళింగాంధ్ర | రాయలసీమ |
|---|---|---|---|---|
| తాత<br>(తండ్రి తండ్రి) | తాత/జేజి నాయన | అయ్యా నాన్న | తాతీయ/తాత్య | అజ్జ/అజ్జిప్ప/జేజినాయన |
| నాయనమ్మ | అమ్మ/నాయనమ్మ | అమ్మమ్మ/జేజి/బామ్మ | అమ్మమ్మ | అవ్వ/జేజి |
| అమ్మమ్మ | అమ్మ/అమ్మమ్మ | అవ్వ | మమ్మ | అవ్వ |
| తల్లి తండ్రి | తాత | తాతా | తాత | అవ్వతాత |
| తండ్రి | అయ్యా/నాయన/బాపు | బాబు/బాపు | అయ్య/జియ్య | అబ్బ/అప్ప/నాయన |
| తల్లి | అవ్వ/అమ్మ | అమ్మ | అమ్మ | అమ్మ |
| పినతండ్రి | చిన్నయ్య, చినబాపు<br>చిన్నయ్య లేదా<br>కాకయ్య | కక్కయ్య, చిన్నన్న<br>బబయ్య,<br>బుల్లినాన్న, బాబాయి | దద్ద, మిత్తనాయన<br>చిన్నయ్య | సన్నప్ప |
| పినతల్లి | చిన్నవ్వ/పిన్ని | కక్కమ్మ, చిన్నమ్మ<br>పిన్నమ్మ | సన్నమ్మ | పినతల్లి/సన్నతల్లి |
| మేనత్త | మేనత్త/మ్యానత్త<br>అత్తాయి | అక్కయ, అప్ప<br>బాప్ప | బాప్ప, అప్పశ్రీ | మ్యానత్త |
| అక్క | అక్క | అప్ప | అప్పశ్రీ | అక్క |
| వియ్యంకుడు | ఇయ్యంకుడు<br>ఇయ్యాలకాపు | వియ్యంకుడు | ఇరకాదు | ఇయ్యకులు/అనుకుడు |
| వియ్యంకురాలు | ఇయ్యపురాలు<br>ఇయ్యకసాని | ఈపరాల్లు<br>ఇయ్యపురాలు<br>ఇరకత్తె | ఇరకత్తె | ఇమరాలు,<br>ఇయ్యపురాలు<br>ఇనుకురాలు |

| ఆరోపం | తెలంగాణ | ఆంధ్ర | కళింగాంధ్ర | రాయలసీమ |
|---|---|---|---|---|
| అమ్మాయి | పోరి/పోల్ల | బుడ్డది | గుంట/కుర్రది | పిల్లకాయ |
| అబ్బాయి | పోరడు/పోల్లగాడు | బుడ్డోడు | గుంటడు/కుర్రాడు | పాపడు/పిల్లగాడు/ |
| పిల్లకాయ | | | | |
| పిల్లలు | పోరగాండ్లు/పిల్లగాండ్లు | బుడ్డోల్లు | గుంటలు/కుర్రోల్లు | పిల్లకాయలు |
| పినతండ్రి కొడుకు | తమ్ముడు | తమ్ముడు | మిత్తబాబు | తమ్ముడు |
| తోడికోడలు | యారాలు, ఆరండ్లు | తోడికోడలు | బేదవులు | తోడికోడలు |
| తోడల్లుడు | సడ్డకుడు | తోడల్లుడు/సడుగుడు సడ్డగుడు | జిగుల్డు/జిగులుడు | సడ్డకుడు |
| పెద్దమ్మ | పెద్దవ్వ/పెద్దమ్మ | అయమ్మ | దొడ్డమ్మ, పెద్దశ్రీ | దొద్దమ్మ/దొడ్డమ్మ |
| పెద్దనాయన | పెద్దయ్య/పెదబాపు | పెద్దయ్య | దొడ్డనాన్న | దొడ్డ నాయన |
| ఆడపడుచు | ఆడబిడ్డ | ఆడపడుచు | ఆడబోట్టి | ఆడపడచు |
| స్నేహితులు | దోస్తులు/సోపలిగాల్లు | స్నేహితులు | గాడప్ప/మిత్తయ్య | స్నేహితులు |
| సవతులు | సమితి/సమ్తి | సయితి | యారళ్లు/యార్లు | సవుతి |
| అన్నకుమారుడు | అన్నకొడుకు | కొడుకు | పుత్రకొడుకు | కొడుకు |
| అన్నకూతురు | అన్నబిడ్డ | అన్నకూతురు | పుత్రకూతురు | అన్నకూతురు |
| బంధువులు | సుట్టాలు, సుట్టపోల్లు | అంటుదార్లు,సుట్టాలు | బంధువులు | బంధువులు |
| దత్త పుత్రుడు | సాదుకపు కొడుకు ఇల్లుటంకొడుకు | దత్తుకొడుకు పెంపుడుకొడుకు | దత్తుడు | దత్తుకొడుకు |
| అక్కాచెల్లెల్లు | అక్కచెల్లెండ్లు | అప్పచెల్లెల్లు | అక్కాచెల్లెలు | అక్కాచెల్లెలు |
| ఇల్లరికం | ఇల్లుటం | ఇల్లర్కం | ఇల్లిర్కం | ఇల్లిటం/ఇల్లటం |
| ముత్తాత | ముత్తాత | ముత్తాత | ముత్తాత | జేజితాత |
| ముత్తాతభార్య | ముత్తాతభార్య | ముత్తమ్మ | ముత్తమ్మ | ముత్తవ్వ |
| నాన్న రెండో భార్య | మరుమన్న తల్లి | మారుటమ్మ | సవతితల్లి | సవతి తల్లి |
| విధవ | ముండరాలు | విదవ | ముండదాయి | ఇదవ |
| ఉంచుకున్నవాడు | మిండేడు | రంకుమొగుడు | రంకు మొగుడు | మిండేగాడు |
| పాకడం | అంబాడడు | పాకడం | పారుడు | బంగరుడు |

మాండలిక పద సేకరణ ప్రాజెక్ట్ చేసినప్పుడు తెలుగు సమాజంలోని అన్ని ప్రాంతాలు మాండలికాలపై పద సేకరణ చేయడం జరిగింది. ఇందులో వ్యవసాయ, సాంస్కృతిక, కుటుంబ సంబంధమైనవి, జంతు వర్గానికి సంబంధించినవి, పశు పక్ష్యాదులు, కాయలు, పూలు, అలంకరణ వస్తువులు, శరీర భాగాలు, భూగోళాంశాలు, కొలతలు, రంగులు, ఆటలు, రవాణా, ఆహార పదార్థాలు, తినే వస్తువులు, ఇంట్లో వాడే వస్తువులు, ఇంటి భాగాలు – ఇలా ఒకటేమిటి అన్ని రకాల వాటిపై పద సేకరణ చేయడం జరిగింది. అందులో బంధు వాచకాలు ఒకటి.

ఉదాహరణకు ఎలుగుబంటిని గుడ్డేలుగు అని, ఎలుగ్గొడ్డని, ఎలుగుబంటి ఇలా రకరకాలుగా పిలుస్తుంటారు. అదే విధంగా బంధు వాచకాలలో కూడా నాలుగు ప్రాంతాలలో నాలుగు విధాలుగా పిలవడం జరిగింది. ఆ వివరాలను పట్టిక రూపంలో ఇచ్చాను. మేం క్షేత్ర పర్యటనకు వెళ్లినప్పుడు ఆయా ప్రాంత ప్రజలు మమ్మల్ని మాట్లాడే భాషతో గుర్తు పట్టేవారు. మీరు ఫలానా ఏరియా కదా అని అడిగేవారు. ఒకసారి గుంటూరులోని దాచేపల్లి ప్రాంతంలో పర్యటన చేసినప్పుడు బంధు వాచకాల గురించి ఒకామెను అడిగినప్పుడు 'ఏమి మీకు లేరా, మీరు పిలుసుకోరా' అని విచిత్రంగా అడిగింది. ఆ ప్రాంతంలో ఉన్న బంధు వాచకాలే రాష్ట్రమంతా అంటాయనుకుంది. ఆమెకు నేను సర్దిచెప్పి, విషయాన్ని వివరించి, చెప్పి క్షేత్ర పర్యటన ఉద్దేశ్యం చెప్పి, ఇతర ప్రాంతాలలో ఇలా అంటారు. మీ ప్రాంతంలో ఏమంటారు అని తెలుసుకోవడానికి వచ్చానని చెప్పాను. అప్పుడామె 'మీకేం పని లేదా? ఇదే మీ పనా?' అన్నది. అవునమ్మా అంటే, ఈ మాత్రం దానికి హైదరాబాదు నుండి ఇక్కడికి రావాలా? గవర్నమెంటుకు ఏమి పని లేదు. మీకు పని చెప్పింది' అని అన్నది. అంతా వివరించి చెప్పి డేటా రాబట్టాను. ఇంకోచోట 'రేషన్ కార్డుకో, ఓటరు కార్డుకో, ఇంకా లోన్లకో వచ్చినారనుకొని మమ్మల్ని నానా రకాల ప్రశ్నలతో విసిగించేవారు. ఇంకొకసారి నల్గొండ జిల్లా భువనగిరి ప్రాంతంలో క్షేత్ర పర్యటనలో ఒక వడ్రంగి వద్దకు వెళ్లాను. అతను 'రా... రా... నాయనా, నీ కోసమే చూస్తున్న తొందరగా రాసుకో' అన్నాడు. నేను ఆశ్చర్యపోయాను. 'ఏమ్ నా కోసం ఎందుకు చూస్తున్నావు? నేను వస్తనని నీకేం తెలుసు' అన్నాను. దానికి అతను ఇచ్చిన సమాధానం 'మీరు లోన్లు ఇస్తారు. రాసుకోవడానికి వచ్చారు కదా' అన్నాడు. అందుకు నేను 'కాదు... కాదు... నేను అందుకు రాలేదు. నేను నా పని మీద వచ్చాను' అని చెప్పాను. దానికి అతను చిన్నబుచ్చుకొని 'అయితే అందుకు కాదా' అని చిన్నబోయాడు. అతనికి వివరణ చెప్పి అడగడంతో 'నాకు పనుందయ్యా నేను పోవాలె. నన్నిడిసిపెట్టు' అన్నాడు. నేను నీకు సహాయం చేస్తాను అన్నాను. దానికి 'ఏమిటి?' అన్నాడు. 'మీ లోన్లు ఇచ్చే ఆయనకు, నాకు పరిచయం, నీ పేరు చెప్తాలే' అన్న తర్వాత సంతోషించి నాకు సమాచారమంతా ఇచ్చిన తర్వాత 'నా గురించి చెప్పు ఆ సారుకు' అని లేచిపోయాడు.

ఇలా క్షేత్ర పర్యటనలోనూ, పద సేకరణలోనూ బంధువాచక పద సేకరణలో చాలా సమస్యలున్నాయి. ఇంకా కొన్ని ఊర్లలో గ్రామ సర్పంచులతో చెప్పించి సమాచారాన్ని ప్రశ్నిస్తే సమాధానాలు ఇచ్చివారు. కొన్ని ఊర్లలో మీరు మా ఊరికి రావడం మా అదృష్టం. మీరు మా గురించి ఇంత పట్టించుకొని ఇంత కష్టపడి మా ఊరికి వచ్చినందుకు ప్రత్యేక కృతజ్ఞతలని చెప్పినవారూ ఉన్నారు. అతిథి ప్రేమలో రాయలసీమను మించినవారు లేరని క్షేత్ర పర్యటనలో తేలింది. విషయ సేకరణ నిమిత్తం వాళ్ళ ఇండ్లకు వెళ్లినప్పుడు తప్పకుండా భోజన

ఏర్పాటును చేసేవాళ్ళు. అంతేగాకుండా 'మా ఇంటికాడ లంచ్ టైమ్ వరకు ఉండి, మా ఇంట్లో భోజనం చేయండి' అని నాతో ఉండి తీసుకుపోయి అన్నం తినిపించేవారూ ఉన్నారు. ఇంట్లో వాళ్ళు కూడా బంధువులను చూసినట్లు చూసేవారు. క్షేత్ర పర్యటనకు వెళ్లినప్పుడు గ్రామాలలో పద సేకరణ కోసం వాడ, వాడలు తిరిగినప్పుడు కొంత మంది మమ్ములను దొంగలు అని కూడా అన్నవారు కూడా ఉన్నారు. పగలు వాడలన్నీ తిరిగి, రాత్రి దొంగతనానికి వస్తారని మమ్మల్ని వ్యంగ్యంగా అన్నవారు కూడా ఉన్నారు. ఇలా సాంస్కృతిక పదాలైన బంధు వాచకాల సేకరణలో చాలా సమస్యలతో పాటు కొన్ని మధుర సంఘటనలు కూడా ఉన్నాయి.

**ఆధార గ్రంథాలు :**


1. రామారావు, చేకూరి. 2000. 'భాషా తరంగం', హైదరాబాద్, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం.
2. చంద్రశేఖర్, పగడాల. 2011. 'తెలుగు దినపత్రికల భాష–ఆధునీకరణ', సికింద్రాబాద్, పగడాల పబ్లికేషన్స్
3. రామారావు, చేకూరి. 2003. 'తెలుగులో వెలుగులు', హైదరాబాద్, చిక్కడపల్లి, హరిప్రియ గ్రాఫిక్స్.
4. సుబ్రహ్మణ్యం, పి.ఎస్. 2000. ఆధునిక భాషా శాస్త్ర సిద్ధాంతాలు, హైదరాబాద్, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం.
5. నా యొక్క క్షేత్ర అనుభవాలు


× × ×

# దివ్యాంగుల బతుకుల్లో వసంతాన్ని నింపే సాయిపద్మ 'శిశిరానంతరవేళ'

యద్దనపూడి దీప్తి (పిహెచ్ డి)
ఆదికవి నన్నయ్య విశ్వవిద్యాలయం
రాజంహేంద్రవరం.
6303836405.

ఉపోద్ఘాతం

''శరీరం లో ఏదైనా అంగం పనిచేయని వారిని వికలాంగులని భావిస్తుంటారు. అయితే.. దేవుడు వారికి అదనపు శక్తినిచ్చాడని, ఇతరులలో లేని దివ్యశక్తి ఒకటి వారిలో ఉందని అర్థమవుతుంది. అందుకే ఇకపై వారిని దివ్యాంగులు అని పిలవాలి''- ఇదీ.. మన్ కీ బాత సందర్భంగా ప్రధాని నరేంద్ర మోదీ ఇచ్చిన పిలుపు. 2015లో చివరి మన్‌కీ బాత్‌లో ఆదివారం ఆయన మాట్లాడారు. దివ్యాంగుల కోసం సుగమ భారతం కార్యక్రమాన్ని ప్రారంభించామని, ప్రయాణాల్లో, రోజువారీ కార్యకలాపాల్లో వారికి ఇబ్బందులు లేకుండా చేయటమే దీని లక్ష్యమని చెప్పారు. ఇలా శారీరక, మానసిక వైకల్యం కలిగిన పాత్రల జీవన విధానాన్ని ప్రధాన అంశంగా తీసుకొని వారు వాళ్ళ జీవితంలో ఎదుర్కొన్న సమస్యలని, వాళ్ళు మార్చుకున్న బతుకు చిత్రాన్ని చూపించిన ఒక కథని ఈ పత్రంలో నేను చెప్పదలచుకున్నాను.

'శిశిరానంతరవేళ' కథారచయిత్రి సాయిపద్మ. విజయనగరం జిల్లా గజపతినగరం సొంత ప్రాంతం. మార్చి 10, 1972 లో పుట్టారు. సామాజిక కార్యకర్తగా చురుగ్గా పనిచేస్తున్నారు. ఆదివాసీ, గ్రామీణ ప్రాంతాల్లో పాఠశాలలు నడుపుతున్నారు. భర్త ప్రజ్ఞానంద్ తో కలిసి వికలాంగులు, వృద్ధుల కోసం గ్లోబల్ ఎయిడ్ అనే సంస్థ నిర్వహణ బాధ్యతలు చూస్తున్నారు. 'శిశిరానంతరవేళ' ఈవిడ రాసిన మూడవ కథ. ఈ కథ 'సారంగ' అంతర్జాల పత్రికలో జులై 2013న ప్రచురించబడింది.

సాహిత్యంలో కూడా దివ్యాంగుల జీవనాన్ని, వాళ్ళు పడే కష్టాలని, వాటిని ఎదుర్కొని వాళ్ళు అందుకున్న అంతస్తుల్ని సృజించిన వాళ్ళు ఎంతో మంది ఉన్నారు. ఆ సాహిత్యాన్ని అధ్యయనం చేసి సమాజానికి అందించవలసిన బాధ్యత నేటి సాహితీప్రియులపై ఉందనేది నా అభిప్రాయం.

*(''సుందరం కుంటివాడు. ఉద్యోగస్తుడు. వేశ్య దగ్గరికి వెలుతున్న సుందరానికి అనాథశరణాలయంలో ఉంటున్న ప్రసన్నతో వివాహం జరుగుతుంది. ప్రసన్న అందగత్తె. అవిటివాడిని పెళ్లిచేసుకోవడం ఇష్టంలేకపోయినా తప్పనిసరి పరిస్థితుల్లో పెళ్లిచేసుకుంటుంది. అసలు విషయం తెలుసుకుని సుందరం ప్రసన్నకు ఇష్టపూర్వకంగా విడాకులు ఇచ్చి తను వెళ్ళే వేశ్యాగృహంలోని కరుణ అనే అమ్మాయిని పెళ్లిచేసుకోవడంతో కథ ముగుస్తుంది.'' )*

'శిశిరానంతరవేళ' శీర్షికలోనే ఇతివృత్తం దాగి ఉంది. శిశిరంలో ఏం జరుగుతుందో అందరికీ తెలిసినదే... ఆకుల్ని రాల్చేసి చెట్లన్నీ మోడువారిపోతాయి. అంతటితో అయిపోయిందనుకుంటే అదే పొరపాటు. ఆ తరువాతే మొదలవుతుంది అసలు కథ... రెండు చినుకులు పడగానే మోడువారిన చెట్లన్నీ

చిగురించడం మొదలుపెడతాయి. అద్భుతమైన అందాల్ని రంగరించుకుంటూ మునుపటికంటే కళాత్మకంగా కనిపిస్తాయి. ఆపై కథ మనకి తెలియంది కాదు... పచ్చని ఆకులు, విరబూసిన పూవులు, లేత పూతలు, పిందెలు, కాయలు, పండ్లు .... అద్భుతం కదా!!!

'పడినచోటే ఉండిపోతే పరుగు విలువ ఏం తెలుస్తుంది. ఓటమే వెంటపడకపోతే విజయం ఎలా వరిస్తుంది.' పడాలి, లేవాలి, ఓడాలి, గెలవాలి ఆపైన తలెత్తుకు నిలబడాలి. నమ్మిన వాళ్ళు వంచిస్తే ఆ వంచనకు ఎదురీది మనదైన అస్తిత్వాన్ని నిలబెట్టుకోవాలి. ఈ అంశాన్ని తీసుకుని రాసిన ఈ కథ శిశిరంలో ఉన్న జీవితాలకు దిక్సూచి అవుతుంది.

తన ప్రమేయం లేకుండా పోలియో వల్ల అవిటివాడిగా మారిపోయిన సుందరం ఈ కథలో కథానాయకుడు. ప్రేమించిన వాడు మనసును కాక శరీరాన్ని వాడుకుని మోజు తీరాక ఆ శరీరాన్ని వేశ్యాగృహాలకు అమ్మివేస్తే చేసేది ఏం లేక అక్కడే వేశ్యగా మిగిలిపోయి దుర్భర జీవితాన్ని అనుభవిస్తున్న కరుణ ఈ కథలో కథానాయకురాలు. సత్తి, సుందరం స్నేహితుడు. ప్రసన్న సుందరం భార్య. ఈ నలుగురి మధ్య సాగే కథే 'శిశిరానంతరవేళ'.

విధి వంచితులని, విధి ఆడే వింతనాటకంలో పావులని, విధికి బలై పోయారని నలుగురు అంటుంటే ఆ మాటలు విని నిస్సహాయంగా మా బతుకులు ఇంతే అని అనుకోకుండా బ్రహ్మ రాతల్ని మన బతుకుల్ని మార్చుకోవా లంటే అది మన చేతులోనే ఉంటుంది అని తెలియచెప్పే కథ ఇది. అవమానాలు, ఛీత్కారాలు, ఛీదరింపులు ప్రతి మనిషి జీవితంలోనూ ఉంటాయి కాకపోతే ఒక్కొక్కరిది ఒక్కో కోణం. అంతమాత్రానే జీవితపు చరమాంకాన్ని చేరుకుంటే ...? సమయాన్ని బట్టి మనల్ని మనం మార్చుకోవాలి. ఒక్కోసారి సమాంతర రేఖలమవ్వాలి. ఒక్కోసారి వక్రరేఖలై పెనవేసుకు పోవాలి.

కథ చివరిలో... వేశ్యావృత్తిలో ఉన్న కరుణని పెళ్లి చేసుకుందామనుకుంటున్న సుందరాన్ని ప్రశ్నించిన స్నేహితుడు, సత్తి తో సుందరం అనే మాటలు ఈ కథకు ఆయువు పట్టుగా కనిపిస్తాయి. "*నా అవిటితనం నేనెలా తెచ్చి పెట్టుకోలేదో, వేశ్య అవుదామని తనుకూడా అనుకోలేదు*" అని సుందరం అన్న మాటలు ప్రతి పాఠకుడినీ ఆలోచింప చేస్తాయి. నిజమే ఊహించనిది జరగడమే జీవితం. అనుకున్నది అనుకున్నట్లుగా జరిగితే అది జీవితం ఎలా అవుతుంది. ఇవే మాటల్ని రచయిత్రి సుందరం, ప్రసన్న ద్వారా పలికిస్తారు.

ప్రసన్న అందగత్తె. నా అన్న వాళ్ళు ఎవరూ లేని ప్రసన్న అనాథశరణాలయంలో పెరుగుతుంది. అదే శరణాలయంలో ఉన్న రాజు ప్రసన్నను పెళ్లిచేసుకోవాలనుకుంటాడు. రాజు కుంటివాడు. ఆ కారణంచేత ప్రసన్న రాజుని తిరస్కరిస్తుంది. శరణాలయం మాష్టారు చెప్పినా ఒప్పుకోదు. పైగా 'నాకున్నది అందం ఒక్కటే, నేను ఇలా ఇక్కడే ఉండిపోను. నా అందం ఇచ్చే ప్రతీ సౌకర్యం కావాలి..." అని శరణాలయం మాష్టారికి చెప్పేస్తుంది. కానీ గత్యంతరం లేని స్థితిలో ప్రసన్న అవిటివాడైన సుందరాన్ని పెళ్లిచేసుకోవలసి వస్తుంది. ప్రసన్న సుందరంకు ఉన్న ఉద్యోగం చూసి పెళ్లిచేసుకుందే తప్ప తనపై ప్రేమ

ఉండి కాదు. గతంలో కూడా సుందరానికి వాళ్ళమ్మ సంబంధాలు చూసినప్పుడు సుందరం చేసే ఉద్యోగం నచ్చింది కానీ సుందరానికి ఉన్న అవిటితనం నచ్చలేదు. ఇప్పుడు ప్రసన్న కూడా ...

"అదృష్టం అందమైన శరీరాలలో లేదు. అందమైన మనసులో ఉంటుంది" అని శరణాలయం మాష్టారు చెప్పిన మాటలకు ఆలోచించిన ప్రసన్న అక్కడినుంచి బయటపడడానికి సుందరాన్ని ఒక మార్గంగా ఎంచుకుంది. సుందరాన్ని పెళ్లిచేసుకుని బయటకి వచ్చిన ప్రసన్న సుందరంతో చేసింది కాపురమనడం కంటే వ్యభిచారం అనడమే ఉత్తమం అనే భావనను రచయిత్రి మనకు కలిగిస్తారు.(వేశ్యా గృహంలో కలిసిన కరుణతో చేసింది వ్యభిచారం అనడం కంటే సంసారం అనే భావన కూడా కలుగుతుంది.) సుందరం మంచితనాన్ని, బలహీనతగా వాడుకోవాలి అనుకుంటుంది ప్రసన్న.

కామం, కోరిక, ప్రసన్నని ఇష్టపడడం ఇవన్నీ సుందరం బలహీనతలు ... ప్రసన్న ప్రవర్తనకు విసిగి వేసారి 'జీవితం సులభంగా దొరకదు...' అంటాడు సుందరం. 'నాకుమాత్రం ఈజీగా దొరికిందా జీవితం?' అనుకుంటుంది ప్రసన్న.

అందంగా ఉన్న ప్రసన్నకు అవిటివాడైన సుందరంతో కాపురం చేయడం ఇష్టముండదు. తనలాంటి అందగత్తె కు సుందరం తగినవాడు కాదని తన అభిప్రాయం. అందుకే సంవత్సరం గడిచినా సుందరాన్ని సంసారిక జీవితంలో విఫలుడిని చేసి ఆడిస్తూ ఉంటుంది. తనతో కలిసి బతకాలని, కాపురం చేయాలని ఆశపడే సుందరంతో ఒక ఒప్పందం కుదుర్చుకుంటుంది. "ఆరునెలల సంపాదన ... రెండు లక్షలు, మూడు తులాల బంగారం ... తన పేరిట డెబ్బైవేల ఫిక్స్డ్ డిపాజిట్ ..." అది తన విలువ. సుందరంతో కాపురం చేస్తుంది. కథారంభంలోనే వేశ్య దగ్గరకి వెళ్లొద్దని సుందరం స్నేహితుడు సత్తి, సుందరంతో వాదిస్తూ ఎవరు లేని ఒక అనాథను పెళ్లి చేసుకుని "వాళ్ళకి కావలసింది ఇచ్చి... నీకు కావలసింది నువ్వు తీసుకోలేవూ..." అంటాడు. సత్తి దృష్టిలో వాళ్ళకి కావలసింది ఒక కుటుంబం. సత్తి మాట విని అనాథని పెళ్లి చేసుకుంటాడు సుందరం. కానీ కథ తారుమారయ్యింది. ప్రసన్న కి కావలసింది కుటుంబం కాదు 'డబ్బు'. అది ఇచ్చాడు. తనకు కావలసిన సంసార సుఖాన్ని అనుభవించాడు. వేశ్య దగ్గరకు వెళ్లకూడదని స్నేహితునికి పెళ్లిచేశాడు సత్తి. పెళ్లి చేసింది ఎవరూ లేని అనాథ తోనా? లేక వేశ్య తోనా? అది మనల్ని మనం ప్రశ్నించుకోవలసిన ప్రశ్న.

ప్రసన్న హింస భరించలేక సుందరం విడాకులు కోరతాడు. ఇంకెవరైనా అయితే బాధపడే వారేమో కానీ ప్రసన్న కదా! చాలా సంతోషపడింది. ఈ అవిటివాడి నుంచి విముక్తి కలుగుతున్నందుకు. "పడుకోవడానికి బేరం చెల్లించావు కదా విడిపోవడానికి కూడా మంచి బేరం ..." అప్పుడు కూడా బేరం పెట్టింది. అడిగిన డబ్బును అప్పుచేసి, బ్యాంక్ లో లోన్ తీసుకుని ప్రసన్నకు సర్దుబాటు చేసి విడాకుల పత్రాల మీద సంతకాలు తీసుకొని ప్రసన్న నుంచి విముక్తి పొందాడు సుందరం. సుందరాన్ని వదిలించుకుంది ప్రసన్న. "ఏ ఉద్యోగం చేసినా, కింది తరగతి నుండి మధ్యతరగతికి ప్రమోట్ అయిన

మగవాడి ఆయువు పట్టు పరువు" అదే పట్టుకుంది ప్రసన్న. "బంగారు గుడ్లు పెట్టే బాతుని కోసుకుతిన్నా కూడా మంచిదే. అది సరిగ్గా వర్కవుట్ అయితే..." అని రచయిత్రి పలికించిన మాటలు అక్షర సత్యాలు అని పిస్తాయి ఈ కథ చదివితే.

సుందరం కింది నుంచి పైకి వచ్చిన వాడే. చినప్పుడే పోలియో సోకినా ఒక కాలు ఈడ్చుకుంటూ నడిచినా వీలైనంత వరకు తన కాలుని కవర్ చేసుకుంటూ ఆత్మవిశ్వాసం మెండుగా ఉన్న వ్యక్తిగా కనిపిస్తాడు సుందరం. అందుకే "ఒరే ... సత్తిగా మనం కాళ్లీడ్చినా ... మన బతుకులు ఈడ్చినట్టు ఉండకుండా చూసుకోవాలిరా...!!" అంటాడు.

గుళ్ళో ప్రసాదాలు తింటూ ... ఆ ఇంట్లో ఈ ఇంట్లో పాచి పని చేసి సంపాదిస్తూ కష్టపడి చదివించింది సుందరం తల్లి. తండ్రి చిన్నతనంలోనే తాగి తాగి చచ్చి పోయాడు. ఎక్కడా ఫెయిల్ అవకుండా బాగా చదివి ప్రభుత్వరంగ సంస్థలో ఉద్యోగం సంపాదించాడు. "అమ్మ చాలా కష్టపడిందిరా ... నా బతుకు పరుగు తీయాలని... తను నిమిషం నిమిషం కాలం ఈడ్చింది" అంటాడు సుందరం. అందుకే "వికలాంగ కోటాలో ఉద్యోగం సంపాదించినా ఎప్పుడూ రిలాక్స్ కాలేదు" అనే మాటలు కూడా ఈ నేపథ్యంలో కనిపిస్తాయి. మనిషి నిరంతరం ఏదో ఒకటి చేస్తూ ముందుకు పోతూనే ఉండాలి. ఎక్కడైనా ఆగిపోతే ఆగినట్టే ఉంటుంది. అందుకే సుందరం ఆగలేదు. రిలాక్స్ అవలేదు. అమ్మని పని మాన్పించాడు. సుందరం గొప్ప వాడిగా పరిణామం చెందాడు. అట్టడుగు స్థాయి నుంచి అంచెలంచెలుగా ఎదిగిన వ్యక్తి కదా పరువు, ప్రతిష్ట ఇవి సుందరానికి ఆరోప్రాణం. అందుకే ఆ ఆరోప్రాణాన్నే పట్టుకుని ఆట ఆడించి ఆడించి తనకు కావలసింది తీసుకుని సుందరాన్ని ఓడించిందో...! గెలిపించిందో...! మొత్తం మీద ప్రసన్న వెళ్లిపోయింది.

కరుణ ఒక వేశ్య. ప్రేమించిన వాడు మోసం చేసి వేశ్యాగృహాలకు అమ్మి తనని వేశ్యగా మార్చేశాడు. ఈ విషయం తెలిసినా కరుణ తల్లిదండ్రులు పెద్దగా ఏం పట్టించుకోలేదు. కరుణని వదిలేశారు. అందుకే కరుణకి మానవ సంబంధాల మీద పెద్దగా నమ్మకం లేదు. కాబట్టే అక్కడినుంచి తప్పించుకుని బయటికి వెళ్లి బతకాలనే ప్రయత్నం తను ఎన్నడూ చేయలేదు. ఎందుకంటే అక్కడికి నుంచి ఎక్కడికి వెళ్ళినా తను మళ్ళీ మనుషుల మధ్యకే వెళ్ళాలి కదా! పైగా పైకి ముసుగులు వేసుకుని నటించే బయటి ప్రపంచం కంటే ముసుగులన్నీ తీసి నగ్నంగా కనిపించే వేశ్యాగృహాలే నయం అనుకుంది. అందుకే ఇష్టం లేకపోయినా అక్కడే సర్దుకుపోయింది.

సుందరం చేసింది తప్పని చెప్పాలో ఒప్పని చెప్పాలో తెలియదు కానీ ఒకసారి వేశ్యాగృహానికి వెళతాడు. అక్కడే పరిచయమవుతుంది కరుణ. కరుణ అసలు పేరు కరుణ. కానీ వేశ్యాగృహంలో తనపేరు కరీనా. కానీ సుందరం అక్కడికి వచ్చినప్పుడు పొరపాటున కరీనా అనకుండా కరుణ అని తన అసలు పేరు చెప్పి నాలుక కొరుక్కుంటూ సుందరాన్ని చూస్తూ ఉండిపోతుంది. సుందరానికి తను నచ్చిందో, తన పేరు నచ్చిందో, అసలు పేరు చెప్పిన తన నిజాయితీ నచ్చిందో తెలియదు కానీ సుందరం కూడా కరుణనే

ఎంచుకున్నాడు. కరుణ కూడా అవిటివాడని, వీడితో కూడా అవసరమా అని అనుకోలేదు. "ఎవడైతే ఏంటి...? మరీ ఎక్కువగా హింసించకుండా ఉంటే చాలు" అనుకుంది.

గదిలోకి వెళ్ళిన కరుణ జాకెట్ విప్పబోతుంటే... "వద్దు మీకిష్టమేనా ... కాసేపు మాట్లాడుకుందాం ... నాకు కొత్త"అన్నాడు. తన సర్వీస్ లో ఆమాటలు వినడం అదే మొదటిసారి. ఎవ్వరూ... ఎప్పుడూ... చివరకు ప్రేమించిన వాడు కూడా అడగలేదు. అలా సుందరానికి కరుణకి పరిచయం. ఆ పరిచయమే సత్తికి ఇష్టముండదు. వేశ్యలదగ్గరికి పోతే ఏమైనా రోగాలు వస్తాయని సత్తి భయం. కరుణ దగ్గరికి వెళ్ళి వచ్చిన ప్రతిసారి సుందరానికి సత్తికి చిన్నపాటి యుద్ధం. తాటాకు మంటలాగా! కరుణ దగ్గరికి వెళ్ళి "ఎన్నో తీరని కాంక్షలని తీరాలు దాటించి, సగర్వంగా ఉన్న వాడి మొహం చూస్తే" సత్తి మెత్తబడిపోతాడు. కరుణ మంచి స్నేహితురాలని, తను నాకు చాలా విషయాలు నేర్పుతుందని ... ఇంకా ఏవో చెప్పబోతుంటే "సాని దాని దగ్గర నువ్వు సంసారం ఎలా చేయాలో తెలుసుకోనక్కరలేదురా ఒరేయ్..." అంటూ సత్తి ఆవిషయాన్ని దాటేసేవాడు.

నిజానికి కరుణ సుందరానికి చాలానే నేర్పింది. "శరీరం ఏమిటో... ఎలా ప్రేమించాలో... ఆడదాని శరీరం ఏమిటో ..." ఇలా చాలా నేర్పించింది. ఈ సందర్భంలో రచయిత్రి కరుణతో పలికించిన మాటలు నిజంగా భలే నవ్విస్తాయి.... నిజమే కదా అనే భావనను కలుగజేస్తాయి. "నా కస్టమర్ లే కదా నా యూనివర్సిటీ..." సుందరం కూడా కరుణ కు చాలా నేర్పించాడు. "మనిషంటే...మగాడంటే నేర్పించాడు. అనుభవానికి సంగమానికి కూడా తేడా" ఏమిటో నేర్పించాడు.

వాస్తవానికి సుందరం కరుణను కలిసినప్పుడు తనకు "మగాడనే స్పృహ లేదు. ధ్యాసంతా తన కుంటితనం మీదే ... నెమ్మది నెమ్మదిగా అతనిలో స్వచ్ఛత, పసిపిల్లాడిలాంటి మనసు, కష్టాలను చూసి రాటుదేలినతనం, అయినా ఒక నెమ్మదితనం. నా గాయాలకు సానుభూతి లేపనం. నా శరీరం పచ్చిగా ఉంటే పడుకోనిచ్చేవాడు. నన్నే అలా చూస్తూ మాట్లాడుతూ ఉండేవాడు. అతను వెళ్లిపోయాక నా కళ్ళల్లో నీళ్ళు. మనసులో హాయి...!" ఇది కరుణ మనసులో సుందరం స్థానం. "నాకూ ప్రపంచానికి కిటికీ సుందరం" అంటుంది కరుణ. అవును కదా బయట ప్రపంచంతో సంబంధాలు లేని కరుణకు ప్రపంచాన్ని కళ్ల ముందుకు తెచ్చేది సుందరమే కదా! సుందరానికి పెళ్లయ్యి వెళ్లిపోయేటప్పుడు చాలా బాధపడుతుంది కరుణ. అవును మరి "మగాడి పైశాచికత్వానికి పీలికలై ... రక్తపు చారికలైన ఒళ్ళు... సుందరం కళ్ళల్లో నీళ్ళు . ఎన్ని ఆయింట్ మెంట్ లు కొని తెచ్చి రాశాడో తెలీదు. రెండు రోజులు కష్టమర్ లా వచ్చి ..." శారీరక సుఖాన్ని అనుభవించి పోకుండా మానసిక ఆనందాన్ని అందించే సుందరాన్ని ఎలా మరిచిపోగలదు కరుణ. అయినా సర్దుకుపోయింది కరుణ.

కథలో ఈ సంఘటన దగ్గరికి వచ్చే సరికి సెక్స్ వర్కర్ల దయనీయ స్థితి గురించి అలిశెట్టి ప్రభాకర్ రాసిన "తనువు పుండై... తాను పండై...తాను శవమై...వేరొకరి వశమై...తను ఎడారై ... ఎందరికో.. ఒయాసిస్సై...." అనే వాక్యాలు జ్ఞప్తికి వచ్చి కంటతడిపెట్టిస్తాయి. "సుందరానికి సంసారం నేర్పిన మాష్టార్ణి

కదా ... మాష్టారు ఎప్పుడూ స్కూల్ లోనే ఉండాలి. స్టూడెంట్స్ కదా... ఒక్కో దశ దాటి వెళ్తూ ఉండాలి" ఇప్పుడు సుందరం ఒక దశ దాటి ఇంకో దశకు వెళుతున్నాడు. పరిణామం తప్పదు కదా...!!

మనిషి జీవితంలో అనేక పరిణామాలు. ఒకటి కాదు రెండు కాదు వేలకు వేలు... కొన్ని మంచి చేస్తాయి. కొన్ని చెడు చేస్తాయి. ఇప్పటివరకూ సుందరం జీవితంలో వచ్చిన పరిణామాలు ఏవీ సుందరాన్ని ఇబ్బంది పెట్టలేదు. పెళ్లి ఈ పరిణామం సుందరాన్ని తన అస్తిత్వం కోల్పోయి బతికేలా మార్చేసింది. తన మీద తనకే చిరాకు వచ్చేలా మార్చేసింది. అందుకే తనని అర్థం చేసుకోని, తన ఉద్యోగానికి తన డబ్బు కి మాత్రమే ప్రాధాన్యత ఇచ్చే భార్య ప్రసన్నకు విడాకులు ఇచ్చేశాడు. ఆ కథ అంతా మనం పైన చర్చించుకున్నాం.

అనాథ శరణాలయం, సుందరంతో పెళ్లి శిశిరం అనుకుంది ప్రసన్న. మోసగించబడి వేశ్యాగా మారిన కరుణ జీవితంలోకి సుందరం ప్రవేశించడం కాస్త ఊరట కలిగించినా పెళ్లి చేసుకున్న సుందరం తిరిగిరాదని చాలా బాధ పడిపోతుంది. సుందరం లేని కరుణజీవితం శిశిరం. ఇటు కరుణాకు దూరమై, కట్టుకున్న భార్యకు దూరమై ఒంటరిగా మిగిలిన సుందరం జీవితం శిశిరం. ఈ కథలోని ప్రధాన పాత్రలన్నీ ఇప్పుడు శిశిరంలో ఉన్నాయి. మరి ఈ పాత్రలకు శిశిరానంతరవేళ ఎలా ఉందో చూద్దాం.

ప్రసన్న సుందరానికి కావలసింది ఇచ్చింది. తనకు కావలసింది తీసుకుంది. తనకు కావలసింది డబ్బు. అదే సర్వం అనుకుంది. 'దీపం ఉండగానే ఇల్లు చక్కదిద్దుకోవాలి' అన్నట్టు తన ప్రయత్నం తాను చేసింది. ప్రసన్న అలా చేయడానికి కారణాలు మనం అన్వేషించలేము. తనతో పాటు అనాథ శరణాలయంలో పెరిగిన నాగలక్ష్మి కి పెళ్లయ్యి అత్తగారింటికి వెళుతుంది. కానీ కొద్దిరోజులకే అందం తగ్గిపోయిందని నాగలక్ష్మి భర్త నాగలక్ష్మిని వదిలేస్తే మళ్ళీ గత్యంతరం లేక అనాథశరణాలయానికే చేరి అందరికీ వండిపెడుతూ కాలం వెళ్ళబుచ్చుతూ ఉంది. తన బతుకు కూడా అలా కాకూడదనేమో తన జాగ్రత్తలో తనుఉందనిపిస్తుంది.

సుందరం మళ్ళీ కరుణను వెదుక్కుంటూ వేశ్యాగృహానికి వెళతాడు. కరుణ కూడా సుందరాన్ని చూసి చాలా సంతోషపడుతుంది. భార్య యోగక్షేమాలు అడుగుతుంది. సుందరం నాన్చకుండా అన్నీ చెప్పేసి సేరుగా విషయానికి వచ్చి "నేను అవిటి వాడిని, నువ్వు వేశ్యావృత్తిలో ఉన్నావు. ఇలా తెలిసిన విషయాలు కాకుండా నన్ను చేసుకోవడానికి నీకు అభ్యంతరం ఏమైనా ఉంటే చెప్పు ...!" అని సుందరం అడగ్గానే కరుణ కాస్త ఆలోచనలో పడుతుంది.

"కరుణా – మనం పెళ్లిచేసుకుందాం. శారీరక సుఖం కోసం మాత్రమే కాదు. కలిసి ఉండడం కోసం. గతంలో మీ దగ్గరికి రావడం ... డబ్బులిచ్చి నీ శరీరాన్ని కొనుక్కోవడం ఎప్పుడూ తప్పనిపించలేదు. ప్రసన్నతో కలిసిన ప్రతి నిమిషం వ్యభిచారం చేస్తుంటే ఎలా ఉంటుందో అలా అనిపించింది. ... ఆమె లేకపోతే నేను ఉండలేనా? ఇదేనా నా జీవితం అనిపించేది. ముఖ్యంగా నగ్నమైన నా అవిటితనం తన కళ్ళల్లో నిద్రలేపిన అసహ్యం తలచుకుంటే, ఆమెతో సుఖించినందుకు నామీద నాకే అసహ్యం వేసేది. నరకం

చూశాను కరుణా...!!" అని సుందరం తన ఆవేదనను వ్యక్తం చేస్తుంటే కరుణ కన్నీటి పర్యంతమవడం మనం ఊహించవచ్చు. "ఆమెకు డబ్బు కావాలి. నేను నా disability వద్దు. ధర్మేచ... అర్థేచ .. లో తనకు అర్థమయ్యింది కేవలం ఆర్థికమే. అది తెలిసి కూడా నేను తనతో ...". కరుణ ఒప్పుకుంది. సత్తి సంశయంలో పడ్డాడు. "నా అవిటితనం నేనెలా తెచ్చిపెట్టుకోలేదో, వేశ్య అవుదామని తనుకూడా అనుకోలేదు" అని సుందరం చెప్పిన మాటలతో సత్తి కళ్ళు చెమర్చాయి. "నా బాధను అర్థం చేసుకున్న నా స్నేహితుడు నా శక్తి" అని సుందరం సంతోషప డతాడు. నిజమే కదా మన బలం మన బలహీనత అన్నీ స్నేహితులే కదా!!! కరుణ, సుందరం పెళ్లి జరిగిపోయింది. "నేను నాలా ఉండటంలో ఉన్న సంతోషం దేనికీ సాటిరాదు. నేను నిజంగా తెలివైన మంచివాడిని అని నాకిప్పుడిప్పుడే నమ్మకం కలుగుతోంది." అని సుందరం తనలో తాను అనుకోవడంతో కథ ముగుస్తుంది.

ప్రస్తుత సమాజానికి ఇలాంటి కథలు చాలా అవసరం. ఆత్మన్యూనతా భావాలు పెరిగిపోయి అన్నీ కోల్పోయాము అనే భావనలో నేటి తరం తీసుకునే నిర్ణయాలు దారునాతి దారుణం. ఏమీ లేకపోయినా ఎదగొచ్చు, అన్నీ కోల్పోయినా ఎదగొచ్చు (అవయవాలు కావచ్చు, అవసరాలు కావచ్చు) అనడానికి ఈకథ నిలువెత్తు నిదర్శనం. తింటానికి కూడా లేని స్థితి నుంచి ప్రభుత్వ ఉద్యోగం వరకు ఎదిగిన సుందరం, పెళ్లయ్యి అన్నీ కోల్పోయి మళ్ళీ బతుకు సమరంలో గెలిచిన సుందరం... ప్రేమించి, ఇంటినుంచి బయటకు వచ్చి ప్రేమించినవాడి చేత అమ్మబడి, వేశ్యగా మారి అన్నీ కోల్పోయిన కరుణ, సుందరాన్ని చేరుకొని బతుకుబాటలో సేదతీరిన వైనం... 'మనిషి చచ్చి కాదు సాధించాల్సింది బతికుండి సాధించాలి' అనడానికి ఈ ఒక్క కథ సరిపోదూ...!!!

*లండన్ కు చెందిన 'నార్మన్' అనే వ్యక్తికి ఒక ప్రమాదంలో కాళ్లుతెగిపోయాయట.! 1981 లో అతడు చంక కర్రల సాయంతో అర్జంటీనాలోని 17వేల అడుగుల ఎత్తైన పర్వతాన్ని అధిరోహించి క్షేమంగా దిగివచ్చాడట.*

*అందుకే రచయిత్రి సుందరం చేత కథారంభంలోనే "మనం కాళ్ళు ఈడ్చినా ... మన బతుకులు ఈడ్చినట్టు ఉండకుండా చూసుకోవాలి" అని పలికిస్తారు . నిజమే కదా... వసంతం రావాలి అంటే శిశిరాన్ని దాటాలి కదా !!!*

# తెలుగు - మరాఠీ దళిత కథల్లో బాలల సమస్యల చిత్రణ – తులనాత్మక పరిశీలన

డా. అప్పారావు పంతంగి, తెలుగు అధ్యాపకులు
Rajiv Gandhi University, Nuzvid
9177021405, pantam.iiit@gmail.com

*తెలుగు కథా సాహిత్యంలో మరియు మరాఠీ కథా సాహిత్యంలో బాలల సమస్యల్ని చిత్రించిన కథల్ని ఇక్కడ నేను ప్రస్తావించాను. నేను పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం నుంచి " తెలుగు –మరాఠీ దళిత కథలు తులనాత్మక పరిశీలన" అనే అంశంపై పిహెచ్ డి సిద్ధాంత గ్రంథాన్ని సమర్పించి డాక్టరేట్ పొందాను. ఆ థీసెస్ లోని కొన్ని కథలను ఇక్కడ పత్ర సమర్పణకు ఎంచుకున్నాను. ఇక్కడ నేను రెండు భాషా కథల్ని ఎంచుకోవడం అంటే తులనాత్మక దృష్టితో కాకుండా కేవలం రెండు ప్రాంతాలలోని దళితుల్లో బాలల సమస్యలను చర్చించుకోవడం అని గమనించగలరని మనవి.*

**ఆకలి - చక్తా తులనాత్మక పరిశీలన**

**ఆకలి (తెలుగు కథ పరిచయం)**

ఆకలి కథలో చిన్ని చుట్టూ కథ తిరుగుతుంది. చిన్ని వాళ్ళ అమ్మనాన్నకు ఉన్న ముగ్గురు సంతానంలో రెండవది. మొదట అక్క తరువాత చిన్ని, తరువాత తమ్ముడు. ఇప్పుడు మరలా వాళ్ళ అమ్మ మరొకరిని కడుపులో మోస్తూ కనడానికి సిద్ధంగా నిండునెలలతో లేవలేకుండా ఉంది. వాళ్ళనాన్న ఊరువదిలి పనికి వెళ్ళాడు. వాళ్ళ నాన్న వచ్చేవరకు మంచినీళ్ళు త్రాగి బ్రతకడమే వాళ్ళగతి. అక్క కాస్త ఇంట్లో పనులు చూసుకుంటుంది. ఎక్కడో ఊరు చివర ఉన్న మంచినీళ్ళు అక్క తెస్తేనే వాళ్ళంతా దాహం, ఆకలి తీర్చుకునేది. ఇక చిన్ని, తమ్ముడు ఏ పనీ చేయలేరు ఎందుకంటే అంత వయస్సు, శక్తి ఇంకా వారికి రాలేదు.

చిన్ని ఎప్పుడూ వాళ్ళ నాన్న కోసం ఎదురు చూస్తూ ఉంటుంది, నాన్న వస్తే ఆకలి తీరుతుందని చిన్ని ఆశ. నాన్న ఇంటి దగ్గర ఉన్నప్పుడు ఒకరాత్రి తినకపోయినా తెల్లవారితే ఆకలి తీరుతుందనే ఆశ ఉండేది. ఒక వేళ నాన్న ఇంట్లో లేకపోయినా తెల్లవారి వస్తే ఏదైనా తెస్తాడు దానిని తిని ఆకలి తీర్చుకోవచ్చు అనే ఆశ ఉండేది. కాని మూడు రోజుల నుంచి వాళ్ళ నాన్న కోసం ఎదురుచూస్తూనే ఉంది, ఆకలి తీరకపోయినా నాన్న వస్తాడేమో, ఆకలి తీరుస్తాడేమో అనే చిన్ని ఆశ చిన్నిని ఎదురుచూసేలా చేస్తుంది.

చిన్ని సాయంత్రం పూట అందరి ఇళ్ళకూ వెళ్ళి వాళ్ళు వండుకుంటుంటే ఆ అన్నం, కూర వాసనలు పీల్చి ఎవరైనా ఏమైనా పెడతారేమోనని ఎదురుచూసి, చూసి తిన్నవి కూడా కడుక్కున్నాక నిదానంగా ఇంటికి వచ్చి మంచినీళ్ళు త్రాగి పడుకుంటుంది.

ఆకలి తీరకపోవడంతో ఆకలి తీర్చేవారు ఎవరూ లేకపోవడంతో అరటిపండు తింటూ కనిపించిన ఒక అబ్బాయిని తనకు కూడా కొంచం పెట్టమని అడుగుతుంది అతను నిరాకరించడంతో బలవంతంగా తన చేతిలో నుంచి లాక్కోవడానికి ప్రయత్నించి ఘోరపరాజయానికి లోనై ఆకలితో పాటు బాధను కూడా పెంచుకుంటుంది. ఆ బాధతో ఏడుస్తూ ఉండగా ఆ అబ్బయి వాళ్ళ అన్న వచ్చి చిన్ని ని తిట్టి కోపాన్ని అణుచుకోలేక కొట్టి మరీ అక్కడినుంచి వెళ్ళిపోతాడు.ఆకలి బాధ, అరటిపండు అందలేదనే బాధ, అతను కొట్టాడనే అవమానపు బాధ ఇవన్నీ తనను బాధిస్తుంటే ఎదురుగా వస్తున్న లారిని చూసి దానికి ఎదురుగా వెళ్ళి నుంచుంటుంది. లారీ ఆపి డ్రైవరు ఇంకా కొంతమంది చిన్ని ని తిట్టి అక్కడినుంచి వెళ్ళిపోతారు తన ఆకలి గురించి పట్టించుకోకుండా.

చిన్ని ని చూస్తే నాన్న రాకపోయినా, ఆకలి తీరకపోయినా స్నేహితులతో కలిసి ఆడుకుంటుండగా లారి గుద్దడంతో స్పృహ తప్పి పడిపోతుంది. కళ్ళు తెరచి చూసే సరికి అమ్మ పక్కలో ఉంటుంది. ఆ లారీ ఓనర్ నెలకు 100 రూపాయల చొప్పున నాలుగునెలలు ఇస్తానని,రోజు మంచి పండ్లు ఆహారం తెస్తానని అతను అక్కడినుంచి వెళ్ళిపోతాడు. అలా నాలుగు నెలలు అమ్మ నాన్న సంపాదించలేని సొమ్మును ఆహారాన్ని చిన్ని సంపాదించింది. కాలం కష్టాల్లో కష్టంగానూ, సుఖాల్లో తొందరగానూ గడిచిపోతుంది కదా, చిన్ని జీవితంలో కూడా అదే జరిగింది. నాలుగు నెలల కాలం గడిచిపోయింది. నెలకు 100 రూపాయలు, పండ్లు, ఇవి ఏవీ లేవు. మళ్ళీ పాత జీవితం చిన్ని ని పలకరించింది. రోజూ లారీ డ్రైవరు చిన్నిని పలకరించి వెళ్ళేవాడు. తరువాత తరువాత లారీ ఆపడం కూడ ఆపేశాడు.

చిన్నికి ఏమీ అర్థం కాలేదు. అసలు అప్పుడు ఎందుకు 100 రూపాయలు ఇచ్చాడు, పండ్లు ఇచ్చాడు, ఇప్పుడు ఎందుకు ఇవ్వడం లేదు. అప్పుడు ఎందుకు లారీ ఆపి నన్ను బాగున్నావా అని అడిగాడు ఇప్పుడు ఎందుకు అడగడంలేదు. తనకు అర్థంకాలేదు అందుకే ఒకరోజు... ఒకరోజు చిన్ని లారీ వస్తుంటే రోడ్డుకు అడ్డంగా నిలబడుతుంది. జోరున వర్షం కురిసి ఆగడంతో అల్లంత దూరంలోనే చూసి బ్రేక్ వేసినా తడిచిన రోడ్డు కావడంతో లారీ ఆగలేదు. ఆగిన తరువాత చూస్తే చిన్ని కనిపించలేదు. ఎటు పడిందో తెలియలేదు. లారీ వెనుక నుంచి వర్షపు నీటిలో కలిసిన రక్త ఏరులై పారుతుంది. చిన్ని ఇకలేదు.

***CHAKTA*** (మరాఠి కథ పరిచయం)

ఈ కథలో ప్రధాన పాత్ర కచరు. అందరూ అతనిని కచరియా అని పిలుస్తుంటారు. కచరు వాళ్ళ అమ్మ చెత్తకుప్పల వెంట తిరుగుతూ పనికిరాకుండా పడేసిన డబ్బాలు,కాగితాలు ఏరుకుంటూ జీవనం కొనసాగిస్తుంటుంది. ఆమె భర్త పోతురాజు భర్త చనిపోయిన నాలుగేళ్ళకు లక్ష్మీదేవి దయవల్ల కచరు పుట్టాడు. కచరు వాళ్ళ కుటుంబం దేవీ భక్తులు.

కచరు ఎప్పుడూ సలేటీ అనే ఒకరకమైన ఆహార పదార్థాన్ని ఎక్కువగా తింటూ ఉంటాడు. అతనికి అది చాలా ఇష్టమైన ఆహార పదార్థం. రోజుకు కనీసం ఒక సలేటీయైనా తింటాడు. పాపం రోజు అమ్మ ఎక్కడినుంచి

సలేటీ తెస్తుంది, అందుకే కచరు తన స్నేహితుల వద్ద ఉన్న సలేటీని దొంగతనంగా తీసుకొని వారికి కనిపించకుండా దాచుకొని తింటూ ఉంటాడు.

కచరియా ఉదయం పూట స్కూలుకు వెళ్తాడు.మధ్యాహ్నం నుంచి ఇంటి ఇంటికి తిరిగి అడుక్కుంటూ ఉంటాడు. తనకు అది ఇష్టం ఉండదు. అయినా వాళ్ళ అమ్మ బలవంతంగా భయపెట్టి పంపుతుంది. వెళ్ళకపోతే లక్ష్మీ దేవికి కోపం వస్తుందని భయపెడుతుంది. కుక్కలకు భయపడకుండా వాటి అరుపులను ఎలా ఎదుర్కోవాలో కూడా వాళ్ళ అమ్మ చెప్పేది. బయటికి వెళ్ళేటప్పుడు ముఖం నిండా సింధూరం పూసి పంపేది. నాలుగైదు సంచులు భుజాలకు వేసి ఒక సంచి నడుముకు వేసి బయటకు పంపేది. భిక్షం అడగడానికి వెళ్ళకపోయినా, కుక్కలకు భయపడినా అమ్మ తనని కొట్టేది. భిక్షం తెచ్చుకోకపోతే నువ్వు ఏమి తింటావు. లక్ష్మీదేవి నిన్ను ఎప్పుడూ చూస్తుంటుంది. అమ్మని నువ్వు అవమానిస్తున్నావు. కాబట్టి నువ్వు పురుగులు పడి చస్తావు అని భయపెట్టేది. సంచులిచ్చి బయటకు నెట్టేసేది. కళ్ళు తుడుచుకుంటూ కచరియా బయటకు వెళ్ళిపోయేవాడు. ముఖానికి ఉన్న సింధూరం పోయేది. అందరూ అతనిని పోతురాజు అని ఏడిపించేవారు

కచరియా తల్వకి నూనె ఉండేది కాదు. తల వెంట్రుకలు బాగా పెరిగి పిచ్చివాడిలా ఉండేవాడు. వాళ్ళ అమ్మలానే. రోజు ఒకే ఊరిలో ఎవరు పెడతారు అందుకే కచరియా రోజుకో ఊరు వెళ్ళేవాడు. పక్క ఊర్లకు కూడా వెళ్ళేవాడు. కొంతమంది అడుక్కోపోతే ఏదైనా పనిచేసుకోవచ్చుకదా అనే వాళ్ళు. కొంతమంది తిట్టేవాళ్ళు. కొంతమంది వాళ్ళకు తోచింది పెట్టేవాళ్ళు.

ఒకరోజు అడుక్కోవడానికి వెళ్లి వచ్చేటప్పటికి అమ్మ నూనె పట్టుకొని కూర్చుంది తలకు రాయడానికి. అమ్మ నూనె రాసేటప్పుడు  ఒంటి మీద చక్తా  యొక్క గుర్తులు ఉండటం గమనించి వాటికి మందు రాసింది. దురద పెడుతున్నాయా అని కచరియా ని వాళ్ళ అమ్మ అడిగింది. అది శరీరమంతా పాకడం చూసి వాళ్ళ అమ్మ ఎంతగానో చింతించింది. ఈ విషయం తెలిసి స్నేహితులందరూ తనని దూరంగా ఉంచారు. అప్పుడు తనకు ఏలల్య గుర్తుకు వచ్చింది. ఆమె యొక్క చేతులు, పాడైపోయిన కాళ్ళు నాకు గుర్తుకు వచ్చాయి. తన చేతులు, కాళ్ళు కూడా ఏలల్యా చేతులు, కాళ్ళలానే అయిపోతాయని భయంవేసింది. ఆ వ్యాధిని దాచిపెట్టడానికి ఎంతగానో ప్రయత్నం చేశాడు. ప్రయత్నం లేకపోయింది. అప్పుడు ఏలల్యా వాళ్ళ అమ్మ నువ్వు లక్ష్మీ దేవిని ద్వేషించి ఉంటావు అందుకే ఇలా జరిగింది వెళ్ళి అమ్మను క్షమాపణ అడుగు అని చెప్పటంతో అలానే చేశాడు. గుడిలోకి, బడిలోకి, నలుగురిలోకి వెళ్ళే అవకాశం కూడా కచరియాకు లేదు.

బస్సు ఎక్కినప్పుడు కండక్టర్ కిందికి దించేశాడు. హోటల్ లో కాఫీ తాగడానికి కూడ రానివ్వడం లేదు. బిక్షానికి వెళ్ళినా ఎవరూ బిక్షం కూడా వేయడం లేదు. చివరికి వాళ్ళ అమ్మ కూడా దూరంగా చూస్తుంది. అమ్మ ఒకరోజు పని నుంచి ఇంటికి వచ్చింది. అప్పటికే ఏలల్యా నోటినుంచి దుర్వాసన వస్తుంది, కళ్ళ నుండి నీరు కారుతుంది. కాళ్ళు చేతులూ పాడైపోయాయి. ఏలల్యా కు, కచరియాకు గొడవ జరిగింది. దాంతో కచరియా

ఏలల్యా గొంతు నులిమాడు అతను గట్టిగా అరచి అక్కడినుండి వెళ్ళిపోయాడు. మరునాడు అతను మరణించాడు, మట్టిలో కలిపారు. కచరియా వాళ్ళ అమ్మ ఏలల్యా ఇంట్లో ఉన్నారు. అమ్మ బయటకు వెళ్లింది. రెండురోజులైనా తిరిగి రాలేదు. కచరియాకు బాగా ఆకలి వేయడంతో ఇంటికి వెళ్ళాడు. అక్కడ అమ్మ పడుకొని ఉంది. ఆమె కళ్ళు, నోరు తెరచి ఉన్నాయి. ఆమె చుట్టుపక్కల చీమలు ఉన్నాయి. నేను అమ్మను చూశాను. ఆమెలో చలనం లేదు. అమ్మ చనిపోయింది. ఆమె తలదగ్గర కచరియా కూర్చున్నాడు. ఆమె మెడపైన ఒక గుర్తు ఉంది ఆమెను ఏలల్యా చంపేశాడు.

**ఆకలి – chakta తులనాత్మక పరిశీలన**

ఆకలి ఈ రెండు కథల్లో కథ అంతా ముక్కు పచ్చలారని పసిబాలల చుట్టూ తిరుగుతుంది. చక్త కథలో కచర్ (కచరియా), ఆకలి కథలో చిన్ని ప్రధాన పాత్రలుగా ఇంకా చెప్పాలంటే కథను నడిపించే పాత్రలుగా మనకు దర్శనమిస్తాయి. కచర్ బాలుడు చిన్ని బాలిక కానీ వారి స్థితిగతులు, ఆర్థిక నేపథ్యం అన్నిటిలోనూ కొంతవరకు పోలికలు కనిపిస్తున్నా ఆయా కథకులు మాత్రం కథను నడిపించే విధానాలలో బేధాలు కనిపిస్తాయి.

తన తల్లికి కచర్ ఒక్కడే కొడుకు, తండ్రి పోతురాజు తన చిన్నతనంలోనే చనిపోవడం జరుగుతుంది. దానితో కుటుంబ బాధ్యత మొత్తం కచర్ తల్లి మీద పడుతుంది. దానితో ఆవిడ తన కొడుకును కూడా వాళ్ళ నాన్న వలే పోతురాజు వేషం వేయించి ఊరిమీదకి బిక్షాటనకు పంపుతుంది. ఆ విధంగా కచర్ ఆ ఊరిలో ఆ పక్క ఊరిలో బిక్షాటన చేసి ప్రతిరోజూ సాయంత్రానికి ఎంతో కొంత తీసుకు వచ్చేవడు. ఎంతో మంది ఎన్నో మాటలు అనేవారు.పని చేసుకోమని, బిక్షం వేయమని, ఛీఛీ అని, పోపో అని ఎన్నో మాటలు భరించి బిక్షాటన చేసేవాడు. తాను ఇవన్నీ భరించలేక బిక్షాటనకు వెళ్ళనంటే కులదైవమైన లక్ష్మీదేవి శపిస్తుందని భయపెట్టేది. ఆ భయంతోనే కచర్ ఇష్టంలేకపోయినా బిక్షాటనకు వెళ్ళేవాడు. కచర్ ఉదయం పూట పాఠశాలకు (చదువుకోవడానికి) కూడా వెళ్ళేవాడు. ఉదయం చదువు, మధ్యాహ్నం నుంచి బిక్షాటన ఇలా కచర్ జీవితం సాగిపోతుండేది.

ఆకలి కథలో చిన్ని చుట్టూ కథ తిరుగుతుంది. చిన్ని వాళ్ళ అమ్మనాన్నకు ఉన్న ముగ్గురు సంతానంలో రెండవది. మెదట అక్క తరువాత చిన్ని, తరువాత తమ్ముడు. ఇప్పుడు మరలా వాళ్ళ అమ్మ మరొకరిని కడుపులో మోస్తూ కనడానికి సిద్ధంగా నిండునెలలతో లేవలేకుండా ఉంది. వాళ్ళనాన్న ఊరువదిలి పనికి వెళ్ళాడు. వాళ్ళ నాన్న వచ్చేవరకు మంచినీళ్ళు త్రాగి బ్రతకడమే వాళ్ళగతి. అక్క కాస్త ఇంట్లో పనులు చూసుకుంటుంది. ఎక్కడో ఊరు చివర ఉన్న మంచినీళ్ళు అక్క తెస్తేనే వాళ్ళంతా దాహం, ఆకలి తీర్చుకునేది. ఇక చిన్ని, తమ్ముడు ఏ పనీ చేయలేరు ఎందుకంటే అంత వయస్సు, శక్తి ఇంకా వారికి రాలేదు.

చిన్ని ఎప్పుడూ వాళ్ళ నాన్న కోసం ఎదురు చూస్తూ ఉంటుంది, నాన్న వస్తే ఆకలి తీరుతుందని చిన్ని ఆశ. నాన్న ఇంటి దగ్గర ఉన్నప్పుడు ఒకరాత్రి తినకపోయినా తెల్లవారితే ఆకలి తీరుతుందనే ఆశ ఉండేది. ఒక

పేళ నాన్న ఇంట్లో లేకపోయినా తెల్లవారి వస్తే ఏదైనా తెస్తాడు దానిని తిని ఆకలి తీర్చుకోవచ్చు అనే ఆశ ఉండేది. కాని మూడు రోజుల నుంచి వాళ్ళ నాన్న కోసం ఎదురుచూస్తూనే ఉంది, ఆకలి తీరకపోయినా నాన్న వస్తాడేమో, ఆకలి తీరుస్తాడేమో అనే చిన్ని ఆశ చిన్నిని ఎదురుచూసేలా చేస్తుంది.

చిన్ని సాయంత్రం పూట అందరి ఇళ్ళకూ వెళ్ళి వాళ్ళు వండుకుంటుంటే ఆ అన్నం, కూర వాసనలు పీల్చి ఎవరైనా ఏమైనా పెడతారేమోనని ఎదురుచూసి, చూసి తిన్నవి కూడా కడుక్కున్నాక నిదానంగా ఇంటికి వచ్చి మంచినీళ్ళు త్రాగి పడుకుంటుంది.

ఆకలి తీరకపోవడంతో ఆకలి తీర్చేవారు ఎవరూ లేకపోవడంతో అరటిపండు తింటూ కనిపించిన ఒక అబ్బాయిని తనకు కూడా కొంచం పెట్టమని అడుగుతుంది అతను నిరాకరించడంతో బలవంతంగా తన చేతిలో నుంచి లాక్కోవడానికి ప్రయత్నించి ఘోరపరాజయానికి లోనై ఆకలితో పాటు బాధను కూడా పెంచుకుంటుంది. ఆ బాధతో ఏడుస్తూ ఉండగా ఆ అబ్బయి వాళ్ళ అన్న వచ్చి చిన్ని ని తిట్టి కోపాన్ని అణుచుకోలేక కొట్టి మరీ అక్కడినుంచి వెళ్ళిపోతాడు. ఆకలి బాధ, అరటిపండు అందలేదనే బాధ, అతను కొట్టాడనే అవమానపు బాధ ఇవన్నీ తనను బాధిస్తుంటే ఎదురుగా వస్తున్న లారిని చూసి దానికి ఎదురుగా వెళ్ళి నుంచుంటుంది. లారీ ఆపి డ్రైవరు ఇంకా కొంతమంది చిన్ని ని తిట్టి అక్కడినుంచి వెళ్ళిపోతారు తన ఆకలి గురించి పట్టించుకోకుండా.

కచర్ కు నాన్న లేడు. చిన్ని కి ఉన్నా ప్రయోజనంలేదు. కచర్ ఒక్కడే కానీ చిన్ని వాళ్ళు మొత్తం నలుగురు పుట్టబోయే వారితో కలిసి. కచర్ చదువుకునే భాగం కూడా కనిపిస్తుంది. కానీ చిన్ని జీవితంలో చదువు అనే పదం కూడా కనిపించదు.కారణం ఆడపిల్లకు చదువెందుకని కాబోలు,లేకపోతే తింటానికే తిండిలేదు చదువులెందుకని కాబోలు.కచర్ ఊరు ఊరు తిరిగి అడుక్కుంటూ ఉంటాడు. చిన్ని ఇల్లు ఇల్లూ తిరిగి ఎవరైనా ఒక ముద్ద పెడతారేమోనని చూస్తుండేది కానీ ఎవరినీ నోరు తెరచి మాత్రం పెట్టమని అడగదు. అది పెంపకవిధానం కావచ్చు. కానీ కచర్ జీవితం ను పరిశీలించినట్లైతే వాళ్ళ అమ్మే తనను భిక్షాటనకు పంపటం గమనించ వచ్చు. కనుక కచర్, చిన్ని ల పెంపకంలో కొంత బేధం మనకు స్పష్టంగా కనిపిస్తుంది.

కచర్ అడుక్కునేటప్పుడు ఎంతో మంది ఎన్నో అవమానాలకు గురుచేస్తుండేవారు, స్నేహితుల దగ్గరనుంచి, భిక్షం వేసేవారి వరకు. చిన్ని కూడా ఆకలి తీరక, అడుక్కోలేక , ఆకలిని అణుచుకోలేక కనిపించిన పిల్లవాడి దగ్గర్నుంచి అరటిపండు లాక్కోవడం ఆ అబ్బాయి వాళ్ళ అన్న వచ్చి చిన్ని ని తిట్టడం, కొట్టడం ఆ లేత వయసులో చిన్నికి జరిగిన అవమానంగా భావించవచ్చు.

కచర్ జీవితం ఇలా కొనసాగుతున్న నేపథ్యంలో అనుకోకుండా తను ఒక వ్యాధి బారిన పడతాడు. దాని వల్ల క్రమేపీ అతని కాళ్ళు, చేతులు అన్నీ చెడిపోతూ ఉంటాయి. అందరిలోకి వెళితే వాటిని చూసి తనను దూరంగా నెట్టివేస్తారని కనిపించకుండా చూసుకునేవాడు. కానీ రోజు రోజుకు అవి పెరిగిపోతుంటే చేసేది ఏమీలేక తానే గుడికి, బడికి, అందరికీ దూరంగా ఉండసాగాడు. అయితే వాళ్ళ ఇంట్లో ఉన్న ఎహల్యా ఇదే వ్యాధితో

చనిపోతాడు. ఆ తరువాత ఈ వ్యాధి కచర్ కి వస్తుంది. వాళ్ళ తగ్గుతుంది అనే నమ్మకంతో ఉంటుంది. కానీ అనుకోకుండా కారణం లేకుండా కచర్ వాళ్ళ అమ్మ చనిపోతుంది. ఆమె గొంతుపై ఉన్న గాయాలు చూసి ఎహల్యానే అమ్మను చంపాడని అనుకుంటాడు. తను ఆకలితో, తగ్గని ఆవ్యాధితో, సమీపాన మృత్యువుతో అనాథ గా మిగిలిపోతాడు.

ఇక ఆకలి కథలో చిన్ని ని చూస్తే నాన్న రాకపోయినా, ఆకలి తీరకపోయినా స్నేహితులతో కలిసి ఆడుకుంటుండగా లారి గుద్దడంతో స్పృహ తప్పి పడిపోతుంది. కళ్ళు తెరచి చూసే సరికి అమ్మ పక్కలో ఉంటుంది. ఆ లారీ ఓనర్ నెలకు 100 రూపాయల చొప్పున నాలుగునెలలు ఇస్తానని, రోజు మంచి పండ్లు ఆహారం తెస్తానని అతను అక్కడినుంచి వెళ్ళిపోతాడు. అలా నాలుగు నెలలు అమ్మ నాన్న సంపాదించలేని సొమ్మును ఆహారాన్ని చిన్ని సంపాదించింది. కాలం కష్టాల్లో కష్టంగానూ, సుఖాల్లో తొందరగానూ గడిచిపోతుంది కదా, చిన్ని జీవితంలో కూడా అదే జరిగింది. నాలుగు నెలల కాలం గడిచిపోయింది. నెలకు 100 రూపాయలు, పండ్లు, ఇవి ఏవీ లేవు. మళ్ళీ పాత జీవితం చిన్ని ని పలకరించింది. రోజూ లారీ డ్రైవరు చిన్నిని పలకరించి వెళ్ళేవాడు. తరువాత తరువాత లారీ ఆపడం కూడ ఆపేశాడు.

ఒకరోజు చిన్ని లారీ వస్తుంటే రోడ్డుకు అడ్డంగా నిలబడుతుంది. జోరున వర్షం కురిసి ఆగడంతో అల్లంత దూరంలోనే చూసి బ్రేక్ వేసినా తడిచిన రోడ్డు కావడంతో లారీ ఆగలేదు. ఆగిన తరువాత చూస్తే చిన్ని కనిపించలేదు. ఎటు పడిందో తెలియలేదు. లారీ వెనుక నుంచి వర్షపునీటిలో కలిసిన రక్త ఏరులై పారుతుంది. చిన్ని ఇకలేదు. కచర్ జీవితాన్ని వరించడానికి చావు ఎదురుచూస్తుంది. కానీ చిన్ని జీవితాన్ని చావు వరించింది.

కచర్ తల్లి ఉన్నంత కాలం తల్లిని భిక్షాటన చేసి పోషిస్తే,చిన్ని కి యాక్సిడెంట్ కావటం వల్ల వచ్చిన డబ్బుతో కుటుంబమంతా నాలుగు నెలల పాటు పోషించబడింది.ఇద్దరూ చిన్న పిల్లలే కానీ పెద్దవారిలా కుటుంబ బాధ్యతలు నెత్తిన వేసుకున్నారు.కనుకనే అనారోగ్యం పాలై చావుకు చేరువలో ఉన్నాడు కచర్, యాక్సిడెంట్ అయ్యి చావుకు దగ్గరయ్యింది చిన్ని.

ఈ రెండు కథల్లో కథకులు దళిత జీవితాల్లో ఉండే అధ్వాన్నమైన స్థితిని కళ్ళకు కట్టినట్లు వర్ణించారు.కచర్,చిన్ని చదువుకోవలసిన వస్సులో పడిన ఇబ్బందులు చూస్తుంటే, చదువుతుంటే ఆ భయంకరమైన జీవితం పగ వారికి కూడా రాకూడదని అనుకోని మనిషి ఉండరనడంలో అతిశయోక్తి లేదు.భర్త చిపోయిన స్త్రీ ఎలాంటి పరిస్థితులను అనిభవిస్తుందో చెప్తూనే, భర్త ఉండికూకా సరైన సంపాదన లేక పోతే ఆ కుంటుంబ పరిస్థితి ఎలా ఉంటుందో కథకుడు వర్ణించిన విధం కన్నీళ్ళు తెప్పిస్తుంది. ఈ రెండు కథల్లో దళిత జీవన విధానం , వాళ్ళ అధ్వాన్న స్థితి మనకు కనిపిస్తుంది.

**ఎర్నీళ్ళు - సంగతరాశ్ తులనాత్మక పరిశీలన**

ఎర్నీళ్ళు (తెలుగు కథ పరిచయం)

సూర్యుడు నడినెత్తి మీద ఉన్నాడు. అది చింతడికి తెలియదు. డొంకలో నాలుగు తోవల కలిసే చోట నిలబడి దీక్షగా చూస్తున్నాడు చింతడు. చాలా సేపు అలానే నిల్చున్నాడు. తరువాత కూర్చున్నాడు. చింతడి దగ్గర సూర్యుని ప్రతాపం ఏమీ పనిచేయలేదు. చింతడికి కళ్ళు ఉన్నాయి వాటికి చూపు ఉంది. అమ్మ తప్ప అన్యం కనిపించదు.చెవులున్నాయి వినిపిస్తుంది. కానీ అమ్మ కన్నోడా అన్నప్పుడు మాత్రమే వినిపిస్తుంది.

అమ్మ పొలం పోయిందనీ, పని ముగించుకొని వస్తుందనీ, వచ్చి వండిపెడుతుందని చింతడికి తెలియదు. చింతడి వయస్సు నాలుగేళ్లు. అన్నదమ్ముల్లేరు.

చింతడు అమ్మకోసం చూస్తున్నాడు. ఇంట్లో తినడానికి ఏమీలేవు.చూపు మరలడం లేదు.ఎందుకు మరలిందో చింతడి చూపు మరలింది. నేల వైపు చూస్తున్నాడు. నేల మీద నిమ్మకాయలు, ఉప్పు, ఎండు మిరపకాయలు, చింతపండూ, వెంట్రుకలూ ఉన్నాయి. వీటిని పెద్ద వాళ్ళు చూస్తే తప్పుకు పోతారు. ఎట్టి పరిస్థితుల్లోనూ తొక్కరు. పిల్లల్ని తొక్కనివ్వరు. దిష్టి తీస్తే అలా ఉండొచ్చు. చేతబడి చేస్తే అలా ఉండొచ్చు. మంత్ర తంత్రాలు జరిపినా అలా ఉండొచ్చు. ఇవేవీ చింతడికి తెలియదు అందుకే వాటిని తొక్కలేదు,దాటలేదు ఏకంగా చేతిలోకి తీసుకున్నాడు. ఇంటికి తెచ్చుకున్నాడు.

అక్కడే ఎర్నీళ్ళు కూడా ఉన్నాయి. వాటిని దాటకూడదంటారు.తొక్కకూడదంటారు. వాటిని తొక్కకుండా వచ్చాడో, తొక్కి వచ్చాడో తెలియదు కానీ మొత్తం మీద బయటకు వచ్చాడు. అమ్మ వచ్చే వరకు ఆకలికి ఆగలేక పోయాడు.ఇంట్లో కూడా తినడానికి ఏమీ లేకపోవడంతో తప్పలేదు.వాటన్నిటిని ఉపయోగించి నిమ్మరసం తయారు చేశాడు. అమ్మ పొలం నుంచి వచ్చింది.నిద్ర పోతున్న చింతడిని లేపింది. చింతడు ఆవులిస్తూ లేచి అమ్మను వాటేసుకున్నాడు. వెంటనే లోపలికెళ్ళి ముంత తెచ్చి అమ్మ మూతికందించాడు.ఇదేందిరా అని అమ్మ అడిగింది. నీమలసం అన్నాడు దీర్ఘాలు తీస్తూ... మరి నీకో..., తాగా... , ఎక్కడిదిరా... , తాగు... అమ్మ ముంతడు నిమ్మరసం దించ కుండా తాగి పెట్టిన చోట పెట్టకుండా గంపెడు ముద్దులు పెట్టింది చింతడికి.

**సంగతరాశ్ (మరాఠీ కథ పరిచయం)**

టాక్ వడే అనే గ్రామంలో భయంకరమైన కరువు వచ్చింది.వర్షం కోసం ఎదురుచూసి చూసి కళ్ళు జనం కాయలు కాసాయి. అయినా ఎక్కడా వర్షాలు పడే అవకాశమే లేదు. రోజు గడవడం కోసం సగం గ్రామం వలసపోయింది. కొంతమంది వారి దగ్గర ఉన్నవాటిని తక్కువ రేటుకే అమ్మేసి ఊరు వదిలి వెళుతున్నారు. ఊరిలో బావులన్నీ ఎండిపోయాయి. త్రాగునీటికి కూడా ఇబ్బందిపడవలసి వస్తుంది. ఇక స్నానమైతే వారానికొకసారి. ఊరిలో అన్ని బావులు ఎండిపోయాయి. తాగునీరు కూడా కరువయ్యింది. కుండలు చేసుకునే

సంగతరాశ్ పరిస్థితి మరీ అధ్వాన్నం. వర్షాలు లేక, వరిపొట్టు, మట్టి, నీరు లేక కుండలు చేయడం లేదు. ఉన్నటువంటి మూడు గాడిదెలు అమ్మేశాడు. చేతిలో చిల్లి గవ్వ లేదు. రెండు రోజుల నుంచి పస్తులు. పటేల్ ని ధాన్యం గింజలు అడగమని భార్య సలహా ఇస్తుంది. కలుద్దామనుకునే లోపే ఎవరో వచ్చి పటేల్ రమ్మంటున్నాడని చెప్తారు. లక్ష్మీ మందిరంలో ఊరు జనమంతా ఉన్నారు త్వరగా రమ్మనడంతో అతనితోపాటే సంగతరాశ్ వెళ్తాడు.

ఎన్నో రకాల పూజలు, వ్రతాలు, నోములు, భజనలు జరిపించాం వర్షాల కోసం పంటలు సరిగా పండటం కోసం ఇక చివరగా గాడిదను ఊరేగిస్తే మంచిది.రేపు ఉదయం గాడిదని శుభ్రంగా కడిగి. నూతన వస్త్రాన్ని కప్పి తీసుకురమ్మని పంపిస్తాడు. చాలా సంతోషపడతాడు. ఉదయానే పటేల్ చెప్పినట్టే గాడిదను తీసుకొస్తాడు.

పక్క వీధిలో బాజాలు మోగుతున్నాయి, ఇంకో వీధిలో హరిజనులు చిందులు వేస్తున్నారు. ముందు చిందులు వేసేవారు, తరువాత బాజాలు వారి వెనుక సంగతరాశ్, అతని గాడిద వెళుతున్నారు. వారు పటేల్ ఆవరణలోకి వెళ్ళారు. అప్పటికే ఊరుజనం అక్కడికి చేరుకున్నారు. గాడిదకు ఆ పటేల్ ఇంట్లోవారు కాళ్ళు కడిగి పూజలు చేశారు. రకరకాల పదార్థాలు తినిపించారు. ఆ తరువాత నీళ్ళు త్రాగించి మళ్ళీ తిను బండారాలు పెట్టారు. అందరికీ బెల్లం పంచారు. ఆ తరువాత పటేల్ కుటుంబంతో కలిసి ఊరేగింపులో పాల్గొన్నాడు. మొత్తంమీద ఊరేగింపు అయిపోయింది. తప్పకుండా వర్షాలు పడతాయని పూజారి కూడా హామీ ఇవ్వడంతో అందరూ అక్కడినుంచి ఇళ్ళకు వెళ్ళిపోయారు.

సంగతరాశ్ కొంత ధాన్యం ఇవ్వమని ,ఇల్లు గడవడం కష్టంగా ఉందని అడుగుతాడు.పటేల్ కోపగించుకొని నానా విధాలుగా తిడతాడు.సంగత్ నిరాశతో ఇంటికి వెళ్తాడు. మిఠాయి, బెల్లాన్ని పిల్లలకు భార్యకు పంచి అతడు తన భార్యతో మనం గాడిదగా పుట్టి ఉంటే ఎంత బాగుండేదో మనిషి జన్మ ఎందుకు ఎత్తామా అనే నిరాశ ను వ్యక్తం చేశాడు.

ఆ తరువాత గాడిదను చూస్తూ దాని అదృష్టాన్ని , తన దురదృష్టాన్ని తలచుకుంటూ నీరు తాగి నిద్రపోతాడు.

**ఎర్నీళ్ళు - సంగతరాశ్ తులనాత్మక పరిశీలన**

తెలుగు కథ ఎర్నీళ్ళు, మరాఠీ కథ సంగతరాశ్. ఈ రెండు కథల్లో కథకులు చెప్పాలనుకున్న భావం ఒకటే.తింటానికి, తాగడానికి కూడా ఇబ్బందిపడే దళితుల స్థితి. కూలిపనుల మీద ఆధారపడే వారి జీవన చిత్రణ. బ్రతుకు వ్యధలు కథలు కథలుగా మనకు కనిపిస్తూనే ఉంటాయి.

ఎర్నీళ్ళు లో చింతడి కుటుంబం, సంగతరాశ్ లో సంగతరాశ్ కుటుంబం ఇందుకు నిదర్శనాలు. కూలిపనుల మీద,కుల వృత్తుల మీద ఆధారపడే వాళ్ళ జీవితాలు ఎంత అగమ్య గోచరంగా ఉంటాయో, ఎంత హృదయవిదారకంగా ఉంటాయో మనకు ఈ కథల ద్వారా తెలుస్తాయి.

ఎర్నీళ్ళు లో అమ్మ కోసం ఎదురుచూసే చింతడు రోడ్డుమీద దిష్టితీసో, చేతబడి చేసో, మంత్ర తంత్రాలు చేసో పడేసిన నిమ్మకాయలు, ఉప్పు, మిరపకాయలు, చింతపండు ఇవన్నీ తీసుకొని వాటితో నిమ్మరసం చేసి తను తాగి తల్లికి కూడా ఇచ్చిన చిత్రం మనకు కనిపిస్తుంది. ఎర్నీళ్ళలో ఉన్న పెద్దవాళ్ళు చూడటానికి కూడా ఇష్టపడరు, కానీ చింతడు ఏకంగా వాటితో నిమ్మరసం కూడా చేశాడు. ఒకటి తనకు తెలియక చేయడం, రెండు తన పేదరికం, ఇంట్లో తినడానికి ఏమీ లేకపోవడం, తల్లి వచ్చే వరకు ఆకలికి ఆగలేకపోవడం ఇవన్నీ కారణాలుగా చెప్పుకోవచ్చు.

సంగతరాశ్ లో సంగత్ ఇల్లు గడవని స్థితిలో ఉంటాడు. ఒకరికొకరు సహాయం చేసుకునే స్థితిలో కూడా ఆ ఊరి ప్రజలు లేరు. వరదల వల్ల ఇబ్బందుల్లో ఉన్నారు. కాస్తో కూస్తో ఉన్న వారిని అడిగినా పెట్టే హృదయం వారికి లేదు. అందుకే సహాయం అడిగిన సంగత్ కు పటేల్ సహాయం చేయడు కానీఊరేగింపుకోసం తెచ్చిన సంగత్ గాడిదకు కాళ్ళు కడిగి రకరకాల తిను బండారాలు పెడతారు. కానీ సంగత్ కు గుప్పెడు గింజలు కూడా ఇవ్వడు. దేవుళ్ళకు కల్యాణ వైభోగాలు చేయిస్తారు కానీ దళితులకు గుప్పెడు గింజలు కూడా ఇవ్వరు. అందుకే సంగత్ తనకు ప్రసాదంగా ఇచ్చిన బెల్లం,మిఠాయి పిల్లలకు,పెళ్ళానికి పంచి గాడిదగా ఎందుకు పుట్టలేదా మనిషి జన్మ ఎందుకు ఎత్తామా అని తన దురదృష్టాన్ని తలుచుకుంటూ నీళ్లు తాగి పడుకుంటాడు.

మనుషులు తిరిగే ఈ లోకంలో మనిషిగా ఎందుకు పుట్టామా అని సంగత్ అనుకున్నాడంటే తను ఎలాంటి మనుషుల మధ్య ఉంటున్నాడో అర్థం చేసుకోవచ్చు. అదే విధంగా ఎర్నీళ్ళులో చింతడు కూడా ఎవరూ చూడటానికి, తీసుకోవడానికి కూడా సాహసించని ని తీసుకొని వాటితో నిమ్మకాయలు, ఉప్పు, మిరపకాయలు, చింతపండు ఇవన్నీ కలిపి కడుపునింపే నిమ్మరసాన్ని తయారు చేసుకున్నాడు. అంటే చింతడు కూడా ఎలాంటి మనుషుల మధ్య బ్రతుకుతున్నాడో అర్థం చేసుకోవచ్చు.

మొత్తంమీద తెలుగు కథ లో చింతడు, మరాఠీ కథలో సంగత్ ఇద్దరూ బ్రయుకుతున్న సమాజం ఒకటే. ఇద్దరూ ఎదుర్కొంటున్న సమస్యలు ఒకటే. కాకపోతే వయసు తేడా అంతే. చింతడికి నాలుగేళ్ళయితే... సంగత్ కి నలభై ఏళ్ళనుకోవచ్చు. కానీ సమస్య ఒకటే.

కథకులు తమ తమ కథల్లో దళితుల జీవణ చిత్రణని ఒక కోణంలో మాత్రమే ఇక్కడ ఆవిష్కరించార నుకోవచ్చు.ఇంకా ఎన్ని కోణాలు ఉన్నాయో వారి బ్రతుకుల్లో...

# ప్రపంచీకరణ కథల్లో స్త్రీ అస్తిత్వ చిత్రణ

డా యద్దనపూడి గాయత్రి
తెలుగు ఉపాధ్యాయురాలు
ఆదర్శ పాఠశాల, తెలంగాణ
9640919930

ఉపోద్ఘాతం

స్త్రీ జీవితంలో శీలం, వివాహం, మాతృత్వం అతి ముఖ్యమైన అంశాలు. భార్యాభర్తల సంబంధాల్లో అసమా నత్వం, యాంత్రికత, హింస, విశ్వాసరాహిత్యం ,పెత్తనం, అధికారం, అణచివేత మొదలైనవి అనేక కథల్లో ప్రధాన వస్తువుగా కనిపిస్తుంది. వివాహం నుండి బయటపడటానికి ,వివాహం కంటే అతీతంగా తమకొక అస్తిత్వం ఉందని గుర్తించడానికి స్త్రీలు ఈనాటికీ వెనుకాడుతూనే ఉన్నారుధైర్యం చేసి స్త్రీ తన భర్తకు విడాకులివ్వడం ,మళ్ళీ పెళ్లి చేసుకోవడం జరిగినా దాన్ని లోకం హర్షించదుకంప్యూటర్ యుగమైనా., ప్రపంచీకరణ శకమైనా ఇది అనివార్యంగా కొనసాగుతూనే ఉందిప్రపంచీకరణ కొత్తగా స్త్రీలకు చేసిందంటూ ఏమీ . లేదు.నేటి స్త్రీలు చదివి మంచి ఉద్యోగంలో ఉన్నప్పటికీ తన మానసిక సంఘర్షణలో మాత్రం ఏ మాత్రం తేడా లేదు.

మహిళ అన్న పదంలోనే చాలా హుందాతనం దాగిఉన్న భావన కలుగుతుందిమహా ...మహిళలూ. అంటూ ఒక సంగీతకారుడు పాటకు పదాలను కూర్చినా ఆడదే ఆధారం అంటూ స్త్రీ లేనిదే జీవితా ...రాణులూ నికి అర్థమే లేదంటూ ఓ మహానుభావుడు చిత్రాన్ని నిర్మించినా,నేను అలసిపోయానంటూ అమ్మ రాజీనా మా చేయాలని ప్రయత్నించినా, స్త్రీ జాతి మొత్తం స్త్రీ చైతన్యాన్ని కోరుతూ అనేక ఉద్యమాలు ,ఉపన్యాసాలు చేసినా నేటి ప్రపంచీకరణ శకంలో కూడా మహిళ ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్న సామెతను తలపించే విధంగా సర్వ స్వాతంత్ర్యాలకై పోరాటం చేస్తూనే ఉంది.స్వేచ్ఛ లేని మరబొమ్మ లాగా మిగులుతూనే ఉంది.ఇంకా అంతులేని ఆ కథ సాగుతూనే ఉంది.

ప్రపంచీకరణ మన జీవితంలో భాగమైన తరువాత ఆర్థిక పరంగా స్త్రీ జీవితం ఛిన్నాభిన్నమైపోవడాన్ని ప్రపంచీకరణ కథకులు చాలా వాస్తవికంగా చిత్రించారుప్రపంచంలో ఎప్పటికప్పుడు సంభవించే . మార్పులన్నిటిపట్ల స్త్రీలు ఎంత అప్రమత్తంగా ఉండాలో ,అభివృద్ధి పేరిట జరిగే ప్రతి పరిణామం స్త్రీలను మరింతగా ఎలా మూలకు నెట్టేస్తుందో , స్త్రీ ప్రాముఖ్యాన్ని ,ఆత్మగౌరవాన్ని ఎలా కించపరుస్తుందో ఈ కథలు చెప్తున్నాయి కుటుంబంలోని వివక్ష.,సమాజంలోని అసమానతల చిత్రణకే పరిమితం కాకుండా ప్రాపంచిక

,ఆర్థిక,రాజకీయ పరిణామాల మధ్య స్త్రీ జీవితాన్ని అర్థం చేసుకోవడానికి కూడా తెలుగు కథా సాహిత్యం ఎంతగానో ఉపకరిస్తుంది.

నేను పత్ర సమర్పణకు ఎంచుకున్న నస్త్రీ స్వాతంత్ర్యమూర్తి ,స్వేచ్ఛ , పంజరం విరిగింది, బొమ్మలోచైతన్యం , అమ్మా నాన్న ఎవరు? ఈ కథలు ప్రపంచీకరణ నేపథ్యంలో స్త్రీ అస్తిత్వ చిత్రణ ఎలా ఉంది అనే విషయాలను మన ముందు ప్రతిబింబించేలా చేస్తాయి .

నస్త్రీ స్వాతంత్ర్యమూర్తి ముదిగంటి సుజాతారెడ్డి)-విసుర్రాయి కథా సంపుటి1998 - ) కథలో సుగుణ మనకు ప్రధాన పాత్ర గా కనిపిస్తుందిఐదుగురు కొడుకుల్ని బాగా చదివించిన రాఘవరావు కూతురు . సుగుణను మాత్రం పదో క్లాసుతోనే ఆపించి,గుండెలమీద కుంపటిగా భావించి మోహనరావు కిచ్చి పెళ్ళిచేసి చేతులు దులుపుకుంటాడు మోహనరావుకు. గౌరవించే సంస్కారం లేదు కనీసం ఆమెను ఏ రోజూ మనసున్న మనిషిగా కూడా చూడడుతను ఆఫీస్ కు వెళ్ళేటప్పుడు భార్యను గదిలో పెట్టి తాళం వేసుకొని . .వెళ్ళేవాడుఇక భర్త కాలం చేశాక కొడుకుల పంచన చేరిన సుగుణకు గత పరిస్థితులతో పోల్చుకుంటే పెద్దగా మార్పేమీ కనిపించాడుతండ్రి స్థానంలో భర్త వచ్చాడు.,ఇప్పుడు భర్త స్థానంలో కొడుకులొచ్చారుఅక్కడ . ఉండలేక బయట ఏదైనా గాడి అద్దెకు చూడమంటే నీకేం తెలియదు నోరుమూసుకొని ఇంట్లో కూర్చోమంటే తను పాలిచ్చిపెంచిన వారు తనను పాలించడానికి ప్రయత్నిస్తుంటే దానిని ఘోర అవమానంగా భావించి .ఇంట్లో నుంచి బయటకు వెళ్లిపోతుంది

ప్రపంచీకరణ నేపథ్యంలో వచ్చిన కథ ఇదిమరి ఈ కథలో రాఘవరావులో కానీ., మోహన రావులో కానీ ఎలాంటిమార్పూ లేదుస.్త్రీ స్థితిగతుల్లో కూడా ఎలాంటిమార్పూ లేదుయుగయుగాలుగా., తరతరాలుగా ఎలా అయితే స్త్రీ మగాడి మీద ఆధారపడి బ్రతుకుతుందో,ఆధునిక అన్నీ రంగాలలో దూసుకెళుతున్న ఈ రోజుల్లో కూడా స్త్రీ అలానే ఉంది అనే విషయాన్ని ఈ కథ తెలియపరుస్తుంది.

ప్రపంచీకరణ అణువణువునా జీర్ణించుకుపోయిన వ్యవస్థలో పుట్టిన ఈ కథలో నాటి స్త్రీకి నేటి స్త్రీకి పెద్ద ఎంత చదువులు చదివినా.తేడా లేదనే విషయాన్ని స్పష్టంగా తెలియపరుస్తుంది,ఎన్ని ఉద్యోగాలు చేసినా ఆడదాని స్థితి మాత్రం ఆనాటి నుంచి ఈ నాటి వరకు అలానే ఉంది.

స్వేచ్ఛ1998 -విసుర్రాయి కథా సంపుటి - ముదిగంటి సుజాతారెడ్డి) ) కథలో సరోజ ఉద్యోగిని .వేణు ఆమె భర్తభర్త అనాథ ను తెచ్చి పెంచుకుందామని అడిగినా .పిల్లలు పుట్టలేదని ఎంతో దిగులు చెందుతుంది. స్త్రీ కి మాతృత్వం.సరోజ ఒప్పుకోదుగొప్పవరమని తన కడుపున పుట్టే వారి కోసం ఏళ్ల తరబడి ఎదురుచూస్తుందికొడుకును బాగా చదివించి .ఆ తరువాత రెండేళ్లకు వేణు చనిపోతాడు.శేఖర్ పుడతాడు. కానీ కొడుకు కుక్కిన .స్వేచ్ఛ గా ఉండాలనుకుంటుంది.తాను రిటైర్ అవుతుంది.ప్రయోజకుడిని చేస్తుంది

.పేనులా మూలాన కూర్చోమంటాడుప్రతి విషయంలో అడ్డుపడుతుంటాడుభరించలేని సరోజ ఇల్లు వదిలి . .వృద్ధాశ్రమానికి వెళ్లిపోతుంది

పంజరం విరిగింది - ముదిగంటి సుజాతారెడ్డి)విసుర్రాయి కథా సంపుటి 1998 -) కథలో లక్ష్మి కేశవ రావు,జయల మూడవ సంతానం ఇద్దరబ్బాయిల తరువాత పుట్టిన ఆడపిల్ల .గారాబంగా పెంచుతారు.కానీ ఆడపిల్లలకు చదువులెందుకు ,ఉద్యోగాలు చేసి ఊళ్లేలాలా అనే మనస్తత్వం కేశవరావుది .అందుకే ఇంట్లో వాళ్ళు చదివించకపోయినా కష్టపడి బిసి.వరకు చదువుతుంది .ఏ..ఏకానీ కేశవరావు .చేయాలనుకుంటుంది . పెళ్లి చేయాలనినిశ్చయించుకుంటాడు .అందుకు లక్ష్మి ఒప్పుకోదు.తల్లి నెమ్మదిగా చెప్పి చూస్తుందిఅయినా . సరే నా మనసు చెప్పిందే నేను చేస్తాను నా ఇష్టానికి వ్యతిరేకంగా ఏదీ చేయనని కరాఖండీగా చెప్పేయడంతో ఇక్కడ లక్ష్మి తీసుకున్న నిర్ణయం ఆడపిల్లలు తమ ఇష్టాయిష్టాలను చంపుకొని పంజరం లో .కథ ముగుస్తుంది చిలకాలా బ్రతకాల్సిన అవసరంలేదని ,ఆ పంజారాన్ని విరగగొట్టుకొని బయటికి వచ్చి స్వేచ్ఛాలోకంలో తనకు నచ్చినట్టుగా ఉండమని ఇచ్చిన సందేశంలా కనిపిస్తుంది.

బొమ్మలో చైతన్యం - ముదిగంటి సుజాతారెడ్డి) విసుర్రాయి కథా సంపుటి 1998 -) వరలక్ష్మి ఆస్తిపరుల ఇంట్లో పుడుతుందిరోజు ఆవిడని అందంగా అలకరించేవారు బొమ్.మలాగాభర్త .కొన్నాళ్ళకు పెళ్ళవుతుంది ... కానీ వ్యాపారాలు.కూడా తనకు ఏలోటూ రాకుండా చూసుకుంటాడు,బిజినెస్ అంటూ తను ఊర్లు పట్టుకు తిరుగుతుంటాడుమొదట్లో తనకు .వరలక్ష్మి పెళ్లైనా ఒంటరిగానే మిగిలిపోయిన జీవితాన్ని అనుభవించేది. తెలిసేది కాదు తనను ఎందుకు అలా అలంకరించారో,తను ఎందుకు అలా అలంకరించుకుందోతరువాత ... .అదంతా స్టేటస్ కోసమని.తరువాత తనకు విషయం అర్థమవుతుందిఎప్పుడైతే తనకు ఈ విషయం తెలిసిందే అప్పుడు తనకు అలంకారాల మీద విరక్తి కలుగుతుందిఈ నేపథ్యంలోనే భర్తకు వేరే అమ్మాయితో సంబంధం . .ఉన్న విషయం తెలిసిపోతుందిఅన్యాయానికి గురైనా ధైర్యంగా నిలబడి విడాకులు తీసుకోవాలని నిర్ణయించుకుంటుంది .ఆమె తీసుకున్న నిర్ణయం స్త్రీలలో కలిగిన చైతన్యాన్ని తెలియపరుస్తుంది.

అమ్మా!.. నాన్న... ఎవరు ? - నేటి సమాజం కథల సంపుటి - పాలకుర్తి పుష్పలత) 2007 (కథలో అన్నపూర్ణమ్మ ప్రధాన పాత్ర తనకు ఏమీ తెలియని.వయసులో మనిషి రూపంలో ఉన్న ఒక మగ మృగం తనపై అత్యాచారం చేస్తాడుఅసలు తను ఏంచేశాడనే విషయం కూడా .అది ఎవరనేది కూడా తనకు తెలియదు. అంత అమాయకత్వం.తనకు తెలియదు,అంతపసితనం ఆమెలో చోటుచేసుకుంటాయి .చివరకు ఆమె గర్భవతి అవుతుంది. ఊరుఊరంతా ఆమెను నిందిస్తుందితల్లిదండ్రులతో సహా.ా ఆ అవమానాన్ని భరించలేక ఊరు ! ఓ పెద్దింటావిడ తనను చేరదీసి తన కొడుకు రాజును బాగా చదివించి .వదిలి వెళ్లిపోతుంది అన్నపూర్ణమ్మ .కానీ కొడుకు చిన్న తనం నుంచి అడిగే ప్రశ్న.కలెక్టర్ ని చేస్తుందిఅమ్మా నాన్న ఎవరు? అనే ప్రశ్నకు మాత్రం సమాధానం చెప్పలేకపోతుందికలెక్టర్. గా మారిన కొడుకును తీసుకొని తన సొంతఊరుకు

వెళుతుంది అప్పుడు తనపై అత్యా.చారం చేసిన వ్యక్తి ముందుకు వచ్చి ఆ రోజు పశువులా ని జీతాన్ని నాశనం చేసింది నేనేనని తప్పు ఒప్పు కొని క్షమాపణ కోరడంతో తనను క్షమించి రాజుకు తండ్రిగా పరిచయం చేస్తుంది.

ఈ కథ మగాడి అరాచకానికి ,ఆడదాని క్షమాగుణానికి గొప్ప నిదర్శనం అష్టకష్టాలు పడిన అన్న. పూర్ణ మ్మ చివరకు తన గర్భానికి కారణమైనవాడిని తెలుసుకొని తనని రాజుకు తండ్రిగా స్వీక రించడంలో వంటి సన్ని వేశాలు తరతరాలనుండి వస్తున్న మగవాడి దాష్టీకాన్ని మళ్ళీ మళ్ళీ నిలబె డుతూనే ఉండటాన్ని తెలియచే స్తుందిఅన్నీ కష్టాలకు కారణమైన మగాడిని క్షమించడంలోనే స్త్రీ తనను తాను అబలగానే . స్త్రీలు ఎంతముందడుగు వేసినా వాళ్ళలో అనాదిగా .నిలుపుకుంటోదనడానికి రుజువులా కనిపిస్తుంది నాటుకుపోయిన ఆచారాలు,భారతీయ సంప్రదాయాలు వారిని ఇంకా కట్టిపడేసే ఉన్నా యనడానికి ఈ కథ ఒక సాక్షీభూతం.

ముగింపు

అనాగరికులంగా ఉన్న మనం నాగరికులంగా పరిణామం చెందే క్రమంలో ఆదిమ మానవ యుగా లను, ఆటవిక యుగాలను దాటి ఆధునికత వైపు పరుగులుపెడుతున్నాంనేడు ప్రపంచీకరణను కూడా . ఆర్థిక.పరిచయం చేసుకున్నాం, రాజకీయ, సామాజిక, శాస్త్ర, సాంకేతిక రంగాలలో ఎంతగా అభివృద్ధి చెందినా ఇంకా ఆడదానిని ఆడదానిగా గుర్తించలేని స్థితిలో అనాగరికులంగానే ఉన్నాంఅంతరిక్షంలో . అడుగుపెడుతున్న అతివలను చూస్తున్నా,అనుమతి లేనిదే అంగుళం కూడా కాలు కదపలేని స్థితిలో ఉన్న అభాగ్యులనూ చూస్తున్నాం .సతీసహగమనాలను చెరిపేసుకొని చకచకా ముందుకు వెళ్తున్నామని సంబరపడుతున్నా ఇంకా స్త్రీ జీవితంలో ఆరిపోని చితులెన్నో మిగిలే ఉన్నాయనే సత్యాన్ని గ్రహించలేకపోతున్నాం .

ఇంకా ఇన్నాళ్ళో ఈ స్థితి ...., పరిస్థితి,దుస్థితి.

# మధుర బంజారా జాతి - వికాసం

**డా. కరిమింద్ల లావణ్య**
సహాయ ఆచార్యులు
తెలుగు అధ్యయన శాఖ
తెలంగాణ విశ్వవిద్యాలయం
నిజామాబాదు-తెలంగాణ-503322
చరవాణి నంబర్: 984810244
ఈమెయిల్: lavanyakarimindla@gmail.com

## మధుర బంజారాల పుట్టు పూర్వోత్తరాలు-వికాసం:

దక్షిణ భారతదేశంలో నివసిస్తున్న బంజారా ఉపజాతిని మధురా"లబాన్", "చౌటే లబాన్" అని పిలుస్తారు. పంజాబ్, ఉత్తర ప్రదేశ్‌లో లబానా మరియు లబాణా, మధుర అని పిలుస్తారు. ప్రాచీన కాలంలో పంజాబ్‌లోని లబానీవారు తిరుగుతూ వ్యాపారం చేసేవారు. 'గురుతేజ్ బహదూర్' యొక్క జీవన విధానం గురించి వచ్చిన పుస్తకంలో 'లబానో' గురించి ఈ విధంగా ఉంది. "గురుతేజ్ బహదూర్ చనిపోయిన తర్వాత అతని శరీరం చాలా సమయం వరకు అలాగే ఉంది. చీకటి అయ్యే సమయంలో 'లబానా' అనే 'సిక్' అనే వ్యక్తి తన ఎడ్ల బండిపై ఇతని శరీరాన్ని దూది మడ్లలో మలిచి 'రసినా' అనే గ్రామానికి తీసుకొచ్చాడు. వేరే శ్రేణుల్లో ఉన్న 'సిక్' జాతివారు తేజ్ బహదూర్ యొక్క శరీరానికి అంతిమ సంస్కారాలు చేయడానికి ఎవరు ముందుకు రాలేదు. కేవలం 'లబాన్ సిక్' ఎవరి దృష్టి పడకుండా తేజ్ బహదుర్ యొక్క శరీరాన్ని తన యొక్క ఎడ్ల బండిపైన పెట్టి ఊర్లో బయట ఉన్న గుడిసెలోకి తీసుకెళ్ళాడు. అక్కడ గడ్డితో చేసిన గుడిసెలు ఉన్నాయి. ఈయన గురుతేజ్ బహదూర్ యొక్క శరీరాన్ని ఈ గుడిసెలో పెట్టి కాల్చేశాడు.

పైన పేర్కొన్న ఉదాహరణలని 'లాబానా' లేదా 'లుబానా', లోభానా శబ్దాన్ని బట్టి సిక్ విశేషణం జోడించబడింది. 'గురు గోవిందు' యొక్క ఐదుగురు ప్రియమైన శిష్యులతో విశిష్టమైన జాతుల్లో వీళ్ళని పేర్కొనడం జరిగింది. పైన పేర్కొన్న ఉదాహరణ తాత్పర్యం ఏమిటంటే 'గురుతేజ్ బహదుర్' యొక్క కాలంలో 'తేజ్ బహదూర్' 'లాబానా', 'లుబానా', లోభానా అంటే ఎడ్ల బండిపై 'దూది'(పత్తి)యొక్క వ్యాపారం చేసేవారని అర్థం. పంజాబ్‌లోని అనేక గ్రామాల్లో నేటికీ కూడా 'టాండా' అనే శబ్దం యొక్క ప్రయోగం ఉంది. పంజాబీలో లాబానా అంటే పత్తి వ్యాపారం చేసేవారని అర్థం. వీరు వ్యాపారరీత్యా భారతదేశమంతా వ్యాప్తి చెందారు.

ఇలియట్ అనే భాషాశాస్త్రవేత్త ఉత్తర భారతదేశంలోని 'లాబానా'ల్లో 11 గోత్రాలు ఉన్నాయని చెప్పాడు. ఈయన అభిప్రాయం ప్రకారం వీరి పూర్వీకులు బ్రాహ్మణ కుటుంబానికి చెందినవారు.

'ఔరంగజేబు' యొక్క పాలన కాలంలో లబానాలు జాతివారు 'రణ్ తంబోర్' నుంచి ఉత్తర ప్రదేశ్ వచ్చారు. 'లాబాన్' శబ్దం యొక్క ఉత్పత్తి కొందరు 'లావన్' శబ్దం నుంచి వచ్చిందంటారు. వీరు 'ఉప్పు వ్యాపారం చేసి జీవనం సాగించేవారు అన్నారు. అందుకే 'లాబాన్' అన్నారు. మధ్యప్రదేశ్ యొక్క బంజారా తెగ మరియు 'లాబానో' వీరి ఇద్దరి మధ్య భేదాన్ని చూపించారు. ఇలియట్ అనే భాషాశాస్త్రవేత్త 'లాబాన్' వారు తమ యొక్క వంశాన్ని 'మొల' మరియు 'మోట' అని తేల్చారు.

కాని, పైన చెప్పినటువంటి అంశాలు ఉపయోగకరమైనవిగా, శాస్త్రీయంగా లేవు. మహారాష్ట్రలో 'లాబానా' లేదా 'లాబానీ' యొక్క పదం 'చరనౌ' వారి కోసం వాడబడుతుంది. ఆంధ్రప్రదేశ్‌లో 'మథుర' వారిని 'లాబానా' అంటారు. 'చరనౌ' వారు కూడా మథుర వారిని లాబానా అని ప్రయోగిస్తారు. 'మథుర' వారు స్వయంగా వారిని వారు 'లాబానా' అని పిలుచుకుంటారు. 'లాబానా' ప్రజల్లో ఒక 'బ్రాహ్మణ' వర్గం ఉంది. రాజస్థాన్ మరియు హర్యానాలో గత శతాబ్ది వరకు బ్రాహ్మణుల కుటుంబాలు చాలా సంపన్నులుగా ఉండేవి. వీరిని 'బొహర్' కుటుంబాలని అంటారు. వీరు వ్యాపారస్థులకు మరియు రాజులకు కూడా రుణాలు ఇస్తారు. రాజస్తాన్, హర్యానాలో గౌడ బ్రాహ్మణులు అగ్రస్థానంలో ఉంటారు. గౌడ బ్రాహ్మణులు 'లాబానో' కలిసి వాళ్ళతో ఉండేవారు. వారితో ఎక్కువ సమయం గడపడం వలన రాజస్తాన్, హర్యానాల్లో సమాజంలో కలిసిపోయారు. ప్రత్యేక సమూహాలు, తండాలు అక్కడ లేవు. దక్షిణ భారతం యొక్క 'మథుర' మరియు ఉత్తరాన పంజాబ్, రాజస్తాన్, హర్యానా, మహారాష్ట్ర రాష్ట్రాల్లోని 'లాబాన్'యొక్క కుల గోత్రాలు పరిశీలించినట్లయితే ఆ రెండు వర్గాలు ఒకే జాతిగా సంబంధాన్ని ఏర్పర్చుకున్నారు. ఇతర సమాజం యొక్క వ్యక్తులతో కలిసినా ఒక జాతి మూలంలో కన్పిస్తుంది.

మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, తెలంగాణల్లోని మథుర సమాజంవారి యొక్క  చారిత్రక విశేషాలు ఒకే విధంగా ఉన్నాయి. నారాయణపూర్ గ్రామం, జిల్లా ఆదిలాబాద్‌లోని మథుర నాయక్‌ను ఈ వ్యాస రచయిత కలిసినప్పుడు చెప్పాడు. ఇలా ఒకప్పుడు మాహారాష్ట్ర, తెలంగాణ ప్రాంతాల్లో మథుర బంజారాలు లేరు. సంచార జీవనంలో భాగంగా వచ్చి స్థిర నివాసం ఏర్పరచుకున్నారు. మేము ఇక్కడ మా యొక్క పురాతనమైన పద్ధతిని అవలంభిస్తున్నాం. సంపాదన లేకుంటే ఆకలితో నిద్రపోతారు. కానీ అడవి యొక్క ఆవాసం మాత్రం విడిచి పెట్టం. ఏ మథుర కుటుంబం పట్టణంలో ఉండడం చెల్లదు(నడవదు). అదే విధంగా డా. శ్రీరాం శర్మగారు మథుర సమాజం యొక్క చారిత్రక నేపథ్యం గురించి అదిలాబాద్ జిల్లా పోలీస్ సూపరింటెంట్ శ్రీ మహేంద్ర కుమావత్‌ను ఇంటర్వ్యూ తీసుకున్నప్పుడు అతను చెప్పిన విషయాల్లో ప్రధానమైంది మథుర బంజారా ప్రజలలో అపరాధి అయ్యే సూచన పోలీస్ వాళ్ళ దగ్గర ఉండదు. ఈ ప్రజలు శాంతి ప్రియులై ఉన్నారు మరియు ఇతరుల శాంతిని భంగం చేయరు. వాళ్ళ జీవనం సాఫీగా సాగుతుంది. ఘర్షణ మథుర బంజారా జాతి వారిలో ఉండదు.

**మథుర బంజారాల మూల స్థానం:**

'బంజారాలు' వారు దేశం మొత్తంలో ఉన్నారు. అందులో మథుర మరియు మథురియాను ప్రారంభంలో ఒకటే అనుకున్నారు. పరిశోధకులు, విమర్శకులు కానీ వాస్తవానికి ఈ రెండు కూడా వేరే జాతులుగా గుర్తించారు. మథుర అనేది ఒక మానవజాతి కాని మథురియా ఒక జనజాతి అనడంలో కూడా ఎలాంటి సందేహం లేదు. మథుర బంజారాలు అడవుల్లో నివాసం ఉంటారు. మథురియాలో మిగతా సామాన్య జనంతో కలిసి ఉంటారు.

చారనులతో పోల్చినప్పుడు మథుర ప్రజల సంఖ్య చాలా తక్కువ. సిరాజుల్ హసనే మథుర మరియు చారణుల మధ్య భేదాన్ని తెలుపుతూ ఈ విధంగా పేర్కొన్నాడు." మథుర జాతివారు తెల్లగా ఉంటారు. ప్రతిరోజు స్నానం చేస్తారు. ఇతర జాతుల వారు చేసిన వంటలను భోజనం చేయరు. వేషధారణ, పరంపర, పురాణం, భాష మొదలగు అంశాలతో పోలిస్తే వీరు చారణులతో భిన్నంగా ఉంటారు. తెలంగాణవారు చారణులను లంబాడా అంటారు. మథుర జాతివారు లంబాడా అని అంటే వారు వ్యతిరేకిస్తారు. మేం లంబాడా కాదని చెబుతారు.

మథుర అనగా మథురియా ప్రజల గురించి వివరించేటప్పుడు ఈ రెండు తెగల మధ్య భిన్న సంస్కృతులు కనిపిస్తాయి. మథుర అనేది భారతదేశం యొక్క సాంస్కృతిక మరియు ధార్మిక నగరం మాత్రమే కాక ఉత్తర భారతదేశంలో ఉద్యోగం, శిల్పం మరియు వాణిజ్య నగరంగా కూడా ఉంది. దేశంలో చాల జాతులవారు తమతో పాటు మథుర అనే పదాన్ని జోడించారు. బ్రజే బ్రాహ్మణులలో 'చౌబే' ప్రజలకు ప్రముఖస్థానం కలదు. చౌబే పదం చతుర్వేది అనే పదానికి వికృతి రూపంగా గుర్తిస్తారు. చతుర్వేది వారు తమ చరిత్రను వివరించేటప్పుడు బ్రజ్ చౌబే వారు తమలో మథుర్ అనే పదాన్ని జోడిస్తారు. మథురియాలు, మథురియా అనే చౌబే రెండు వర్గాలుగా విభజించబడ్డారు. వారు కడవే చౌబే, మీఠే చౌబే అని మళ్ళీ విభాగాలుగా విడిపోయారు. మథుర మరియు మథురియాను ప్రజల సంబంధం ఎక్కడో ఒకచోట మథుర నగరంతో ఉండి ఉండవచ్చని పరిశోధకుల అభిప్రాయం. మథుర నుంచే వాణిజ్యానికి కావలసిన వివిధ వస్తువులను దూర ప్రాంతాలకు ఎగుమతి చేసి ఉండవచ్చు. మథుర ప్రజలలో ఒక కథ కూడా ప్రచారంలో ఉంది. గురునానక్ తనతో పాటు వీరిని మథుర తీసుకొని వెళ్ళారు. అక్కడ గురునానక్ వీరంతా జనజీవనంలో కలిసిపోయారు. వీరికి పని కల్పించారు. అందువలన వీరు మథురియా అని పిలువబడ్డారు. 'కైబర్' ప్రజలు ఈ కథను మరొకరకంగా వ్రాశారు. గురునానక్ ముగ్గురు బాలురులను మథుర నుండి దక్షిణానికి తీసుకుని వెళ్తున్నారు. మార్గ మధ్యలో వారికి ఒక బ్రాహ్మణుడు తన భార్య ఇద్దరు కూతుళ్ళతో నది ఒడ్డున ఒక గుడిసెలో నివసిస్తూ ఉంటారు. ఆ బ్రాహ్మణుడి భార్య గురునానక్ గారితో ఒక నివేదన చేస్తుంది. నా ఇద్దరు కూతుళ్ళు పెళ్ళీడుకొచ్చారు. వారికి తగ్గ వివాహ సంబంధాలు రావడం లేదని చెప్తుంది. దానికి గురునానక్ తనతో పాటు వచ్చిన ముగ్గురు బాలురులలో ఇద్దరికి ఆ అమ్మాయిలతో వివాహం చేస్తాడు. వీరి సంతానమే మథుర అని పిలువబడ్డారు. ముఖ్యమైన విషయం ఏమిటంటే చారణులు తమను రాజపుత్ వారసులుగా ఏ విధంగా పిలుచుకుంటారో అదే విధంగా మథుర

మరియు మధురియా వారు తమను బ్రాహ్మణుల వంశీకులుగా భావిస్తారని ఒక ఐతిహ్యం ప్రజల్లో వ్యాప్తి చెంది ఉన్నది.

మధుర ప్రజల కథనం ప్రకారం వారు శ్రీరాముని పుత్రుడు లవ యొక్క సంతానమని, వారు లవపుర్(లాహోర్)అనే నగరాన్ని నిర్మించారని నమ్ముతారు. లవ యొక్క సంతానం కాబట్టి వారు లబానా అని పిలువబడ్డారు. వీరి జన్మ స్థలం పంజాబ్. వ్యవసాయం, పశుపోషణ కోసం వీరు దూరప్రాంతాలకు వెళ్తుండేవారు. వీరిలో ఒక శాఖ మధుర అని పేరుగా ఉన్నది. అక్కడ కొద్ది రోజులు నివసించాక దక్షిణ ప్రాంతానికి వెళ్ళారు. దక్షిణ ప్రాంతవాసులు వీరిని మధుర అని పిలిచేవారు. మధురవారు తమలో తాము లబానా అనే పదాన్ని ఉపయోగించేవారు. తెలంగాణలో వీరిని మధుర, లబానా అని, మహారాష్ట్రలో వీరిని లబాన అని పిలుస్తారు.

**మధుర ప్రజల ఉత్పత్తి:**

మధుర బంజారా ప్రజల గురించి ఒక కథ ప్రచారంలో ఉంది. ఆ కథ ప్రకారం రామునికి లవ-కుశ అనే ఇద్దరు కుమారులు ఉన్నారు. కాని లవుడు తన కుమారుడు కాదనీ సందేహం రామునికి కలుగుతుంది. కుశను మాత్రమే తన సంతానంగా భావిస్తాడు. లవ తన సంతానం కాదని అతను ఎవరి సంతానం అని సీతను ప్రశ్నిస్తాడు. ఈ ప్రశ్నకు సీత మరియు లవ ఇద్దరు కూడా సరియైన సమాధానం ఇవ్వలేకపోవడం వల్ల రాముడు లవను శపిస్తాడు. ఈ శాపం నుండి విముక్తి పొందుట కొరకు లవ శివున్ని ప్రార్థిస్తాడు. ఈ విధంగా కష్టపడుతున్న లవ కు శివుడు ప్రత్యక్షమై ఈ విధంగా తెలియజేశాడు. 11 జాతుల బ్రాహ్మణ బాలురను భ్రష్టు పట్టిస్తే ఈ శాపం నుంచి విముక్తి పొందుతావు. దాని ప్రకారం 11 మంది బ్రాహ్మణుల బాలురులను లవుడు భోజనానికి ఆహ్వానించడం జరిగింది. కాని వారికి భోజనంలో మాంసాహారం ఇవ్వడం జరిగింది. ఈ విషయం తెలియక వారు భోజనం చేసి తమ తమ ఇంటికి వెళ్ళిపోయారు. ఒక బాలుడు తమ ఇంటికి వెళ్ళిన తర్వాత తమ తల్లి దగ్గర కూర్చొని ఉండగా అతని నోట్లో ఒక మాంసపు ముక్క ఉండటం ఆమె గ్రహించింది. ఈ విషయం గురించి ఆరాతీయగా ఆ బాలుడు తన తల్లికి తను భోజనానికి వెళ్ళిన విషయం గురించి వివరిస్తాడు. అక్కడ వారికి మోసంతో మాంసాహారం తినిపించడం జరిగిందని గ్రహిస్తారు.

బ్రాహ్మణులంతా కలిసి ధర్మాన్ని భ్రష్టు చేయడం వల్ల వారికి జాతి నుంచి వెలివేయడం జరిగింది. ఈ 11 మందితో పాటు మరొక బ్రాహ్మణ బాలుడు కూడా ఉన్నాడు. కాని అతనికి భోజనంలో మాంసాహారం ఉన్నదని తెలిసిపోయింది. అతను భోజనంను ముట్టనే లేదు. అందువల్ల ఇతన్ని జాతినుండి వెలివేయలేదు. కాని అతను మాత్రం ఆ 11 మంది బ్రాహ్మణ బాలురతో పాటు శిక్షను అనుభవిస్తాడు. ఈ 12 వ బాలుడు మిగిలిన బాలురులందరికి అండగా నిలుస్తాడు. అందువల్ల మధుర ప్రజలు ఆ బాలున్ని పెద్ద కొడుకులాగా భావించారు. ఈ బ్రాహ్మణులందరు అనాధలుగా సంచరిస్తూ ఉంటారు. నిరాశగా ఒక చోట కూర్చొని రోదిస్తూ ఉంటారు. ఆ 12వ బాలుడు కూడా వీరితో పాటు కష్టాలను అనుభవిస్తూ ఉంటాడు. వీరి

దు:ఖాన్ని చూడలేక విష్ణుమూర్తి ప్రత్యక్షమవుతాడు. ఈ విధంగా విష్ణుమూర్తి అడగసాగాడు ఓ బాలులారా! ఎందుకు? ఎందుకు? ఈ విధంగా రోధిస్తున్నారు. దీనికి ఆ బాలురులు ఈ విధంగా సమాధానం ఇచ్చారు. మేము అనాథలం మమ్మల్ని ఎవరు పట్టించుకోవడం లేదు. మాకు చాలా ఆకలిగా ఉంది మాకు ఎవరు కూడా పని ఇవ్వడం లేదు. ఇలా అయితే మేం ఎలా బతకాలి? దానికి విష్ణుమూర్తి ఈ విధంగా చెప్పాడు. మీరు కొబ్బరికాయలు అమ్మండి, కొబ్బరి తాళ్ళు అమ్మండి. ఈ రెండు పనులతో మీరు మీ జీవితాన్ని తిరిగి ప్రారంభిస్తారు. దీనితో వారికి పని లభించడంతో పాటు ధనం కూడా సంపాదించగలిగారు.

ఒకానొక రోజు మళ్ళీ ఈ 11 మంది బాలురు రోధించసాగారు. వీరి ముందు విష్ణుమూర్తి ప్రత్యక్షమవుతాడు. ఏమయింది భక్తులారా! మళ్ళీ ఎందుకు చింతిస్తున్నారు. దానికి ఆ బాలురు ఈ విధంగా సమాధానం ఇచ్చారు. మమ్మల్ని వివాహం ఆడటానికి ఎవరూ కూడా ముందుకు రావడం లేదు. ఇల్లాలు లేని ఇల్లు ఎలా? అని అడిగారు. మీరు ముందు ఊళ్ళోకి వెళ్ళి మీకు నచ్చిన అమ్మాయిలను వివాహం ఆడండి. కాని వారి జాతి గురించి ఆలోచించకండి. విష్ణుమూర్తి చెప్పినట్లు వారు వారికి నచ్చిన 11 మంది అమ్మాయిలతో రావి చెట్టు క్రింద వివాహం ఆడుతారు. వివాహం తరువాత వధువులందరూ కలిసి రోధించసాగారు. విష్ణుమూర్తి ప్రత్యక్షమయి బాలికలారా ఎందుకు దు:ఖించసాగారు అని అడుగుతాడు. మేము మా బంధువులని కాదని వివాహం ఆడాము. బాధని ఎవరితో చెప్పుకోవాలి. విష్ణుమూర్తికి సమాధానం ఇచ్చారు. దానికి విష్ణుమూర్తి ఈ రావిచెట్టును కౌగిలించుకొని మీ బాధని వ్యక్తపరచమని అదృశ్యమయ్యాడు. విష్ణుమూర్తి చెప్పిన విధంగా కొద్దిసేపు ఆ రావిచెట్టు క్రింద రోదించి తమ తమ భర్తలతో వెళ్ళిపోసాగారు. మార్గ మధ్యలో వారికి బ్రహ్మ మరియు విష్ణుమూర్తి ప్రత్యక్షమయ్యారు. ఈ విధంగా వారిని అడగసాగారు. మీకు పని లభించింది మరియు వివాహం కూడా జరిగినది దీనికి మీరు మాకు చేసే చేవ ఏమిటి? ఆ 11 మంది బాలురులు ఈ విధంగా సమాధానం ఇచ్చారు. మీ ఇద్దరికి శిరస్సుపై జటా ఉంటుందో అదే విధంగా మా స్త్రీలు కూడా అలాంటి జటా కడతారు. మీ పట్ల మేము చూయించే సమర్పణ ఇదే. ఆ రోజు నుండి మథుర స్త్రీలు చిన్నప్పటి నుంచి తమ శిరస్సుకు జటాను కట్టసాగారు. అందుకే వీరిని సింగాడియాలు అని కూడా అంటారు.

ఈ విధంగా దేవుడి ఆజ్ఞ మేరకు మథుర ప్రజలు కొబ్బరి నారలతో తాళ్ళు అల్లడం లాంటి పనులు చేయసాగారు. కాని 12వ బ్రాహ్మణ బాలుడు ఈ పనులను చాల చిన్నవిగా భావించాడు. అతని ఆజ్ఞను సరిగా నెరవేర్చలేకపోయాడు. ఈ విధంగా వారి స్థితి సమాజంలో చాలా చిన్నదిగా మారిపోయింది. అందువల్ల ఇప్పటికి చాలా మంది మథుర ప్రజలు పశుపోషణయే ఎక్కువగా చేస్తుంటారు. పాల ఉత్పత్తులు అమ్మడం, వ్యవసాయం వీరి ప్రధానవృత్తి. వీరు అటవీ ప్రాంతాలలో నివసించడానికి ఇష్టపడతారు. ఇందువల్లనే ఇతర జాతుల వారితో సమైఖ్యంగా మెలగలేకపోయారు.

**మథుర - ఆదిపురుషుడు**

మధుర ప్రజలు మూల పురుషుడిగా ముఖండ్ షా పేలియాను గుర్తిస్తారు. అతను వారి కాలంలో పెద్ద మరియు గొప్ప వ్యాపారవేత్తగా పేరుగాంచాడు. ఉడన్కవేల్ అనే నౌకలో సరుకునంతా తీసుకొని దేశ విదేశాల్లో వ్యాపారాన్ని నిర్వహించేవాడు. ఒక రోజు ఇదే విధంగా తన వ్యాపారంలో భాగంలో సముద్రంపై ప్రయాణిస్తున్నప్పుడు నౌక ప్రమాదంలో పడింది. దాంతో అతను తన గురువుని ప్రార్థించాడు. నేను ఇంటికి క్షేమంగా వెళితే నీకు అనగా నా గురువుకి '500 మెహరే' చెల్లిస్తానని ప్రార్థించాడు. ఈ విధంగా ప్రార్థించడం వల్ల ఆ నౌక మునిగిపోకుండా బయటపడింది. ముఖండ్ షా పేలియా సురక్షితంగా ఇంటికి చేరుకున్నాడు. పేలియా తన మొక్కును తీర్చుకొనడానికి కత్రీపూర్(పంజాబ్)చేరుకున్నాడు. కాని అక్కడ చాలా మంది సాధువులు కూర్చొని ఉన్నారు. అందరూ ఒకేలా కనిపించారు. అందులో తన గురువు ఎవరో గుర్తుపట్టలేకపోయాడు. చివరికి ఒక ఉపాయం తట్టింది అది ఏమనగా ఒకరికి 500 మెహరీలు ఇవ్వడం కన్న ఒక్కొక్కరికి 5 మెహరీలు ఇస్తే బాగుంటుందని అనుకున్నాడు. అదే విధంగా చేస్తూ ఒక్కొక్క గురూజీకి పాదాభివందనం చేస్తున్నాడు. చివరి గురువు దగ్గరికి చేరుకున్నాడు. ఆ సాధువు 'ముఖండ్'తో నేనుయే నీ గురువుని అన్నాడు. కావాలంటే నా భుజాన్ని చూడు నీ నౌకను కాపాడేటప్పుడు నాకు ఈ గాయం అయింది.ఆ సాధువు తను ఆ నౌకను ఏ విధంగా కాపాడాడో ముఖండ్ కు వివరించాడు. ఆ ప్రయత్నంలో ఈ గాయం అయ్యిందని గ్రహించాడు. అప్పటికే ముఖండ్ తన దగ్గర ఉన్న మొహరీలను అందరు సాధువులకే పంచాడు. అయినా కూడా తన వద్ద తన మొక్కు కన్న ఎక్కువ మెహరీలు ఉన్నాయి. వాటన్నింటిని ఆ సాధువుకు ముఖండ్ సమర్పించాడు. కాని ఆ సాధువు(500)మెహరీలు మాత్రమే స్వీకరించి మిగిలినవి తిరిగి అతనికే ఇచ్చెను. కాని అతని సంతానం ఏ విధంగా మధుర అని పిలువబడిందో అని చెప్పడానికి రుజువులు లేవు. కాని మధుర ప్రజల నమ్మకం ప్రకారం ప్రారంభం నుండే వారిలో చాల ఉపజాతులు ఉన్నాయని నానుడి. చాలా వరకు జాతులు అంతరించిపోయాయి. ప్రసిద్ధిగాంచినది ఏంటంటే 'బోర్య' ప్రజలలో 22 ఉపజాతులు ఉన్నాయి. ప్రస్తుతం కేవలం ఈ క్రింది కులాలు 6 మాత్రమే ఉన్నాయి. అని ఖాసుక్త, దిర్భాస, ఉలహుక్త, ఖచకర్, నిసత్య మరియు కొసరొత్".

**బంజారాల మూల స్థానం:**

ఈ కాలంలో బంజారాలు దేశం మొత్తం వ్యాపించి ఉన్నారు. వారు ఎక్కడి నుండి వచ్చారు. ఎందుకు ఇక్కడి నుండి వెళ్ళిపోయారు అనే ప్రశ్నలకు సమాధానాలు వివిధ రచయితలు వివిధ రకాలుగా నర్ధారించుకున్నారు. దేశంలో ఉన్న వివిధ ప్రాంతాల్లోనే కాక విదేశాల్లో నివసించిన బంజారాలు మరియు జిప్సీ జాతివారు తమ భాషను సురక్షితంగా ఉంచారు. ఈ భాషను అనుకరించి వీరి జన్మస్థానం నిర్ధారించవచ్చు. వీరి జాతికి చెందిన సాహిత్యం కూడా సురక్షితంగా ఉంది. వీరు నివసించే ప్రాంతం, ఆరాధ్యదేవతలు పాత్రల ఆధారంగా వీరి జన్మస్థానాన్ని గుర్తించవచ్చు. ఆచార వ్యవహారాలు, పండగలు, సంప్రదాయాలు, వేషధారణ మొదలగు అంశాలను బట్టి నిర్ధారించవచ్చు. వీరి సాహిత్యాలను అధ్యయనం చేయడం ద్వారా బంజారాలు మరియు ఇతర దేశాల నుండి వచ్చిన జిప్సీలు వీరందరి జన్మస్థానంగా

గుర్తించారు. శ్రీ వీర రాజేంద్రఋషిగారు రచించిన పంజాబీ ఇంగ్లీష్ నిఘంటువులో తామక్-కోష్ అనే ప్రాంతానికి సంబంధించిన జిప్సీ యొక్క జన్మస్థానం పంజాబ్‌గా చెపుతూ అద్భుతమైన పంజాబ్ నగరాన్ని కోరుకున్నాడు. ఆ నగరంలో పంజాబ్, హర్యానా, హిమాచల్ ప్రదేశ్, డిల్లీ, చండీఘర్, రాజస్థాన్ లాంటి కొన్ని ప్రాంతాల కలయికగా ఊహించాడు. కానీ ఈ బంజారాలు ఒకే ప్రదేశంలో స్థిరపడకుండా సంచార జీవితాన్ని కొనసాగించేవారు. దాంట్లో భాగంగా వీరు రాజస్థాన్ నుండి బయలుదేరి సింధ్, బెలుచిస్థాన్, అఫ్ఘనిస్థాన్ వరకు వెళ్ళేవారు. కావున వీరి భాషలో పంజాబీ, హర్యానా భాషల ప్రభావం ఉండేది. శ్రీ వీర్ రాజేంద్రఋషి గారు వివిధ ప్రాంతాలపై జిప్సీవారి పూర్వదేశం బరోగాన్‌గా లిఖించారు. ఈ బరో అనే పదం ఆధునిక పంజాబి పదానికి సంబంధం కలిగి ఉంటుంది. మరియు రాజస్థాన్ బ్రజ్ భాషకి కూడా సంబంధం కలిగి ఉందని గ్రహించాడు.

**దక్షిణ భారతదేశ ఆగమనం:**

ఉత్తర భారతదేశానికి చెందిన బంజారాలు అదే తమ స్థిర నివాసం అని భావిస్తారు. దక్షిణ భారతదేశానికి చెందిన బంజారాలు కూడా తమ జన్మస్థానం రాజస్థాన్‌గా భావిస్తారు. మధ్యప్రదేశ్ దక్షిణ భారతదేశంలో ఉన్న బంజారాలు రాజస్థాన్ లోని ఐదు ప్రాంతాలకు సంబంధించిన వారిగా గుర్తించారు. మొదటగా మార్వాడిగా పిలువబడేవారు. జోత్‌పూర్ పరిసర ప్రాంతాలకు చెందిన వారని రెండవ గుంపుగా జై సల్మీర్ వారని, మూడవ గుంపు జైపూర్(శకావటి)వారని, నాలుగవ గుంపుగా కోటబుంది వారని, ఐదవ గుంపుగా అజ్‌మీర్‌కి చెందిన వారని గుర్తించారు.

ఔరంగాబాద్ నుండి 60కి.మీల దూరంలో ఉన్న 'నిభయితి తండా' కు చెందిన జగన్ జీ-పవార్ డా. శ్రీరామశర్మ గారు ఈ క్రింది విధంగా వివరించారు. "వారి తండ్రి జోధ్‌పూర్ నుండి వచ్చారని చెప్పినారు. ముందుగా మా తాతయ్య ఈ తాండాకు వచ్చారని విన్నాను. కానీ నేనెప్పుడు వెళ్ళలేదు. ఈ తాండాలో ఉన్నవారు వ్యవసాయం, పశుపోషణ చేస్తూ తమ జీవితాన్ని గడుపుతున్నారు. వర్షాకాలం రాగానే వీరు మాల్వా వెళ్తారు. అక్కడ నుంచి ఆవులను, బర్రెలను తీసుకొని వస్తారు. కొంతమంది పండితులు బంజారాలు మొఘలుల కాలంలో వచ్చారని వివరించారు. అనగా పాలనకు కావలసిన జంతువులతో పాటు వ్యాపారంలో భాగంగా ఈ బంజారాలు దక్షిణ భారతదేశానికి వచ్చారని వివరించారు. కైబర్-లాగ్ ప్రకారం అఫ్వాకా అనే సైన్యాధికారితో దక్షిణ దిశకు వచ్చారు. షాజహాన్ ఆజ్ఞ మేరకు అహ్మద్‌నగర్ మరియు బరార్ దండెత్తినపుడు ఓడిపోయిన సైన్యంతో పాటు వీరు కూడా వచ్చి ఉండవచ్చని వివరించారు". క్రీ.శ 17వ శతాబ్దంలో ఇది జరిగి ఉండవచ్చని పండితుల అభిప్రాయం.

హేమండ డ్రాఫ్ ప్రకారం బంజారాలు షాజహాన్ మంత్రి హన్‌షాకాత్‌తో కాదు ఔరంగజేబు సైన్యంతో వచ్చారని వివరించారు. రసెల్ మరియు హీరాలాల్ దీనిని సమర్థించారు. బ్రిక్స్ ప్రకారం బంజారాల గురించి మహ్మద్ బీన్ తుగ్లక్ కాలం నుండి ఔరంగజేబు కాలం వరకు వలస ఉందని వివరించాడు. బీజాపూర్ సుల్తాన్ ఇబ్రహీం ఆదిల్ షా సమకాలికుడయిన చారిత్రక రచయిత పారిష్ తా బంజారాల గురించి

రాయడం జరిగింది. బంజారాలు దక్షిణ భారతదేశానికి ముస్లిం పరిపాలన కన్నా ముందే వచ్చారని వివరించారు.

పారిష్ తా తన కాలంలో జరిగిన ఒక సంఘటనను వివరిస్తూ గుల్బర్గాకు చెందిన ఫిరోద్ షా బహమనీ తమ్ముడి బంజారులను చాలా సంఖ్యలో బంధీలుగా చేసి తీసుకొని వచ్చాడని రాయడమైంది. ఈ రచయిత స్వయంగా వీరిని గమనించినట్లుగా తెలిపాడు. దాని ప్రకారం గమనించినది ఏమిటంటే వీరు ధాన్యం యొక్క వ్యాపారం చేస్తాడని గ్రహిస్తాడు. మొఘులులకు పూర్వం ఉన్న ముస్లిం పాలకులు తమసైన్యంలో రాజపుత్రులనేకాక ఇతర జాతీయులను కూడా బర్తీ చేసేవాడు. మరో కథనం ప్రకారం మహ్మద్ బీన్ తుగ్లక్ దేవగిరిపై దండయాత్ర చేసినప్పుడు అతనితో పాటు బికా/బిక్యా అనే బంజారాకు చెందిన వ్యక్తి ఉన్నాడని కథనం. బిక్యా తన మొత్తం కుటుంబ సభ్యులతో తుగ్లక్ సైన్యంలో ధాన్యానికి సంబంధించిన పనిని నిర్వహించేవాడు. బంజారులు మొఘులుల కంటే పూర్వమే వచ్చారని తెలిపేందుకు అధారాలు లేకపోయిన ఇది వాస్తవంగా గ్రహించవచ్చు. అసఫ్ జా తనతో పాటు వివిధ జాతులకు చెందిన బంజారాలను దక్షిణ భారతదేశానికి తీసుకొని వచ్చాడు. వారి పని పట్ల సంతోషించిన అసఫ్ జా బంజరాల నాయకుడు అయిన జంగీ-బంగీని తామ్ర పత్రాలతో సన్మానించాడు.

**దక్షిణ- ఉత్తర కలుపు మార్గం**

డాక్టర్ మోతీచంద్ తాను వ్రాసిన 'సార్థవాహ' అనే గ్రంథంలో బంజారాలు ఉత్తరం నుండి దక్షిణానికి వచ్చిన కొన్ని మార్గాలను వివరించారు. మొదటి మార్గంగా ప్రయాగ నుండి జబల్పూర్ వచ్చి దారిలో బుందేల్ ఖండ్ దాటిన తర్వాత నాగ్పూర్ వస్తుంది. అక్కడి నుండి గోదావరిని దాటి ఆంధ్రలో ప్రవేశిస్తాము. బస్తర్ మరియు మైకాలా పర్వతాలు ఉండటం వల్ల దట్టమైన అడవులు వ్యాపించి ఈ దారి అనుకూలంగా ఉండేది కాదు. ప్రాచీన కాలంలో ఇదే దారి నుండి గుజరాత్కు వెళ్ళేవారు. ప్రస్తుతం ఈ మార్గం గుండా ప్రయాగ-జబల్పూర్-నాగ్పూర్ వెళ్ళి రాయ్పూర్ వైపు మరులుతాము. బస్తార్ యొక్క దట్టమైన అడవులను దాటి భద్రాచలం దగ్గరలోని గోదావరి వరకు చేరుకొని ఆంధ్రలో ప్రవేశిస్తాము. ఈ మార్గం గుండా దట్టమైన అడవులు పర్వతాలు వ్యాపించి ఉన్నాయి. ఇక్కడ గోండు జాతివారు ఉంటారు.

డాక్టర్ మోతీ చంద్ దక్షిణానికి చేరుకునే వివిధ మార్గాల గురించి ఈ క్రింది విధంగా వివరించారు. ఒకదారి మన్మాడ్ నుండి మచిలీపట్నం వరకు అక్కడి నుండి గుజరాత్ ఉండేది. ప్రస్తుతం అదే దారిలో రైలు మార్గాలను నిర్మించారు. మరో మార్గం పుర్న నుండి కాంచిపురం, మూడో మార్గం గోవా నుండి తంజావూర్ నాగపట్నం వరకు, నాలుగో మార్గంగా కాలికట్ నుండి రామేశ్వరం వరకు ఉండేది. ఐదో మార్గం విశాలంగా కాక చిన్నగా ఉండేది. ఉత్తరం నుండి దక్షిణానికి వచ్చే మరో మార్గం అద్భుతమైన మార్గం మన్మాడ్ నుండి దక్షిణంగా అజంత మరియు బాల్ఘట్ పర్వతాలను దాటి గోదావరి చేరుకుంటాము.

(బంజారా స్టడీ యూనిట్ రిపోర్ట్)బంజార స్టడీ బృందం తమ వివరణలో ఈ మార్గం యొక్క మాన చిత్రాన్ని వివరించారు. ఈ చిత్రంలో దేశాంతర మార్గాలే కాక ఇతర దేశాలకు వెళ్ళి మార్గాలను కూడా

వివరించారు. ఈ మార్గాల గురించి తెలుసుకునేవారు మోతీచంద్ గ్రంథాన్ని చదివి తెలుసుకోవచ్చు. మహారాష్ట్ర నుండీ వచ్చే బంజారాలు ఆంధ్రాను దాటి కర్ణాటక అక్కడి నుండీ తమిళనాడు వరకు వెళ్ళేవారు. బంజారాలు గుజరాత్ సముద్ర తీరాల్లో ఉప్పు తయారీ కోసం వెళ్ళేవారు. ఈ తీరాల్లో మనకు అవసరమయ్యే 70% వరకు ఉప్పును తయారు చేసేవారు. గుజరాత్ నుండి దక్షిణ భారతదేశానికి మార్గము ఈ క్రింది విధంగా ఉంటుంది. సూరత్ నుండి బార్డోలీ-పిపల్నేర్, దేవ్ఘుడ్, దౌలతాబాద్, ఔరంగాబాద్, ఆష్టి, నాందేడ్, గోల్కొండ, కృష్ణ మరియు తుంగభద్ర తీరాలు.

**తెలుగు - మరాఠి క్షేత్రాలు**

పెనుగంటి దాటి ఆదిలాబాదు జిల్లాలో ఉండే బంజారాల వద్ద తగినంత భూమి ఉండేది కాదు. అక్కడి నుండి వరంగల్, ఖమ్మం ప్రయాణమయ్యారు. ఆదిలాబాద్లోని కిన్వాట్ వరంగల్, ఖమ్మం, హైదరాబాద్ ప్రాంతాలలో జీవించేవారు. అందుకే ఆదిలాబాద్లోని తెలుగు క్షేత్రాలలో ప్రవేశించడానికి కష్టంగా ఉండేది కాదు. హేమాండ్ డ్రాఫ్ మరాఠి భాష నుండి తెలుగు భాషకు మారే సమయాన్ని వివరించారు. మరాఠి మరియు తెలుగు మాట్లాడే బంజారజాతి వారి సంస్కృతి, సంప్రదాయాలు ఒకే రకంగా ఉండటంతో వీరి సంఖ్య రోజురోజుకి అభివృద్ధి చెందింది. లంబాడా జాతి వారి మూల స్థానం ఉత్తర భారతదేశం. ముస్లిం సైన్యంతో దక్షిణ భారతదేశానికి వచ్చారు. వీరు ఇక్కడికి వచ్చిన తర్వాత రెండు రకాల పనులను చేస్తూ జీవనాన్ని కొనసాగించేవారు. పశు పోషణ మరియు ఎడ్లబండ్ల మీద సామానులను మోసేవారు. ఆదిలాబాద్ లోని మరాఠి భాషకు చెందిన బంజారాలు వివరంగా వారి జాతి గురించి వివరించి ప్రస్తుతం ఉన్న మాడివి(నాందేడ్) అనే గ్రామం ఒకప్పుడు దట్టమైన అడవులతో నిండి ఉండేది. ఈ గ్రామంలో అత్యధికంగా బంజారాలు నివసించేవారు. ఇతర జాతి వారు కూడా ఉండటానికి సౌకర్యం కలిగించారు. ప్రతి ఒక్క ఇంటివారికి నిర్మితమైన పరిమాణంలో వ్యవసాయ భూమి మరియు ఇంటిని నిర్మించుకోవడానికి స్థలాన్ని కేటాయించారు.

**ఆంధ్రప్రదేశ్లో మథుర బంజారాలు**

మహారాష్ట్ర నుండి ఒక మార్గంను ఆంధ్ర కర్ణాటక వరకు వెళుతుంది. ఈ మార్గం బీమా నది దాటి కృష్ణా వరకు వెళ్తుంది. ఇదే మార్గంలో మథుర బంజారాలు యాత్రకు వెళ్ళేవారు. 17వ శతాబ్దంలో మథుర బంజారాలు బరార్ నుండి ఆదిలాబాద్కు వెళ్ళారు. అక్కడి నుండి వరంగల్, ఖమ్మం వరకు వెళ్ళారు. కొన్ని జాతులు వీరు ఔరంగబాద్ నుండి పర్భణి(నాందేడ్), నిజామాబాద్, హైదరాబాద్, మహబూబ్నగర్, కర్నూలు వెళ్ళారు. నిజాం కాలంలోనే అత్యధికంగా బంజారాలు తెలుగు క్షేత్రాల్లో ఉండడం జరిగింది. ఆదిలాబాద్ జిల్లాకు వీరు వలస వచ్చిన సమయంలో అడవులతో నిండి ఉండేది. వీరు తమ కఠినమైన శ్రమతో దానిని ఒక తండాగా మార్చారు. ఇక్కడే జంగి యొక్క కథ రాయడం జరిగింది. ఆసఫ్జాలకన్న ముందు దక్షిణ భారతదేశానికి వచ్చినవారు. తుంగభద్రను దాటి వెళ్ళారు. అక్కడ వీరు సుగాలి

అనబడ్డారు. ఆంధ్రాలో లంబాడులు(చారనులు)తో పాటు మధుర జాతివారు కూడా అధిక సంఖ్యలో ఉన్నారు. వరంగల్ జిల్లాలో స్థిరపడిన తర్వాత కూడా పశుపోషణ వీరి ప్రధాన వృత్తిగా స్థిరపడింది.

**ఆధార గ్రంథాలు:**

1. గోనానాయక్. ఎం. డా.-2005- భారతదేశంలో బంజారాలు. తెలుగు అకాడమి. హైదరాబాదు.
2. శ్రీరాంశర్మ.డా.-1983-బంజారా సమాజ్- దక్షిణ్ ప్రకాశన్. హైదరాబాదు.
3. చీనియా నాయక్. బి.-1998- బంజారా చరిత్ర, సంస్కృతి ప్రగతి-హాథీరాం బావాజీ ప్రచురణ. అనంతపురం
4. మోతీరాజ్ రథోడ్. ప్రొ.-ఏన్సియంట్ హిస్టరీ ఆఫ్ గోర్ బంజారా. ఔరంగాబాదు. మహారాష్ట్ర.

# సవర భాషా నిఘంటువు – గిడుగు రామమూర్తి కృషి

డా॥ కొల్లేటి రవిబాబు
హైదరాబాదు విశ్వవిద్యాలయం
సెల్: 9494398884

గిడుగు వేంకటరామమూర్తి గారు 1863 ఆగష్టు 29న శ్రీకాకుళం జిల్లాలోని పర్వతాలపేటలో జన్మించారు. రామమూర్తి గారు వ్యవహారభాషావాదిగా శాసనభాషా పరిశోధకుడుగా అందరికీ తెలుసు. భాషలు బోధించడానికి భాషాశాస్త్ర అధ్యయన అవసరాన్ని మొదట గుర్తించిన వారు గిడుగువారే. సమకాలీన భాషాశాస్త్రవేత్తల మెప్పు పొందిన భాషావేత్త. సవరభాషను ఆధునిక భాషాశాస్త్ర దృష్టితో శాస్త్రీయ పద్ధతిలో అధ్యయనంచేసి సవర భాషా వ్యాకరణం, సవరభాషా నిఘంటువులు నిర్మించారు. నిఘంటు నిర్మాణం ఎంత ఎక్కువగా జరిగితే భాష వినియోగం, భాష ఆధునీకరణ అంత ఎక్కువగా జరిగే అవకాశం ఉంటుందని భాషలోని శాస్త్ర విషయాల్ని చెప్పిన అనువర్తిత భాషాశాస్త్రవేత్త కూడా రామ్మూర్తిగారే. నిఘంటు నిర్మాణంలో రామమూర్తిగారు పాటించిన పద్ధతులు నేటికీ ఆమోదయోగ్యం. నవ్యనవనీతం.

**నిఘంటువు**

నిఘంటువు(dictionary) అంటే పదాలకు అర్థాలు వాటి వివరణలు ఉండే పుస్తకం. దీనిని ఆంగ్లంలో డిక్షనరీ అంటారు. అక్షరాలతో కూడి పదాలను అకారాది క్రమంలో కూర్చిన పరామర్శ గ్రంథం అని ఆచార్య ఎన్.ఎస్ రాజు గారు నిర్వచించారు. నిఘంటువు అనగా అక్షర క్రమాలతో పదాలు, వాటి అర్థాలు కలిగినదని, పరామర్శగ్రంథం లేదా ఇతర భాషా పదాలతో కూడిన అకారాది పట్టిక అనే నిర్వచనాలూ ఉన్నాయి. పై నిర్వచనాలని బట్టి ఒక భాషను నేర్చుకోడానికి స్పష్టమైన అర్థం, వివరణ, ప్రయోగం తెలుసుకోడానికి నిఘంటువు విశిష్ట భూమికను పోషిస్తోందని చెప్పవచ్చు. నిఘంటువుకి కోశం, పర్యాయనామం, పదనిధి వంటి పేర్లు కూడా వ్యవహారంలో ఉన్నాయి.

నిఘంటువులు ప్రధానంగా మూడు రకాలు. పదం లేదా ఆరోపం వాటి అర్థాలు వివరణ ఒకే భాషలో ఉంటే దానిని ఏక భాషా నిఘంటువు అంటారు. ఆరోప పదం ఒక భాషలో ఉండి దాని అర్థం వివరణ వేరొక భాషలో ఉన్నట్లైతే దాన్ని ద్విభాషా నిఘంటువు అంటారు. ఆరోప పదం వాటి అర్థాలు ఒకటి కంటే ఎక్కువ భాషల్లో ఉంటే అటువంటి నిఘంటువులను బహుభాషా నిఘంటువులుగా వ్యవహరిస్తారు.

**సవర భాష– నిఘంటు నిర్మాణం**

గిడుగువారి బహుముఖీనమైన ప్రతిభకు నిదర్శనం వారు సవర భాషకు, ఇంకా ఆధునిక భాషాశాస్త్ర పద్ధతుల్లో వ్యాకరణం రాయడంతో పాటు నిఘంటువులు కూడా నిర్మించడం. అలాగే సవర భాషకు సంబంధించి విశేషమైన కృషి చేశారు. ఆధునిక సమాజంతో పోలిస్తే వేల సంవత్సరాలుగా వెనకబడి ఉన్న సవర జాతికి చదువు నేర్పించారు. సవరలకు వ్యవహార జ్ఞానం నేర్పి, ఆర్థికంగాను సామాజికంగాను వారిని అభివృద్ధిలోకి తీసుకురావడం కోసం సవర భాషను నేర్చుకున్నారు. 1930లో సవర భాషకు వర్ణనాత్మక వ్యాకరణం రాశారు. అంతర్జాతీయ ధ్వని

లిపిలో వెలువడిన మొదటి వ్యాకరణం ఇదేనని డేవిడ్ స్టాంపె పేర్కొన్నారు. వీటితో పాటుగా సవర వాచకాలు, సవర కథలు , పాటలు, సవర– ఇంగ్లీషు, ఇంగ్లీషు– సవర, తెలుగు – సవర నిఘంటువులు తయారు చేశారు.

సవర భాషకు లిపి లేనందువలన అంతర్జాతీయ ధ్వని సంకేతాలు వినియోగించి నిఘంటు నిర్మాణం చేయాలన్న రామమూర్తిగారి ప్రతిపాదనను అంగీరించిన మద్రాసు ప్రభుత్వం మొదట సవర భాషకి వ్యాకరణం తయారు చేయమని ఆదేశించింది. దాంతో రామమూర్తి గారు సవర భాషకు వ్యాకరణం తయారుచేశారు. ఆ వ్యాకరణాన్ని 1931 మద్రాసు ప్రభుత్వం ప్రచురించింది. ఆ తరువాత రెండు సంవత్సరాలకు ఇంగ్లీషు – సవర, సవర – ఇంగ్లీషు నిఘంటువులు 1933లో ప్రచురించారు. వీటిని తిరిగి 2016 పోరంకి దక్షిణామూర్తి గారి సంపాదకత్వంలో వేదగిరి పబ్లికేసన్స్ వారు ముద్రించారు

రోజువారి వ్యవహారంలోని మాటలు, కథలు , పాటలను వారి నుండి రికార్డు ద్వారా తీసుకుని ఈ నిఘంటువులో చేర్చారు. రామమూర్తిగారి ఆర్థికస్థితికి సాధ్యమైనంత వరకు పదాల కూర్పు చేశారు. అంత శాస్త్రీయతతో నిఘంటు కూర్పు చేసినప్పటికి ఇదే సవర భాషకి సమగ్రమైన నిఘంటువు అని ఆయన పేర్కొనలేదు. ప్రతిభాషకు వాడుకలోకి రాని ఎన్నో పదాలు ఉంటాయి. సవర భాష లో థ్యాంక్స్ అనే మాట వినడానికి చాలా కాలం పట్టిందని రామమూర్తిగారు అన్నారు.

గిడుగు రామమూర్తిగారు నిఘంటువులు కూర్చిన విధానం, సవర భాషకు తాను చేసిన సేవ గురించి నిఘంటువు పీటికలో చాలా విస్తృతంగా అవగాహన అయ్యేమేరకు వివరించారు. రామమూర్తిగారు కూర్చిన నిఘంటువులు ఎంతో శాస్త్రీయతతోను పరమ ప్రామాణికతతో ఉన్నట్లు వీటిని చదవితే తెలుస్తుంది.

**సవర – ఇంగ్లీషు, ఇంగ్లీషు – సవర నిఘంటువులు**

రామమూర్తి గారు మొదట 1938లో ఈ నిఘంటువుని ప్రచురించి 5వ జార్జికి అంకితం ఇచ్చారు. నిఘంటువులలో ప్రయోగించే లిపి ధ్వని సంకేతాల స్థానంలో స్థానికతవి కాకుండా IPA సంకేతాలు ఉపయోగించారు. పదాల ఎంపికలో ఉచ్చారణలో మాటలలో నైపుణ్యం ఉన్న శబ్దాలను ప్రయోగించే విషయంలో 'రెవరెండ్ హాప్ మాన్ రాసిన ఎన్ సైక్లోపీడియా ఆప్ ముండారిక'ను ప్రమాణంగా తీసుకున్నట్లు రామమూర్తిగారు పేర్కోన్నారు.

సవర భాషలో అనేక వర్ణాలు కలిగిన పదాల ధాతువుకి ముందు వెనుక ప్రత్యయాలు ఉంటాయి. వాటికి సంకేతాలుగా అర్థాన్ని బట్టి చిన్న గీత, పెద్ద గీతలు ఉపయోగించడం ఉంది. పదాలలో పెద్ద గీత సమాసానికి సంకేతంగా వాడినట్లు పేర్కోన్నారు.

సవరభాషలో ఒకే పదం పునరుక్తి అవడం సాధారణం. అటువంటి పునరుక్తి పదాలను అన్నిచోట్ల ఇవ్వకుండా ఒక అక్షరం రాసి తర్వాత డాట్, లేదా డ్యాష్ ని పెట్టారు.

**ఉదా**: di= getup, di–an–de–le= having got up

Ium–eat, jum–an –jom–le = having eaten

Dvl= wait

Dvl–do: l –an = waiting

కొన్ని ఇంగ్లీషు పదాలకి సవర భాష లోనే పదాలు వాడారు. అయితే సవర పదాలకి సరైన అర్థం ఇచ్చే పదాలు ఇంగ్లీషు లేవు. అలాంటి పదాలను ()లో సూచించారు. ఇంగ్లీషులోని కొన్ని వర్ణాలకు సవర భాషలో అర్థాలు లేని పదాలను నిఘంటువులో ఆరోపాలుగా తీసుకోలేదని చెప్పారు.

విశేషణాలను సవర భాషలో ఉదాహరించేటప్పుడు క్లాజస్ ని ఉపయోగించి ఉదాహరించే ప్రయత్నం చేశారు.

ఉదాహరణకి సవర భాషలో ఇడియంని క్రియగా వాడడం ఉంది. ఇంగ్లీషు లోని adjective అర్థాన్ని సవర భాషలో క్రియలా వివరించారు.

ఇంగ్లీషులోని ఒక పదానికి సమానమైన అర్థాన్నిచ్చే పదం సవరలో లేకపోయినప్పటికి ఆ పదానికి ధాతువు రాయడం దాని పక్కన ఐఫన్ పెట్టి ఏదైనా అక్షరాలు పెట్టారు. ఇటువంటి సంకేతాల వలన పూర్తి అర్థం తెలిస్తుంది.

సవర –ఇంగ్లీషు నిఘంటువులో వృక్షనామాలు, జంతునామాలు, గ్రామనామాలు, వ్యక్తుల నామాలు తెలియజేసే పట్టికలను ఇచ్చారు.

**తెలుగు — సవర నిఘంటువు**

తెలుగు — సవర నిఘంటువును 1914లో డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఎడ్యకేషన్ వారు ప్రచురించారు. తరువాత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం దీనిని 2017లో తిరిగి ముద్రించింది. దీనిలో మొత్తం 108 పుటలు ఉన్నాయి. రెండవ ముద్రణలో కొత్తగా డి.టి.పి చేయకుండా యధాతథంగా ముద్రించడం వలన కొన్ని పుటలలో పదాలకు అర్థాలు స్పష్టంగా లేవు. రామమూర్తిగారు నిఘంటు పీటికలో ఈ నిఘంటువు లక్ష్య లక్షణాలు, వాటి ప్రత్యేకతలు గురించి పేర్కొన్నారు.

★ లిపి, సాహిత్యము లేని వ్యవహారికభాషను ఆధారంగా చేసుకొని ఈ నిఘంటువు నిర్మించారు. సవర భాష వాడుక భాషే కాబట్టి తెలుగు పదాలను కూడా వాడుక భాషలోనివే తీసుకున్నాడు.

★ తెలుగు ఆరోపాలకు సరైన సవర ఆరోపాలు రాయడమే కాకుండా ఆ ఆరోపాలను వాక్యరూపంలో ప్రయోగించడం ఈ నిఘంటువులో కనిపిస్తుంది. వాక్యం ప్రయోగించడం ద్వారా భాష నేర్చుకొనే వారికి సులభతరంగా ఉంటుందనే దృష్టితో వాక్యంలో ప్రయోగం చూపారు.

**ఉదాహరణలు**

అన్యాయము – నాయమ్ తె

వాక్య ప్రయోగం – గమాజ న్ లన్ సమాన్ పాజ్ల్ డో నాయమాన్ అతియె (గోమాంగు లంచం తీసుకున్నాడు కాబట్టి న్యాయము లేదు)

★ తెలుగుమాటలకు సరైన మాటలు దొరకనప్పుడు వాటి అర్థాన్ని సవర మాటలలో వివరించారు.

తప్పించుకొను — తజిర్రే ఎరేతి, సిల్లే ఎరేతెసాడా

తలుపు– సనజ. సనజ ఇజన్న (తలుపేసుకో)

★ దేవత, కాలవాచకం, శృంగారించుకోవడం లాంటి నిత్యం వాడుకలోని పదాలకు నిఘంటువుల్లో అర్థం ఇచ్చి వదిలేయకుండా దేవత అన్నతెలుగు మాటకు సవరలు వాడుకొనే పదాలను చూపి దేవతల పేర్లు అన్నింటిని ఇవ్వడం ఉంది.

| **తెలుగు** | **సవర** |
|---|---|
| దేవత | సోనమ్ (సుమ్, సిమ్), కితుజ్ డైయా, సున్ని, తున్ని |
| పెద్దలు | జగారాబోజి, సుతారాబోజి, సంకల్పబోజి, పెర్సిబోజి, పడాలు |
| ఆట | ఆరండి (ధాఅండి) ఆండీడన్, ఆన్ డ్రన్ డీ, రొండ్రడి, అరాలఇ. |

★ స్త్రీ, పురుషుల అలంకరణలకి సంబంధించిన అన్ని పదాలు శృంగారించుకో అనే పదం కింద ఇవ్వడం ఈ నిఘంటువులో కనిపిస్తున్న మరొక విశేషం.

| | |
|---|---|
| శృంగారించుకో | తింకుడో ఇనా, రూదొ |

★ స్త్రీలకి సంబందించిన పదాలు

| **తెలుగు** | **సవర** |
|---|---|
| బొట్టు పెట్టు | తిలకా ఇన్నా |
| కుచ్చు తగిలించుకో | బలెతజ్ నా |
| నూనె రాసుకో | మిఇ ల్ జుడానా |
| కంటికి కాటుక పెట్టు | గొయెనున్నా |

★ పురుషులకి సంబంధించిన పదాలు

| **తెలుగు** | **సవర** |
|---|---|
| బట్ట కట్టుకొ | సింద్ర జజినా |
| తలదువ్వుకో | ఊనమ్ సార్నా |

ఇలాంటి పదాలు అర్థాలు వాటి వివరణలు ఇవ్వడం వలన సవరల జీవన విధానం, అలంకరణ తెలుస్తుంది.

★ సూర్యుడి గమనాన్ని బట్టి కాలం నిర్ణయించడం సవర భాషలో ఉంది. కాలాన్ని సూచించే అన్ని మాటలను సూర్యుడు అనే ఆరోపం కింద ఇవ్వడం కనిపిస్తుంది.

| **సవర** | **తెలుగు** |
|---|---|
| యోజిన్ – | సూర్యుడు రెక్కలు ఆడించుచున్నాడు |
| జెయోజ్ లె – | ఎర్రబడ్డాడు |
| ససర్గడొజ్ లె – | అంచుకు వచ్చినాడు |
| పల్లెల్లె, సారె – | తెల్లవారింది. |

★ సవరలు తినే కూరలు

| **సవర** | **తెలుగు** |
|---|---|
| ఉఆబ్ – | కూర |
| బడాడాన్ – | బొదందెముకూర |
| తిత్తిజావ్ – | చింతకూర |
| ఉడాఆప్ – | మామిడికాయికూర |
| గనాఇఆప్ – | కందలకూర |

ఈ విధంగా పదాలనే కాక వాక్యాలను కూడా తెలుపుతూ నిఘంటువులు నిర్మించాడు గిడుగువారు. సవర భాషను మాత్రమే కాకుండా సవరల చరిత్రను, సవరల గురించిన విశేషాంశాలు తెలుగువారికి తెలియజేయడంతోపాటు సవరలను విద్యావంతులను చేయాలన్న లక్ష్యంతో సవర భాషాభివృద్ధికి శాస్త్రీయతతో చేసిన కృషే గిడుగు రామమూర్తి గారిని ప్రపంచ భాషాశాస్త్రవేత్తలలో ఒకరిగా గుర్తింపు పొందేలా చేసింది.

**ఆధార గ్రంథాలు**

1. జానకి. వి. గిడుగు రామమూర్తి – విమర్శనాత్మక పరిశీలన. 1991. జీవన ప్రచురణలు. వరంగల్లు.
2. రెడ్డి శ్యామల, వై. నిఘంటు నిర్మాణం – భాషాబోధన, హైదరాబాద్, భార్గవ పబ్లికేషన్స్, 2014.
3. విజయభాను, కొమాండూరి. తెలుగు నిఘంటువులు – ఆరోపాల అధ్యయనం, హైదరాబాద్: శ్రీయజ్ఞ పబ్లికేషన్స్, 2016.
4. సుబ్రహ్మణ్యం, పి.యస్. ఆధునిక భాషాశాస్త్ర సిద్ధాంతాలు, హైదరాబాద్: పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, 2017.
5. సీతారామాచార్యులు, బహుజనపల్లి. శబ్దరత్నాకరము, విజయవాడ: విక్టరీ పబ్లికేషన్స్, 2007.

---------------------

# 'రేపటి శత్రువు'ని సమాజానికి పరిచయం చేసిన మిత్రుడు 'ఆకెళ్ళ'

Kuricheti Jagadeesh
BA (Spl Tel, Spl Eng, History)
AcharyaNagarjunaUniversity
9502417741

## పరిచయం

ఆకెళ్ళ పూర్తి పేరు ఆకెళ్ళ వేంకట సూర్యనారాయణ. ఈయన కథకుడిగా, నవలా రచయితగా, సినీరచయితగా, నాటక రచయితగా పేరెన్నికగన్నవారు. 200కు పైగా కథలు, ధర్మోరాక్షతిరక్షిత:, విద్యారణ్యం వంటి నవలలు, మగమహారాజు, స్వాతిముత్యం, శృతిలయలు, ఆడదే ఆధారం, అయ్యయ్యో బ్రహ్మయ్య వంటి సినిమాలు, భవదీయం, అమ్మ, రేపటి శత్రువు, ఏ చీర కట్టనూ?, నాలుగో సింహం, ఇండియన్ గేమ్, అల్లదే! మావూరు, కాకి ఎంగిలి, క్రాస్ రోడ్స్, ఎయిర్ ఇండియా, ఆకాశంలో సగం మొదలైన నాటకాలు, ఇంకా రేడియోలో పది నాటకాలు, ఎన్నో రూపకాలు, 22 కథలు... ఇవి ఆకెళ్ళ రచనలు. ఆకెళ్ళ బహుముఖీన ప్రతిభ కలిగిన రచయిత అనడానికి ఆయన చేపట్టి సమర్ధంగా నిర్వహించిన రచనలే కారణం. అందుకే ఈయన అడుగుబెట్టిన ప్రతిరంగంలోనూ ఎన్నో అవార్డులు పొందిన రచయితగా రికార్డులకెక్కడం అభినందనీయం. ఈయన నారీయాగం టి.వి. సీరియల్ కథా రచయితగా నంది అవార్డు పొందారు. పల్లెవాసం–పట్నవాసం టీ.వి. సీరియాల్ మాటల రచయితగా నంది అవార్డు అందుకున్నారు.

ప్రస్తుతం నేను తీసుకున్న నాటిక 'రేపటి శత్రువు'. 'పంచవటి' పేరుతో వెలువడ్డ నాటికల సంపుటిలో అమ్మ, నాలుగోసింహం, రేపటి శత్రువు, ఇండియాన్ గ్యాస్, భవదీయం అనే నాటికలు ఉన్నాయి.

ప్రస్తుత సమాజంలో వృద్ధులు పడుతున్న బాధలు, ఈతరం పిల్లల ఆలోచనలు ఆకెళ్ళ 'రేపటి శత్రువు' లో కళ్ళకు కట్టినట్లు చూపించారు. నాభార్య, నాపిల్లలు లేదా నా భర్త నాపిల్లలు అని చుట్టూ గీత గీసుకుని ఆ గీతదాటి బయటకు రాకుండా ఉండి, కనిపెంచిన తల్లిదండ్రుల పట్ల మమకారాన్ని చుపకుండా బాధ్యతా రహితంగా ప్రవర్తించడం మనం గమనిస్తున్న విషయమే. అలాగే వృద్ధాప్యంలో ఉన్న పెద్దలు కూడా ఇంకా పిల్లల మీద పెత్తనం చెలాయించడం, వాళ్ళ పెత్తనం సాగడంలేదని బాధపడటం, ఆందోళనకు గురి కావడం మన అనుభవంలోని విషయమే. ఈ వాస్తవాన్ని ఆకెళ్ళ పదునైన సంభాషణలతో, స్పష్టమైన సన్నివేశాలతో ఆలోచనాత్మకంగా, సందేశాత్మకంగా 'రేపటి శత్రువు' లో ప్రతిబింబింపచేశారు. ఈ నాటకంలో ఇతివృత్తం వృద్ధాప్యం. ఇందులోని పాత్రలు సన్నివేశాలు మనకు వెదుక్కోకుండానే అడుగడుగునా కనిపిస్తూనే ఉంటాయి. సంభాషణలు మన ఇంట్లోనో పక్కింట్లోనో విని రాసినట్టుగా ఉంటాయనడంలో ఎంతమాత్రమూ సందేహము లేదు. సహజత్వానికి ప్రతిబింబంలా ఈ నాటకం ఆద్యంతం కొనసాగుతుంది.

## పత్రసారాంశం – సందేశం

సమాజంలోని పెద్దల్లో చైతన్యం రావాలనే ప్రబోధం, కన్నవాళ్లకు, కట్టుకున్న వాళ్ళకు సమన్వయం సాధించేలా ఉండాలని యువతకు ప్రబోధం సత్యం పాత్ర ద్వారా రచయిత అందిస్తాడు. పెద్దలు హద్దుల్లో ఉండకుండా పిల్లల జీవితాల్లో జోక్యం చేసుకుంటే సమస్యలు ఉత్పన్నమవుతాయి అనే నిజాన్ని రచయిత సత్యం పాత్ర ద్వారా పలికిస్తాడు. తరాలు మారాయి కాబట్టి పిల్లల ఆలోచనా విధానాలు కూడా మారుతున్నాయని దానికి అనుగుణంగా పెద్దలు కూడా వాళ్ళ ఆలోచనా విధానాలు మార్చుకోవాలని రచయిత సత్యం పాత్ర ద్వారా అభిప్రాయపడ్డారు. శాంత దృష్టిలో 'రేపటి శత్రువు కొడుకు' అయితే, సత్యం మాత్రం 'రేపటి శత్రువు వార్ధక్యం' అంటాడు. ఏది ఏమైనా ఈతరం రాబోవు తరాల వాళ్ళకి రేపటిశత్రువు ఎవరో తెలిసింది కనుక జాగ్రత్తగా వ్యవహరించడం వృద్ధులకు మంచిది అని సందేశాన్ని అందించారు ఆకెళ్ళ.

## ప్రధాన కథ

ఇందులో పాత్రలు ఐదు. శాంత, సత్యం తల్లిదండ్రుల పాత్రలు. వీరి ఒక్కగానొక్క కొడుకు ఆనంద్. కోడలు రాణి. రాణి తండ్రి చిదంబరం. తల్లిదండ్రులు ఆనంద్ ని చాలా గారాబంగా పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు నేర్పించి యుక్త వయసు వచ్చిన తరువాత రాణితో వివాహం జరిపిస్తారు. రాణి కోడలుగా ఇంట్లో అడుగు పెట్టిన దగ్గరనుంచి శాంత కి ప్రశాంతత లేకుండా పోతుంది. అత్త కోడళ్ళకి పడదు. ఇది సహజం.

పాలవాడిని తన అనుమతి లేకుండా మాన్పించి తన చేత పాలు తెప్పించడం, ఎంతో కాలం నుంచి వాడుతున్న సబ్బు ఆపేసి తన అనుమతి లేకుండా వేరే సబ్బు తెప్పించడం అత్తకు కోడలి మీద కోపం పెరిగేలా చేస్తాయి. కొడుకు ఆనంద్ తల్లికి తెలియకుండా తన వడ్డాణాన్ని బ్యాంక్ లో తాకట్టు పెట్టడం ఆవిషయం శాంతకు తెలిసి దీనికి కూడా కారణం కోడలే అనుకోవడం ఇలా... ప్రతి సన్నివేశంలోనూ అత్తకీ కోడలకీ మధ్య అంతరం పెరుగుతూ వస్తుంది. వృద్ధులతో కలిసి ఉండటం కష్టమని భావించి ఆనంద్, రాణి లు ఇల్లు వదిలి బయటకు వెళ్లడానికి నిశ్చయించుకుంటే తల్లిదండ్రులు వృద్ధాప్యంలో పిల్లల మీద ఆధారపడి బ్రతకాల్సిన అవసరం లేదని శాంత, సత్యం లు వాళ్ళ సొంత ఊరికి వెళ్లడానికి నిశ్చయించుకుంటారు. కొడుకుకు ఆస్తి మొత్తాన్ని రాసి ఇచ్చి నిరాదరణకు గురైన రాణి తండ్రి చిదంబరం కూడా సత్యం, శాంత లో వెళ్లడానికి ఇష్టపడటంతో శాంత సత్యం, చిదంబరాన్ని కూడా మనసారా ఆహ్వానిస్తారు. నాటిక ముగుస్తుంది.

ఈ నాటిక చదువుతున్నంతసేపు పాఠకుడు, చూస్తున్నంత సేపూ ప్రేక్షకుడు ఆలోచిస్తూనే ఉంటాడు. తప్పెవరిదా? అని. చిన్న చిన్న విషయాలను భూతద్దంలో పెట్టి చూసే అత్తగారిది తప్పా? తనకంటూ ఇష్టాయిష్టాలు, సొంత ఆలోచనలు ఉంటాయి కనుక తన అభిప్రాయం ప్రకారం నడుచుకోవడం కోడలి తప్పా? అనే ఆలోచనాలోచనల్లో మునిగిపోతాం. తప్పెవరిదో చెప్పడం కష్టం. కలిసి ఉంటే ఇలాంటి సమస్యలే వస్తాయి. అందుకే మారుతున్న కాలాన్ని బట్టి ఆలోచనల్లో మార్పు రావాలి. పిల్లలుగా ఉన్నప్పుడు మన మాట విన్నవాళ్లు పెద్దయ్యాక, పెళ్లయ్యాక కూడా వినాలంటే కష్టం.

అత్తగారైన శాంత కోడలితో " అడుగడుగునా ఈ ఇంట్లో మార్పులు చేయాలని చూస్తున్నావు. ఈ ఇంటి పెత్తనాన్ని నీ చేతిలోకి తీసుకోవాలని చూస్తున్నావు.!" అని అన్నప్పుడు కోడలి సమాధానం ఈ విధంగా ఉంటుంది. "పోనీ మీరన్నది నిజమే అయితే అయిన అదేం తప్పు కాదే! మీ మొగుడు సంపాదించినంత కాలం మీరు పెత్తనం చేశారు. ఇప్పుడు నా మొగుడు సంపాదిస్తున్నాడు కనుక నేను పెత్తనం చేస్తున్నాను" అంటుంది.

తరాలు మారుతున్నాయి. అంతరాలు పెరుగుతున్నాయి. ఆలోచనా విధానాలు కూడా మారుతున్నాయి. ఇక్కడ కోడలి మాటలు కూడా ఆలోచించదగినవే. ఎల్లకాలం పెద్దవాళ్లే పెత్తనం సాగించాలనుకుంటే జరిగే పనికాదు కనుక పెద్దల ఆలోచన విధానాల్లో కూడా మార్పురావాలి.

రాణి ప్రవర్తన అత్తగారి పట్ల అంత సముచితంగా లేదని చిదంబరం వియ్యంకుడితో అన్నప్పుడు సత్యం కూడా రాణి తప్పులేదనడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఇక్కడ రచయిత స్త్రీ స్వేచ్ఛని సత్యం మాటల్లో పలికిస్తాడు రచయిత. "అవును ఇరవై ఏళ్ళు పుట్టింట్లో అమ్మ పెత్తనంలో అమ్మ మాటలో, అమ్మ బాటలో నలిగి వేసారి ఆడపిల్ల పెళ్లికాగానే తన ఇల్లును తనెంతో చక్కదిద్దుకోవాలని ఎన్నో కలలు కంటూ అత్తవారింట్లో అడుగుపెడుతుంది. ఇక్కడకు రాగానే అమ్మకు బదులు అత్త గద్దె మీద కూర్చొని తన ఇష్టాయిష్టాలను శాసిస్తుంటే ఏ కొడలైనా ఎందుకు సహిస్తుంది. తిరగబడుతుంది. అది స్వతంత్రం కోసం చేసే తిరుగుబాటు. అదే నీ కూతురు చేసింది. అది ఆడపిల్ల మనసుతో ఆలోచిస్తే తెలుస్తుంది." అంటాడు.

## యువతకు ప్రబోధం:

నగ తాకట్టు పెట్టిన విషయంలో గొడవ చిలికి చిలికి గాలివాన అయితే అక్కడ సత్యానికి, ఆనంద్ కి మధ్య జరిగిన వాగ్వాదంలో సత్యం ఇచ్చే సందేశం ఆలోచనాత్మకంగా ఉంటుంది. "... మగాడై పుట్టిన వాడు తనని కన్న వాళ్ళకి, తను కట్టుకున్న దానికి మధ్య సమన్వయం సాధించాలి. అలా సాధిస్తేనే ఏ మగాడైన మొనగాడు అనిపించుకుంటాడు. వెళ్ళు ఆ సమన్వయం సాధించే ప్రయత్నం చెయ్" అంటాడు.

సత్యం పలికిన ఈ పలుకులు కేవలం ఆనంద్ కే కాదు. భర్తగా మారిన, మారుతున్న ఈ తరం కొడుకులందరికి వర్తిస్తుంది. తల్లిదండ్రులకు చెప్పలేక, భార్యకు చెప్పలేక మధన పడే వారు సమాజంలో మనకు చాలా మంది కనిపిస్తారు. ఇరువురికీ సంతోషం కలిగే రీతిలో ప్రవర్తించాలని మాట్లాడుతూ సత్యం పాత్ర చేత చైతన్యం కలిగింపచేశారు.

## వృద్ధులకు ప్రబోధం

పిల్లలు పెద్దవాళ్ళు అయిన తరువాత వాళ్ళ విషయాలలో మనం జోక్యం చేసుకోకూడదని సత్యం పలికితే, "అంటే కొడుకుల దగ్గర ఉన్నవాళ్ళు సగం చచ్చి పడిఉండాలా? పెంచి పెద్ద చేసిన తండ్రి అవసాన దశలో తండ్రి సాయాన్ని ఆశించడం తప్పంటారా? అని చిదంబరం అడిగితే "తప్పే కొడుకంటే బ్యాంక్ రిటైర్మెంట్ పాలసీ అనుకుంటున్నావా? నువ్విన్నేళ్ళు డబ్బు కట్టావు కనుక వార్ధక్యంలో నీ కన్నీళ్లు ... నువ్వు కట్టిన డబ్బు ఇవ్వడానికి, నువ్వు సాకినట్టే వాడూ నిన్ను సాకాలని ఆశించకు. నీకవసరం అయితే వాడు చేయాలని ఆశించు" అంటాడు.

ఈనాటి తల్లిదండ్రులు ఇంకా చెప్పాలంటే వృద్ధులు నేటి కొడుకు,కోడళ్ళ నుంచి ఎక్కువ ఆశిస్తున్నారని, ఆశించిన మేర గౌరవ మర్యాదలు దక్కకపోతే నిరాశకు గురవుతున్నారని, అలా నిరాశకు గురి కావడం వల్ల అనారోగ్యం పాలవుతున్నారని, ఆశించకుండా ఉంటే ప్రశాంతంగా ఉండవచ్చని సత్యం పలికిన పలుకులు అక్షర సత్యాలే కాదు. అక్షరాలా సత్యాలు. పెద్దతరం వారు సందర్భాలను గుర్తించి మసలుకోవలసిన తీరు రచయిత చక్కగా తెలియచెప్పారు. ఇంట్లో నుంచి వెళ్లిపోయే కొడుకు ఆనంద్ ని మేము పోయాక తలకొరివి పెట్టడానికి మాతోనే ఉండమని బతిమిలాడుతుంటే సత్యం "అసలు నువ్వు చచ్చాక ఎవరు నీకు కొరివి పెడతారో నీకు తెలీదే" అని భార్యతో అంటూ పున్నామ నరకం నుంచి తప్పించుకోవడానికి బతికున్నంత కాలం ఈ నరకం అనుభవించాలా? అని ప్రశ్నిస్తాడు. ఇదే అదనుగా "అమ్మా! నిజం చెప్పమన్నావ్! చెప్పాను. మీరిద్దరూ మాతో ఉండడం మాకు ఇబ్బందేనమ్మా!" అంటాడు. వెంటనే కోడలు రాణి కూడా అందుకుని "పైకి చెప్పలేకపోవచ్చు కానీ, ఏ కోడలికీ అత్తామామలు తనతో ఉండటం ఇష్టముండదు అత్తయ్య!" అని శాంతమ్మను మరింత రగిలింపచేస్తుంది.

తల్లి దృష్టిలో పిల్లలంటే గర్భ శత్రువులు అనే భావాన్ని శాంత వ్యక్తం చేస్తుంది. తొమ్మిది నెలలు మోసి, కని, పాలు ఇచ్చి కంటికి రెప్పలా పెంచడం అంటే రేపతిశత్రువు ని తయారు చేసుకోవడమే. పిల్లలంటే రేపటి శత్రువులు అనే సామాజిక వాస్తవికతను ఈ నాటిక వెల్లడిస్తుంది.

ఇది ఈ నాటి పిల్లలకు రచయిత కొట్టిన చర్నాకోల్ దెబ్బ. అంతేకాకుండా పిల్లల పట్ల జాగ్రత్తగా మసలుకోండి అని వృద్ధులైన తల్లిదండ్రులకి  ఇచ్చే హెచ్చరిక గా కూడా తలంచవచ్చు.

సమాజం మారింది. వ్యక్తుల మనస్తత్వాలు మారిపోతున్నాయి. స్వార్థం పెరిగిపోయింది. అందుకే ప్రతి ఒక్కరూ తమతమ స్వప్రయోజనాలను లెక్కించుకుని ప్రవర్తిస్తున్నారు. ముఖ్యంగా ఈ తరం కొడుకుల్లో... అందుకే రచయిత సత్యం పాత్ర ద్వారా బంధాలు పెంచుకోకూడదని పలికిస్తాడు. ఇన్ని విషయలు గమనించిన తరువాత రేపటి శత్రువు ఎవరని సత్యం శాంతని అడిగితే శాంత రేపటిశత్రువు కొడుకు అని చెప్తుంది. నీ ఆలోచన తప్పు అని చెబుతూ రేపటి శత్రువు సంతానం కాదని వార్ధక్యమే రేపటిశత్రువని స్పష్టం చేస్తాడు.  సమాజంలో వృద్ధులు చైతన్యం చెందవలసిన అవసరాన్ని సత్యం పాత్ర ద్వారా రచయిత పలికిస్తాడు. సత్యం మాటలు ఆలోచనాత్మకాలు."

## ముగింపు

మనం పిల్లల్ని ఎంత బాగా పెంచినా వారు ఎదిగిన తరువాత దూరమవుతారనేది ఎందరో అనుభవాలలో చూసిన వాస్తవంగా కనిపిస్తుంది.  ప్రస్తుత సమాజంలో పిల్లలు తల్లిదండ్రుల పట్ల చూపే నిరాదరణని, నిర్లక్ష్యాన్ని గుర్తించి రాబోయే ప్రమాదం విషయంలో మెలకువతో ఉండాలనే హెచ్చరికను చేశారు రచయిత. తల్లిదండ్రులు జాగ్రత్తతో ఉంటే వృద్ధాప్యాన్ని సంతోషంగా గడపవచ్చనే సామాజిక సందేశాన్ని రచయిత "కర్ర విరగకుండా, పాము చావకుండా" సున్నితంగా అందించారు ఆకెళ్ళ.

# ఆధునిక తెలుగు సాహిత్యంలో అభ్యుదయ ధోరణులు

- డా॥ పైనేని మాధవి

వెయ్యేండ్ల చరిత్ర కలిగిన తెలుగు సాహిత్యాన్ని ప్రాచీన సాహిత్యం, ఆధునిక సాహిత్యం అనే రెండు విభాగాలుగా సాహితీ విమర్శకులు విభజించారు. నన్నయనుంచి కందుకూరి వీరేశలింగం పూర్వంవరకు ప్రాచీన సాహిత్యమని, వీరేశలింగంనుంచి నేటి వరకు ఆధునిక సాహిత్యమని పరిశోధకులు పేర్కొంటున్నారు. అయితే ఆధునిక సాహిత్యంలో కూడా కొంతవరకు ప్రాచీన సాహిత్య ధోరణులు కనిపించాయి. కందుకూరి గ్రాంధికాన్ని ప్రయోగిస్తూ వివిధ నూతన ప్రక్రియల్లో రచనలు చేశాడు. ఆ తరువాత వచ్చిన గురజాడ అప్పారావు వ్యవహారికాన్ని విస్తృతంగా ప్రయోగించాడు. అందులో ఉత్తరాంధ్ర మాండలికం విరివిగా ఉంటున్నది. వీరిరువురూ ప్రాచీనత్వానికి భిన్నంగా వస్తువులో, భాషలో, భావంలో నవ్యతపాటిస్తూ రచనలు చేశారు. వీరి భావజాలాన్ని ఆదర్శంగా తీసికొని తరువాత రచయితలు అభ్యుదయ దృక్పథంతో రచనలు చేసారు, చేస్తున్నారు. వీరి దృక్పథానికనుగుణంగా వివిధ ధోరణులు రూపుదాల్చాయి. వాటిని స్త్రీవాద, దళిత వాద, మైనారిటీవాదాలు వంటివిగా పేర్కొనవచ్చు.

ప్రజలను ఆలోచింపచేస్తూ, వారి సమస్యలను వస్తువుగా ఎన్నుకొని రచనలు చేయడం దాదాపుగా 1900 నుంచే మొదలయ్యిందని చెప్పవచ్చు. ఇలా తెలుగు రచయితలు రచనలు చేయడానికి ప్రేరణ కలిగించిన వారు తెల్ల దొరలు. వీరి సంస్కరణలు, సాహిత్యరీతులు మన రచయితలను ఎంతగానో ప్రభావితం చేశాయి. అలాంటి ముఖ్యులను ఇలా పేర్కొనవచ్చు.

1. కందుకూరి వీరేశలింగంపంతులు
2. గురుజాడ అప్పారావు
3. త్రిపురనేని రామస్వామి చౌదరి
4. తాపీ ధర్మారావు
5. గుఱ్ఱం జాషువా
6. చలం
7. కొడవటి గంటి కుటుంబరావు
8. చెరబండరాజు - వంటి వారున్నారు. ఈ కోవకు చెందిన వారే ఇంకా ఎంతోమంది రచయితలు, రచయిత్రులు ఉన్నారు. అయితే పైన పేర్కొన్నవారు నూతన ధోరణులకు

అంకురార్పణ చేశారు.భావంలో, భాషలో ఆధునికత పాటిస్తూ సాహిత్య దిశ దశను పై ఎనిమిది మంది కవులు మలుపు తిప్పారని చెప్పవచ్చు. దీనికి వారి సాహిత్యమే ప్రబల నిదర్శనంగా ఉంది. వీరి సాహిత్యం సమాజాన్ని ఆలోచింపజేసింది, చైతన్య పరిచింది. అలాంటి కొన్ని ధోరణులు ఇక్కడ పేర్కొని వివరించడం జరిగింది.

**సంస్కరణ దృక్పథం :**

సాహితీ క్షేత్రంలో నిరంతరమూ శ్రమించి కొత్త పంటలను పండించిన కృషీ వలుడు కందుకూరి. ఆధునిక శాస్త్రీయ విజ్ఞాన వికాసమునకు ప్రోత్సాహకాన్నందించి, బాల్య వివాహాల మూర్ఖత్వాన్ని పారద్రోలి వితంతు పునర్వివాహాల్ని స్వయంగా జరిపించిన వైతాళికుడు ఈయన. సంఘ సంస్కరణ దృక్పథంతో రచనలు చేశాడు. బోగమేళాలు వ్యతిరేకించాడు. స్త్రీ విద్యను ప్రోత్సహించాడు. ప్రాచీన సాహిత్యంలోని మూఢ నమ్మకాలను ఖండిస్తూ ఎన్నో రచనలు చేశాడు. సంఘ సంస్కరణకోసం పత్రికలు నిర్వహించాడు. శాస్త్రీయ దృక్పథాన్ని ప్రజల్లో పెంపొందింపజేసే రచనలు చేశాడు. ఈపరంపరలో కొందరు ఆయనకు ఆటంకం కలిగించారు. అయినా వెనుదీయకుండా, వెరవకుండా మునుముందుకే సాగినాడు.

కందుకూరి అన్ని సామాజిక దురాచారాలపైన, అవినీతిపైన ధ్వజమెత్తాడు. వాటిని గూర్చి స్వీయచరిత్రలో ఇలా రాశాడు.

"లంచములు తగవన్న రాజకీయోద్యోగులకు కోపం. వేశ్యాంగనా సంగమము నీతి కాదన్న శృంగార నాయకులకు కోపం. నీతిమాలిన బాహ్య వేషములు మత విరుద్ధములన్న ఆచార్య పురుషులకు కోపము" అని పేర్కొన్నాడు. దీనిని బట్టి ఆనాటి సమాజం, ఆసమాజంపై తనకున్న బాధ్యతను నొక్కి చెప్పాడు. ఈయన లంచాలను, వేశ్యా వృత్తిని, నీతిబాహ్యమైన కార్యకలాపాలను తీవ్రంగా వ్యతిరేకించాడు.

కందుకూరి తరువాత ఆ వారసత్వాన్ని అందిపుచ్చుకున్న మహాకవి గురజాడ అప్పారావు. పాండితీ భేషజాలతో తెలుగు సాహిత్యం జిగటబారి పిడసగట్టిననాడు తేట తెనుగుల తీయదనాలతో నూత్న భావాలను ఆవిష్కరించిన అత్యంత ఆధునికుడు గురజాడ. నవ్యత నాణ్యతలేని మత సాహితీ భజనల నుండి తెలుగు సాహిత్యాన్ని రక్షించి అభ్యుదయ ప్రభంజనంగా మానవతను, సమతను చాటి చెప్పిన గొప్ప రచయిత. వ్యవహారిక భాషోద్యమాలను పలుకుబడిలో, సంస్కరణోద్యమాలను భావంలో

రంగరించుకొన్న సంస్కారుడు. నిర్జీవమూ, నిస్తేజము సాహిత్యంలో సమాజంలో ఆవరించినపుడు ఉత్తేజాన్ని, ఉజ్జీవాన్ని రంగరించడానికి సాహిత్యాన్ని ఒక కొత్తమలుపు తిప్పిన మహనీయుడు. పూర్ణమ్మ, కన్యక వంటి ఖండ కావ్యాల రచనల ద్వారా స్త్రీల దుస్థితిని కళ్ళకు కట్టినట్లు చిత్రించాడు. ఈయన కుల తత్వాన్ని ఇలా ఎండగట్టాడు.

**కులము లేదట వొక్క వేటున**

**పసరముల హింసించు వారికి**

**కులము కలదట నరుల వ్రేచెడి**

**క్రూర కర్ములకున్ –** అని మండిపడ్డాడు.

గురజాడ అప్పారావు కులంపైన, మతంపైన, మూఢాచారాలపైన సాహిత్యమనే ఆయుధంతో దాడి చేశాడు. యుకకర్త స్థానాన్ని సంపాదించుకున్నాడు.

**హేతువాద దృక్పథం :**

కార్య కారణ సంబంధాన్ని సహేతుకంగా ప్రశ్నించి తర్కించి అందులోని సత్యాన్ని గుర్తించేది హేతు వాదం. మూఢ విశ్వాసాలకు బద్ధ వ్యతిరేకం హేతువాదం. రామాయణంలో హేతువాద ఛాయలున్నాయి. రామాయణంలో జాబాలి, భారతంలో చార్వాకుడు హేతు వాదులు. వారి వారి సత్వం నేటికీ సజీవంగా కొనసాగుతున్నది. వేమన, వీర బ్రహ్మం, త్రిపురనేని రామస్వామి చౌదరి, తాపీధర్మారావు వంటి వారు ఈ వాదానికి సాహిత్య స్థాయిని కల్పించారు.

వేల కంఠాలతో మతాన్ని ఘోషిస్తున్నపుడు, వేల కరాలతో గతాన్ని భజిస్తున్నపుడు, వేల నేత్రాలతో రాతిని పూజిస్తున్నపుడు కవిరాజు సత్య వాక్రుభంజనం మతాన్ని గతాన్ని నిరసించి వాస్తవానికి పతాకలెత్తింది. ఈయన ఆర్ష వాఙ్మయాన్ని సమగ్రంగా అధ్యయనం చేశాడు. ఆ సందర్భంగా ఆయనకు సందేహాలు కలిగాయి. అపుడు ఇలా అన్నాడు.

**చదివితినే పురాణముల సాంగముగా భయభక్తి యుక్తులన్**

**జదువుటెగాని యందుగల సందియముల్ సతతంబు హెచ్చుదున్**

**బొదలక చిత్త శాంతి పరిపూర్ణముగా భ్రమియింపు చుండ నా**

**మదిమది నుండదయ్యె నొక మార్గము యేనియు దోఁచ దెమ్మోయిన్**

పురాణాలు చదివే కొలది తనకు సందేహాలు కలుగుతున్నాయని, దానితో మనశ్శాంతి కోల్పోతున్నానని అంటాడు కవి. అంటే అందులో పరస్పర విరుద్ధాంశాలే ఉన్నాయని హేతు దృక్పథంతో ప్రశ్నిస్తాడు.

రామస్వామి చౌదరివలె సాహిత్యంలో హేతు తత్వాన్ని సృజించి ప్రబోధించిన మహా రచయిత తాపీ ధర్మారావు. ఈయన కూడా సంస్కృతాంధ్ర సాహిత్యాలను ఆమూలాగ్రం అధ్యయనం చేశాడు. అందులోని అసంగతాలను సూటిగా ప్రశ్నించాడు. హేతు దృక్పథంలో రచనలు చేశాడు. తన దృక్పథాన్ని 'వ్రాత – రోత' అనే గేయంలో ఇలా తెలిపాడు.

**ప్రజల భావముల ప్రతిధ్వనిస్తూ**
**బాగు పరిస్తే వ్రాతా**
**గజి బిజి వ్రాతల కళ్ళు మూసుకొను**
**గాలి మూటయే రోతా**
**జీవన మందలి పెద్ద సమస్యల**
**చిక్కు విప్పితే వ్రాతా**
**ఏవో పుక్కిటి పురాణములతో**
**బావురమంటే రోతా**
**ఈ ప్రపంచమున జ్ఞానం ఎంతో**
**ఎరుగుచు వ్రాస్తే వ్రాతా**
**కూపస్థం వలె గ్రుడ్డి పాఠములు**
**కూటికి రాస్తే రోతా**
**గతమును బాగా విమర్శ చేస్తూ**
**గతి చూపిస్తే వ్రాతా**
**మతి సుతిలేని ఊహాశూన్యుల**
**మాటల గారడి రోతా** – అని తేల్చి చెప్పాడు.

గతమంతా మంచిది కాదని దాన్ని శాస్త్రీయ దృక్పథంతో తర్కించాలని ధర్మారావు స్పష్టంచేశాడు. ప్రజలను చైతన్యపరుస్తూ రచనలు చేసే అది వ్రాత అవుతుందని, అలాకాకుండా ప్రజలను అజ్ఞానం

వైపు నడిపించే దిశగా రచనలు చేస్తే అది రోత అంటాడు కవి. ఈ గేయంలో ధర్మారావు కవి బాధ్యతను చక్కగా గుర్తుచేశాడు.

హేతు వాద దృక్పథంతో రచనలు చేసిన మరో రచయిత కొడవటి గంటి కుటుంబరావు. గతి తార్కిక భౌతిక వాదాన్ని, సమసమాజ దృక్పథాన్ని ఆయన తన రచనలకు వస్తువుగా ఎంచుకున్నాడు. వేదకాలపు సామాజిక పరిస్థితులు, వైదిక భాషలో అశాస్త్రీయత, మూఢాచారాలు, కుల వ్యవస్థ భౌతిక వాదం, భావవాదం, హేతువాదం వంటి చారిత్రక విషయాలను గూర్చి సశాస్త్రీయంగా తర్కిస్తూ కుటుంబరావు నవలలు, గల్పికలు, కథలు, వ్యాసాలు రాశాడు. ప్రజల కున్న మౌఢ్యభావం మీద ధ్వజమెత్తాడు. కులాల పుట్టుక, ఉపకులాల పుట్టుక, గోత్రాల పుట్టుక గూర్చి చారిత్రక సత్యాలు ప్రకటించాడు. భౌతిక దృష్టి లోపించిన జాతి వెనుక బడి ఉండక తప్పదని, భౌతిక వాదం నూరిపోసినంత మాత్రాన ఈ ఆస్తికత్వం నిష్క్రమించదని, భౌతిక వాదం జీవిత విధానాలలోకి సమగ్రంగా ప్రవేశించాలని చాటి చెప్పాడు.

అన్ని మౌఢ్యాలలోకి మత మౌఢ్యం బలవత్తరమైనదని ఎందుకంటే మత సత్యాలకు ఋజువు లేదని ఆ అవసరం కూడా మతావలంబికులకు లేదని, అందుచేతనే మత మూఢులు అత్యధిక విద్యావంతులలోనూ, శాస్త్ర వేత్తలలోనూ కూడా కనిపిస్తారని తేల్చి చెప్పాడు.అంతేగాక సంస్కర్తలకు భౌతిక దృష్టి లోపించినట్లైతే ఫలితం ఉండదని నిర్మొహమాటంగా చెప్పాడు.

సాహిత్యం ఒకనాడు దేవుళ్ళను నెట్టేసి రాజుల వద్దకు చేరిందని, ఆ తర్వాత రాజులను నెట్టేసి మధ్య తరగతిని చేరిందని, ఇక ఈనాడు మిగిలిన వర్గాలన్నిటిని నెట్టేసి ప్రజల దగ్గరకు వెళ్ళాలని స్పష్టం చేశాడు కొడవటిగంటి. ఈ ప్రజాయుగంలో ప్రజల కొరకు రాయడమేగాక ఆప్రజల దగ్గరకు సాహిత్యం వెళ్ళాలని తెలిపాడు. పునరుద్ధరణ వాదాన్ని నిరసిస్తూ, పురోగమన వాదాన్ని సిద్ధాంతీకరిస్తూ ముందుకు కదిలాడు.

**విప్లవ దృక్పథం :**

1960 నుంచి ఆంధ్రదేశంలో పీడిత ప్రజల పక్షాన నిలిచి పోరాటం చేస్తున్నది విప్లవ దృక్పథం. ఈ దృక్పథానికి ఎందరో విప్లవ కవులు పునాదులు వేశారు. అలాంటి వారిలో అగ్ర గణ్యులు చెరబండరాజు. శ్రమజీవి శ్రమ ఫలితం అతనికి దక్కకుండా పెట్టుబడిదారులకూ, దోపిడీ వర్గాలకు ఎలా చేరుతున్నదో ఒక గేయంలో చెరబండరాజు ఇలా తెలిపాడు.

**కొండలు పగలేసినం**

**బండలను పిండినం**

**మానెత్తురు కంకరగా**

**ప్రాజెక్టులు కట్టినం**

**శ్రమ ఎవడిదిరో**

**సిరి ఎవడిదిరో"** – అంటూ సూటిగా ప్రశ్నించాడు. కవి జీవికి పట్టెడన్నం లేకుండా ఉంటున్నదని ఆవేశపూరితమైన ఆవేదనను వెలిబుచ్చాడు.

**మతం పిచ్చికన్న లేదు**

**మత్తు మందురో**

**కాల కూట విషం జల్లు**

**కాల మొద్దురో** – అని చాటి చెప్పాడు.

**కష్టాలకు అదృష్టం**

**కాదు కాదురో**

**పునర్జన్మ కర్మ ఫలం**

**వొట్టి మాటరో** – అని తేల్చి చెప్పాడు.

**అంటరాని పువ్వంటూ**

**లేదు లేదురో**

**మనిషి మనిషి మధ్య**

**తెరలు దించబోకురో** – అని హితబోధ చేశాడు.

చెరబండరాజు కులమతాలను, మూఢ విశ్వాసాలను నిర్భయంగా ఖండించాడు. శ్రమలోన పుట్టి సర్వము తానేను అని వేమన అన్నట్లుగా చెరబండరాజు శ్రమతత్వాన్ని గుర్తించమన్నాడు.

**మానవతా దృక్పథం :**

మనిషిని మనిషిగా చూడాలన్నదే మానవతా దృక్పథం. కులం పేరుతో మతం పేరుతో మనుషులు అడ్డుగోడలు కట్టుకోరాదని. సర్వ సమత్వాన్ని పాటించాలని ప్రబోధించేది మానవత్వం.

దీనిని ఆంగ్లంలో Humanism అంటారు. యం.యన్.రాయ్ ఈ మానవతా సిద్ధాంతాన్ని విస్తృతంగా ప్రచారం చేశాడు. ఈ దృక్కోణంతో రచనలు చేసిన మహాకవి గుర్రంజాషువా. ఈయన కలం నుంచి దాదాపు యాభై గ్రంథాలు వెలువడ్డాయి. వాటన్నిటిలోనూ అగ్ర కులాలవారి ఆధిపత్యాన్ని ప్రత్యక్షంగానో పరోక్షంగానో ప్రశ్నించడం కనిపిస్తుంది.

గుర్రంజాషువా గబ్బిలంలో అమానవీతను గూర్చి ఇలా అంటాడు.

**ప్రతిమల పెండ్లి సేయుటకు వందలు వేలు వ్యయించుc గాని దుః**

**ఖితమతులైన పేదల పకీరుల శూన్యములైన పాత్రలన్**

**మెతుకు విదల్పదీ భరత మేదిని ముప్పది మూడు కోట్ల దే**

**వత లెగబడ్డి దేశమున భాగ్య విహీనుల క్షుత్తులా ఱనే** – అని సూటిగా ప్రశ్నించాడు.

దేవతా విగ్రహాలకు పెళ్ళిళ్ళు చేయడానికి వేలల్లో ఖర్చు చేస్తారుగాని తిండికి గుడ్డకు లేని వారిని గూర్చి పట్టించుకోరని సమాజాన్ని ప్రశ్నిస్తాడు.

**మనుజులార మాది ఘనమైన మతమని**

**ఒకడు తరిమి తరిమి యుగ్గడించు**

**పెక్కు మతము లిట్లు పేచీలు సాగింప**

**మార్గమేది యైక మత్యమునకు** – అంటాడు మరొకచోట. కవి మతం పేరుతో జరుగుతున్న దుర్మార్గాన్ని, దౌష్ట్యాన్ని గర్హిస్తాడు. మనుషులందరూ మానవత్వంతో ఐక్యంగా ఉండాలని, ప్రబోధిస్తాడు. వీరు ఇలా పేర్కొనుటకు గురజాడ చెప్పిన 'మతములన్నియు మాసిపోవును, జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును' అన్న మాట హేతువు కావచ్చు.

**స్త్రీ దృక్కోణం :**

స్త్రీ పురుషునితో సమానం అని తేల్చి చెప్పిన మహా రచయిత చలం. స్త్రీలను సమాజం తరతరాలనుంచి అణచి వేస్తున్నదని, దానినుంచి స్త్రీలు బయట పడాలంటే తిరుగుబాటే శరణ్యమంటాడు చలం. స్త్రీకి కూడా శరీరం వుంది. దానికి వ్యాయామం ఇవ్వాలి. ఆమెకు మెదడు వుంది. దానికి జ్ఞానం ఇవ్వాలి. ఆమెకు హృదయం ఉంది. దానికి అనుభవం ఇవ్వాలి, అని ఖరాఖండిగా చెప్పిన రచయిత చలం.

స్నేహము, ప్రేమ, త్యాగము, స్వేచ్ఛ స్త్రీ పురుష సంబంధాల్లో మమేకం కావాలని తపన చెందాడు. ఆ భావాలను రంగరించి శశిరేఖ, అరుణ, రాజేశ్వరి వంటి పాత్రలను సృష్టించాడు. స్త్రీ పురుషులు నిజమైన స్నేహితులు, దంపతులు కావాలంటే ఇద్దరికి సంపూర్ణమైన స్వేచ్ఛ వుండాలి. ప్రేమ బంధమే కాని, అధికార బంధం ఉండకూడదు. పాపము, ద్వేషము, జలసీ, అవినీతి, వ్యభిచారము, దుఃఖమూ ఈ అగ్నిలోనుంచి నడిచి తడిస్తేగాని ఆ వ్యక్తికి స్వాతంత్ర్యం కలగదు అంటారు.

ఇరవయ్యో శతాబ్దంలో భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం, విప్లవకవిత్వం, దిగంబర కవిత్వం వంటి కవితా ధోరణులు వెలువడ్డాయి. ఇవన్నీ ప్రజలను సంస్కరణ వైపు, హేతువాదం వైపు, విప్లవంవైపు, స్త్రీ అభ్యుదయం వైపు నడిపించాయి, నడిపిస్తున్నాయి. వీటి మూలంగా సమాజం పురోగమనంవైపు పయనిస్తున్నదని చెప్పవచ్చు.

**ఉపయుక్త గ్రంథాలు :-**

1. సాంఘిక విప్లవ రచయితలు – కత్తి పద్మారావు
2. స్త్రీ వాదం – ఆచార్య కాత్యాయనీ విద్మహే
3. భారతీయ తత్వ శాస్త్రం – దేవి ప్రసాద్ ఛటోపాధ్యాయ
4. చలం జీవితం – సాహిత్యం – డా॥ ఎన్. రామచంద్ర
5. విప్లవ వాదం – డా॥ కడియాల రామ మోహన్ రాయ్
6. హేతువాదం – రావిపూడి వెంకటాద్రి

* * *

**డా॥ పి. మాధవి**
టీచింగ్ కన్సల్టెంట్
సంస్కృత విభాగం
ఎస్.వి. యూనివర్సిటి, తిరుపతి
చరవాణి : 85198 04784

# సందేశాత్మక కవిత్వం - సమకాలీన సమాజ దర్పణం

యల్లావుల నాగరాణి IMA Telugu
హైదారాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం
8522032772

**ఉపోద్ఘాతం**

పూర్వంలో నీతిశాస్త్రం మొదలుకొని కవిత్వంలోనూ ఇలాంటి వాక్యాలు చెప్పటం మొదలైంది. సందేశం అనేది అన్ని వర్గాల వారికి తప్పనిసరి. సందేశం, ఉపదేశం ఏదైనా మనిషిని సరైన మార్గంలో నడిపించడానికి చేసేది. జీవితాన్ని అనేకమైన అంశాలనించి కొలవడం ఇందులో కనిపిస్తుంది. "కథకైనా, కవితకైనా నడకనేది అవసరం!నడతనేదీ అవసరం!" చదివించే లక్షణం (Reedability) ఒకటి కవితకి చాల అవసరం. ఆనడక వెంటే పాఠకుడు పరిగెడతాడు. అలా నడిపించే శక్తి సందేశాత్మక కవిత్వంలో తప్పక ఉంటుంది. మనిషిని ఉత్తేజ పరచి, ఆలోచింపచేసి, అడుగులు ముందుకు వేసే మహోన్నతమైన శక్తి సందేశ పూరిత కవిత్వం అందిస్తుంది.

**బతుకడమంటే ...**

"ఆలోచనల సుడిగాలి
వీచినప్పుడు కొట్టుకుపోని"ఏకాంత ధ్యానమై నిలవాలి/
"భాద్యతల బండరాయి
నిశ్శబ్దాన్ని బద్దలు చేసినప్పుడుచెదరని సరోవరమై నవ్వాలి/"
"మూగ గొంతు పలికే పాటకు/గొంతుక కావాలి
చెవిటి గుండెకూ వినబడేచైతన్య శంఖారావమవ్వాలి/"
"బతుకంటే జీవిస్తూమరణించడం కాదు/
బతుకడమంటేజీవించడమవ్వాలి మరణిస్తూ/"

కరణం లుగేంద్ర పిళ్లై రాసిన పై కవితలోని వాక్యాలన్నీ జీవితాన్ని కూడదీసుకోవడానికి కావలసిన బలాన్ని మనకందిస్తున్నాయి. మన జీవితంపై మనకొక స్థిరత్వాన్ని అందిస్తున్నాయి. చివరివాక్యాన్ని పై వాక్యాలన్ని విడమర్చి చర్చిస్తాయి .బతుకంటే జీవిస్తూ మరణించడం కాదు, బతుకడమంటే మరణిస్తూ జీవించడమవ్వాలి ... అనే చివరివాక్యపు సమగ్రతకోసం ఇలాంటివి అనేకమందిలో కనిపిస్తాయి. వాక్యాలు కొన్నిసార్లు నినాదాల్లా కనిపిస్తాయి. కొంత కళాత్మకతను పెనవేసుకుంటే వాక్యాలకు ఆ నిర్దిష్టత చేరుతుంది.ఈ కవిత మంచి ఉదహరణ సమగ్రనిర్వచనాన్ని చెప్పుకోవడానికి.

**అమ్మకానికి పేదరికం...**

దేశం ప్రగతి పథంలో నడుస్తోంది
పాలపొంగులా ఏ ఏటికాఏడు పైకి ఎగబాకే

మన ఆర్థికాభివృద్ధి రేటు అబ్బో ఎంత మెరుగో
వార్చి వడ్డించిన విస్తరిలో అంతా మాయ..
లేనిది ఉన్నట్టు.. ఉన్న ది లేనట్టు......

నోటిలోకి నాలుగు వేళ్లు వెళ్ళకున్నా..
అకలి పేగులు మెలిపెడుతున్నా..
అవి కావట ప్రభువులకు ప్రామాణికాలు...
పేదరికాన్ని కొలిచే కొలమాన రాళ్లు కూడా
దిగుమతి చేసుకునే నేతలకు ముందు చూపెందుకు ఉంటుంది
పనికట్టుకొని చూసే వాళ్ళకు అంతర్జాలం కనికట్టు
చూస్తుంటే అంతా పచ్చగానే ఉంటుంది మరి
కాస్త కళ్ళను నేలపైకి దింపి చూస్తేకదా..

బడ్జెట్ భూతం భూతద్దంలో బోల్డ్ లెటర్ లో సంక్షేమ పద్దులు
వార్త పత్రికల పతాక శీర్షికల కెక్కి కాగితాలలోనే ఇంకిపోతూ...........
కారిచ్చులా వాడవాడలా వ్యాపించిన పన్నుల ప్రచారం
ఆకాశం ఎత్తుకు రోదసిలోకి నిత్యవసరాలు ఎగిరిపోతూ.........

ప్రచారానికి కోట్లు ఖర్చు పెట్టి
కిలో రూపాయికి బియ్యం ఇస్తేనేం..
ఆకలి తీరుతోందా .....
ఫ్లాష్ న్యూస్ స్క్రోలింగ్ ఇప్పుడే అందిన వార్తంటూ
మద్యం సిండికేట్లకూ తెల్ల రేషన్ కార్డులు....

ఊకదంపుడు ఉపన్యాసాలు ఇచ్చి
ఆరోగ్య శ్రీ ఉచితంగా అందిస్తేనేం
రోగాలు తగ్గితున్నాయా...
అందమైన భవంతులలో దొంగ ఆపరేషన్ల కోతలు..
ఖజానా కు చిల్లులు పెట్టే బిల్లుల తడిచి మోతలు
కట్ చేస్తే .. కాటికి పడకేసిన ప్రభుత్వ దవాఖానాలు...

ఇదే కదా
ఏ ప్రభుత్వం వచ్చినా ఎప్పుడూ ఉండే తంతు
తెల్లబోవడం మాత్రం పేదవారి మనవంతు

పిండం ఫలధీకరణకోసం
అద్దెకు గర్భసంచిని ఓ తల్లి బేరానికి పెడుతోంది
పని వెతుక్కుంటూ చలి చీమల గుంపులై
రోడ్లపై కూలీలు బారులు తీరుతున్నారు..
గొప్పలు చెప్పి గుప్పిట్లో బంధించిన
విష సంస్కృతికి విసిరిన పాచికకు
విలువలు ఉరేసుకు ఆత్మహత్యలు చేసుకుంటున్నాయి
ప్రపంచీకరణ అందించిన విజ్ఞానపు వీచికకు
శ్మశానంలో పేగు బంధాలు కాలుతూ కమురు వాసన వేస్తున్నాయి

బతుకు బండిని నడిపే ధనం అనే ఇంధనం కోసం
వలసలతో  పట్టణాలవైపు పరుగులు తీస్తున్న జనం
పైటలు పరచే వృత్తికోసం విహంగాలై ఎగురుతన్నవనితల గుంపు
మనిషి తాను కూర్చొన్న కొమ్మనే తానే నరుకున్నట్టు
బంధాలన్నీ నూలుపోగుల్లా తెగుతున్న చప్పుడు ..
అయినా పేదరికం అంటే
పూటగడవడక పోవడం కాదని నిర్వచించుకుందాం..
ఏ కుప్పతొట్టి వెతికినా దొరికే ఆడశిశువులు
కుక్కలు నోట కరుచుకుపోతుంటాయి..
ఏ వీధి మలుపు తిరిగినా చిల్లర కోసం
దేబురిస్తున్న అనాథ జీవచ్ఛవాలు మురికి వాసన వేస్తుంటాయి
బస్టాండు, రైల్వే స్టేషన్ పేవ్ మెంట్ పై పేదరికం నిదురిస్తున్న దృశ్యాలు
విశ్వ విపణిలో అన్నింటికిధర పలుకుతోంది..
అమ్మడానికి సిద్ధమవుడమే తరువాయి
పేదవాడినో ఆటబొమ్మ చేసి  ప్రపంచ బ్యాంకుకు తాకట్టు పెట్టినట్టే
లేకుంటే వెన్నులపై వీపు విమానమోత మోగించే ఈ పన్నుల భారమేంటి
అయినా మన దారేదో మనది...

అయినా పేదరికం అంటే
పూటగడవడక పోవడం కాదని నిర్వచించుకుందాం

మానవతకు చీడపట్టించిన సంస్కరణల పర్వంలో
పేద, ధనికుల మధ్య అంతరం పెరుగుతోంది
లేని వాడిని కొట్టి ఉన్న వాడికి రాయితీలు ఇస్తున్న ఈ వక్రనీతిలో
పేదవాడిని బలిపశువు చేస్తున్న ఈ ఆర్థిక జాతరలో
ధరలు పెంచడం అంటే గాయంపై కారం పూసి బతుకును వేలం వేయడమే
అయినా పేదరికం అంటే
పూటగడవడక పోవడం కాదని నిర్వచించుకుందాం..
ఈ ఉగాది రోజయినా దేశం ప్రగతి పథంలో నడుస్తోంది భ్రమిద్దాం.

రాజ్యములేదు,రాజులేడు దండించేవాడు దండింప బడేవాడులేడు. ధర్మాన్నొకదాన్ని తాముగ నిర్మించుకుని ప్రజలు పరస్పరం ఒకరినొకరు రక్షించుకునేవారు( భారతం శాంతి పర్వం లోని ఈశ్లోకం రాజ్యం యొక్క డొల్లతనాన్ని చెబుతుంది. ఇప్పటి పరిస్థితుల్లో నైతే పాలన, చట్టం, న్యాయం అనే అంశాలు వ్యష్టిగా పనిచేస్తాయి. అందువల్ల రాజ్యం దాని ఆకాంక్షల మేరకు పనిచేస్తుంది. కానీ వర్తమానంలో ప్రజాప్రతినిధులు కేవలం పార్టీనాయకులుగా ప్రవర్తించడం వల్ల ప్రజా ఉద్యమాలు అణచబడుతాయి. అందువల్ల తమ ఆకాంక్షలకోసం పోరాడే ప్రజాచైతన్యం అనేక సార్లు మోసం చేయబడుతుంది. పోరాట ఫలితాలను ప్రజల ఆకాంక్ష మేరకు కాకుండా నాయకుల ఆలోచనలకు దగ్గరగా నియంత్రించ బడతాయి.

పిళ్లై రాసిన 'అమ్మకానికి పేదరికం' కవిత సమకాలీన సమాజానికి అద్దం పడుతుంది. ఆర్థికాభివృద్ధి గురించి ఆకలి ప్రేగుల గురించి లేనిది ఉన్నట్టు.. ఉన్న ది లేనట్టు...... కనికట్టు చేసే వ్యక్తుల గురించి ప్రభువుల ప్రామాణికాల గురించి పేదరికాన్ని కొలిచే కొలమాన రాళ్ళ గురించి ముందు చూపు లేనినేతల గురించి అంతర్జాలాల మాయాజాలం గురించి బడ్జెట్ భూతం భూతద్దంలో బోల్డ్ లెటర్ లో సంక్షేమ పథకాల గురించి రోదసీలోకి ఎగిరిపోయిన నిత్యావసరాల గురించి ప్రచారానికి కోట్లు ఖర్చుపెట్టి కిలోరూపాయికి బియ్యం ఇచ్చి ఆకలి తీర్చాములే అనుకునే రాజకీయ నాయకుల అవినీతి గురించి, మద్యం సిండికేట్లకూ తెల్ల రేషన్ కార్డులు అంటున్న ఫ్లాష్ న్యూస్ స్క్రోలింగ్ గురించి ఊకదంపుడు ఉపన్యాసాలు ఇచ్చి ఆరోగ్యశ్రీ ఇచ్చినా తగ్గని రోగాల గురించి చెప్తూనే ఏ ప్రభుత్వం వచ్చినా ఎప్పుడూ ఉండే తంతు ... తెల్లబోవడం మాత్రం పేదవారి మనవంతు అనడంలో తనను కూడా పేదవానిగా కవి పేర్కొంటూ ప్రభుత్వాలు మారినా పేదవాది బ్రతుకు చిత్రం మారదనే నగ్న సత్యాన్ని తెలియపరచారు. ఉపాధి లేక గర్భాశయాన్ని కూడా అద్దెకు ఇచ్చే తల్లుల గురించి చెప్తూ విలువలు ఉరేసుకొని చస్తున్నాయని పేర్కొనడంలో ప్రస్తుత సమాజ స్థితి ఎలా ఉందో మనం అర్థం చేసుకోవచ్చు. బతుకు

బండిని నడిపే ధనం అనే ఇంధనం కోసం వలసలతో పట్టణాలవైపు పరుగులు తీస్తున్న జనం స్థితుల గురించి, కుక్కలు నోట కరచుకుపోతున్న ఆడశిశువుల మరణాల గురించి, అత్యంత ఉన్నతమైన, అతిధులను దేవుళ్ళగా పూజించుకునే భారతదేశంలో అడుక్కుతింటున్న అనాథ బాలల గురించి, ప్రపంచీకరణ ప్రభావాల గురించి, మానవతకు చీడపట్టించిన సంస్కరణల పర్వంలోపేద, ధనికుల మధ్య పెరుగుతున్న అంతరాల గురించి పేదవాడిని బలిపశువు చేస్తున్న ఈ ఆర్థిక జాతర గురించి సవివరంగా తెలియపరుస్తూ ఈ ఉగాది రోజయినా దేశం ప్రగతి పథంలో నడుస్తోందని భ్రమిద్దాం అని కవి అనడంలో ఆంతర్యం మనం అర్థం చేసుకోవచ్చు.

# స్త్రీ ఉనికిని స్త్రీకి పరిచయం చేసిన సాహిత్య ప్రక్రియ " స్త్రీవాదం "

పంతంగి నాగలక్ష్మి (MA-Telugu)
హైదారాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం
9951237729

**ఉపోద్ఘాతం**

తెలుగు కథానికను సంపద్వంతం చేసినవాళ్ళలో స్త్రీల భాగస్వామ్యం తక్కువేమి కాదు. స్త్రీలు కథలు రాయకుండా ఉంటే మానవజీవితంలోని అనేక అనేక పార్శ్వాలు, చీకటికోణాలు సమాజానికి తెలిసేవికావు. మానవసంబంధాలు వ్యక్తి సున్నితస్పందనలు, మనస్తత్వాలు స్త్రీల కథల్లో విశిష్టంగా కన్పిస్తాయి.

స్త్రీపురుష సంబంధాల్లో కొత్తకోణాన్ని ఆవిష్కరించాయి. స్త్రీవాద కథలు, వైవాహిక జీవితంలో నిస్సారంగా కొట్టుకుంటున్న స్త్రీపురుష సంబంధాల్ని చాలామంది స్త్రీవాదులు చిత్రించారు. స్త్రీపురుషుల కలయికకు ప్రేమనే ప్రాతిపదిక కావాలి. మనసారా ఒకరినొకరు ఇష్టపడటమే ప్రధానం. ప్రేమానురాగాలకు ఏమాత్రం తావులేని పెళ్ళిలో ఉండి, ఇష్టం లేకున్నా మగవాడికి శరీరం అప్పగించడం కన్నా, పెళ్లి చేసుకోకుండా తమకు నచ్చిన వ్యక్తితో నచ్చినంతకాలం జీవిస్తే తప్పేమిటన్న ఆలోచనల్ని స్త్రీవాద కథలు కలిగించాయి. సమాజం చెపుతున్న శీలం, నీతి, మగవాళ్ళకు కూడా వర్తించాలి. వాళ్ళమీద లేని ఆంక్షలు నిర్బంధాలు కేవలం స్త్రీల మీదనే ఎందుకని తమ కథల్లో స్త్రీవాదులు ప్రశ్నించారు. తమను తాము తెలుసుకోవడానికి, విముక్తి కలిగించుకోవడానికి, తమ జీవితాన్ని, ఆత్మవిశ్వాసంతో నిర్మించుకోవడానికి, ఆడవాళ్ళకు స్ఫూర్తిని ఇచ్చాయి.

సుఖాంతం - ఇల్లిందల సరస్వతీదేవి

ఆమెకు చాలా సేపటినుంచి నిద్ర రావడం లేదు.అప్పటికే ఒక నిద్ర మాత్ర వేసు కుంది.అయినా రావడం లేదు.ఇంట్లో తను ఒక్కర్తె ఉంది.పిల్లలకు పెళ్లిళ్లయిపోయి ఎక్కడెక్కడో స్థిరపడిపోయారు.భర్త ఊరు వెళ్లారు.చాలా రోజుల తరువాత ఆమెకు నిద్ర మీద వ్యామోహం కలిగింది.హాయిగా నిద్ర పోవాలి.మనసారా నిద్ర పోవాలి.శవం నిద్ర పోయినట్టుగా నిద్ర పోవాలి.ఎన్నాళ్ల కొరికో అది.

చిన్నప్పుడు నిద్ర పోవాలంటే అమ్మ లేపేది.వయానొచ్చాక నిద్రపోదామంటే ఆడపిల్ల పొద్దెక్కేవరకు పడుకోకూడదని నియమం. పెళ్లాయ్యాక నిద్రపోవాలంటే అనుమతులు , ఆంక్షలు.ఆ తరువాత పిల్లలు, వాళ్ళను పెద్ద చేయడం, పెళ్లిళ్లు చేయడం, పురుళ్ళు పోయడం, వాళ్ళ ఆలనా పాలనా చూడటం ...ఇలా ఎంతకాలం?

ఆమెకు విరక్తి వస్తుంది.కంటి నిద్ర పోవాలి దేవుడా అనుకుంది.మనసుకు దేహానికి విశ్రాంతి దక్కాలి.నాకంటూ నాకోసం నిద్రపోవాలి అనుకొని లేచి ఇంకో నిద్ర మాత్ర కోసం బాటిల్ వంపు కొంటుంది.

ఒక్కసారిగా బాటిల్ లోని నిద్ర మాత్రలన్నీ ఆమె అరచేతిలో పడతాయి.ఆ మాత్రలు,అవి వేసుకుంటే వచ్చే నిద్ర ఆమెను ఊరిస్తుంటాయి.వాటన్నిటిలో నిద్ర ఉంది.ఆ నిద్ర ఆమెకు కావాలి.అందుకే భర్తకు చిన్న చీటీ రాసిపెడుతుంది. "ఏమండీ... ఆత్మహత్య చేసుకున్నానని భయపడకండి.నిజంగా నిద్ర కోసం నిద్ర పోతున్నానంతే.అని ఆ చీటిలో ఉంటుంది. కథ ముగుస్తుంది.

రచయిత్రి అబ్బూరి ఛాయాదేవి రాసిన ఒక వాస్తవ అనుభవం ఇది.దీని పేరు సుఖాంతం.కానీ దు:ఖాంతం గా కనిపిస్తుంది.అవును ఎక్కడైనా ,ఎప్పుడైనా స్త్రీ జీవితం దు:ఖాంతమే కదా!భారతీయ కుటుంబాల్లో స్త్రీ ఒక జీతం భత్యం లేని పనిమనిషి.ఆమె చాకిరీ చేసేందుకే పుడుతుంది.చనిపోయేంతవరకూ చాకిరీ చేసి చేసీ చనిపోతుంది.చాకిరీ ఆమెకు మాయ.చాకిరీ ఆమెకు అన్నం.చాకిరే ఆమెకు నిద్ర.ఈ చాకిరీ నుంచి బయటపడి ,మాయ చెదిరిపోయి ,ఎవరూ తోడు ఉండని పెద్ద వయసుకు చేరినప్పుడు ,ఏకాంతం లాంటి ఒంటరితనం దొరికినప్పుడు మనసు ఒక దెయ్యాల దిబ్బలా మారి గతంలోకో, భవిష్యత్తులోకో ప్రయాణిస్తూ నిద్రను శాశ్వతంగా ఎగరగొడుతుంది.

ఏమడుగుతోంది ఈ కథలోని స్త్రీ పాత్ర ? అని ఒక్కసారి మనిషిగా ఆలోచించుకోగలిగితే మణులా, మాణిక్యాలా? అంటే అవేవీ కాదు కాసింత నిద్ర.ఆ కాసింత సుఖానికి కూడా స్త్రీని దూరంగా పెట్టిన వ్యవస్థ మనది.స్త్రీని పట్టించుకోవడం అంటే కేవలం కుటుంబంలోని పురుషుడు మాత్రమే పట్టించుకోవడం కాదు.సాటి స్త్రీలు పట్టించుకోవాలి.అప్పుడే ఆమె నిశ్చింతగా నిద్రపోగలుగుతుంది.పొదుగులో పాలు నింపుకున్న పాడి ఆవు తిరిగి యజమాని సేవకు సిద్ధమైనట్లు ఆమె కూడా కుటుంబం కోసం సిద్ధం కాగలుగుతుంది.ఈ దేశంలో పశువుకైనా విశ్రాంతి దొరుకుతుంది.కానీ స్త్రీ కి దొరుకుతుందా ?అని కాలర్ పట్టుకొని అడిగే సత్తా కలిగిన కథగా మనకు కనిపిస్తుంది.

కథను కరుకైన కత్తిలా ఉపయోగించి మగవారి బండ హృదయాలను కోసి పడేసిన రచయిత్రి పి.సత్యవతి అనడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు.ఈ కథ చదివితే అలా అనని మనిషి ఉన్నా,అమ్మ విషయంలో ,ఆడదాని విషయంలో మారని మనిషి ఉన్నా వాడిని మనిషి అనాల్సిన అవసరం ఎంత మాత్రమూ లేదు.

సూపర్ మామ్ సిండ్రోమ్ - పి.సత్యవతి

ఒన్ ఫైన్ మార్నింగ్ యాభై ఏళ్ల అనురాధ చనిపోయింది.కొడుకు బాగా చదివించి అమెరికాలో సెటిల్ చేసి నా కొడుకు అమెరికాలో ఉన్నాడని నలుగురికి చెప్పుకొని మురిసిపోయిన అనురాధ,కూతుర్ని పట్టుబట్టి అమెరికా అబ్బాయికిచ్చి పెళ్లి చేసిన అనురాధ ,ఇల్లు కట్టించి కుటుంబాన్ని సెటిల్ చేసిన అనురాధ ఈ రోజు హఠాత్తుగా చనిపోయింది.ఉదయానే దుప్పటి తీసి పరీక్షించిన భర్త కొయ్య బారిపోయాడు.అనురాధ శవం తెల్లబారిపోయింది.చీర జాకెట్ కట్టుకున్న సుద్దముక్కలా ఉంది.అందరూ వచ్చి చూస్తున్నారు.అందులో

ఒకపిల్ల ఆ సుద్దముక్కలా ఉన్న శవాన్ని కాస్త గిల్లి దానిని తీసుకొని ల్యాబ్ కెళ్ళి పరీక్షించింది.ఇంతకీ ఆ ముక్క ఏమిటో తెలుసా ఆస్ప్రిన్ ట్యాబ్లెట్.ఆ అమ్మాయి వెంటనే భూతద్దం తీసుకొచ్చి అనురాధ డెడ్ బాడీని పరీక్షించి చూస్తే అనురాధ ఒళ్ళంతా ట్యాబ్లెట్లే. నల్ల ట్యాబ్లెట్లు,తెల్ల ట్యాబ్లెట్లు ఇలా అన్నీ ట్యాబ్లెట్లే.అవును అనురాధ ఉద్యోగం చేస్తూ భర్తను ,పిల్లలను చూసుకునేది.ఆ క్రమంలో తనుకున్న పనులు జరిగిపోవడానికి తన అనారోగ్యం అడ్డుకాకూడదని తలనొప్పికి నవాలజీన్,జ్వరానికి క్రోసిన్,నడుమునొప్పికి బ్రూఫిన్, ఫంక్షన్లు, శుభకార్యాలని ఆ మూడు రోజులను కూడా మందులతో వెనక్కి నెట్టేది.కొన్ని సందర్భాలలో నిద్ర రాకుండా మాత్రలు,కొన్ని సందర్భాలలో నిద్ర రావడానికి మాత్రలు ఇలా అయిన దానికి కానీ దానికి అన్నిటికీ మాత్రలు వాడటంతో తన శరీరం ఇలా మారింది.అన్నీ మాత్రలు...మాత్రలు...మాత్రలు...వాడీ వాడీ చివరకు తన దేహమే ఒక మాత్ర అయిపోయింది.

ఈ కథ చదివిన తరువాత చలించిన హృదయాలలో జ్వలించే ఆలోచన ఏమిటో తెలుసా. భయంతో, ఆందోళనతో ,కంగారుతో అందరం పరిగెత్తాలి.

ఎక్కడికో తెలుసా?... ఇంటికి...ఎందుకో తెలుసా?...తల్లిని పలకరించడానికి.తల్లిని గుండెలకు హత్తుకోవడానికి, హత్తుకొని అమ్మా నువ్వు ఎలా ఉన్నావ్ ,నీ ఆరోగ్యం ఎలా ఉంది అని అడగడానికి. మాకు నువ్వు కావాలి... ,నీ చిరునవ్వు కావాలి ...నీ ప్రాణాలు కావాలి ...మా శిరస్సుల మీద నీ చల్లని చెయ్యి అండ కావాలి.దయచేసి నూవ్వు విశ్రాంతి తీసుకో అమ్మా అని అమ్మను ఆప్యాయంగా హత్తుకొని చెప్పటం కోసం...ఇది ప్రపంచంలోని ప్రతి అమ్మ కథ .ప్రతి ఆడదాని కథ .నవ్వుతూ కనిపించే ఆడది ,అమ్మ లోలోపల ఎలా ఉందో,ఎంతగా క్షోభిస్తుందో,ఏ అనారోగ్యంతో బాధ పడుతుందో అని మనమందరం మన తల్లుల గురించి,మన ఆడవాళ్ళ గురించి ఆలోచించేలా రాసిన అద్భుతమైన కథ ఇది.అందరి కథ ఇది.

పై రెండు కథల్లోనూ స్త్రీ కి విశ్రాంతి కరువవ్వడం మనకు కనిపిస్తుంది.తను కోరుకునే ప్రశాంతమైన విశ్రాంతి తనకు కేవలం మరణంలోనే దొరకడం చాలా దురదృష్టకరమైన విషయం.కాలగమనంలో వేల ఏళ్లు గడిచిపోయి ఉంటాయి.వందల తరాలు దాటిపోయి ఉంటాయి.కానీ స్త్రీ పరిస్థితి మాత్రం నేటికీ అలానే ఉంది.శాస్త్ర,సాంకేతిక,ఆర్థిక,రాజకీయ రంగాల్లో పట్టణాల నుంచి ప్రపంచం వరకు తిరుగులేని అభివృద్ధిని సాధిస్తున్నా స్త్రీ విషయానికి వచ్చే సరికి ఇంకా అనాగరికులంగానే మిగిలిపోయాం. స్త్రీ కోరుకొనే స్వేచ్ఛని స్త్రీకి ఇవ్వలేకపోతున్న మనం తను కోరుకునే విశ్రాంతి ని కూడా తనకు అందించలేకపోతున్నాం.

కెరటాలన్నీ కలిస్తే సముద్రం.కానీ పైకి చూడ్డానికి ఎలా ఉంటుందంటే సముద్రమే కెరటాలను ఇస్తున్నట్టుగా ఉంటుంది.కానీ కెరటాలు సముద్రాన్ని కాదన్ననాడు దాని బండారం బయట పడుతుంది. అలానే ఆడవాళ్ళ మనశ్శాంతిని,విశ్రాంతిని దోచుకొని మగాళ్లు ఎంత ఎత్తుకు ఎదిగినా తన విలువను

గుర్తించేది తను దూరమైన తరువాతే.అప్పుడే వాళ్ళు పడిన కష్టం విలువ,వాళ్ళ ఔన్నత్యం విలువ మన హృదయాంతరాళ్లలో నిలిచిపోతుంది.అనే నగ్న సత్యాన్ని పై కథల ద్వారా మనం తెలుసుకోవచ్చు.

ముగింపు

అనేకానేక పార్శ్వాల్ని చిత్రించిన స్త్రీవాద కథలు గత పదేళ్ళ కాలంలో వందలాదిగా వచ్చాయి. స్త్రీల జీవితాల్లోని సూక్ష్మాతిసూక్ష్మమైన అంశాల్ని సైతం కథలు రికార్డు చేశాయి. స్త్రీవాద కథలకు కథాసాహిత్యంలో ప్రత్యేక ప్రాధాన్యం ఉంది. వీని ప్రభావం పాఠకుల మీద, సాటి రచయిత మీద, సమాజం మీద బలంగా ఉంది.కులమతాలు ఏవైనా స్త్రీలందరూ ఒకే విధమైన సమస్యల్ని ఎదుర్కొంటున్నారని తెలిపే కథలు వచ్చాయి. స్త్రీలు తమ మధ్య గోడల్ని చెరిపేసి, ఐక్యత సాధించడమే దానికి పరిష్కారమని ఈ కథలు తెలియచెప్పాయి.

స్త్రీవాద దృక్పథంలో రచనలు చేసినవారిలో పి.సత్యవతి, కరుణ, ఓల్గా, కుప్పిలి పద్మ, కొండేపూడి నిర్మల, వాడ్రేవు వీరలక్ష్మి, పి.సుజాత, పాటిబండ్ల రజని, చంద్రలత, సి.సుజాత, వి.ప్రతిమ, కె.వరలక్ష్మి, భార్గవీరావు, జయప్రభ, గీతాంజలి, పద్మలత, శిలాలోలిత, చల్లపలి స్వరూపరాణి, అల్లం రాజయ్య, తుమ్మేటి రఘోత్తమరెడ్డి, కాలవ మల్లయ్య, బి.ఎస్.రాములు, సన్నపురెడ్డి వెంకటరెడ్డి, దాదా హయాత్, బమ్మిడి జగదీశ్వరరావు వంటి రచయితలు ఉన్నారు.

# తెలుగు కథాసాహిత్యం – మాతమ్మ వ్యవస్థ

డా. యస్. స్రవంతి

భారతీయ సంస్కృతీ సంప్రదాయాల్లో అట్టడుగు వ్యవస్థలో ఉన్న దళిత కుటుంబాలలో వివాహం కాని స్త్రీలను దేవుడికి ఇచ్చి వివాహం చేసి, ఆ తరువాత ఆ గ్రామ పెద్ద మొదట ఆమెను లైంగికంగా ఉపయోగించుకుంటాడు. అటుతరువాత ఊరందరి పురుషులకు లైంగిక వస్తువుగా మారుతుంది. ఈ సంప్రదాయాన్ని మాతమ్మగా పిలుస్తారు. ఈ సంప్రదాయాన్ని గ్రామానికి అరిష్టం వచ్చినప్పుడు, ఆ అరిష్టం నుండి గ్రామాన్ని కాపాడడానికి మొక్కుబడిగా వివాహంకాని ఆడపిల్లలను దత్తత ఇవ్వటం అనే సంప్రదాయం నుండి ఈ వ్యవస్థ ప్రారంభమయ్యింది. సాధారణంగా ఒకే కుటుంబంలోని ఆడపిల్లలనే జోగినీలుగా మారుస్తారు. అమ్మాయిని జోగినిగా మార్చే కార్యాన్ని 'జోగుపట్టం' అంటారు. ఆ స్త్రీని యల్లమ్మ, పోచమ్మ దేవాలయానికి తీసుకెళ్తారు. బ్రాహ్మణ పూజారి పోతురాజు పూజలు జరిపించి జంతుబలి ఇస్తాడు. ఈ తంతు ముగిసిన తరువాత దీర్ఘసుమంగళిగా మారుతుంది. దీని తరువాతే ఆమె ఊరందరికీ లైంగిక వస్తువుగా మారుతుంది. వాత్సాయనుని "కామసూత్రా" లలో వీరు వివిధ కళలలో నైపుణ్యం గలవారని 'గిరిక', 'విలాసవతి' అనే పేర్లతో ఈ సంప్రదాయాన్ని కొనసాగించేవారని పేర్కొన్నారు. ఈ దేవదాసీ వ్యవస్థ భారతదేశమంతా ఉండేదని 'హుయాత్సంగ్' పేర్కొన్నారు.

ఈ మాతమ్మను భారతదేశంలో వివిధ రాష్ట్రాలలో ఎలా పిలుస్తారో ఇక్కడ చూద్దాం. కేరళలో 'మహడి', అస్సాంలో 'నాట్యని', మహారాష్ట్రాలో 'మురళి', తమిళనాడులో 'దేవరణ్ డియర్' కర్ణాటక, రాయలసీమలో 'బసివిని' తెలంగాణాలో 'జోగిని', అని పిలుస్తారు. చిత్తూరు, నెల్లూరు జిల్లాల్లో మాతమ్మ అని పిలుస్తారు. ఈ దేవదాసీల ప్రస్థావన మొట్టమొదట కాళిదాసు రచించిన 'మేఘదూతం' నాటకంలో కనిపిస్తుంది. అలాగే అర్థశాస్త్రం, మత్స్యపురాణం,

విష్ణుపురాణాలలో కూడా దేవదాసీల ప్రస్తావన ఉంది. ఆగమశాస్త్రంలో వీరు నృత్యం, గానంతోటి దేవున్ని ప్రార్థించేవారని తెలుస్తుంది. ఆ తరువాత రాజుల ఆస్థానాలలో వీరికి ప్రత్యేకమైన గౌరవమర్యాదలు ఉండేవి. చదువు, కళల్లో ప్రావీణ్యం సంపాయించి దేవుడి కార్యక్రమాలు చేస్తుండేవారు. ఆతరువాత కాలక్రమంగా వీరిని వేలం వేసి కొనేవారు. ఆ వేలంలో దక్కించుకున్న రాజులకు వారిపై ఇచ్ఛ తీరేవరకు ఉపయోగించుకొని దేవాలయానికి అప్పగించేవారు. అప్పటి నుండి ఆ స్త్రీ ఊరందరి సొత్తుగా మారిపోతుంది. ఆ రతువాత కాలక్రమేనా బిక్షమెత్తుకోని జీవిస్తుండేవారు. ఇలా ఈరోజుల్లో అగ్రకులస్తుల చేతిలోనుండి ఊరందరి లైంగిక వస్తువుగా మారుతూ కోరిక తీరుస్తూ వారిచ్చే రోగాలకు వైద్యం అందక ,తినడానికి తిండిలేక సమాజంలో పని దొరక్క, వారి పిల్లలకు తండ్రి లేక నానాఅవస్థలు పడుతూ దేవతకు అంకితమనే పేరుతో సాంఘిక దురాచారాలను గురించి, మాతమ్మ వ్యవస్థ గురించి, వారి జీవితాల గురించి, మన తెలుగు రచయితలు చిత్రించిన కథల ఆధారంగా పరిశోధించడం ఈ వ్యాస ప్రధాన లక్ష్యం.

గోగుశ్యామల రచించిన 'రడం' కథలో జోగినీవ్యవస్థను నిరసించి, వ్యతిరేకించినందుకు ఆధిపత్యకుల చేతుల్లో బాధితపక్షం ఏవిధంగా హింసకు గురైంది అన్న విషయాన్ని, ఉన్న ఊరిని, ఆస్తిని కూడా పోగొట్టుకోని అనాధల్లాగా ఊరి నుండి బలవంతంగా వచ్చేయాల్సి వచ్చిన కుటుంబం కథే ఈ రడం.

ఈ కథలో అంటరానితనం, జోగినీవ్యవస్థ, ఆధిపత్యభావజాలం దోపిడీలతోపాటూ హింసకు గురి అవుతాడు బాలయ్య, తన ఒక్కగానొక్క కూతురు సాయమ్మ. ఈమెను బాగా చదివించి ఉద్యోగస్తురాలిని చేయాలనుకుంటాడు. కానీ ఊర్లోని అగ్రకులస్తులంతా కలిసి ఆ ఊరి జోగినీకి వయస్సైపోయిందని ఆమె చనిపోయేంతలోపు పాటలు, పద్యాలు నేర్పించాలని ఆ అమ్మాయిని జోగినీని చేయాలనుకుంటారు. అందుకు అంగీకరించని బాలయ్య తనను హాస్టల్లో వదిలేసి టీచర్ ఇచ్చిన ధైర్యంతోటి ఊరొచ్చేస్తాడు. ఈ విషయం తెలుసుకున్న

అగ్రకులస్తులంతా పోలీసులతో కుమ్మక్కై బాలయ్యను కొట్టి హింసిస్తారు. చావుబతుకుల మధ్య కొట్టుమిట్టాడుతున్నా అగ్రకుల పురుషులకు బయపడి ఎవ్వరూ నీళ్ళు కూడా ఇవ్వరు. చివరికి ఒక మాలస్త్రీ తన చనుబాలు ఇచ్చి అతనిని బతికిస్తుంది. ఆ పరిస్థితుల్లో కూడా అతన్ని  నీ కూతుర్ని జోగినీకి చేస్తే ఊర్లో ఉండు లేదంటే భూమినంతా వదిలేసి వెళ్ళిపొమ్మంటారు. బలవంతంగా ఆస్తి పేపర్లపైన వేలి ముద్ర వేయించుకోని ఆ వూరి నుండి వెలేస్తారు.

బాధితకులం తన పిల్లలకి చదువు చెప్పించి, మంచి ఉద్యోగం చేయించాలని నానా వెట్టి చాకిరి చేసి ఆడపిల్లని బాగా చదివించాలని నిర్ణయించుకున్న కుటుంబాన్ని చూసి ఓర్వలేక ఒక రాజకీయ పథకం ప్రకారం ఆ పిల్లని జోగినీని చేయాలి, రంగమెక్కించాలని ఆధిపత్య కులం ఆశించింది. దానికి ఆ కుటుంబాన్ని మోటివేట్ చేసిన విధానాన్ని గమనిస్తే తెలుస్తుంది." ఉన్న ఊర్లో ఏర్పులకేస్తే మనందరి కళ్ళ ముందుంటది. సదివితే ఏమున్నదిరా బాలిగా ఎంత చదివిన పని తప్పదు కదా. జెర్ర పెద్దగయితే ఎవ్వనెంబడన్న పడిపోదని ఏం నమ్మకం యా చాయకప్పులు కడిగేటోనెంబడో పోదని ఏం గ్యారంటి?" ఇందులోని కుట్ర మనకు స్పష్టంగా అర్థమవుతుంది. నయాన భయాన మనుష్యుల్ని మానసికంగా వశపరుచుకోవాలంటే మతానికి మించిన ఆయుధం మరొకటి ఉండదు. దీని మూలంగానే ఆ కుటుంబాన్ని దేవుని పేరు చెప్పి, నమ్మకాల ప్రాభల్యం తెలిపి, భయాన్ని రేకెత్తించి మరీ ఒక దురాచారాన్ని వాళ్ళే ఇష్టపూర్వకంగా అమలు చేయాలను కోవడం దానికి పోలీసులు మద్దతు ఇవ్వడం ఇందులో గమనిస్తాం.

ఈ కథలో దెబ్బలు తగిలి రక్తంతో తడిచిపోయి మరణించే వ్యక్తి మంచి నీళ్ళు ఇస్తే తమ పురుషుల వల్లా కలిగే భయాన్ని అగ్రవర్ణ స్త్రీలు తెలియజేశారు. చివరికి ఎవ్వరు కూడా ఒక్క గ్లాసు నీళ్ళు ఇవ్వరు. మరో స్త్రీ దళితుల కోసం ఉన్న సత్తుగిన్నెలో నీళ్ళు తీసుకుపోయేసరికి

నీళ్ళన్నీ ఖాళీ అయిపోతుంది. చివరికి పోయే ప్రాణాన్ని నిలబెట్టడానికి కూడా అంటరానితనం అడ్డువచ్చింది. ఒక దళితస్త్రీ తన చనుబాలతో అతని ప్రాణం కాపాడుతుంది.

అగ్రకులాధిపత్యం తన ఆధిపత్యాన్ని బాధిత పక్షంలో నిలబెట్టుకోని కొనసాగించాలనే తాపత్రయం ఈ కథలో స్పష్టంగా కనిపిస్తుంది. అందుకే సాయమ్మను ఊరి క్షేమం కోసం జోగినీని చేయాలని, తమకోసం కాదని ఏలగైనా తమ పంతం నిలబెట్టుకోవడానికి చేసిన ప్రయత్నం చూస్తే " మీబిడ్డను జోగినీకి వేయమన్నది నాకోసం కాదు, ఊరు కోసం ఊరు బాగుకోసం అంటే మీ మొద్దు మెదల్లకు అర్థం కావటం లేదు. ఇంక మీతో మాట్లాడే ఓపిక నాకు లేదు. మీపోరీని వేస్తే జోగుకు వేయండి లేదా మీరు ఊరొదిలేసి పోండి. ఇదే ఆఖరు మాట. ఆపని చేయకుండా ఊర్లర్ల ఉండనీకే వీల్లేదు. మొండికేసి ఉంటమంటిరా నిరుడు మీ మాదిగ జంగానికి పట్టిన గతే మీకూ వడుతది చూస్కోండి." అని నయాన చెప్పినా వినని వాళ్లని భయాన బెధిరించి బలవంతంగా తమ ఆస్తినంతా లాక్కోని వారిని అనాధల్లాగా బస్సు చార్జీలకు డబ్బులిచ్చి వెళ్లిపొమ్మంటారు. అయినా ఏమాత్రం జంకకుండా తమ బిడ్డను చదివించుకోవాలనే దృఢ విశ్వాసం వాళ్ళని నడిపిస్తుంది. చదువుకోసం వాళ్ళు పడ్డ బాధ, శ్రమ, పోరాటం ఆదర్శనీయం.

ఈ కథలో ప్రభలమైన అంటరానితనం కనిపిస్తుంది. బాలయ్య కూతుర్ని జోగినీని చేయడం మాదిగ కుల ధర్మం అని భోదించి చెయ్యనన్నదానికి కొట్టి రక్తశ్రావం జరిగితే "ఈజాగా అంతా వీడి రక్తంతో అపవిత్రమైంది. వాడికేమన్న అయ్యి ప్రాణం పోగల్ల ఈ సంగతి ఊర్ల పొక్కాల్ల ఇక్కడి నుండి తీపించెయ్యి" అని కనీస మానవధర్మం తెలీయకుండా ప్రవర్తిస్తారు. అగ్రవర్ణ స్త్రీలు ఇవ్వాలనుకున్న తమ పురుషుల ఆధిపత్యం గుర్తుకొచ్చి ఆగిపోతారు. ఒక మాలస్త్రీ తన చనుబాలు ఇచ్చి గాయలకు పూసి తేరుకున్నక ఈవిషయం వాళ్లకు తెలిస్తే నాకుంటదని బయపడి పారిపోతుంది. ఇలాంటి అంటరానితనాలను, సాంఘిక దురాచారాలను నిర్మూలించాల్సిన ప్రభుత్వం కూడా ఆధిపత్యులకు మద్దతిస్తూ సహకరించడం కూడా

ప్రత్యక్షంగా కనిపిస్తుంది. ఎస్.ఐ, ఐస్.ఎస్ అంతా కలిసి పటేలువద్దనే ఉంటూ బాధితులను రక్తం కారేలా కొట్టినా కూడా ఎటువంటి యాక్షన్ తీసుకోరు. ప్రభుత్వాలు, చట్టాలు కూడా అగ్రకుల ద్వారపాలకులుగానే పనిచేస్తున్నాయి. కనుక మన దేశంలో ఎన్ని చట్టాలు వచ్చినా బాధితులకు న్యాయం జరగట్లేదు. నేటికీ ఈవ్యవస్థ చిత్తూరు జిల్లాలో అమలులో ఉందనడానికి సాక్షాలుగా నిలుస్తాయి.

ఈ కథలో జోగినీలు చేయాల్సిన పనులను కూడా తెలియజేయడం జరిగింది. "రేపటి ఊరూడమ్మ పండుగకు రంగమెవ్వరు ఎక్కుతారు? పోలెపల్లిలో 'సిడె' ఎవరు కడ్తరు?మనూర్ల జోగుకు దీసిన లస్మి ముసల్దైంది.దానికి కొలువులు చెప్ప నడుగులు డొల్లైనయి.ఊర్ల శానామందికి అమ్మవారు పోసినప్పుడు ఊరూడమ్మకు జీవులను,దున్నపోతులను కోసి పెద్ద పచ్చితునకను జోగినీ నోటిల ఏలాడదీసి ఊరు చుట్టూ దిప్పాలంటే ఏడ సాధ్యపడ్డది." ఈ వాక్యాలలో జోగినీ పడ్డ కష్టం, పడాల్సిన పాట్లు గమనించవచ్చు. ఊరు క్షేమం కోసం ఊర్లో జనాలకు, పశువులకు ఎలాంటి రోగాలు రాకుండా,చావులు అరికట్టడం కోసం జోగినీలుగా మారాలని చదువులేని, సామాజిక జ్ఞానంలేని, అమాయకపు దళిత స్త్రీలను దేవుడి పేరు చెప్పి నమ్మకం పేరుతో బయపెట్టి బలిపశువులుగా మారుతూ, సాంఘిక దురాచారాలకు బలికావలసి వస్తున్న వైనం మన భారతదేశ సంస్కృతిలో చోటుచేసుకున్నదని ఈ కథలో తెలిపారు రచయిత్రి.

గోగుశ్యామల రాసిన "బైండ్లామె భూమి అడగదామరి" కథలో అగ్రకులాధిపత్యం, అంటరానితనం, కులాంతరవివాహం కారణంగా ఒక బైండ్ల స్త్రీ ఎదుర్కుంటున్న సమస్యల చిత్రణే ఈ కథ. ఏర్పుల తనం చేసే సాయమ్మ ఇందులో ప్రధాన పాత్ర. బైండ్ల కులానికి చెందిన స్త్రీ.. తెనుగోళ్ళ సెంద్రప్పను ప్రేమించి పెళ్ళి చేసుకుంది. వైవాహిక జీవితం కొద్దికాలం సజావుగానే సాగింది. కొద్దికాలానికి జబ్బు చేసి సెంద్రప్ప మరణించాడు. ఆ శవాన్ని భార్యాపిల్లలకు చూపించకుండా వారి ఆచారసంప్రదాయాలతో కర్మ జరిపించాలని తీసుకెళ్తారు

అగ్రకులస్తులు. చివరిసారిగా భర్తను, చూడటానికి, ముట్టుకోవడానికి అవకాశంకూడా కల్పించలేదు పెండ్లి చేసుకోని ముగ్గురు పిల్లల్ని కన్న తరువాత కనపడిందా అంటరానితనం అంటూ మాదిగ పెద్దలు వాదోపవాదాలు, గొడవలు జరుగుతాయి. శవం దగ్గర ఇలాంటి వాదోపవాదాలేమీ వద్దని సాయమ్మ తన వాడకు తీసుకొచ్చి బట్టల్ని శవం ఆకారంగా చుట్టి మాదిగ సంప్రదాయంతో భూస్థాపితం చేస్తారు.

శవాన్ని ముట్టుకోకపోతే అంటరానివాళ్ళు అన్న మాటలే గుర్తు పెట్టుకోండి. అంటరాని పనులన్నీ మేము చేయమని దళితులు నిరసనలు వ్యక్తం చేస్తారు. భర్త మరణించిన తరువాత సాయమ్మను ఏర్పుల కేస్తారు. జోగినీని చేస్తారు. అప్పటి నుండి గ్రామదేవతల జాతరలో ఆమె రంగం ఎక్కాల్సిందే. ఆమెపైనే ఆ ఊరి పండుగంతా ఆధారపడుతుంది. ఈ ఏర్పుల తనం అన్నది వంశపారపర్యంగా కొనసాగుతుంది. సాయమ్మ అత్తకు ఊరి పెద్దలు భూమిని పంచిస్తారు. సాయమ్మ కాలానికి ఆభూమి అగ్రకుల వారసుల చేతుల్లోనే ఉంటుంది. ఆ భూమివారసత్వంగా సాయమ్మకే దక్కాలి. కాబట్టి ఆ భూమిని తన పేర రాయిస్తేనే ఏర్పుల తనం చేస్తానంటుంది. అందుకు అగ్రకులస్తులంతా కలిసి ఆభూమిని మీ అత్త పేర ఇవ్వలేదని వాదిస్తారు. కావాలంటే కూలి తీసుకోమంటారు. ఆమాటలకు ఆగ్రహించిన సాయమ్మ కూలి నేనే ఇస్తాను మీ కూతుర్ని రంగమెక్కించు అని వాదిస్తుంది. భూమి ఇవ్వకపోతే ఊరి చుట్టూ మిమ్మల్ని పొలివడ్తా అప్పుడు ఊరికి పట్టిన పీడ వదులుతుంది, అనీ దేవతపూనినట్టు మాట్లాడటంతో అగ్రకులస్తులంతా భయభ్రాంతులవుతారు. స్పృహ తప్పిన సాయమ్మను తన తమ్ముడు తీసుకు వెళ్తాడు. ఒక బైండ్లది బల్ల గుద్ది మాట్లాడతుంటే గాజులు తొడుక్కోని కుర్చున్నారా అని దొర అగ్రహావేశానికి గురవుతాడు. బైండ్లది బల్లగుద్దిందంటాడేంది! ఎందుకు భూమి అడగటానికే కదా అని వాడ మ్యాతర్ల పెద్దలు సాయమ్మకు సపోర్ట్ చేస్తారు. ఇలా చేసి తనకు రావాల్సిన భూమిని తాను పొందగలుగుతుంది.

దళితులు కులాంతర వివాహం అనేది ప్రేమించి చేసుకున్నా, పెద్దలు కుదిర్చి చేసినా ఇటు స్త్రీలైనా, అటు పురుషులైనా ఏదో ఒక సమయంలో అంటరానితనాన్ని, కులవివక్షతను భరించాల్సి వస్తుంది. అలాగే ఈ కథలో కూడా సాయమ్మ తనకన్నా ఎక్కువ కులానికి చెందిన సెంద్రప్పను ప్రేమించి పెద్దల సమక్షంలోనే పెళ్ళి చేసుకుంది. భర్త బతికున్నంతకాలం జీవితం సాఫీగా సాగింది. భర్త మరణించిన తరువాత చివరి చూపు చూడటానికి, మనస్ఫూర్తిగా ఏడవాటానికి కూడా అంటరానితనం అడ్డువచ్చింది. ఒక పీడిత కులానికి చెందిన స్త్రీ ఏడిస్తే అంటూ అని ముట్టు అని నానా ఇబ్బందులకు గురి చేస్తారు. భార్యా, పిల్లల్ని చూడనివ్వకుండా మాకులంలో పెళ్లి చేసుకోలేదు కాబట్టి నువ్వు ఉంచుకున్నదానితో సమానం అని అగ్రకుల దురహంకారంతో, కులవివక్షతతో మాట్లాడతారు. "సాయమ్మ... నీవు ఇంట్లకొచ్చి పీనుగు మీద పడి ఏడ్వకమ్మ బయటపో మీరు మాదిగోళ్ళ బైండ్లోల్లు,మిమ్ముల ముట్టకూడది బైటపోయి ఏడ్వుపో" అని నిర్దాక్షణ్యంగా మాట్లాడుతారు.

అలాగే ఈ కథలో అగ్రకుల దిక్కరణ కనిపిస్తుంది. భార్యాపిల్లల్ని శవాన్ని ముట్టుకోవడానికి అంటరానితనం గుర్తుకొచ్చిందా అంటూ దళితులంతా అగ్రకులస్తులకు చేయాల్సిన పనులేవీ చెయ్యమని వారిని వెలేస్తున్నామని అని తెలియజేస్తారు. కుల వివక్షతను వ్యతిరేకిస్తారు. బట్టలను శవాకారంగా పేర్చి భూస్థాపితం చేయడంద్వారా వారి నిరసనను తెలియజేస్తారు.

ఆధిపత్యకుల స్వభావులు బాధితకులాల వాళ్ళని ఆర్థికంగా, రాజకీయంగా, సామాజికంగానే కాకుండా సాంస్కృతికంగా కూడా ఎలా దోచుకుంటున్నారో ఈ కథలో తెలియజేశారు. ఎలాగంటే " ఈ ఆడ గ్రామ దేవతలు అనే వారు మన హైందవ మతంలో లేరు. ఉన్నా లక్ష్మీ, పార్వతి, సరస్వతులే ఉన్నారు. ఈ ఊరూడమ్మ, మైసమ్మ, పోచమ్మ, ఈదమ్మ, ఎల్లమ్మ మన్కెక్కడ? ఈ మాలమాదిగలు పనిబాట కులాలోళ్లు ప్రాణంతో అమ్మవార్లని కొల్సుకుంటారు. వాళ్ళను అట్ల చేసుకోనియ్యాలే. వద్దంటే వ్యతిరేకమైతారు. తిరగవర్తరు.

వారినట్లా చేసుకోనిస్తూ మన చేతి కింద పెట్టుకోవాలె. అందుకే ఇప్పుడు అమ్మవారి పండుగల్లో ఎన్నో చేయాల్సి ఉంది. సరిగ్గా మొయింటెన్ చేయకపోతే అసలకు ఎసకొచ్చినట్లు అసలు మోసం బైయటికొస్తది." ఇలా దళితులను సాంస్కృతికంగా కూడా దోచుకని వారి ఆధిపత్యం కింద బతికేలా చేయడమే వారి ముఖ్యోద్దేశ్యం.దళితులు ఆడగ్రామదేవతల్ని పూజించడం అన్నది వారిలోని మాతృస్వామిక ప్రతీకలుగా చెప్పుకోవచ్చు.

వి,ఆర్. రాసాని రచించిన 'మాత' కథలో మాతంగిని చేయాలనే అగ్రకుల పురుషాధిపత్యానికి బలైపోయిన స్త్రీ పరిస్థితి కనిపిస్తుంది. కర్ణాటకాలో వడ్డెకులం దళిత కులానికి చెందింది. కనుక రచయిత వడ్డెకులానికి చెందిన చెంచయ్య కూతురు మాతంగి. ఈమె ఆ ఊరి అగ్రకులస్తుడైన రంగనాయుడి కూతురు త్రిపురసుందరి ప్రాణ స్నేహితులు. మాతంగి జయరాముని్ని ప్రేమించింది. ఇద్దరూ పెళ్లి చేసుకోవాలనుకుంటారు, పెద్దలు ఒప్పుకోరు. రంగనాయుడు మాతంగిని తన కూతురితో ఉన్నప్పుడు చూసి ముగ్ధుడైపోతాడు. తన కోరికను తీర్చమని అడగటంతో చెంప చెల్లుమనిపిస్తుంది. ఆకసితో ఆ అమ్మాయిని మాతమ్మను చేయాలని పథకం. పన్ని రంగసానితో దేవతపూనినట్టు నాటకమాడించి మాతమ్మను చేస్తారు. ఆరోజు రాత్రి మొదటగా ఆమె రంగనాయుడితో గడపాల్సి వస్తుంది. ఈ పథకం గురించి తెలుసుకున్న తన కూతురు మాతంగిని రాములుతో పంపించి దూరంగా పోయి సంతోషంగా బతకమని చెప్పి తన స్థానంలో త్రిపురసుందరి వెళ్తుంది. చీకట్లో తన కూతుర్ని చూసి నిర్చేష్టుడవుతాడు. ఇలా ఈ కథలో పురుషాధిపత్యాన్ని ఎదుర్కోని తన తండ్రికి బుద్ధిచెప్పే కూతుర్ని చూడొచ్చు. ఈ రచయిత రచించిన 'అక్షింతలు' కథలో కూడా ఈ వస్తువే కనిపిస్తుంది. ఇందులో కూడా ఊర్లో కలరా నోకి మనుష్యులు, జంతువులు చనిపోతున్నాయని చెప్పి బాల్యవివాహం అయిన భాగ్యమ్మ మాదమ్మల కూతురు. ఈ వివాహం చెల్లదని చెప్పి ఆమెను మాతమ్మను చేయాలని అగ్రకులస్తులంతా నిర్ణయించి ఆమెను మాతమ్మను చేసిన అగ్రకుల దురహంకారం కనిపిస్తుంది.

మధురాంతకం నరేంద్ర రచించిన "ముక్కుపుల్ల" కథలో దళిత కుటుంబాల్లో ఉండే ఒక సాంఘిక దురాచారమైన మాతమ్మను గురించి ప్రస్తావించారు. అంతేకాకుండా ఒక నిరుపేద ఉమ్మడి కుటుంబంలో సంభవించే వైరుద్యాలను తెలియజేశారు ఒక దళితస్త్రీ తన కుటుంబం కారణంగా అనుభవించే కష్టాలనుతెలిపారు. మాతమ్మకు పెళ్ళైన స్త్రీ జీవితాలకు మద్య ఉండే తారతమ్యాలను తెలిపారు. ఒక అగ్రవర్ణ స్త్రీ తనకు నచ్చిన ఒక ముక్కుపుల్లను తనభర్తకు, పిల్లలకు, మనవళ్ళకు కనిపిస్తే తన పరువు పోతుందేమోనని ఆ స్త్రీ పడే మానసిక వ్యధను చిత్రించారు. ఇలా ఈకథలో దళితస్త్రీ, దళిత ఆచారాలు, దళిత కుటుంబ కలహాలు, పితృస్వామ్య వ్యవస్థలో దళిత, అగ్రవర్ణ స్త్రీ పడే మానసిక సంఘర్షణలను తెలియజేశారు.

యం.ఆర్. అరుణకుమారి రచించిన 'పోస్ట్ చేయని ఉత్తరం' కథలో దేవదాసీ వ్యవస్థ కారణంగా కుటుంబం, ఆ కుటుంబంలోని వ్యక్తులు పడే మానసిక సంఘర్షణను చిత్రించారు రచయిత్రి. దేవదాసీ వ్యవస్థ కారణంగా స్త్రీ కోల్పోతున్న వ్యక్తిగత సంఘర్షనను కళ్ళకు కట్టినట్టు చూపించారు. ఈ కథలో అహల్య పెద్దకూతురు కావటంతో ఊరంతా కలిసి ఆమెను దేవసీని చేశారు. ఆమెను ప్రేమించిన,ఆమె ప్రేమించిన వ్యక్తి అభిరాంని తన చెల్లెలుకు ఇచ్చి వివాహం చేస్తుంది. తను మాత్రం తన కుటుంబం కోసం, అగ్రకులదౌష్ట్యానికి బలైన వైనం కనిపిస్తుంది.

దళితులు అంటరానితనానికి, అవమానాలకు, తమ అస్పృష్యతలకు లోనై పేదరికాన్ని అనుభవిస్తున్నారు. ఆ పేదరికం కారణంగా సమాజంలో ఆధిపత్యకుల అణచివేతకు గురి అవుతున్నారు. ఆ అణచ్చివేత ఒక స్త్రీ జీవితం మీద చూపిస్తున్న ప్రభావాన్ని అహల్యమాటల్లో చూస్తే "ఒకసారంటూ దేవదాసి శృంఖలాలు తగిలించుకున్నాక మరో పురుషుడికి భార్య కావడమనే విష్ఫంఖలత నాకు లేదని పంచాయితీలో తేల్చి చెప్పారు. "(పుట చిత్తూరుకథ) అని ఒక దళితస్త్రీని ఊరూడమ్మడి లైంగిక వస్తువుగా మార్చడానికి అగ్రకుల పురుషాధిపత్య భావజాలం ఎంత ప్రభావవంతంగా పని చేస్తుందో రచయిత ఈకథలో చూపించారు. ఈ సమస్యకు రచయిత పరిష్కారాన్ని కూడా చూపించారు. ఆ పరిష్కారం కూడా బాదితురాలైన

అహల్యమాటల్లో "కానీ సుధా! నాకు తెలిసి అడుగుతున్నా! ఉల్లి మొక్కకు మల్లె పూస్తుందా? ఉల్లి మొక్కకు ఇల్లాలు అనే మల్లే పూయించాలన్న ఆదర్శాన్ని అడ్డుకొనే ఛాందస వాదులను ఎదుర్కోవాలంటే ముందు వ్యవస్థే మారాలి. వ్యవస్థ మారాలంటే వ్యక్తుల్లో మార్పు రావావి."వ్యక్తులు మారితే వ్యవస్థ మారుతుందని రచయిత ఈకథ ద్వారా తెలియజేశారు. ఈ మాటల్లో బాధితులుగా మారటానికి కారణమైన అగ్రవర్ణ వ్యవస్థ మారితేకానీ దళితుల స్థితి మారదు అని తేల్చారు.

అగ్రవర్ణాధిపత్య సమాజంలో దేవుడి పేరు చెప్పి తమ కామ కోరికలు తీర్చుకోవడానికీ, పుట్టిన పిల్లల భాద్యలను తప్పించుకోవడానికి కేవలం పురుషాధిపత్యాహంకార ధోరణితో స్త్రీల దేవదాసీలుగా మారుతున్నారు. వారి కోరికను తీరుస్తున్నా దేవదాసీలకు వచ్చేప్రతిఫలం రోగాలు, రొష్టులు, కడుపునిండా అన్నానికి కూడా నోచుకోకపోవడం, వీరికన్నా పట్టణాల్లో బతికే సెక్స్ వర్కర్లు నయం. చేసిన పనికి ప్రతిఫలమైన అందుకుంటారు. అని రచయిత అగ్రవర్ణదురహంకారానికి బలైపోయిన స్త్రీల పరిస్థితిని ఈకథలో తెలిపారు.

ఈ విధంగా కారణమేదైనా అది కేవలం అగ్రవర్ణపురుషాధిపత్య ప్రతిఫలంగా మాత్రమే దళితస్త్రీలు ఊరూమ్మడి వస్తువులుగా మారుతున్నారు. అని ఈకథల ఆధారంగా తెలుసుకోవచ్చు.

# ప్రాచ్య పరిశోధన సంస్థ ప్రగతిలో వేటూరి ప్రభాకరశాస్త్రి ప్రస్థానం

– డా॥ టి. రాజశేఖర్
పోస్ట్ డాక్టరల్ ఫెలో
ప్రాచ్య పరిశోధన సంస్థ
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి–517502
సంచారవాణి: 8179730107
Email: telugurajaori@gmail.com

ఒక జాతి ప్రాచీన నాగరికత కలిగిందిగా నిర్ధారించే ప్రామాణికాంశాల్లో సాహిత్యం కూడా ఒకటి. అలా సాహిత్యం ద్వారా మన తెలుగు జాతి ఎంత ప్రాచీనమైనదో అంచనా వేయవచ్చు. అలాంటి సాహిత్య పదాన్ని అమరావతీ స్థూపంలో కనుక్కొని తెలుగు భాష ప్రాచీనత గురించి ప్రతి ఒక్కరిలో ఆలోచనలు రేకెత్తింపజేసిన వారు శ్రీమాన్ వేటూరి ప్రభాకరశాస్త్రి. అలాగే తెలుగు భాషకు సంబంధించిన ప్రాచీన సాహిత్యాన్ని పరిరక్షించే సంస్థల్లో ఉద్యోగించి, ఆ సంస్థలకే వన్నె తెచ్చిన మహనీయుడు కూడా ఆయనే. అసలు తెలుగులో ప్రామాణిక పరిశోధనకు పునాదిరాయి వేసిన వారు వేటూరి ప్రభాకరశాస్త్రి.

నేడు 65 వేల తాళపత్రాల నిధిగా విరాజిల్లుతున్న శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధన సంస్థకు ప్రపంచ వ్యాప్తంగా ఎంతో పేరు ప్రఖ్యాతలున్నాయి. సాధారణంగా ఒక సంస్థ ఇంత పేరు ప్రఖ్యాతలు గడిచిందంటే రెండు కారణాలుగావుంటాయి. మొదటి వ్యక్తుల వల్ల సంస్థకు పేరు రావడం, రెండోది సంస్థ వల్ల వ్యక్తులకు పేరు రావడం. ఇందులో మొదటి కోవకు చెందిన వారు శ్రీమాన్ వేటూరి ప్రభాకరశాస్త్రి. ఆయనవల్ల ప్రాచ్య పరిశోధన సంస్థకు ఎనలేని పేరు వచ్చింది. సంస్థ తొలిదశల్లో ఈ సంస్థలో పనిచేసిన ఇద్దరు మహానుభావుల కృషివల్ల, ప్రతిష్టవల్ల ఈనాటికీ మంచి పేరు ప్రఖ్యాతలతో ముందు వెళ్లుతోంది. వారు మానవల్లి రామకృష్ణ కవిగారు (1875 నుండి 1957), వేటూరి ప్రభాకరశాస్త్రి క్రీ.శ 1888–1950). ఈ ఇద్దరు మహాపండితులు ప్రాచ్యపరిశోధన సంస్థ వృద్ధిలో శ్రామికులు, తాళపత్రసేకరణలో, పునరుద్ధరణలో రెండుకళ్లు, సంస్థ ప్రగతి పథంలో ముందుకు తీసుకెళ్లే జోడు గుర్రాలు. ఈ పరంపరలోనే అమూల్య తాళపత్ర ప్రతులను, ప్రాచీన ముద్రిత, రాత పత్రుల సేకరణలో దూసకెళ్లి వేలకొద్దీ గ్రంథాలను సంస్థ కోసం సేకరించారు. భారతదేశంలో నేడు పేరెన్నికగన్న సంస్థగా పునాదులు వేశారు. అయితే వీరిద్దరిలో మానవల్లి వారి పరిశోధన నాట్యశాస్త్రం వైపు మళ్లి 'భరతకోశ' నిర్మాణంతో పరిపూర్ణమైంది. వేటూరి వారి పరిశోధన సృజనరచన, గ్రంథపరిష్కరణ, భాషాశోధన, శాసన చరిత్ర, వ్యాఖ్యాన, యోగవంటి రంగాల్లో బహుముఖాలుగా విస్తరించింది. ఆయన ప్రాభావాన్ని మొత్తం కాకుండా శ్రీవేంకటేశ్వర ప్రాచ్యపరిశోధన సంస్థకు ఆయన సేవను మాత్రం ఈ పరిశోధన పత్రంలో విశ్లేషించడం జరుగుతుంది.

శ్రీమాన్ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు 1940 నుండి 1950 వరకు శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధన సంస్థలో రీడర్‌గా పనిచేశారు. కాని ఈయన ఆ పది సంవత్సరాల కాలంలో సంస్థలో ప్రత్యక్షంగా పనిచేసి సారస్వత సేవచేసినప్పటికీ పరోక్షంగా ఆయన 1910 నుండి 1940 వరకు మద్రాసులోని ప్రాచ్చలిఖిత భాండాగారంలో పనిచేసినప్పటి నుండే ఆయన ప్రతిభా పాటవాలు ప్రాచ్య పరిశోధన సంస్థ కోసం అన్నట్లుగా సాగాయి.కాబట్టి ఆ దశ గురించి రెండు మాటలు చెప్పుకోనిదే మనమనకున్న అంశం గురించి పూర్తికాదు. తన ఉద్యోగ జీవితమంతా క్షణం తీరిక, విరామం లేకుండా పని చేసిన ఈయన అక్కడ పదవీ విరమణ పొందిన తర్వాత తన అనుభవాన్ని రంగరించి ప్రాచ్య పరిశోధన సంస్థకు జవజీవాలు ఇవ్వడానికి అవకాశం కలిగింది. అలాగే మద్రాసులో పనిచేస్తున్నప్పుడు జీర్ణ తాళపత్ర పత్రాల్లోని పద్యాలను సేకరించి 'చాటుపద్యమణి మంజరి'గా కూర్పు చేసినాడు, ఆంధ్ర రాష్ట్రమంతా తన శిష్యులతో తిరిగి వేలకొలది తాళపత్రాలను, రాతపత్రాలను సేకరించి కళ్ళలో వత్తులేసుకొని మరి, 'గ్రంథవివరణలు' (డిస్క్రిప్టివ్ కేటలాగ్) తయారు చేశాడు. అలాగే ఈ కాలంలోనే ఆయన అనేక సంకలన గ్రంథాలు, పరిష్కరించి ప్రచురించిన గ్రంథాలు, స్వతంత్ర రచనలు, ఆయన సేకరించిన బాలసాహిత్యం, ఆయన పరిశోధనానుభవం అన్నీ మద్రాసులో ప్రాచ్య లిఖిత భాండాగారంలో భాగమైనా ఆయన శ్రీమంతా ఊరికేపోలేదు. 1953లో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడ్డాక ఆ గ్రంథసంపదంతా తిరుపతి ప్రాచ్య పరిశోధనా సంస్థకు చేరింది.

ఇక శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధన సంస్థలో పనిచేసిన విషయానికొస్తే క్రీ.శ 1939లో శ్రీరెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమైంది. అదే సంవత్సరంలో తిరుమల తిరుపతి దేవస్థానం వారు శ్రీవేంకటేశ్వర ప్రాచ్య పరిశోధన

సంస్థను స్థాపించారు. ఆ మరుసటి సంవత్సరమే మద్రాసు ప్రాచ్యలిఖిత భాండాగారంలో పదవీవిరమణ చేసిన వేటూరి ప్రభాకర శాస్త్రిని కొత్తగా స్థాపించిన సంస్థలో రీడర్ పదవిలో పనిచేయడానికి ఆహ్వానించారు. అయితే ఆయన్ను మొదట తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాల (ఎస్వీ ఓరియంటల్ కాలేజీ)లో ఆంధ్రోపన్యాసకులుగా నియమించారు. ఆ విధంగా తిరుపతిలో శాస్త్రిగారి ప్రస్థానం ప్రారంభమైంది. తర్వాత ప్రాచ్య పరిశోధన సంస్థలో రీడర్‌గా చేరారు. ఇలా ప్రస్థానం ప్రారంభం చేసి పదిసంవత్సరాలు పనిచేసిన పదికాలాల పాటు పదిలంగా చెప్పుకొనేంత సారస్వత సేవచేసిన శాస్త్రిగారి గురించి ఏడుకోణాల్లో స్థూలంగా పరిచయం చేసుకుందాం. అవి 1. తాళపత్ర సేకరణ. 2. గ్రంథ పరిష్కరణ – పీఠకలు 3. వ్యాసాలు – ప్రతిపాదనలు 4. వ్యాఖ్యానాలు, 5. గ్రంథరచనలు, 6. సంఘసేవ, 7. మ్యూజియం ఏర్పాటు.

**1. తాళపత్ర సేకరణ:**

శాస్త్రిగారికి గ్రామ గ్రామాలు శ్రమకోర్చి తిరిగి తాళపత్రాలను సేకరించడం వెన్నతో పెట్టిన విద్య. ఆయన కార్యదక్షతవల్లనే అనేక తాళపత్ర గ్రంథాలు, కాగితపు ప్రతులు సంపాదించబడి ఈ గ్రంథాలయానికి చేర్చబడినాయి. కార్వేటినగరం , శ్రీకాళహస్తి సంస్థానాల నుండి, చిత్తూరుజిల్లాలోని అనేక సంస్థల నుండి, ప్రత్యేక వ్యక్తులనుండి, ఎన్నో తాళపత్రప్రతులు, కాగితపు రాత పత్రాలు, ముద్రిత పుస్తకాలు సంపాదించి ఈ గ్రంథాలయాన్ని అభివృద్ధి పరిచారు.

**2. గ్రంథ పరిష్కరణ – పీఠికలు:**

మద్రాసు ప్రాచ్యలిఖిత భాండాగారంలో పరిశోధన, పరిష్కరణ, పీఠికా రచనల్లో రాటుదేలిన వేటూరివారు తిరుపతి కొచ్చాక వేగం పెంచారు. తన అనుభవాన్ని రంగరించి గ్రంథపరిష్కరణలతో పాటు విలువైన పీఠికలతో సంస్థ పక్షాన ప్రచురించారు. ఈ సందర్భంగా ఆయన తాళ్ళపాక వారి రచనలపైనే ప్రత్యేక శ్రద్ధ కనబరిచినట్లు తెలుస్తోంది. వేంకటేశ్వర వచనాలు, అన్నమయ్య సంకీర్తనలు, అన్నమాచార్య చరిత్ర, సుభద్రాకల్యాణం, సారసంగ్రహగణితం, శృంగారామరకం అనే గ్రంథాలను శాస్త్రిగారు ప్రాచ్య పరిశోధన సంస్థ పక్షాన ప్రచురించారు. ఈ గ్రంథాల గురించి చర్చిద్దాం.

***2.1 వేంకటేశ్వర వచనాలు:***

శాస్త్రిగారు ఈ గ్రంథాన్ని 1945లో తిరుమల తిరుపతి దేవస్థానం వారి పక్షాన ప్రాచ్యపరిశోధన సంస్థలో పరిష్కరించి ప్రచురించారు. అయితే 1917లో డిస్క్రిప్టివ్ కేటలాగ్ 2వ, 3వ సంపుటాల్లో వీటిని గురించి ప్రస్తావించారు. 1925లో భారతీ పత్రికలో కొన్ని వచనాలు ప్రకటించాడు. చివరగా 166వచనాలతో సుప్రభాత స్తవాన్ని చేర్చి ప్రకటించాడు. ఈ గ్రంథానికి రాసిన పీఠికలో ఈ వచనాల్లో విశిష్టాద్వైత సిద్ధాంతాలు కరుడుగట్టి ఉన్నాయని, అయితే శరణాగత తత్వం ఉందని చెప్పాడు. ఈ వచనాలు ఠాగూర్ గీతాంజలిని తపిస్తున్నాయని అనంతుని గద్యలక్షణాల్ని కలిగి ఉన్నాయని విశ్లేషించాడు.

***2.2 అన్నమయ్య సంకీర్తనలు 4వ సంపుటం:***

శాస్త్రిగారు ఈ గ్రంథాన్ని 1947లో తిరుమల తిరుపతి దేవస్థానం వారి పక్షాన పాచ్య పరిశోధన సంస్థలో పష్కరించి ప్రచురించారు. ఈ గ్రంథానికి రాసిన ముందుమాటలో తాళ్లపాక రచనల ముద్రణ ప్రారంభమైందని అయినా అంతకుముందే శ్రీమహంతు ప్రయోగదాస్‌జీ పాలనా కాలంలో రాగిరేకులు కాగితాలపై రాయించారని చెప్పాడు. ఈ గ్రంథప్రచురణ కాలంలో శాస్త్రిగారు దేవస్థానం ఆఫీసునుండి రాగిరేకుల్ని తెప్పించుకొని క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు. అంతకుముందే వచ్చిన మూడు సంపుటాల్లోని కీర్తనల్ని, రాగిరేకుల్లోని కీర్తనల్ని సరిపోల్చి, ఆ మూడు సంపుటాల్లో ఏమన్నాయో వివరించాడు.

1. మొదటి సంపుటంలో తాళ్లపాక కవుల లఘుకృతాలున్నాయని వీటిలో కొన్ని రాగి రేకుల్లో ఉన్నాయని చెప్పాడు.
2. రెండవ సంపుటంలో ఆధ్యాత్మ సంకీర్తనలన్నీ అన్నమయ్యవి కావని అవి కలగాపులగంగా వున్నాయని అన్నమయ్యవి 391 రాగిరేకులు, పెదతిరుమలయ్యవి 77, చిన్న తిరుమలయ్యవి 10 రాగిరేకులు మొత్తం 478గా లెక్క తేల్చాడు.
3. మూడవ సంపుటంలో శృంగార సంకీర్తనల్లో అన్ని అన్నమయ్యవి కావని వాటిలో 2002కీర్తనలు అన్నమయ్యవిగా 100 కీర్తనలు పెదతిరుమలయ్యవిగా, 10 కీర్తనలు చినతిరుమలయ్యవిగా విభజించి మొత్తం 2112గాగా లెక్కకట్టాడు. ఇలా వివరణాత్మకమైన పీఠకలతో పరిశోధకులకు స్పష్టతనిచ్చాడు.

***2.3 అన్నమయ్య ఆధ్యాత్మ సంకీర్తనలు 5 సంపుటలు:***

దీన్ని శాస్త్రిగారు 22-6-1950న ప్రాచ్య పరిశోధన సంస్థ ద్వారా ప్రచురించారు. అప్పటికీ 565 శృంగార సంకీర్తనలు

180 ఆధ్యాత్మ సంకీర్తనలు తి.తి.దే ప్రకటించిదని చెప్పి ఈ సంపుటిలో 331 సంకీర్తనలు ఇచ్చాడు. ఇంకా 1746 ఆధ్యాత్మిక సంకీర్తనలు 11,4906 శృంగార సంకీర్తనలు రావడానికి 10సం॥ పడుతుందని పీఠిక తెల్పాడు. ఈ పరిశోధనలో తనకు తోడ్పాటు నందించిన ఉదయగిరి శ్రీనివాసాచార్యులను గురించి ప్రత్యేకంగా చెప్పాడు.

***2.4 అన్నమాచార్య జీవితచరిత్ర:***

దీనికర్త చినతిరువెంగళనాథుడు(చిన్నన్న). దీన్ని వెలుగులోకి తెచ్చింది శాస్త్రిగారే. దీని మూలం 1047పుటల్లోను, పీఠిక 133పుటల్లో ఉంది. ఈ పీఠిక ఎంతో అమూల్యమైనది. ఇందులో తాళ్ళపాక కవుల చరిత్ర, సంకీర్తనల విశిష్టత, నాటి తెలుగు భాషారీతులు, ఆంధ్రదేశ చరిత్ర వంటి అపూర్వ విషయాలతో ఈ పీఠికలో శాస్త్రిగారు చర్చించారు. గంగమ్మగుడి, అవ్వాచారికోన వంటి విషయాలు, అన్నమయ్య జనన, మరణ తేదీలను శాస్త్రిగారే నిర్ణయించారు. ఈ గ్రంథముద్రణలో ఏ.వి. శ్రీనివాసాచార్యులు సహకరించినట్లు తెలిపారు.

***2.5 సుభద్రాకల్యాణం:***

1950లో ప్రాచ్య పరిశోధన సంస్థ పక్షాన శాస్త్రిగారు తాళ్లపాక తిమ్మక్కను ఆంధ్రసాహితీలోకానికి తెలయజేయడమే గాక ఆ ప్రతిని శ్రీకాళహస్తి సంస్థానం నుండి సేకరించి ప్రచురించారు.

***2.6 సారసంగ్రహగణితం:***

వేటూరి వారు ఈ గ్రంథాన్ని 1912లోనే గుర్తించారు. కానీ దీని పరిశోధన పూర్తయింది. మాత్రం తిరుపతి ప్రాచ్యపరిశోధన సంస్థలోనే పరికర్మ, భిన్న గణితాలు మాత్రం పరిష్కృతమై వెలువడ్డాయి. అంతలో శాస్త్రిగారు మరణించడంలో పీఠిక రాయలేదు.

**3. వ్యాసాలు – ప్రతిపాదనలు:**

వేటూరి ప్రభాకర శాస్త్రి మద్రాసులో పనిచేసినప్పుడే భారతి వంటి ప్రసిద్ధ పత్రికల్లో పరిశోధనాత్మక వ్యాసాలు ఎన్నో రాశాడు. కానీ ప్రాచ్యపరిశోధన సంస్థలో చేరాక ఆయన దాని జర్నల్స్‌లో రాసిన వ్యాసాల్లో విలక్షణత ఉంది. పరిశోధనలో పరిపక్వత, నిజాలు నిగ్గుతేల్చడంలో నిర్భయత కనిపిస్తుంది.

పండితారాధ్య చరిత్రపై ఓ.ఆర్.ఐ. జర్నల్‌లో రాసిన వ్యాసంలో చిలుకూరి వారి పరిష్కరణను విమర్శించాడు. చిలుకూరి నారాయణరావు ఇలా పరిష్కరించాడు.

"శ్రీ గురులింగ! సంచిత దయాపాంగ

భాగ మహోధార! పాల్కూరికి సూ!"

అనే ద్విపథలో నాలుగు సంబోధనలున్నాయనీ, కానీ రెండే సంబోధనలుండాలని సూచించాడు. అంతేగాకుండా ఎక్కగొళ్ళు అనే పదం వుండకూడదని అక్కుగొళ్ళు అని సవరించాలని సూచించాడు.

'కాకతి' అనే వ్యాసం 1950 జనవరి జూన్ సంచికలో వచ్చింది. కాకతి ఓరుగల్లును పాలించిన రాజులదేవతని దీన్ని నిరూపించడానికి క్రీడాభిరామాన్ని పానుగంటి శాసనాన్ని కృష్ణాజిల్లా ముక్త్యాల జమిందారు మ్యూజియంలోని విగ్రహాన్ని ఆధారంగా చూపించాడు. ఏ విషయాన్నైనా సంపూర్ణ ఆధారాలు లేకుండా ప్రతిపాదించడం వేటూరి నైజంకాదు. పూర్వాపరాలతో, శోధించి చూపడం ఆయన ప్రత్యేకత.

'తెలుగుదనం – సంప్రదాయం' అనే వ్యాసం 1943(జూలై – డిసెంబర్)లో ప్రాచ్య పరిశోధన సంస్థ సంచికలో వచ్చింది. ఈ వ్యాసం నేటికి కొత్తగానే అనిపిస్తుంది. తెలుగు వారి సంప్రదాయం ప్రకారం మనం చెప్పుకొనే పైటమనదికాదని, మహారాష్ట్ర గుర్జర సంబంధమైనది, పైఠాన్ నాగరికతలో అది తెలుగునాట ప్రవేశించిందనే వాస్తవాన్ని వివరించాడు. అదేవిధంగా తాళిబొట్టు, కమ్మలు అన్ని తాటి ఆకులతో తయారు చేసుకొని ధరించేవారని అందుకే వాటికాపేరు వచ్చిందని పరిశోధనాత్మకంగా వివరించాడు.

గ్రంథగంథు అనే 1940 ఓ.ఆర్.ఐ జర్నల్‌లో రాసిన వ్యాసంలో ప్రాచీన గ్రంథాల్లోని అనేక పదాలకు వివవరణలు ఇచ్చాడు. ఆ పదాలును కవి ఎందుకు ప్రయోగించాల్సి వచ్చిందో, వివరంగా తేల్పాడు.

అలాగే వేటూరి వారు ఖచ్చితమైన అభిప్రాయాల్ని వ్యక్తం చేసేవారు. ఎదుటివ్యక్తి ఎంత గొప్ప పరిశోధకుడైన తన అభిప్రాయాన్ని కుండబద్దలు కొట్టినట్లు స్పష్టంగా చెబుతారు. మధునాపంతులు సత్యనారాయణ వారి ఆంధ్రరచయితలు గ్రంథానికి తొలి పలుకులు రాస్తూ 'కందుకూరి కవుల చరిత్ర'ను సంస్కరించాల్సిన అవసరం చాలా వుందని నిర్మొహమాటంగా చెప్పాడు.

**4. వ్యాఖ్యాలు:**

శాస్త్రిగారి వ్యాఖ్యానాలు చాలా విలక్షణంగా ఉంటాయి. ఈయన వ్యాఖ్యలను గురించి డా॥ పి.సి. వెంకటేశ్వర్లు గారు ప్రస్తావిస్తూ 'మల్లి నాధుడిలాగా శ్సాస్త్రిగారిది కూడా గచ్ఛత్ వ్యాఖ్య ఎందుకంటే మూలంలో, లేనిది ముట్టుకోడు అన్వయంలోనే సర్వం వ్యాఖ్యానిస్తాడు' అని అభిప్రాయపడ్డాడు. శాస్త్రిగారు మూడు వ్యాఖ్యలు తిరుపతి ప్రాచ్య పరిశోధన సంస్థలో ఉన్నప్పుడు చేశారు. అవి కుమార సభవ వ్యాఖ్య, ఉత్తర హరివంశం, నైషధ పారిజాతంలకు వ్యాఖ్యానం రాసినా అవి కొన్ని పూర్తికాగా మరి కొన్ని, పని ఒత్తిడివల్ల అలాగే మిగిలిపోయాయి. ఆయన వ్యాఖ్యల్లో కష్టమైన ఘట్టాలను కూడా అరటిపండు వలచి నోట్లో పెట్టినట్లు సులభంగా చెప్పడం ప్రత్యేకత. ప్రతి అశ్వాసానికి ముందు కథాంశాన్ని శీర్షిక రూపంలో పెట్టడం చెప్పుకోదగ్గ అంశం.

**5. గ్రంథరచనలు:**

శాస్త్రిగారు తిరుపతికి వచ్చాక గ్రంథ పరిష్కరణపైనే దృష్టికేంద్రీకరించి స్వతంత్రరచనలు తక్కువ చేశారు. ఆయన 1940 తర్వాత ప్రచురించిన రచనలుగా సీతాఫలం, మాతృశ్రీ అనే రెండు కావ్యాలు కనిపిస్తున్నాయి.

**6. సేవాకార్యక్రమాలు:**

వేటూరివారు మద్రాసులో పనిచేసేటప్పుడే అనారోగ్యంతో బాధపడేవారు. కాని మాస్టర్ సి.వి.వి. గారి అనుగ్రహంతో సంపూర్ణ ఆరోగ్యవంతులైనారు. తానుకూడా వైద్యం. యోగశాస్త్రాల్లో అభ్యాసం ప్రారంభించి పరిపూర్ణుడైనాడు. ఆ అనుభవాలలో తన వద్దకు వచ్చే అనేక మందికి వైద్యంతో సేవ చేసేవాడు. తిరుపతిలో కూడా ఆయన అనేక మందికి వైద్యంతో సేవ చేసేవాడు. తిరుపతిలో ఆయన యోగ, వైద్యసేవల విషయంపై మంచిపేరు ప్రతిష్టలు వచ్చాయి.

అదేవిధంగా ఆయన పుస్తకాలను సంస్కరించడంతో పాటు సంఘసంస్కరణభావాలు కూడా కలిగినవాడు. సనాతన బ్రాహ్మణకుటుంబంలో పుట్టినా మూర్ఖమైన ఆలోచనలతో ఉండేవాడుకాదు ఆయన. సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని, సమానత్వాన్ని కోరుకున్నాడు. తిరుపతిలో హరిజన దేవాలయ ప్రవేశ ఉద్యమానికి నాంది పలికింది శాస్త్రి గారే అనేది ఎప్పటికి గుర్తుంచుకోవాల్సిన విసయం. హరిజనుల దేవాలయ ప్రవేశం జరిగేవరకు తాను తిరుపతిలో ఉన్నా శ్రీవేంకటేశ్వరుని దర్శించుకోలేదంటే వారిలోని నిబద్ధత ఏమిటో అర్థమవుతుంది.

**7. మ్యూజియం ఏర్పాటు:**

శాస్త్రిగారు ప్రాచ్యపరిశోధన సంస్థల్లో ఉన్నప్పుడే మ్యూజియం ఏర్పాటుచేయాలని తిరుమల తిరుపతి దేవస్థానం వారికి ప్రతిపాదన పెట్టారు. మ్యూజియంలో పెట్టాల్సిన ప్రాచీన అపూర్వ కళాఖండాల కోసం రాష్ట్రం నలుమూలలా అవిశ్రాంతంగా తిరిగాడు. 1950 ఆగష్టులో గుంటూరుజిల్లా మద్దనపూడిలోని ఒకబావిలో అపురూపమైన శిల్పాన్ని వెదకడానికి వెళ్లి జడివానలో తడిచి, నల్లరేగళ్లలో నడిచి ఆరోగ్యం చెడుగొట్టుకున్నాడు. జ్వరంతో తిరుపతి చేరుకొని 1950 ఆగష్టు 20న పరమపదించాడు.

ఈ విధంగా శాస్త్రిగారు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధన సంస్థకు అపూర్వమైన సారస్వత సేవ అందించడమే గాక బ్రౌన్ సాహిత్యసేవను తొలుత గుర్తించింది కూడా ఇక్కడే అనే విషయం తెలియజేయడానికి గర్వకారణంగా ఉంటుంది. తన ఉద్యోగ పదవీ విరమణ తరువాత కాచివడబోచిన జీవితంలో తిరుపతి ప్రాచ్య పరిశోధన సంస్థకు వచ్చి తాళ్లపాక వారి సంకీర్తనల్లో ఎవరెవరివి ఏవి అని రచనల వర్గీకరణ చేసి స్పష్టత ఇచ్చారు.

*****

# రావూరి భరద్వాజ కాదంబరి నవల – పరిశీలన

– జి. నాగభూషణరెడ్డి
తెలుగు అధ్యాపకులు, ప్రభుత్వ జూనియర్ కళాశాల
బి.కాంప్, కర్నూలు. మొబైల్ : 9182931715
gnagabhushanreddy84@gmail.com

ఆధునిక సాహిత్యాన్ని అవలోకనం చేసుకొంటే యదార్థ సంఘటనలు, వాస్తవిక జీవితాలు తెల్లకాగితంపై నల్లసిరతో అంటుకొంటున్నాయని అర్థంచేసుకోవచ్చు. అలా వాస్తవిక జీవితాలు సాహిత్య పుటలకు ఎక్కించిన రచయితలే రాణిస్తున్నారు. అలాంటి రచనల్లో ఒకటి రెండు సంఘనటలను ఆధారం చేసుకొని చిత్రిస్తే, అది కథానిక అవుతుందనీ, ఒక వ్యక్తి సమగ్ర జీవితాన్ని చిత్రిస్తే, అది నవల అవుతుందనీ, చాలామందికి ఒక అభిప్రాయముండేది. కాని నవల ఒక సమాజాన్ని, ఒక దేశాన్ని, ఒక సమగ్రానుభవాన్ని చిత్రించగలగాలి. అయితే ఈ చిత్రణం ఊహాలోకంలో తిరుగాడే పద్ధతిలో ఉంటే, అది నవల అనిపించుకోదు. వాస్తవ జీవన చిత్రణ నవలకు ప్రాణం. చిత్రణలోని సామ్యర్థమే దానికి ఆయువుపట్టు. ఆ ఆయువు ఎంత అందులో నిబిడీకృతం అయ్యిందో అదే నవలకు గీటురాయి. అయితే నవల నిర్వహణలో రచయిత శిల్ప నైపుణ్యాలు ఎన్నైనా కావచ్చు. కొందరు పాత్రలు జీవితాన్ని జీవితానుభవం కోసం జీవిస్తూ దాన్ని వివేచిస్తున్నట్లు మలుస్తారు. కొందరు తమ జీవితానుభవంతో జీవితాన్ని కొలుస్తున్నట్లు పాత్రలను నిర్మిస్తారు. మరి కొందరు జీవిత సత్యాలను కొన్నింటిని ప్రమాణంగా స్వీకరించి ప్రమాణాన్ని ప్రయోగంలో ప్రయోగిస్తున్నట్లు పాత్రలను కల్పిస్తారు. మరికొందరు పరిస్థితులకూ ప్రమాణాలకూ సంఘర్షణ కల్పించి దాన్ని విమర్శిస్తూ పాత్రలు జీవితాన్ని వ్యాఖ్యానిస్తున్నట్లు వెలువరిస్తారు. ఇంకొందరు జీవిత విమర్శలో పరమార్థాన్వేషణలో బాట పొరులుగా పాత్రలను రూపొందిస్తారు. కొందరి పాత్రలు ప్రతీకలు. వారి జీవితం ఒక సజీవ ప్రయోగం. కొందరి పాత్రలు జీవిత దృక్కోణాలకు, వివిధ దృక్పథాలకు సజీవ దృష్టాంతాలు. వారి జీవితం ఒక క్షీర సాగర మధనం. కొందరి పాత్రలు జీవిస్తుంటాయి. జీవితాన్ని సృష్టించుకుంటాయి. అయితే అవి వాటికి వ్యాఖ్యానం చేయలేవు, చేసే మరో పాత్రకోసం అన్వేషిస్తుంటాయి. అటువంటి పాత్ర దొరికినప్పుడు మహాకావ్యం ఒక మహా విమర్శకుని కోసం పడిగాపులు పడ్డట్లు ఆ పాత్ర చుట్టూ పరిభ్రమిస్తుంటాయి. ఆ పరిభ్రమణలో పరమార్థాన్ని సాధిస్తాయి. ఇలా ఎన్నో శిల్ప మార్గాలున్నాయి.

నవలా చిత్రణంలో శ్రీ రావూరి భరద్వాజ ' పాకుడు రాళ్ళ ' లో పాత్రలకు జీవించి, జీవిత సత్యాలను తెలుసుకునే సూత్రం నేర్పాడు. 'కాదంబరి' లో తమ పాత్రలకు జీవిస్తూ జీవితాన్ని విమర్శించి తమను తాము తెలుసుకునే నేర్పూ, ఇతరులకు తెలియజెప్పే తీర్పూ నేర్పారు. అంతేకాదు. ఏమార్గానికామార్గం ఒక వ్యక్తిత్వం కలదని నిరూపించారు. ఆ పాత్రలకు అన్ని లక్షణాలను మేళవించుకొని రచనలు చేయగల యదార్థ రచయిత రావూరి భరద్వాజ. ఆయన సాహిత్యం విలువను వెలకట్టేవాళ్ళు ఎవరిదగ్గరా ఉండవు. ఎందుకంటే ఆయన సాహిత్యానికి ఎంత విలువో 2012 లో కేంద్ర సాహిత్య అకాడమీ నిర్ణయించింది.

చాలామంది రచయితల్లో లేని భిన్నమైన సామాజిక దృక్పథం రావూరి భరద్వాజలో కనబడుతోంది. ప్రతి ఒక్క రచయిత ఏదో ఒక దృక్పథంతో నవల రాస్తాడు. ఏ దృక్పథమూ లేకుండా రచన చేసేవాడు అజ్ఞాని అయినా అయ్యుండాలి. లేదా మోసగాడైనా అయ్యుండాలంటాడు రాచపాళెం. రావూరి భరద్వాజ దృక్పథం అంతా సామాజిక చైతన్యమే. రావూరి భరద్వాజ, అనుభవం పండిన తరువాత నవల ఎత్తుకున్న రచయిత. అంచేత, విస్త ృత ప్రాధాన్యమున్న రచనలో కూడా గాఢత కోల్పోకుండా జాగ్రత్తపడుతాడు.

కథ చెప్పే నేర్పు విషయంలోకాని, కళ్ళకు కట్టించే వర్ణనల విషయంలో కాని, కమ్మటి తెలుగు పలుకుబడితో చెవుల తుప్పు వదలగొట్టే విషయంలో కాని, సంభాషణ చాతుర్యం విషయంలో ఆయన తనదైన ముద్ర చూపిస్తాడు. రావూరి భరద్వాజ భావయిత్రి కారయిత్రి ప్రసరించడానికి ఆయన జీవితానుభవాలు, అందులో నుండి నేర్చుకొన్న మెలుకవలు కారణం. అవన్నీ ఆయన స్వయంసిద్ధంగా ఒంట బట్టించుకున్నవే. ఏ కాలేజీ కానీ, ఏ గురువు కాని ఆయనను తీర్చిదిద్దలేదు. అంటే ప్రపంచాన్ని ఒక పుస్తకంగా చదివిన మనిషి ఆయన, తెలుగు ప్రజల మధ్యన ఉండి సజీవమైన భాషను సొంతం చేసుకున్న రచయిత. అటువంటి గొప్ప రచయిత కలం నుండి జాలువారిన అద్వితీయమైన నవల కాదంబరి.

సంస్కృతంలో బాణుని కాదంబరి నవలకు, భరద్వాజ  కాదంబరి నవలకు ఎక్కువగా పోలిక లేదుకానీ సామాన్య సామ్యాలున్నాయి. సంస్కృత కాదంబరిలో ఉన్న రొమన్స్‌లు ఈ నవలలో కూడా ఉన్నాయి. ప్రపంచ జీవన సరళి కూడా రెండింటిలో సూచింపబడుతుంది. అడవులు, నదులు, తదితర ప్రదేశాలు వర్ణనలు రెండింటిలో సహజసిద్ధంగా చోటుచేసుకొని ఉన్నాయి.

ఇక రావూరి భరద్వాజ గారి కాదంబరి నవల్లోని ఇతివృత్తాన్ని పరిశీలిస్తే

పత్రికలలో ఒకరోజు ఒక వార్త వచ్చింది. ఒకడు అడవిలో శిథిలాలయం సమీపంలో చిరుతపులిని చేతిలో పొడిని చంపాడని, అది చూసి జగన్నాధం అనే ఉత్సాహవంతుడు శిధిలాలయం వెతుక్కుంటూ వెళ్తాడు. ఆ చిరుతపులిని చంపిన వీరుడు కనబడతాడు. శిథిలాలయమూ కనబడుతుంది. అది రుద్రమదేవి సేనానాయకులలో ఒకడైన మాతప్ప నాయకుని మందిరం. 300 సంవత్సరాలకు పూర్వం నాటిది. ఇంతలో అక్కడ కౌముది అనే అప్సరస లాంటి స్త్రీ కనపడుతుంది. కాకతాళీయంగా, జగన్నాధానికి ఆమెతో పరిచయమవుతుంది. ఆమె జీవితంలో " స్వేచ్ఛాప్రణయ" సంప్రదాయానికి చెందినట్లు కనపడుతుంది. విచిత్రమేమిటంటే ఆమె తండ్రి రామకృష్ణయ్య, కావాలనే బుద్ధిపూర్వకంగా ఆమెనలా పెంచడం జగన్నాధానికి రామకృష్ణయ్యను పరిచయం చేస్తుంది కౌముది.

ఈ రామకృష్ణయ్య జీవిత నేపథ్యం పరిశీలిస్తే ఒకనాడొక అనాధ. తన మేధాశక్తి వల్లా, వచ్చిన అవకాశాలను సద్వినియోగం చేసుకోవడం వల్లా శూన్యం నుండి సుందర సౌధాలను సృష్టించిన మేధావి. ఈ రామకృష్ణయ్యకు కౌముది కూతురు, వసంత్ కొడుకు  రామకృష్ణయ్య విద్యావంతుడు కాదు. బాల్యంలో తాను పడిన బాధలూ, ఆకలి పెట్టిన కోతలూ, చంద్రశేఖరంగారు అనే పెద్దమనిషి తనను ఆదరించి సరస్వతి అనే కూతురును యిచ్చి

పెళ్ళి చేసిన వివరాలూ జగన్నాథానికి చెపుతాడు రామకృష్ణయ్య.

రామకృష్ణయ్య మయూరాక్షి డ్యాం నిర్మాణం చేయించి ఆ ప్రాంతంలోని ప్రజలను ఆదుకోవాలని భావిస్తాడు. రాజకీయ ఆందోళన మొదలు అవుతుంది. అక్కడి కుట్రలు దగాలు ఎత్తుకుపైఎత్తులు ఎలా వుంటాయో తెలుస్తాయి. అన్నింటినీ రామకృష్ణయ్య సమర్థవంతంగా ఎదుర్కొంటాడు. ఈలోగా ఆ భూములను పేదలనుండి బయటవారు వచ్చి కొనుక్కుపోతారు. ఫలితంగా పేదలు మళ్ళీ పేదలుగానే మిగిలిపోతారు.

జగన్నాథం ఈ కథ మొత్తం వింటాడు. కౌముది శంకరం అనే ఇంజనీర్‌ను వివాహం చేసుకొంటుంది. అట్లని జగన్నాథానికి తన అందం పంచి యివ్వాలనే కోరికను వదులుకోదు. తనకు సాధ్యం కానిది లేదని విర్రవీగే రామకృష్ణయ్య , జీవితం చివరి దశలో తాను ఓడిపోయినట్లు బాధపడతాడు. అలాంటి బాదే కౌముదినీ ఆవహిస్తుంది. జగన్నాథం ఈ కథకు సాక్షిగా మిగిలిపోతాడు. స్థూలంగా ఇదీ కథ.

కథను స్థూలంగా పరిశీలిస్తే ఇది రామకృష్ణయ్య కథ మరోరకంగా కౌముది కథ. ఇందులోని ప్రతి పాత్రా మనకోసం సందేశాన్నిచ్చే కథ. భరద్వాజగారు నవలాశిల్ప చాతుర్యం. ఈ రచన ద్వారా మరింత వాసికెక్కింది. కౌముది అంటే వెన్నెల ఈ వెన్నెల చంద్రునిగుణం. నవలలో ముఖ్యపాత్ర రామకృష్ణయ్య. ఆయన చంద్రుడు. ఆయన గుణాలకు ప్రతిరూపమే కౌముది. ఒకప్పుడు నిరుపదే అయిన రామకృష్ణయ్య తన సంతానం ఆ పేదరికాన్ని అనుభవించకూడదని సంపాదించాడు. వారిని ఎప్పుడూ విలాసాలకు బానిసను చేసిన వైనం విస్మయాన్ని కలిగిస్తుంది. ధనమోహంలో పడినవాడు తమబిడ్డలపై కూడా “ స్వేచ్ఛ ” పేరిట వ్యాపార ప్రయోగాలు యెలా చేస్తారో యిందులో 'కౌముది' పాత్ర సాక్ష్యం.

‘ కాదంబరి ’ లో నాయకుడు నిజానికి కౌముది ఆమె మాట శిలాశాసనం. ఆమె అతి అభ్యుదయ స్త్రీ, ఆమె తండ్రితో సమానంగా నలుగురితోనూ తిరుగుతుంది. తాగుతుంది. తన శరీరాన్ని తనకు నచ్చినవారి ఆనందానికి కానుకగా యిస్తుంది. మొదటిసారిగా నవల చదివితే ఆమె పాత్రయెడ కొంత జుగుప్స కలుగుతుందికూడా! కేవలం సెక్స్ కాదు, మొత్తం జీవితానందాన్ని జుర్రుకోవాలని ఆమె చేసే ప్రయత్నాలు మనల్ని వికంపితుల్ని చేస్తాయి.

తర్వాత చెప్పుకోవాల్సింది రామకృష్ణయ్య పాత్ర గురించి. పాత్ర సృష్టి, పోషణ ఒక గొప్ప ప్రతిభకు తార్కాణం. మొదట రామకృష్ణయ్య ఆర్థికరంగంలో ఎలా ఆగర్భదారిద్ర్యం నుంచి ఆగర్భ శ్రీమంతుడు ఎలా అయిందీ చూపారు. తరువాత రాజకీయ రంగంలో ఎట్లా వ్యవహార దక్షుడయిందీ అనన్యంగా చిత్రించారు. ఈ రెండు రంగాలలోనూ అతను ఔన్నత్యాలనందుకున్న వైనాన్ని రచయిత ప్రజ్ఞతో రచించారని చెప్పాలి. ఆటుపోట్లను తట్టుకొని జీవితమనే పద్మవ్యూహంలో నుంచి నడచి పోవడానికి సాహసించి విజయం పొందినవాడు గొప్ప వ్యక్తి క్రిందే లెక్క. పైగా రామకృష్ణయ్య పాత్రలో కొన్ని గొప్ప విశేషాలు కూడా వున్నాయి. అతనిలో మానవత్వం, మంచితనం వుంది. తాను వ్యాపారం చేసినా రైతులను మోసం చేయలేదు. వారికి న్యాయంగా చెందవలసినదాన్ని వారికిచ్చాడు. ప్రాజెక్టు కోసం అతను చేసిన కృషి కూడా రైతుల మేలుకొరకే.

అతనికి అందులో ఏవంతైనా స్వార్థంలేదు. జీవితాన్ని బాగా అర్థం చేసుకున్నాడు. విజయం సాధించిన తర్వాత జీవితాన్ని బాగా అనుభవించాడు. అలా అనుభవించే స్వాతంత్ర్యం అవకాశాలు తన సంతానానికి కూడా ఇచ్చాడు. జీవితంలో ఎంత స్వార్థపరుడో అంత త్యాగం కూడా చేసినవాడు. ఈ ప్రపంచంలో ఎంత దగా, వంచన, అవినీతి, స్వార్థపరత్వం, కపటం ఉన్నప్పటికీ వ్యక్తి బయపడనవసరం లేదు, కృంగిపోనవసరం లేదు. మనుషులను ద్వేషించనక్కరలేదు. సమాజాన్ని దూషించుకుంటూ కూర్చోనక్కరలేదు. ఆత్మ విశ్వాసంతో ముందుకి సాగిపోయి విజయాన్ని సంపూర్ణంగా సాధించడమే మానవుడు చేయవలసిన పని. ఐతే ఆ మహాప్రస్థానంలో సాటిమానవునికి, అందులోనూ కృషికి అన్యాయం చేయవలసిన పనిలేదు. వారికి కొంత చేయూతనిస్తూ మానవుడు స్వీయ శ్రేయస్సు కోసం పాలుపడవచ్చు. ఎన్నో విజయాలు సాధించవచ్చునని భరద్వాజ ఈ నవలద్వారా, ప్రత్యేకంగా రామకృష్ణయ్య పాత్ర ద్వారా చెప్పాడు.

ఆ తర్వాత ముఖ్యంగా చెప్పుకోవాల్సిన పాత్ర జగన్నాథం. అతడు జీవితాన్ని వాస్తవంగా చూచాడు. మేడిపండులా కనపడే సంఘస్వరూపంలోని పురుగులను చూచాడు. ప్రాచీన శిథిలాల్లో కంటే, ఆధునిక మానవ జీవిత శిథిలాల్లో అన్వేషింపదగింది ఎంతో ఉందని తెలుసుకున్నాడు. అవకాశ వాదంలోని అంతరార్థాన్ని కౌముది కౌగిలిలో అన్వేషించాడు. మానవత పడే వేదన కొండల్లో, గుట్టల్లో, అడవుల్లో, శ్రామిక జీవుల్లో, రాజకీయవాదుల్లో, దేశనాయకుల్లో , కుబేరుల్లో, కుచేలుల్లో నిశితంగా పరిశీలించాడు. చివరకు అతడికి దక్కింది మానవత్వపు విలువ, దాన్ని కౌముది కిచ్చాడు. అవగాహనతో కూడుకున్న ఆధునిక అభ్యుదయ మార్గానికి వాళ్ళిద్దరివి సజీవ ప్రతీకలుగా నిలిపాడు. 'జగన్నాథం దేవుడులాంటి మనిషి,' అని కౌముది అంటే కాదు శంకరమే దానికి అర్హుడని చిత్తశుద్ధితో చెప్పగలిగాడు. కౌముదిలో మానవత దేహం నుండి ఆత్మదాకా ఎగబ్రాకింది. శంకరంలో మానవత మనసు నుండి బుద్ధిదాకా ఎగబ్రాకింది. జగన్నాథం వాళ్ళిద్దరిలో మోసులెత్తిన మానవతకు జీవించటం నేర్పాడు. జీవన ఫలాన్ని అందించాడు. అతని అన్వేషణ అలా సఫలమైంది.

ఈ నవల యింత సమగ్రంగా, రామకృష్ణయ్య పాత్ర ఇంత సహజంగా, ఉండటానికి రెండు కారణాలు ఉన్నాయి. ఆ రెండవ కారణం భరద్వాజగారి జీవితమే. భరద్వాజ జీవితం వడ్డించిన విస్తరి కాదు. ఈనాటి చాలామంది ప్రముఖ నవలా రచయితలకూ చిత్రకవులకూ తెలియని 'ఆకలి బాధ' ఏమిటో ఆయనకు తెలుసు. మనిషి మనిషిని అవసరం కోసం యెలా దోచుకుంటారో ఆయనకు తెలుసు. తాను స్వయంగా ఎన్నోసార్లు సమాజంచేత దోచుకోబడ్డాడు. అయినా ముళ్ళకిరీటంతో, ముఖం మీద చెరగని మందహాసంతో భరద్వాజ మిగిలిపోయాడు. " ఓహెూ లోకమంటే యిదీ " అని, నేర్పేవాళ్ళు ఎవరూ లేకుండా తనకై తానే బ్రతుకు బడిలో పాఠాలు నేర్చుకున్నాడు.

భరద్వాజ రసవిద్య నెరిగిన మహాకవి. పాకుడుకాళ్ళు – కాదంబరి మామూలు నవలలు కావు. మానవ జీవితపు లోతులను తరచి చూసిన దర్శనాలు. మనిషి ఎంత నీచుడౌతాడో, పరిస్థితులకూ, అవసరాలకూ ఎంత బానిస అవుతాడో, సంకల్పిస్తే శూన్యం నుండి ఎంత సృష్టి చేయగలుగుతాడో ఈ కథలు మనకు చెపుతాయి.

ఇందులోని మాతప్ప నాయకుని మందిరం వద్ద భరద్వాజ ఊహలు ఎంత రమణీయ కమనీయంగా ప్రవహించాయో ప్రసరించాయో మయూరాక్షి డ్యాం నిర్మాణం వెనుక దాగిన కథలను చెపుతున్నప్పుడు అట్లా నిప్పులను కురిపించాయి. కన్నీళ్ళను ప్రవహింపజేశాయి.

**ముగింపు :–** జీపులో విలాసంగా పోతూ మంచు గడ్డలను వేసుకొని గ్లాసులు నింపి కూతురుకు తాగించి తాను తాగి జీడిపప్పు నములుతూ రామకృష్ణయ్య నిర్భోగమాటంగా చెప్పుకున్న తనకథ ఈ కాదంబరి. కాదంబరి అంటే మద్యమనే ఒక అర్థం ఉంది. ప్రస్తుతం దాన్ని విరివిగా ప్రతి ఒక్కరూ తాగుతున్నారు. మైకం కోసం అది తాగిన వారి జీవితం చీకటి మయం అవుతుంది. ఈ నవలలో సజీవమైన భాష సజీవ సన్నివేశాలు కథను సజీవంగా చేశాయి. జీవిత వాస్తవాన్ని వెలుగులోకి తెచ్చాయి.

✡ ✡ ✡

# సర్కారు గడ్డి నవల - దళిత జీవన చిత్రణ

- పి. మనోహర్
పరిశోధక విద్యార్థి, నెట్ (జె.ఆర్.ఎఫ్),
తెలుగు శాఖ,
యోగి వేమన విశ్వవిద్యాలయం, కడప.
సెల్ : 8106385480

ఆచార్య కొలకలూరి ఇనాక్ గారు గుంటూరు జిల్లాలో జన్మించారు. ఈయన రాయలసీమలో ముఖ్యంగా అనంతపురం జిల్లాలో దళితుల సమస్యల మీద సర్కారు గడ్డి నవలలో చిత్రీకరించాడు. దళితుల్లో చైతన్యాన్ని తీసుకురావడం ప్రధాన ఆశయం. వానలు లేక పొలాలు పండక, తిండి గింజలు లేక కరువు కష్టంతో, అంటరానితనంతో దళితులు ఎంత ఇబ్బందులు పడ్డారో రచయిత. రచయితకు దళిత జీవితం పట్ల తనకున్న అనుభవంలో నుంచి సర్కారుగడ్డి నవల రాశారు. దళితుల్లో వెనుకబాటు తనాన్ని రూపు మాపి, చైతన్యాన్ని తీసుకురావటానికి రచయిత కృషి చేశడు. అగ్రవర్ణ రాజకీయ నాయకులు దళితులను ఓట్ల కోసం అమ్మ, అయ్య అని అడుక్కుంటారు, తర్వాత వారి పక్కకు చూడకపోవడం నవలలో ఎంతో చక్కగా చూపించారు రచయిత.

సర్కారు గడ్డి అంటే వేసవి కాలంలో రాయలసీమలో వచ్చిన కరువుకు ప్రభుత్వం సర్కారు జిల్లాల నుంచి రాయలసీమ జిల్లాలకు అందించే గడ్డి. అనంతపురం జిల్లాలో వందలు వేలు ఆవులు, ఎద్దులు మేత లేక, నీళ్ళు లేక ఆకలితో చనిపోతున్నాయి. మనిషికి అండగా ఉంటూ తిండి పెడుతున్న పశువులకు తిండిలేక అల్లాడిపోతున్నాయి. ముఖ్యంగా గూడ్సు బండిలో రావడం, లారీలు జిల్లా అంతటికి మోసుకుపోవటం నేపథ్యంగా 'సర్కారుగడ్డి' నవలలో ప్రధానంగా రావుడు అనే దళితరైతు అతనికి లచ్చువుడు అనే ఎద్దు ఉంటుంది. రావుడి అసలు పేరు ఓబులేసు. ఎద్దును తమ్ముడి లాగ భావిస్తున్నందుకురావుడు అయిపోయారు. రావుడికి అతని తాత ముత్తాతల వారసత్వంగా వచ్చిన యాభై ఎకరాల పొలం ఉంది. పది ఎకరాల వరి ఉంది, పది ఎకరాల్లో చీనిచెట్లు, ఐదు ఎకరాల్లో జామచెట్లు, రెండు ఎకరాల్లో బొప్పాయి. వానలు పడితే పొలం పండుతుంది. వర్షాలు లేక పొలాలు బీడు పోయాయి. రావుడిక మాదిగ మంచి పేటలోపేరుంది. రావుడికి ముగ్గురు కొడుకులు ముగ్గురు కష్టజీవులు పెద్దవాడు మర్యాదస్తుడు, చాలామంచివాడు, రెండవవాడు (నడిపివాడు) ఎవరినీ ఏమీ అనేవాడుకాదు. ఎలా మాట్లాడాలో బాగా తెలిసినోడు, మాటలతో న్యాయం చెప్పగలడు. కష్టం కలిగించడు. ఎవర్ని బాధపెట్టేవాడు కాదు. నలుగురికీ నచ్చిన మనిషి, పెద్దలపట్ల గౌరవం. రావుడి కొడుకుల్లో మూడవవాడు సన్నాయప్ప కోపం ఎక్కు, ఓర్పు తక్కువ, ఆలోచించి తనమాటలు చెప్పి, అవసరం వివరించి ఎదుటివాళ్ళను ఒప్పించటం

చేతకాదు. ధైర్యవంతుడు ఏదో ఒకటి చావో రేవో అనుకొనే వ్యక్తి అందరు సన్నోని మాట వింటే ఏ పని అయిన చేసిపెట్టగలడు. భయంలేని వ్యక్తి. రావుడు ఏదయిన మంతనాలకు, పెత్తనాలకు సన్నాయప్పను పంపడు.[18]

ఒకసారి వరి గడ్డి లారీ ఊరికి వస్తుందని నడిపాయప్పను రావుడు సర్పంచి దగ్గరకి పంపిస్తాడు నడిపాయప్ప ఇంటి దగ్గర కూర్చుని ఎంత ఎదురు చూసిన సర్పంచి చాలాసేపటికి బయటికి వస్తాడు.

“వోట్లు అంటే పొద్దుగాలే వొచ్చి కాల్లకాడ కూసుండి అమ్మా అయ్యా, అప్పాసామి వరసలు గలిపి అడుక్కొంటూ ఉంటాడుగాని, ఇంతమంది ముంగిలి తొక్కితే ఉలకడు పలకడు యావనుకొంటున్నట్లు”[20] ఎలక్షన్ల సమయంలో అగ్రవర్ణ రాజకీయ నాయకులు దళితుల ఇళ్ళ చుట్టు తిరిగి అడుక్కునే విధానం రచయిత కళ్ళకు అద్దం పట్టేల చూపించారు.

లారీల నుండి గడ్డి వచ్చినప్పుడు తమ పశువులకు వంతుల వారీగా గడ్డి లభించేది. గట్టిగ మాట్లాడితే, బతిమిలాడుతూ అడుక్కుంటూ ఉంటే కొంత గడ్డి ఇచ్చేవారు. అస్పృశ్యత బలంగా ఉన్న దేశంలో రాష్ట్రంలో అందులో ముఖ్యంగా అనంతపురం జిల్లాలో అగ్రకులం పశువులు, ధనవంతుల పశువులు, మాదిగల పశువులు ఇలా వేరు వేరుగా చూసేవారు.

వేసవిలో మూడు నెలలు గడ్డి ఉంటుందని అందరు తమ పశువులను గడ్డి నిలువచేసే కేంద్రానికి తెచ్చారు. గడ్డి లారీలు ఇంతముందులాగ గడ్డి కేంద్రాలకి రావడం లేదని చిన్నోడు చెబుతున్నాడు. కేంద్రంలోకి రావాల్సిన గడ్డి పక్కదారి పడుతున్నదని గ్రహించారు. మోటారు సైకిల్‌పై వెళ్తున్న యువకుడు పక్కదారి పోతున్న లారీల నుండి గడ్డి దించుకుంటున్నప్పుడు చూస్తాడు. అప్పుడే కొందరు సేద్దిగాళ్ళు. సన్నోడు కూడా వెళ్ళిచూస్తాడు. ఇది సర్కారు గడ్డి అని తమకి ఇష్టం వచ్చినంత లాక్కొని వెళ్తారు. సర్పంచి వచ్చి గడ్డిని మొత్తం పీక్కుపోయిన లారిని చూశాడు. గడ్డి కొనమని జీతగాళ్ళకు చెప్పాను ఇది సర్కారు గడ్డి కాదు అన్నాడు.

సన్నోడు ఇది సర్కారుగడ్డి ఒకరు కొనరాదు. మరొకరు అమ్మరాదు. అని సన్నోడు అనేసరికి జనం అంతా అట్లే ఉండిపోయారు. ఏమి మాట్లాడలేదు. సర్పంచి బిత్తరపోయాడు. కొందరికి నిజమే అనిపించింది. సర్పంచికి ఎదురు మాట్లాడినందుకు కొందరికి కోపం వచ్చింది.

సర్పంచి మనుషులు “మదిగోనికి మరేదలేద? మరేదలేద? యెవుర్ని అనేది? యేది అనేది? నోటికొచ్చిన కూత కూయటమేనా? నోటికి అడ్డూ అదుపూ లేదా? కంపునోరు నాకొడుకు. ఆడేంది? అడగేదేంది? అన్నారు.[72]

సన్నాడు అదికాదు అంటే సర్పంచి జీతగాడు "నోరు మూసుకోవై" అన్నాడు.

మరేద! మరేద! అని హెచ్చరించాడు సన్నోడు. పోతే! మరేదంట మరేద! మరేదలేదు మట్టిగడ్డ లేదు అన్నాడు జీగాడు.

మానం మరేద ఉండల్లప్పా! అణ్నడు సన్నోడు.

పోలే! నీమానం! నీమరేద! అని జీతగాడు అంటే సర్పంచి నోరుమూసుకోమన్నాడు జీతగాన్ని తిట్టినట్లు నటించి మెచ్చుకొన్నాడు.

రేటో, లంచమో దుడ్డు కట్టినారు కదా! ఎవరో అడిగారు. కట్టినారని అంటా ఉండారు మరి అన్నాడు సన్నోడు.

"కట్టినారనే అనుకోవచ్చు గదా!

మీ ఇష్టం;

కాబట్టి గడ్డి సర్పంచిదే!

దొంగగడ్డి! అని సన్నోడు.

దొంగెవరు? అని సర్పంచి గింజుకున్నాడు. దొంగతనంగా గడ్డి తెచ్చుకొన్నారని అర్థం.

'దుడ్డాడ బెట్టి గడ్డి కొండబోరి' అని సర్పంచి

దుడ్డులేదు అని సన్నోడు, గడ్డి లేదు అంటు సర్పంచి లేక యాడబోతాది? యావయితాది? అని సన్నో అంటే మాదిగోనికి చెప్పలా? అని ఎవరో అన్నారు. మరేద! మరేద! దేవరా! మాదిగోడు అనరాదు. 'అంటే యాంజేత్త' అని ఎవరో అడిగారు.

పోలీసులతో పని పడతాడి అని సన్నోడు అంటాడు, సర్పంచి తగ్గాడు. మరెవరూ మాట్లడలేదు. కరణమయ్య మధ్యస్థం చేశాడు. ఊ వాళ్ళు నూటయాభై గేరివాళ్ళు నూటా యాభై కట్టి గడ్డి పంచుకుంటే బాగుంటుంది అని సన్నోడు.

సగం లారీ సన్నోడికి ఇచ్చేటట్టు అందరూ ఒప్పుకున్నారు.

సర్పంచి సరే నన్నాడు. కానీ సన్నోడు ఒప్పుకోలేదు. రావుడు సన్నోన్ని అక్కడి నుండి తీసుకుపోతాడు.

ఇంటికి చేరిన తర్వాత ఇది మోసం అన్నాడు సన్నోడు. 'నిజమే' అన్నాడు రావుడు. సన్నోడు బిత్తరపోయాడు. ఇది మోసమని నాకు తెలుసు ననీ అన్నాడు రావుడు. సన్నోడు మోసం అని తెలిసి

ఎంతకాలం ఇలా బతకాతు ఉండాలి అని సన్నోడు కోపంతో అంటాడు. మారుతున్న తరానికి మార్పు కావాలని కోరుకుంటాడు సన్నోడు. ఎంతకాలం ధనికుల దగ్గర దళితులు నమస్కారాలు చేతులు కట్టుకొని నిలబడాలి అగ్రవర్ణాల వారి దయ వల్ల బతకాలి అన ఒక పట్టుదలతో సన్నాయప్ప పాత్రను చూపించాడు రచయిత.

సర్కారు గడ్డి నవలలో ముఠామేస్త్రీ అనే దళిత పాత్ర ఉంది. ఏ ససమస్యలు వచ్చినా నిమిషాల మీద పరిష్కరిస్తాడు. చాలా తెలివైనవాడు. గొప్ప మాటకారి. నీతిమంతుడు. ఎవరికి ఎంత వస్తుంది, ఎంత మిగులుతుందో సమానంగా వచ్చేటట్లు పంచుతాడు. ఇతడికి ఎలాంటి చెడు అలవాట్లు లేవు అందరిని సమానంగా చూసుకకుంటాడు. హమాలీలు మొత్తం పదనాలుగు ముఠాలు వాళ్ళందరికి పెద్ద ముఠామేస్త్రీ ఒక్కొక్క ముఠాకి ఏడుగురు హమాలీలు ఉంటారు. వీళ్ళందరు గూడ్సులో వచ్చిన గడ్డిని లారీలకు ఎత్తడానికి దించడానికి పనిచేస్తుంటరు. వేసవి కాలంలో మాత్రమే వీరికి పని బాగా దొరుకుతుంది. మిగతా కాలాల్లో దళితులు పస్తులతో, కరువుతో ఎంతో ఇబ్బందులకు గురి అవుతుంటారు.

నవలలో మరికొన్ని దళితపాత్రలు చూస్తే బండోడు, నల్లోడు, కర్రోడు ముగ్గురు ఒక తల్లి పిల్లలు. వీరు సింగనమల నుండి అనంతపురం వచ్చి ఆ పనీ, ఈ పనీ చేసుకొంటూ బతుకు సాగిస్తూ సైకిల్ రిక్షాలు యస్.సి. కార్పోరేషన్ ద్వారా కొనుక్కోవడం జరిగింది. రిక్షాల యజమానులయ్యారు. అప్పులు తీర్చి ఆ ఊరిలోనే పెళ్ళిళ్ళు చేసుకున్నారు.

ఆ రోజుల్లో బస్సు, రైలు తప్ప కాలినడకల్లోని కాని లేకుంటే రిక్షాలో ప్రయాణించేవారు. ఆటోలు, టాక్సీలు ఉండేవి కావు. బండోడు, కర్రోడు, నల్లోడు, రిక్షా ఎక్కే పాసింజరు ఏకులం మనిషి అయినా, ఏమతం మనిషి అయినా, ఎంత సంపన్నుడయినా, ఎంత పేదవాడయినా తన కూర్చోమంటే కూర్చోవాలి. ఎక్కమంటే ఎక్కాలి. దిగమంటే దిగాలి. వానిని వెనుక కూర్చోబెట్టుకొని రిక్షాతొక్కుతుంటే సమానత్వం వచ్చినంత ఆనందం కలిగేది. వీరి జీవనం ప్రశాంతంగా సాగుతున్న సమయంలో బొందలేడు నారపరెడ్డి అనేవాడు వచ్చి ముగ్గురి అన్నదమ్ములకు లారీలు కొనుక్కోమని చెప్తాడు. కొంతసొమ్ము నేనిస్తాను కొంత యస్.సి.కార్పోరేషన్ సహాయం చేస్తుందని చెప్పాడు. చివరికి నారపురెడ్డి ఇచ్చిన అప్పు తీర్చటానికి సొంతలారీలలోనే క్లీనర్లుగా పనిచేసే స్థాయికి దిగజారిపోతారు. వీరు లారీ యజమానులుగా ఎన్నో ఇబ్బందులు ఎదుర్కోవాల్సి వస్తుంది. దళితులంటే చిన్నచూపు ఆర్టీవోతో, పోలీసులతో, బ్రేకు లేదని, హారన్ లేదనీ కండీషన్ సరిగా లేదని, చలానా రాయడం, కట్టటం, ఎక్కువ మాట్లాడితే సీజ్ చేయటం, ఇలా ఎన్నో సమస్యలు ఎదుర్కోలేక పోతారు. నారపరెడ్డి ఇచ్చిన అప్పు తీర్చలేక చివరికి

లారీలు అతని చేతిలోకి వెళతాయి. నారపరెడ్డి దగ్గర పదహేడు లారీలు ఉంటే అన్నీ దళితులు పేరు మీద ఉన్నవే. నేటి సమాజంలో కూడా అక్కడక్కడ నారపరెడ్డి వాళ్ళు ఉన్నారు. దళితులు ఎంత ఇబ్బందులకు గురి అవుతున్నారో రచయిత చక్కగా చూపించారు.

నవలలో ముఖ్యంగా వెంకటేసు, లచ్చువక్క పాత్రలు. లచ్చువక్కది వెంకటేసుది బెళుగప్ప దగ్గర పల్లె. ఇద్దరు ఒకే స్కూలులో చదువుతున్నారు. వెంకటేసు తొమ్మిది నుండి పదవతరగతికి వచ్చాడు. లచ్చువక్క ఏడవ తరగతి. వారిద్దరు వేరు వేరు కులాలు. బడికి వెళ్ళే దారిలో చెట్లకింద, బావి గట్టున, పొలాల మధ్యన, మాట్లాడుకుంటూ ఉన్నారని, ఒకరినొకరు ఇష్టపడుతున్నారని తెలుసుకొని లచ్చువక్కను చదువు మానిపిస్తారు.

"మాదిగోనితోడ నీకేలనే ముదనష్టపు ముండా" అని లచ్చువక్కను వాళ్ళు తిట్టారు; కొట్టారు."

"ఉన్నింటి బిడ్డతో నీకేల సప్పా" అని యంగటేసుని సొంతం వాళ్ళు అదమాయించారు. ఎవరూ వాళ్ళ మనస్సు మార్చలేదు.

"యంగటేసే నా మొగుడు" అని తిరుక్కుంది లచ్చువక్క;

ఆయమే నా బసేలి" అని ప్రకటించాడు యంగటేసు."

సంపుతామన్నారు, సస్తామన్నారు. సావమన్నారు, యాడన్నా సావమన్నారు. పోయి యాడనన్నా సావండి" అని వాళ్ళను బెదిరించారు. ఆ యువతీ యువకుల్ని తోవలోకి తేలేక పోయారు. కానీ ఈ రెండు కుటుంబాల మధ్య గొడవలు పెరగలేదు.[53]

ఒక రోజు తెల్లవారుజామున వాళ్ళు వెళ్ళిపోయి పెళ్ళి చేసుకున్నారు. వాళ్ళది చాలా కలిసి మెలిసి ఉండే దాంపత్యం. కొన్ని సంవత్సరాలు అయిన పిల్లలు కలగలేదు. అయినా సంతోషంగా ఉన్నారు. వెంకటేసు లచ్చువక్క పాత్రల ద్వారా కులాంతర వివాహాలు జరిగితే సమాజంలో మేలు జరుగుతుంది. దళితుల్లోనూ, సమాజంలోనూ చైతన్యం తీసుకురావటానికి రచయిత ప్రయత్నించాడు రచయిత.

నవలలో ముఖ్యంగా దళితరైతుగా రావుడు నలుగురితో కలిసి మెలిసి ఉండే వ్యక్తి. ఎవరు ఏమి చెప్పినా వినేవాడు. రావుడి మాట కాదనరు మాదిటపేటలో. ఎన్నికల సమయంలో మాదిగల్లో ఎవరిని ఓటు అడిగినా ఓబులేసునే అడగమనేవాళ్ళు. రావుని ఎవరు ఓటు అడిగిన మా వాల్లతో అడిగి చెప్తాను అనేవాడు. రావుడు మంచివ్యక్తి, ఎలాంటి రాజకీయం ముసుగు వేసుకోని, కల్మషం లేని మనిషి. రావుడి పాత్రను అలాగే అతనికి లచ్చువుడితో వున్న అనుబంధాన్ని రచయిత చాలా గొప్పగా

చిత్రీకరించారు. రావుడు తన యాభై ఎకరాల పొలాన్ని నిలుపుకోవటం గొప్ప విశేషం. ఒకరిని ఆశించకుండ బతకడం నలుగురితో బాగుండటం అందరిలో తాను ఒకడిగా బతకాలనుకునే మనిషి.

బంజర్లు పంచినప్పుడు రావుడికి తన ముగ్గురు కొడుకులకు ఇరవై ఎకరాలు పట్టా తీసుకోలేదు. ఎందుకంటే తనకు భూమి ఉందని ఏమి లేని పేదలకు ఇమ్మని అర్జీ రాశాడు. ఇలాంటి దయాగుణం గ్రామస్తులకు బాగా నచ్చింది. మంచి పేరుంది.

రావ లచ్చువులు నేలతల్లి పిల్లలు. వాళ్ళ కాయకష్టం భూమి తల్లి ప్రేమ వారిని వారి కుటుంబాన్ని పశువుల్ని రక్షించాయి. కొంతకాలానికి రావలచ్చువులు చనిపోయారు. వారిద్దరి గురించి చూసినవారు వారి స్నేహాన్ని అర్థం చేసుకున్నవాళ్ళు గతం తలచుకొంటూ కథలుగా చెప్పుకునేవారు. జీవితం అంతా శాంతంగా ప్రశాంతంగా ఉండే రావుడు ఊరూ, గేరి అలాగే ఉండాలని కోరుకున్నాడు. రావుడి చివరి రోజుల్లో గడ్డి కోసం గొడవలు పడుతుంటే చూడలేక బాధపడేవాడు..

రావుడు బాగున్నా, బాగా లేకపోయినా, ఇతరుల సుఖాల్ని కోరుకునే వ్యక్తి. ఎవరికి కష్టం రాకూడదు అని కోరుకునే వ్యక్తి. ఊరిలో అందరు కలిసి ఉండాలని ఒరికొకరు ప్రేమగా అన్నదమ్ములుగా ఉండాలని భగవంతుణ్ణి ప్రార్థించేవాడు. అందరినీ ప్రేమించేవాడు. ఊరు గేరి ఏకం చెయ్యాలని చూసిన మనిషి.

నవలలో ప్రధాపాత్ర దళిత రైతుగా రావుడుని చెప్పుకోవాలి. అలాగే సమాజంలో గ్రామాల్లో, దళితవాడల్లో వారు అనుభవించే సమస్యలు, తక్కువ కులం పేరుతో మనుషుల్ని చిన్నచూపు చూడడం, అగ్రవర్ణాల చేతుల్లో కీలుబొమ్మలుగా జీవిస్తున్న దళితుల జీవనం రచయిత నవలలో ఉన్నది ఉనట్టుగా చూపించగలిగారు.

## ఆధార గ్రంథాలు

1. సర్కారు గడ్డి – ఆచార్య కొలకలూరి ఇనాక్

# దుర్గమెడలో హారమయ్యిన 'పుత్తడిబొమ్మ పూర్ణమ్మ'

యల్లావుల శ్రీలత IMA Telugu
హైదారాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం
9010745089

**పరిచయం** గురజాడ అప్పారావు గారి రచనల్లో నాటకంగా 'కన్యాశుల్కం' రచనకి ఎంత ఆదరణ ఉందో, గేయ రచనలలో 'పుత్తడిబొమ్మ పూర్ణమ్మ' గేయకావ్యానికి కూడా అంతే ఆదరణ ఉంది. అంతే జనాదరణ కూడా పొందింది. జనజీవితాల నుంచి వచ్చిన ఇతివృత్తం ఏదైనా జనాదరణ పొందుతుంది ప్రజల హృదయాల్లో చిరస్థా యిగా నిలచిపోతుంది అని పూర్ణమ్మ మరో సారి నిరూపించింది. కన్యాశుల్కం నాటకంలో లాగే ఈ గేయానికి కూడా వస్తువు కన్యాశుల్కమే. ప్రస్తుతం వరకట్నాన్ని పెంచి పోషిస్తున్న సాంఘిక వ్యవస్థలో ఉన్న మనం ఒక్కసారి ఆకాలంలోకి పరకాయ ప్రవేశం చేస్తే నాటి స్థితిగతులు, ఆడవాళ్ళ జీవితాలలోని దయనీయ పరిస్థితులు మనకు అవగతం అవుతాయి. ఇప్పుడున్న వరకట్నానికి కన్యాశుల్కం పూర్తిగా వ్యతిరేకం.

బాల్యవివాహపు ఉక్కుకోరల్లో చిక్కుకొని బలైపోయిన ఒక అమాయక బాలిక దీనగాథ, పాషాణ కఠిన కర్కశ హృదయమైనా కరగించి పారేస్తుందిఈ గేయనాటిక ఒక చక్కని .ఇందులోని ఛందస్సు కూడ క్రొత్తదే . గురజాడ సృష్టించిన .నృత్య గేయనాటికగా ఆంధ్రదేశంలో ఎంతో పేరు గడించింది"పుత్తడి బొమ్మ పూర్ణమ్మ" అనే గేయ నాటకం ఇప్పటికీ తెలుగు వారి కంట తడి పెట్టిస్తూనే ఉంది.

పెళ్ళి అనే ఆచారం సంఘంలో కుటుంబవ్యవస్థను పరిపోషించే చక్కని సాధకంగా కాక రక్తమాంసాలను విక్రయం చేసే వ్యాపార వ్యవస్థగా ఎప్పుడైతే మారిందో అది సమాజాన్ని పీడించే దురాచారంగా మారింది. కన్యాశుల్కం ఆచారం కొనసాగుతున్న ఆ సమాజంలో ఆడపిల్లలకు పెళ్ళిచేయడం అంటే ఆమెకు సాంఘికమైన కట్టుబాటు గల కుటుంబజీవనం ఏర్పాటుచేయడానికి అందులో భాగంగా తమ బాధ్యత నెరవేర్చుకోవడంగా కాక వారిని పెళ్ళి పేరుతో జరిగే క్రయవిక్రయాలలో ఒక వస్తువుగా భావించారు తల్లితండ్రులు.స్త్రీ పురుషుల మధ్య జరిగే వివాహం సమాన వయస్కుల మధ్య జరిగే సాంఘిక వ్యవహారంగా ఉంటే సమస్య లేదు. కానీ పూర్తిగా ఐదేళ్ళు కూడా నిండని పసిపిల్లలను, (అంతెందుకు తల్లి కడుపులో ఉన్న శిశువు ఆడపిల్ల అయితే వివాహమాడడానికి సిద్ధపడిన వారూ ఉన్నారుట) కన్యాశుల్కానికి ఆశపడిన పిల్లల తల్లితండ్రులు భార్య చనిపోయిన ముసలివారు, రోగిష్టివారు అని కూడా చూడకుండా తమ ఆడపిల్లలను వారికి ఇచ్చి పెళ్ళి చేసేవారు. అటువంటి కన్నెపిల్లలను పెళ్ళి చేసుకోవడానికి జరిగే పోటీలో వీలున్నంత ఎక్కువ ధనం చెల్లించి బేరం కుదుర్చుకొని పెళ్ళి చేసుకునే వారు ఆ పెళ్ళి కొడుకులు. అటువంటి పెళ్ళి కొడుకులంతా కనీసం యాభై సంవత్సరాలు దాటినవారి దగ్గరనుంచి, కాటికి కాళ్ళుచాచుకున్న ముసలి తనంతో ఉండేవారు.

"ఇంతటి ఘోరమైన పరిస్థితి సమాజానికి సిగ్గుచేటని, ఇటువంటి దురాచారాన్ని ఎండగట్టి, ఉన్నతమైన నైతిక ప్రమాణాలను వ్యాపింపచేయడానికి మించిన కర్తవ్యం సాహిత్యానికి మరొకటిలేదు" (కన్యాశుల్కం నాటకానికి గురజాడ రాసిన ముందుమాటలో) - అని గట్టిగా విశ్వసించిన గురజాడ తన సాహిత్యం ద్వారా అందుకు నడుం కట్టారు.

సమాజంలోని ఈ దురాచారానికి బలి అవుతున్న బాలికల పట్ల అత్యంత కరుణతో, వారికి సమాజం చేస్తున్న దురన్యాయాన్ని కళ్ళకు కట్టే ఉద్దేశంతో అటువంటి చిన్నారి బాలికలకు ప్రతినిధిగా పూర్ణమ్మ అనే పాత్రను సృష్టించి కథనాత్మక మైన కావ్యంగా, అత్యంత కరుణరస ప్లావితమైన రసభరితమైన గేయంగా పూర్ణమ్మ కథ పేరుతో ఈ రచన చేసారు గురజాడ. 'పుత్తడిబొమ్మా పూర్ణమ్మా'అంటూ అందచందాల రాశిపోసిన ముగ్ధ అయిన ఓ కన్య బ్రతుకు, మూఢాచారానికి బలయిన తీరును ఈ కథలో వివరించారు గురజాడ.

మేలిమి బంగరు మెలతల్లారా !
కలువల కన్నుల కన్నెల్లారా !
తల్లులగన్నా పిల్లల్లారా !
విన్నారమ్మా యీ కథను ?

పాట ప్రారంభంలో ముగ్ధమనోహరంగా విరిసీ విరియని పూలలాగా ఉండే చిన్నారి బాలికలను ఉద్దేశించి కవి స్వచ్ఛమైన బంగారంతో చేసిన తీగలలాంటి శరీర .కథనాత్మకమైన తన పాటను ఇలా ప్రారంభిస్తారు- లావణ్యం, కలువలలాంటి తీర్చిదిదిన కనుదోయితో బాల్యం నుండి యవ్వనంలోకి అడుగుపెడుతున్న బాలికలను వర్ణిస్తూ, వారిని సంబోధిస్తూ, వారికోసమే ఈ కథను చెప్పడానికి ఉపక్రమిస్తారు కవివిన్నారమ్మా . .ఈ కథను అంటూ తాను చెప్పబోతున్న కథలోకి వారిని తీసుకువెళ్తున్నారు

**విషయం** ఈ గేయం ప్రారంభంలో ముగ్ధమనోహరంగా విరిసీ విరియని పూలలా ఉండే ఒక పసి బాలలని ఉద్దేశించి కథను చెప్పడం ప్రారంభిస్తారు. యవ్వనంలోకి అడుగుపెడుతున్న చిన్నారి పొన్నారి బాలికలను వర్ణిస్తూ వారిని సంబోధిస్తూ వారికోసమే ఈ కథను చెప్పడానికి పూనుకుంటాడు కవి. విన్నారమ్మా ఈ కథను, కన్నారమ్మా ఈ కథను అంటూ వారిని కథలోనికి తీసుకెళ్తాడు. ప్రధానంగా మనకు ఇందులో బాల్యవివాహలు వల్ల, కన్యాశుల్కం వల్ల ఎంత బాలల జీవితాలు ఎంత హృదయవిదారకంగా ముగిసిపోతున్నాయో తెలియ చెప్పడం జరిగింది. అమ్మానాన్న ల మధ్య, అన్నదమ్ముల మధ్య ఎంతో గారాబంగా పెరిగిన పూర్ణమ్మను చివరకు కాటికి కాళ్ళు చాపిన ఒక ముసలి వాడికి ఇచ్చి పెళ్లిచేయడంతో తన జీవితం దుఖాసాగరంలోకి నెట్టివేయబడుతుంది. తనతోటి వారంతా ఆడుకుంటుంటే తను మాత్రం పెళ్లి చేసుకొని అత్తారింటికి వెళ్లవలసిన పరిస్థితి. అందరూ ముసలితాతను పెళ్లాడవు, నీ మొగుడు ముసలితాత

అని హేళన చేస్తుంటే తట్టుకోలేకపోతుంది. చిన్నారి హృదయం బద్దలవుతుంది. దుర్గమ్మకు దండం పెట్టుకొని వస్తానని వెళ్లిన పూర్ణమ్మ ఇక తిరిగిరాదు.

**ముగింపు** కవి చాలా తెలివిగా ముగింపునివ్వడం అద్భుతంగా ఉంటుంది .సాయంకాలం గడిచిపోతుంది .రాత్రి చిక్కనవుతోంది. కొండలు కోణాలు అంతా గుప్పు గుప్పున చీకట్లు కమ్ముకుంటున్నాయి . అర్ధరాత్రి పూట వేతకు వెళ్లే క్రూర జంతువులు తిరిగే కాలం కూడా సమీపిస్తుంది .అయినా పూర్ణమ్మ ఇంకా ఇల్లు చేరుకోలేదు .దుర్గామెడలో హారములమరెను' అన్న వాక్యంలో పూర్ణమ్మ దుర్గ గుడిని చేరుకుంది అన్న విషయాన్ని గ్రహిస్తాం పూర్ణమ్మ ఏమయ్యిందనే విషయాన్ని .పాఠకుల ఊహకు వదిలేసి వారికి రసానందాన్ని కలిగించడం ఇక్కడ కవి గొప్పతనంగా భావించవచ్చు .

మనిషి జీవితంలో డబ్బుకి వుండవలసిన దానికన్నా ఎక్కువ ప్రాధాన్యం వుండడమే చాలా అనర్థాలకు హేతువుమనిషిలోని ధనలోభం ., కన్యాశుల్క దురాచారం, పూర్ణమ్మలాంటి కన్యల కన్నీటి గాథలకు హేతువులుగా ఈ గేయంలో గురజాడ చిత్రీకరించారు.

వ్యక్తి స్వార్థాలకు, సంకుచితత్వాలకూ వ్యవస్థను అడ్డుపెట్టుకోవడం ఆనాటి నుంచీ జరుగుతున్నదే . .ఆ సంస్కరణ అమలులోకి రావాలంటే మనిషిలో మార్పు రావాలి .వ్యవస్థను అధికారంతో సంస్కరించవచ్చు మనిషిలో మార్పు రానపుడు సమస్య తాత్కాలికంగా సమసిపోయి తదుపరి రూపాంతరం చెందుతుందే తప్ప .సమూలంగా నాశనం కాదు.

పూర్ణమ్మ కథ ముగింపు ఒక మహాకావ్యాన్ని పూర్తిచేసిన అనుభూతిని కలిగిస్తుందని శ్రీశ్రీ అన్నారు . ఛందస్సు, కథావస్తువు, రచనా విధానం, భాష ఇలా అన్ని విషయాల్లోనూ సరికొత్త రీతిని అనుసరించి, 'పూర్ణమ్మ కథ' ఒక శాశ్వతమైన గొప్ప రచనగా రూపొందించారు గురజాడ .'కన్యాశుల్కం' వల్ల ఏమి సాధించిందో అంతకుమించి 'పూర్ణమ్మ' వల్ల ఆయనకు లభించిందిఒక పూర్ణమ్మ గేయం చాలు గురజాడను . సంఘ సంస్కర్తగా నిలిపేందుకు, సాహితీ సామ్రాజ్యానికి 'పట్టం' కట్టేందుకు .'అల్పాక్షరముల అనల్పార్థం' అంటే ఇదేపూర్ణమ్మ ద్వారా కథాకథనంతోపాటు రసపోషణలతోపాటు ., పద ప్రయోగ వైచిత్రిని ప్రదర్శించి కావ్య జీవితాన్ని ధ్వనింపజేశాడుకాన రమణారెడ్డి .అసలు కథా ప్రారంభమే ఒక ఉత్కంఠతో పరితల్ని ఆకర్షిస్తుంది . మాటల్లో'పూర్ణమ్మ చనిపోలేదుభర్త ఇంటికి పోవడానికి మారుగా .ఆమెది ఆత్మహత్య కాదు ., లోకేశ్వరి ఇంటికి పోయింది' అనడం యథార్థం.

## శ్రీనాథుడు సీసపద్యమును నిలబెట్టెను!

- వి. వీరబాబు
పరిశోధక విద్యార్థి,
తెలుగు & ప్రాచ్య భాషా విభాగం,
ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం.
Email : veerendranath00@gmail.com

"శ్రీనాథు(డు సీసపద్యమును (జెడగొట్టినా(డు" అన్న కవిసమ్రాట్ విశ్వనాథ వారి విమర్శ సాహిత్యలోకంలో సుపరిచితాభిప్రాయం. చిరంతనులైన ప్రాచీన సాహిత్య పండితుల జిహ్వాంచలాలపై ఈ విమర్శ నేటికీ నర్తిస్తుండడం లోకవిదితమే. మౌఖికమైన విమర్శ యిది కేవలం ఒకానొక ప్రత్యేక సందర్భంలో ఒక విశిష్ట సాహిత్య ప్రసంగవశాత్తూ మధ్యలో ఆగ్నేయాస్త్రంలా దూసుకొచ్చిన అభిప్రాయం యిది. 'కవి సమ్రాట్ వ్యక్తిత్వాన్ని "దారుణాఖండల శస్త్రతుల్యమై"న వాగ్వైఖరిని ప్రత్యక్షంగా చూచి, విన్న సాహితీవేత్తలెందరికో ఆయన నిత్యనవనీత సమమైన నిండు మనస్సు కూడా లేశమైనా తెలియకపోదు. విశ్వనాథవారు ఒక విషయాన్ని విమర్శించినా అందులోని ఉద్దేశ్యం కేవలం సాహిత్యమే పరమార్థంగా, పరమావధిగా ఉంటుంది. కాళిదాసు, నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, నాచన సోమనాది కవులందరి సాహిత్య నైపుణ్యాన్ని అవలోడన చేసి, ప్రశంశించిన విశ్వనాథ శ్రీనాథ మహాకవిని కూడా ఆవిధంగానే మన్నించినట్లు, గౌరవించినట్లు ఈ క్రింది వారి వాక్యాలలోనే తెలుస్తుంది.

"శృంగార నైషధము, హరవిలాసము, భీమఖండము, కాశీఖండము - ఈ గ్రంథములు చదువని సాహిత్యవేత్తయుండడు. శ్రీనాథు(డు తెలు(గు కవిత్వములో గొప్ప ధారాశుద్ధియను గుణమును పద్యమునకు ప్రధానముగా స్థాపించి వెళ్ళెను . . . . . దేశములు తిరిగి పలుచోట్ల శత్రువుల నోడించి దిగ్విజయము చేసి కవితా జయస్తంభమును నాటిన మొదటి తెలు(గు కవి యీయనయే యనవలయును. ఈయన పద్యము లఖండధారా సమన్వితములై యుండును. ఆంధ్ర సారస్వతములో తరువాతి తక్కిన కవులకు సీసపద్య రచయం దీయన పెట్టినదే భిక్ష" (చూ.కావ్య పరీమళము. పు. 115).

శ్రీ విశ్వనాథ వారు పైరీతిని శ్రీనాథ మహాకవిని పూజించినా, ఆంధ్ర సారస్వతంలో శ్రీనాథుని చిరదీప్తిని అమరవాణీ ప్రసారంతో అజరామరం చేసినా, శ్రీనాథుని సీసపద్యంపై ఒక ప్రత్యేక సందర్భంలో విశ్వనాథ వెలిబుచ్చిన అభిప్రాయమే సాహిత్యవేత్తల మస్తిష్కంలో తిష్ఠ వేసుకుని ఉన్నది. సదసద్విమర్శలలో దేనికి వ్యాప్తి కలిగినా, అది దాని హేతుబద్ధతను, విమర్శనారీతిని బట్టి కలుగుతుంది. విమర్శనారీతి స్పష్టమై, నిర్దుష్టమై "కుండబ్రద్దలు కొట్టిన"ట్లుంటే ఆ విమర్శ సహజంగానే ఆకర్షణీయం. విశ్వనాథ విమర్శనారీతి, వాగ్వైఖరీ, నిశ్చితాభిప్రాయాభిసంధి ఆయన పై విమర్శనే సజీవం గావించాయి. నిజానికి శ్రీనాథుడు సీసపద్యానికి ఎంత ప్రసిద్ధి, ప్రచారం కల్పించాడో, సీసపద్య నిర్మాణంలో శ్రీనాథునిదైన విన్యాసం ఎటువంటిదో సాహితీ జగత్తుకు తెలియనిది కాదు. కవికీర్తిని మసకబారించే ఇటువంటి అనైకాంతికాభిమతాల్ని సాహిత్య లోకంలో ప్రస్తావించడం వలన ప్రయోజనం శూన్యం. విశ్వనాథ విమర్శించిన పద్యం శృంగార నైషధంలోని కృతిపతివంశావతార వర్ణనలోని "కాలకంఠ కఠోర కంఠ హుంకారంబు . . . . ." అనే 35వ పద్యం. పై పద్యంలో శ్రీనాథుడు కృతిపతి సోదరుడైన మామిడి వేమనను దండనాయక చూడామణిగా కీర్తించాడు. ఈ గుణస్తావక సీసంలో ఉదేశ్యమైన వేముని గుణగణాలకు, విధేయాలైన మన్మథ, సముద్ర, వింధ్య, చంద్రాదులకు మధ్య నియతపూర్వకాలికత్వం లోపించిందని విశ్వనాథ విమర్శన. ఉద్దేశ్య, విధేయాలలో విధేయానికి పూర్వకాలికత, ఉద్దేశ్యానిది ఉత్తరకాలికత్వమని విశ్వనాథ న్యాయాన్ని ఆశ్రయించారు. అయితే ఉపమాన స్వభావరీత్యా మాత్రం ఉపమాన, ఉపమేయాల మధ్య పూర్వోత్తర సమకాలీనత కృతులలో అంగీకర్యమే. ఉద్దేశ్య, విధేయ ప్రస్తావన ఉపమేయోపమాన సంబంధమున్న చోట అన్నింటా వర్తించదు. కాబట్టి శాస్త్ర, లోకాలలో వ్యవహార సత్యంగా అంగీకరించబడినప్పటికీ కావ్యంలో ఈ సంబంధం అనైకాంతికమే అనవలసి వస్తుంది. శ్రీనాథుడు వేమనను తొల్లిటి మదనునిగా, సముద్రునిగా, వింధ్య, చంద్రాదులుగా ఉపమించుటలో నిర్దోషమైన గుణస్తావన కోసమే గాని, ఉద్దేశ్య విధేయ సంబంధం లక్షించినట్లు కనిపించదు. తొల్లిటి వారనగా ఏవిధమైన శృంగభంగాల్ని ఎదుర్కోని స్వశక్తియుక్త ధీమంతులని చెప్పడం ఇక్కడి ఉపమానశుద్ధి. అనంతర కాలంలో వారందరూ రుద్ర, రాఘవ అగస్త్యాదుల వలన భంగపాటు పొందారు. శిక్షింపబడ్డారు. కాని వేమన మాత్రం వక్తవ్యగుణపరంపరలలో వారి తొల్లిటి స్థితినే కలిగి ఉన్నాడు. అందుచేత వారి తొల్లిటి స్థితి మాత్రమే ఇక్కడి ఉపమానమాలిక. నిర్దోషమైన వారి వారి గుణాలు వారిలో, వేమనలో సమానమైనా వారు భంగపడి నింద్యులయ్యారు. వేమన మాత్రం స్తుత్యుడు. వారికంటే ఆధిక్యం కలిగి ఉన్నాడని వ్యంగ్యార్థం అలంకార పరిష్కృతమవుతున్నది. ఇటువంటి అనైకాంతికాభిప్రాయాలు భిన్నభిన్నాలుగా సాహిత్యలోకంలో ఉంటాయి. అయితే వాటి ప్రామాణికతను నిర్ధారించుకోవడం మాత్రం సాహిత్యవేత్తల కర్తవ్యం.

శ్రీనాథ మహాకవి సీసపద్యానికి తరువాతి కవులకు భిక్ష పెట్టినవాడని విశ్వనాథవారి పైవాక్యమే తెలుపుతుంది. కాబట్టి శ్రీనాథుని సీసపద్య నిర్మాణ విన్యాసాల్ని, ఛందోవైవిధ్యతలను పరిశీలించవలసిన ఆవశ్యకం కలదు. శ్రీనాథుడు తెలుగుపద్యానికి ధారాశుద్ధి అను గుణాన్ని పట్టించినవాడని భట్టుమూర్తి నరసభూపాలీయంలో "శ్రీనాథుని పదప్రసిద్ధ ధారాశుద్ధి" అన్నాడు. ఆ ధారాశుద్ధి నిరంతరధారగా ప్రవహించింది ప్రధానంగా సీసపద్యాలలోనే. సీసపద్యం ఆరు ఇంద్రగణాలు, రెండు సూర్యగణాలు పాదానికి రెండు ఖండాలుగా, రెండు గణాలకు పిదప యతి నియతితో ఉంటుంది. వెనువెంట ఒక తేటగీతి, ఆటవెలదులలో ఒక దానితో ఉంటుంది. ఈ గీత పద్యాలనే ఎత్తుగీతి అంటారు. సీసపాదాలకు ఈ గీతుల్ని ఎత్తుపెట్టినట్లుండడం వలన ఎత్తుగీతి అనబడుతుంది. యతిగాని, ప్రాసయతిగాని పాటించవచ్చు. ఇది సీసపద్య సామాన్య లక్షణం. ఇక సీసంలోని ప్రాస మరియు యతుల స్థాన నియతిని బట్టి వాటిలో భేదాల్ని ఆంధ్ర లాక్షణికులు ప్రపంచించారు. అనంతామాత్యుడు అందరికంటే మిన్నగా 10 భేదాల్ని వివరించాడు. కవిజనాశ్రయకారుడు ఆరింటిని, అప్పకవి-7, విన్నకోట పెద్దన-6, పొత్తపి వేంకటరమణకవి-12 భేదాల్ని చెప్పి వేర్వేరు పరిభాషలలో ఒకరు పఠించినదే ఇంకొకరింకొక పేరుతో పఠించారు. అయితే చిరంతనులైన ప్రాచీన కవులెవ్వరూ ఈ భేదాల్ని కృతులలో ప్రదర్శించలేదని పరిశీలకుల అభిప్రాయం.

శ్రీనాథ మహాకవి కూడా ఈ సీస ఛందో భేదాల్ని పూర్తిగా నడిపినవాడు కాడు, శ్రీనాథుని సీసాలన్ని ముఖ్యంగా సమసీసాలే. సామాన్య సీసానికి ఏ లక్షణాలుంటాయో ఆ లక్షణాలున్నది సమసీసము. మరియు తరచుగా వడిసీసము, అక్కిలివడి సీసాలను పాక్షికంగా నడిపించుట కనిపిస్తుంది. తెలుగుకే ప్రత్యేకమైన పాదాద్యక్షర మైత్రి రూపయతినే శ్రీనాథ మహాకవి ఉపయోగించడం శ్రీనాథుని భాషాగుణదీక్షను వెల్లడిస్తుంది. యతితో బాటు పూర్వ, పశ్చిమాలలో ఏదో ఒక ఖండంలో ప్రాసయతిని సవర్ణప్రాసను వినియోగించడంలో ధారాశుద్ధి కుంటుపడనీయని జాగరూకత దర్శనీయం. ఈ క్రింది ఉదాహరణ శ్రీనాథుని సీస ధారాశుద్ధిని నిరూపిస్తుంది.

సీ. ప్రత్యర్థి సార్థ సార్థక నామధేయుండు
భూమీశ్వరుండొప్పు భీము(డన(గ
నారాజుఃత్రిదివంబు నమరేంద్రుడును బోలె(
దేజంబున విదర్భదేశమేలు
దమనాహ్వయుండైన తపసి సద్వరమున
గాంచె నాత(డు కన్యకాలలామ
సర్వలోకాంగనా సౌభాగ్యగరిమంబు
దమియించు కతమున దానినామ

తే. మ(భ భారతి దమయంతి యంచునొడివె(
దద్గుణంబులు వర్ణింప ధరణినాథ
యబ్జ సూతికినైన శక్యంబుగాదు
పలుకు(బూ(బో(డి కైనను నలవిగాదు !

శృంగార నైషధ ద్వితీయాశ్వాసం నందలి ఈ సీసంలో శ్రీనాథుని సహజ ధారాశుద్ధి ప్రదర్శింపబడినది. ద్వితీయాశ్వాసంలో హంస నలుని చేతి నుండి విడివడి, ప్రత్యుపకార పూర్వకంగా దమయంతిని గురించి నలుని వద్ద వర్ణించిన పద్యం ఇది. ఈ సందర్భంలో హంస ద్వారా నాయకుడైన నలునికి నాయికను గురించి, ఆమెను కన్నవారి గురించి, ఆమె జన్మప్రాశస్త్యాన్ని గురించి ఒకటే పద్యంలో పాదానికొక్క జన్మవృత్త విషయాంశాన్ని పరిచయం చేస్తూ, ఆ పాదాలలోనూ గల ఖండాలు సహితం వేర్వేరు విషయ సంకలితాలయి ఉండుట ద్వారా మొత్తం జన్మ వృత్తాంతమంతా సీసపద్యంలోనే గుదిగ్రుచ్చిన శ్రీనాథుని సీసకథన ధారాశుద్ధి నిత్యానూషతమైనది. తుదకు ఎత్తుగీతి చివరి రెండు పాదాలకు వచ్చేటప్పటికీ "అబ్జ నూతికినైన శక్యంబు కాదు ! పలుకు(పూ(బోడికైనను నలవిగాదు" అని దమయంతి సౌందర్యాది గుణవర్ణనా ప్రపంచానికి ప్రబంధ సన్నివేశాన్ని మలచడం ధారాశుద్ధికి పరమార్థం. ప్రథమ పాదంలో పూర్వఖండమున రేఫ వర్ణఘటిత స్వరయతి, పశ్చిమ ఖండంలో సవర్ణయతితో బాటు కూర్చిన ప్రాసమైత్రి, ద్వితీయ పాదంలోని పూర్వోత్తర ఖండములలోనూ సవర్ణయతి, తృతీయ, చతుర్థ పాదఖండములలోని మరియు ఎత్తుగీతిలో సర్వత్ర పాటించిన సవర్ణయతి, వ్యంజనయతులు, ఎత్తుగీతి చతుర్థ పాదం నందలి దేశ్యములైన "పలుకు, అలవి" శబ్దముల ప్రాసమైత్రి మున్నగు లక్షణ, లక్షణేతర విశేషాలెన్నో శ్రీనాథుని ఈ సీసమును శృంగారిస్తున్నాయి. ఇక

వృత్తపరమైన ఔచిత్యమేమనగా – నాయిక దమయంతి ప్రబంధంలో పూర్వ వృత్తంలోనే వర్ణింపబడింది. ఆమె సౌందర్యాది గుణ ప్రపంచం మాత్రం ప్రస్తుత విషయం కాబట్టి ఆ సందర్భౌచిత్యం బట్టి నాయిక జన్మ వృత్తాంతం అంతా ఒక శ్రీనాథుని సహజధారా తురస్వేయమైన సీసంలో ఒదిగినది.

సామాన్యంగా శ్రీనాథుడు వెలయించినవి సమసీసములే. లాక్షణికులు నిరూపించి ఇతర సీసభేదాల్ని శ్రీనాథుడు క్వాచిత్కంగా కూడా ఉపయోగించలేదు. శృంగార నైషధంలో మాత్రం ఒక వృత్త ప్రాససీసంను యోజించాడు.

సీ. “తన కృపాణము సముద్ధతవైరి శుద్ధాంత
తాటంకములకెగ్గు(దల(చుచుండ(
దన బాహు పీఠంబు ధరణి భృత్కమఠాహి
సామజంబులకు విశ్రాంతి యొస(గ(
దన కీర్తి నర్తకి ఘనతరబ్రహ్మాండ
భువనభూముల గొండ్లి(ఒరిధవిల్ల(
దన దాన మహిమ సంతానచింతారత్న
జీమూత సురభుల సిగ్గుపరుప
తే. బర(గు శ్రీ వేమ మండలేశ్వరుని మంత్రి
. . . . . . . . . . . . . . . . . . . . ”

కృతిపతి ప్రశంశావసరంలోని పద్యమిది వృత్తపద్యం వంటి ప్రాస నియమం కలిగి వృత్తప్రాస సీసభేదమును చెందుతున్నది. పాద ఖండాలలో సర్వత్ర వడినియమం, నైవర్ణ, సవర్ణ, సాజాత్యయతులు కలిగి శ్రీనాథమహాకవి సీసపాఠమునే వివృతీకరిస్తుంది. శ్రీనాథునీ భీమఖండంలోని ఈ క్రింది పద్యం కూడా శ్రీనాథుని సీసవిశేషం అనదగినది.

సీ. “సరివచ్చు ననవచ్చు శతమన్యు వీటికి
వివిధ దేవాగార విభ్రమమున(
బ్రతివచ్చు ననవచ్చు (బాలమున్నీటికి
నక్షయంబగు జీవనాభివృద్ధి
నెనవచ్చు ననవచ్చు నిందుబింబమునకు(
సకల కళావిలాస ప్రవృద్ధి
దొరవచ్చు ననవచ్చు (దోయజాక్షుని మూర్తి
కభిరామలక్ష్మీ సమగ్రమహిమ
గీ. జెప్ప నొప్పదె యప్సర స్త్రీ సహస్ర
. . . . . . . . . . . . . . . . . . . . .
. . . . . . . . . . . . . . . . . . . . .
. . . . . . . . . . . . . . . . దక్షవాటి.

ఈ సీసంలో శ్రీనాథ మహాకవి తన సహజ ఛందోశిక్షకు భిన్నంగా సీసపాదాలలోని పూర్వఖండాలలో ఏకపదప్రాసను ఉపయోగించి దక్షవాటీపుర సంపద్గుణాల్ని అమరావతి, క్షీరాబ్ధి, చంద్రుడు, విష్ణువు మొ॥న అతిలోక సౌందర్యద్రవ్యాలతో ఉపమించాడు. సహజంగా సమసీసానికే మిక్కిలి కట్టుబడిన మహాకవి భీమఖండంలో ఈ సీసవిశేషాన్ని ప్రకటించాడు. గీతరహిత సీసమనే ఒక సీసభేదంలో ఈ ఏకపదప్రాస నియమం చెప్పబడినది. లక్షణశిరోమణికారుడే భేదాన్ని ప్రదర్శించాడు. నిజానికి శ్రీనాథ మహాకవి సీసమే కాక, కందము, గీతులు, క్వాచిత్కంగా స్రగ్ధరలు మున్నగునవి వృత్తములతో బాటు నిసర్గ కవితా మాధుర్యంతో నిష్పన్నమైనవి భీమఖండంలోనే. ఇతర ప్రబంధాలన్నీ వివిధ ప్రముఖ వస్తు సంవలితాలు కాగా, భీమఖండ, కాశీఖండాదులు మాత్రం కవి గాఢ ప్రతిభా సమున్మేషణకు కేంద్రాలైనవి. పౌరాణిక విలసనంతో పైకివచ్చే శ్రీనాథుని ప్రబంధ సీసాలే అర్వాచీన ప్రబంధ కవులకు నిర్మాణ శిక్షను నేర్పాయి. కాశీఖండంలోని ప్రతి అశ్వాసంలోనూ శ్రీనాథుడు తీర్చిన మణిశలాకల వంటి సీసాలు అద్భుత నిర్మాణ చాతుర్యంతో, సంస్కృత పద వ్యామిశ్రితమై అలరారుతాయి. పురాణ కథాఖండాల ఆంధ్రీకరణంలో శ్రీనాథుడు ఎంత గడితేరిన మహాకవో ఆయన ప్రబంధాలు నివేదిస్తాయి. “త్ర సరేణు పరిమాణ ధాతు ధూళీపాళి” (కాశీ. 1.90), “చిరుసాన(బట్టిన చికిలి నేయించిన”, “ప్రాలేయ కిరణ బింబంబు వెల్వెల(బాఱి” (కాశీ. 1.121), “తఱపి

వెన్నెలలోని ధావళ్యమొకకొంత" (కాశీ. 1.123), "దుర్దండఘట్టన త్రుటిత గ్రాహగ్రావ" (కాశీ. 1.137) మరియు వింధ్య పర్వతం త్రైలోక్య ప్రతిబంధకం కాగా "లేవయ్యో స్వాహాస్వధావ షట్కారంబు" (కాశీ. 1.137), "పూచిన కొరవిపూబోదరింటి చందాన" (కాశీ. 1.138) వంటి సీసములు శ్రీనాథ మహాకవి ప్రతిభాప్రౌఢ పరిపాకానికి, ఉపజ్ఞా బలానికి మచ్చుతునకలు. అన్నింటికీ ఆయన సాహిత్యానికే మకుటాయమానమైన మయూరుని సూర్యశతక శ్లోకాల ఆంధ్రీకరణలో ప్రధానంగా అవతరించినవి శ్రీనాథుని సీసపద్యాలే. పాషాణముల వంటి స్రగ్ధరలు శ్రీనాథుని సీసపు మూసలో కరిగి, శ్రీనాథుని ప్రతిభాసైంధవ ధవళ వాక్ఫేనములై విరాజిల్లుతున్నాయి. "కాశికా నగరంబు కడ సీమమున నున్న" (కాశీ. 1.47), "ధర్మంబు కాశికామధ్య స్థానంబున (కాశీ. 1.50), "ఉర్వీధర శ్రేణులుఖ్యాత లూగంగ" (కాశీ. 1.51) వంటి సీసపద్యాలు కాశీనగర పురాణ ప్రశస్తిని ప్రత్యక్షరంలో పృణీహితంగావించుకున్న శ్రీనాథుని సీసపద్యాలు ఆయన ప్రబంధాన్ని శృంగారిస్తూ, రుచిషీయం, సుశ్లోకం కావిస్తున్నాయి. హరవిలాసంలో క్షీరాబ్ధి మథన సమయంలో దేవాప్సరస్త్రీలు ఉద్భవించిన సన్నివేశం కూడా శ్రీనాథుని సీసమే ప్రదర్శించింది.

సీ. మధుకరంబులు గాని మధుకరంబులుగావు
　　రమణీయ వేణీభరములు గాని
శశిబింబములు పుట్టె శశిబింబములుగావు
　　మహిత వక్త్రేందుబింబములుగాని
మెఱు(గుదీ(గలు బుట్టె మెఱు(గుదీ(గలు గావు
　　లలిత కోమలతనూలతలు గాని
చక్రవాకులు పుట్టె(జక్రవాకులు కావు
　　కఠినంబులగు చన్ను(గవలుగాని
తే. యన(గ మకరందవ్యాప్తి చలిత . . . . .
. . . . . . . . . . . . . . . . . . . ."

పై పద్యం శ్రీనాథుని భావనా చమత్క్రియాభరితమైన సీసం. అప్సర:స్త్రీలు ఉద్భవించిన క్షీరాబ్ధి జనిత పదార్థాలలా వారి కచకుచవక్త్రతనూలతలు భ్రాంతి గొల్పినాయని తెలియజేస్తూ, అవి క్షీరాబ్ధి నుండి కలిగినట్లు అప్సరాంగనలూ ఉద్భవించారని చెప్పుటలో అప్సర:స్త్రీలకున్న సౌందర్య విభవమంతా వారికి జన్మతో సిద్ధించిందని, అప్రతిమానమైనదని వ్యంగ్యార్థాన్ని ధ్వనింపజేశాడు. ఇట్లు ధ్వనివంతాలైన భావనలు కూడా సీసపద్యంలో స్థగితం చేస్తూ, పాంక్తమైన సీసపద్యమున ప్రతిపాద పూర్వార్థంలో ఏకపదప్రాసను నిర్వహిస్తూ, తెలుగుకే ప్రత్యేకమైన వడిని పాటిస్తూ, స్వరవ్యంజనోభయ యతుల్ని అనుబంధిస్తూ, వర్ణపదవాక్య గతమైన తూగును, లయను కొనసాగిస్తూ సీసపద్యాన్ని అపూర్వరమణీయం చేయడం శ్రీనాథ మహాకవికే చెల్లింది. శృంగార నైషధంలో శ్రీహర్షుని శ్లోకాల ఆంధ్రీకరణలో శ్రీనాథునికి ఉపాధేయాలైనవి సీసపద్యాలు, శిష్టవచన పరంపరలే అనడం అతిశయోక్తి కాదు. అతి వేలమైన శ్రీహర్షుని ప్రౌఢసుందర శ్లోకాలు ఎన్నో యథాతథంగా ఆంధ్రీకరింపబడినప్పటికీ, అనేకచోట్ల శ్లోకాల్ని ఏకంగా పాదానికొక్కటి చొప్పున సీసపద్యంలోనే శ్రీనాథకవి ఇమిడించాడు. అటువంటి సీసములు శృంగార నైషధంలో - 132 కలవు. హరవిలాస ప్రబంధంలోని సీసములు 92, భీమేశ్వర పురాణం శ్రీనాథ మహాకవి కవితా సాంద్రతకు గీటురాయి. వృత్తాలు, కందాలు, గీతులున్నప్పటికీ శ్రీనాథుని ఆత్మీయత గల పద్యాలన్ని సీసంలోనే దర్శనమిస్తాయి. కాశీఖండం శ్రీనాథ మహాకవి సీసానికి రంగభూమి. సంస్కృతాంధ్ర పద మిశ్రితమైన, ప్రౌఢ వాగ్గుంఫితమైన సీసాలు సజీవమై శ్రీనాథుడు వానికిచ్చిన ప్రధాన్యాన్ని వివరిస్తాయి. శివరాత్రి మాహాత్మ్యంలోనూ, చాటువుల రూపంలోనూ, క్రీడాభిరామంలోని సీసానికి తోడ్పాటునివ్వడంలోనూ శ్రీనాథుని సీసపు ముద్ర స్పష్టమవుతుంది. నైషధాది ప్రబంధాల అవతారికలలోనూ "గగన కల్లోలినీకల్లోలమాలికా" (శృం.నై.1) వంటి సమాస సౌందర్యం గల సీసపద్యాలు ఆయాకృతులు అందుకొన్న కృతిభర్తలు, వారి ఏలికలైన రాజేంద్రుల కీర్తిప్రతిష్ఠల్ని అజరామరం చేశాయి. శ్రీనాథునికి సీసపద్యంలో ఒరవడి తిక్కన గారేనని విశ్వనాథ అభిమతం. (చూ.కావ్య పరిమళం). అయితే శ్రీనాథుడు తిక్కన గారి నుండి నేర్చిన సీసపాఠాన్ని ప్రబంధ కవులకు "శ్రీనాథ సీసపాఠము"గానే అందించాడనడంలో సందేహం లేదు.

* * *

## ఆంధ్రదేశంలో స్వాతంత్రోద్యమ కాంక్ష రగిలించడంలో తెలుగు పత్రికల పాత్ర.

డా. ఒభిన్న శ్రీహరి , తెలుగు శాఖాధ్యక్షులు,
రాజీవ గాంధీ వైజ్ఞానిక సాంకేతిక విశ్వవిద్యాలయం, నూజివీడు.
చరవాణి 9912393495, విద్యుల్లేఖ: obhinni@gmail.com

భారతదేశంలో స్వత్రంత్య పోరాటంలో తెలుగు పత్రికల పాత్ర మరువలేనిది. పరాయి పాలనలో భారతీయుల వ్యద గురించి విచారం వ్యక్తం చేసి పోరాడితే భవిష్యత్తులో స్వేచ్ఛ లభించగలదని తెలుగు ప్రజానీకంలో పోరాట స్ఫూర్తిని తెలుగు పత్రికలు కలిగించాయి. తెలుగు పత్రికలు మొదట్లో మతానికి ప్రాధాన్యం ఇచ్చినా, తరవాత సంస్కరణలకు రాజకీయాలకు ప్రాధాన్యత ఇచ్చాయి. 20 వ శతాబ్ది మొదటి నుంచి రాజకీయ స్ఫూర్తిని ప్రజలలో నాయకులలో పెంపొందించి స్వాతంత్ర్య పోరాటంలో ప్రజలను భాగస్వాములు అయ్యేలా చేసి, స్వాతంత్రోద్యమం తెలుగు దేశంలో నలువైపులా విస్తరించేలా చేసింది.

భారతదేశంలో తొలి వార్తా పత్రిక ఒక ఐరోపా దేశస్థుడైన జేమ్స్ ఆగస్టస్ హికీ బెంగాల్ గెజిట్ అనే పేరుతో ప్రారంభించాడు. తెలుగులో సత్యదూత మొదటి పత్రిక. ఇది క్రిష్టియన్ మాట పత్రిక. దాని తర్వాత అనేక పత్రికలు తెలుగులో వచ్చాయి. ఈ తెలుగు పత్రికలు రాజమండ్రి, కాకినాడ, విజయవాడ, నెల్లూరు, మద్రాస్ నుండి వెలువడ్డాయి. తెలుగు పత్రికలు మొదట సాహిత్యాభివృద్ధికి తమ ప్రాధాన్యత ఇచ్చాయి. తర్వాత సంఘసంస్కరణ ద్వారా సమాజాన్ని జాగృతం చేసి ప్రజలలో రాజకీయ చైతన్యం కలిగించి స్వత్రంత్య కాంక్షను ప్రజలలో కలిగించడంలో విజయం సాధించాయి.

తెలుగులో మొదట సాహిత్య పత్రికల గురించి చెపితే చిన్నయసూరి, బహుజనపల్లి సీతారామాచార్యులు గారు కలసి సుజన రంజని మొదటిది. తర్వాత చిలకమర్తి లక్ష్మీ నరసింహం గారి సరస్వతి, కొక్కొండ వెంకట రత్నం గారి ఆంధ్ర భాష సంజీవని వంటి పత్రికలు సాహిత్యపరంగా 19 శతాబ్దంలో పెరుగడించాయి.వీటిలో రాజకీయాలకు ఆస్కారం లేకుండా కేవలం సాహిత్యానికే ప్రాధాన్యం ఇచ్చాయి. తర్వాత సంఘసంస్కరణ తెలుగు పత్రికలు ప్రజలను సంసిద్ధులను చేశాయి. ఆనాడు ఆంధ్ర భాష సంజీవని సాంఘిక పరిణామాలను, భాషా సంస్కరణ ఉద్యమాలను దుయ్య బట్టింది. గ్రాంధిక భాషకు వీరు ప్రాధాన్యం ఇచ్చారు. వీరు వీరేశలింగం గారి శుద్ధాంధ్ర భారతి సభాపర్వ భాగాన్ని ఆంధ్ర స0జీవనిలో ప్రచురించింది. తర్వాత సాహిత్యాభివృద్ధికి కృషి చేసిన పత్రిక ఉమా రంగనాయకుల గారి పురుషార్థ ప్రధాయని 1872లో ప్రారంభమయింది. తెలుగులో పారిభాషిక పదాల సృష్టికి ఈ పత్రిక శ్రీకారం చుట్టింది.

తెలుగులో సాహిత్య పత్రికల తర్వాత సంస్కరణ పత్రికలు సాంఘిక సంస్కరణోద్యమం ద్వారా ప్రజలను సాంఘిక దురాచారాల నుండి విముక్తి గావించి స్వాతంత్రోద్యమంలో వైపు నడచేలా చేశాయి. ఇటువంటి వాటిలో మొదటిది కందుకూరి వారి వివేకా వర్ధిని . ఈ పత్రిక 1874లో ప్రారంభించబడి తెలుగు

ప్రజల సాంఘిక, సంస్కృతిక పునరుజ్జీవనానికి నాందిపలికి, విశాల ప్రయోజనం వైపు సమాజాన్ని మళ్లించింది. భాషాభివృద్ధి, దేశాభివృద్ధి, సంఘ సంస్కారాభిలాష ఈ పత్రిక యొక్క ముఖ్య లక్ష్యాలయ్యాయి. కందుకూరి సాహిత్యాన్ని సంఘసంస్కరణకు సాధనంగా ఒక వైపు, మరోవైపు సాహిత్యం ద్వారా సమాజాన్ని అభ్యుదయ మార్గాన్న పయనించేలా చేసిన నవయుగ వైతాళికుడు. ఈయన బాల్య వివాహాల మీద పోరాటం చేసి, వితంతు వివాహాలను, బాలికా విద్యను ప్రోత్సహించాడు. ఈయన మూఢ నమ్మకాల మీద మతాచార ఛాందస భావాల మీద రచనలు చేశాసు. వివేకా వర్ధిని రాజకీయ పత్రిక కాకున్నా సాంఘిక పునరుజ్జీవనం ద్వారా ఆంధ్ర దేశంలో స్వాతంత్రోద్యమానికి తోడ్పడింది.

అయితే ఆ కాలంలో స్వత్రంత్రోద్యమం గురించి పత్రికలలో రాసే స్వేచ్ఛ దేశంలో లేదు. ఎందుకంటే 1823లో జాన్ ఆడమ్స్ అనే బ్రిటిష్ అధికారి పత్రికలు ప్రజలలో స్వత్రంత్ర కాంక్షను ఎక్కువ చేస్తాయని గ్రహించి ఒక శాసనాన్ని అమలులోకి తెచ్చాడు. దీని ప్రకారం ఎవరైనా పత్రిక పెట్టాలంటే ఆ పత్రిక యొక్క ముద్రణాలయానికి ప్రభుత్వ అనుమతి పొందాలి. ముద్రణాలయానికి అనుమతిపొంది పత్రిక ప్రారంభించినా ప్రభుత్వానికి వ్యతిరేఖంగా వార్తలు రాయరాదు .ఒక వేల రాస్తే ఆ కాలంలోనే 1000 రూపాయలు జరిమానా, జైలు శిక్ష అనుభవించవలసి ఉంటుందని చట్టం చేశారు. అందువల్ల ఎవరు రాజకీయ పత్రికలు స్థాపించడానికి సాహసించేవారు కాదు. ఈకారణం చేతనే తెలుగులో 19 శతాబ్ధంలో తెలుగు పత్రికలు రాలేదని చెప్పవచ్చు.

దేశంలో స్వాతంత్ర్య కాంక్ష రోజురోకుకీ పెరిగిపోతునప్పుడు జాతీయ స్థాయిలో తిలక్ వంటి మహనీయులు ధైర్యంగా పత్రికలు స్థాపించినప్పుడు తెలుగులోను రాజకీయ పత్రికలు వచ్చాయి. 19 శతాబ్ధం ద్వితీయార్థంలో దేశాభిమాని, యక్షిణి, శశిరేఖ వంటి పత్రికలు ఆంధ్ర పత్రిక, కృష్ణా పత్రిక, స్వరాజ్య పత్రిక మొదలైన రాజకీయ పత్రికలుగా పేరుగాంచాయి.

పై పత్రికలు వందేమాతర ఉద్యమ స్ఫూర్తితో స్వాతంత్రోద్యమ మార్గాన్ని అనుసరించాయి. ఈ వందేమాతర ఉద్యమ ప్రభావం తెలుగు దేశంపై ఎక్కువగా కనిపించింది. బెంగాల్ విభజన సమయంలో జాతీయోద్యమం కొత్త రూపం దాల్చింది. 1907లో బిపిన్ చంద్ర పాల్ ఆంధ్ర దేశంలో పర్యటించాడు. ఈ పర్యటన కృష్ణా పత్రిక సంపాదకుడు ముట్నూరి కృష్ణా రావు గారి నిర్వహణలో జరిగింది. ఈ సందర్భంగా నిర్వహించిన సభలో చిలకమర్తి వారు భారత ఖండంబు చక్కని పాడి ఆవు పద్యాన్ని నాటి తెలుగు పత్రికలన్నీ ప్రచురించాయి. దానితో తెలుగు ప్రజలలో స్వతంత్రకాంక్ష పెరిగింది.

భారత జాతీయ కాంగ్రెస్ ఆవిర్భవించిన 1885లో ఏ.సి పార్థ సారధి నాయుడు గారు మద్రాస్ నుండి నడిపిన ఆంధ్ర పకాశిక తెలుగు పత్రికలకు తొలిసారిగా రాజకీయ ప్రాధాన్యతను తెలియచెప్పింది. 1902 లో మరో పత్రిక శశిరేఖ బ్రిటిష్ చక్రవర్తి ఏడవ ఎడ్వర్డ్ పట్టాభిషేక సందర్భంగా భారత దేశ ఖజానా

నుండి పెద్ద మొత్తాన్ని బ్రిటిష్ ప్రభుత్వం దుబారా చేయడాన్ని విమర్శిస్తూ ఇతర బ్రిటిష్ వలసలతో పాటు భారతదేశాన్ని సమానంగా చూడడం లేదని ఆక్షేపించింది.

కృష్ణా పత్రికను దేశభక్త కొండా వెంకటప్పయగారు,దాసు నారాయణ రావు గారు కలసి 1902 ఫిబ్రవరి 1 వ తేదీన ప్రారంభించారు. ఇది 1905 వరకూ పక్ష పత్రికగా 1906-07 వార పత్రికగా వెలువడింది. నారాయణ రావు గారి మరణానంతరం 1905లో ముట్నూరి కృష్ణారావు గారు వెంకటప్పయ గారి సహ సంపాదకులయ్యారు. తరవాత కృష్ణా జిల్లా విభజనతో పత్రిక యావత్తు కృష్ణారావుగారే చూశారు. కృష్ణా రావు గారు 1906లో బెంగాల్'లో పర్యటించి వంగరాష్ట్ర విభజన, వందేమాతర ఉద్యమాలలో పాల్గొన్నారు. బిపిన్ చంద్రపాల్ ఈయనకు రాజకీయ గురువు. 1907 బిపిన్ చంద్రపాల్ ఆంధ్ర దేశంలో పర్యటించినప్పుడు ఆయన వెంట నుండి స్ఫూర్తిని పొందారు. అయితే కృష్ణా పత్రిక కాలక్రమంలో మితవాద ధోరణి నుండి అతివాద ధోరణిలోకి మారింది. అందువల్ల ఆంధ్ర దేశంలో బిపిన్ చంద్రపాల్ పర్యటన తర్వాత కృష్ణారావు గారు ఉత్తేజితుడై తెల్లవారిని తుపాకులతో కాల్చుట అనే సంపాదకీయం రాసి ప్రచురించాడు. దీనితో ఈ పత్రిక పై నిర్బంధం ఎక్కువైంది.

**1907** లో కొంత విరామం తర్వాత తిరిగి సంపాదకీయ బాధ్యతలు చేపట్టి బ్రిటిష్ వారి చట్ట నిబంధనల మీద వ్యంగ్యంగా బ్రిటిష్ వారిని విమర్శిస్తూ వ్యాసాలు రాశారు. ఇది మన మన తెలుగువాళ్ళల్లో స్వతంత్ర కాంక్షను పెంపొందించేలా చేసింది. అయితే ఈ కృష్ణా పత్రిక సంపాదకీయాలను అనువాదకులు తెలుగులో నుండి ఇంగ్లీష్ లోనికి అనువాదం చేస్తూండేవారు. మొదటి ప్రపంచ యుద్ధానంతరం కృష్ణా పత్రిక సంపాదకీయాన్ని ఒకదానిని ఉన్నవ లక్ష్మీ నారాయణ గారు ఆంగ్లంలోకి అనువదించి బ్రిటన్ పంపారు. అది అక్కడ ఉన్న ఒక ఆంగ్ల పత్రిక ప్రచురించింది. అది చూసి అప్పటి బ్రిటిష్ అధికారులు కోపోద్రిక్తులై విచారణకు ఆదేశించారు. దీనిని బట్టి కృష్ణా పత్రిక సంపాదకీయాలు ఎంత తీవ్రంగా ఉండేవో మనకు అర్థం అవుతుంది.

ముట్నూరు కృష్ణారావు గారు "వెలుగు జిలుగులు – లో వెలుగులు" శీర్షికన ఆయన వ్యాసాలు. ఆయన సంపాదకీయాలు సాగేవి. ఈ విధంగా ముట్నూరి కృష్ణారావు గారి కృష్ణా పత్రిక అనేక వ్యాసాలు, సంపాదకీయాల ద్వారా స్వాతంత్రోద్యమానికి, తెలుగు బాషా సాహిత్యాలకు అనితర సాధ్యమైన సేవ చేసింది. స్వాతంత్రోద్యమ పోరాటలో తెలుగు జాతిని ముందుకు నడిపించడానికి కృష్ణా పత్రిక ఎంతో దోహదం చేసింది. కృష్ణా పత్రిక గాంధీ గారి సిద్ధాంతాలను ప్రజల్లోకి బలంగా తీసుకెల్లగాల్గింది.

ముఖ్యంగా గాంధీ గారి సహాయనిరాకరణ ఉద్యమంలో గాంధీ సిద్ధాంతాలను ప్రజలకు విశదీకపరచడానికి ఈ కృష్ణా పత్రిక దోహదం చేసింది. ఖాదీ ధారణ, హరిజనోద్ధరణ, హిందూ, ముస్లిం సమైఖ్యత మీద అనేక సంపాదకీయాలు వ్యాసాలు వచ్చాయి. ముట్నూరి కృష్ణారావు గారిని ఏదో విధంగా జైల్లో బంధించాలని బ్రిటిష్ వారు అనేక కుట్రలు పన్నేవారు. **1930** కాలంలో తన ముద్రణాలయానికి డిపాజిట్ చెల్లించలేదని కారణంతో కృష్ణారావు గారిని **6** నెలలు జైలు శిక్ష వేశారు.

అదే విధంగా కృష్ణా జిల్లాలో దీవి సీమ దగ్గర వక్కలగడ్డ గ్రామానికి చెందిన బోడి నారాయణ రావు బెజవాడ నుండి ప్రారంభించిన స్వరాజ్య పత్రిక కూడా ఆంధ్ర రాష్ట్రంలో ప్రజలలో స్వాతంత్ర్యోద్యమాన్ని రగిల్చడంలో ఎనలేని పాత్రను పోషించింది. ఈ పత్రికలో నిరంతరం బ్రిటిష్ వారి దురాగతలను వ్యతిరేఖిస్తూ అనేక వ్యాసాలు, సంపాదకీయాలు వచ్చేవి. ఈ క్రమంలో స్వరాజ్య పత్రిక సంపాదకులైన గాడిచర్ల గారి సర్వోత్తమరావు గారు బ్రిటిష్ వారిపై విమర్శలు చేశారని ఆయన మీద రాజద్రోహం కేసు బనాయించి జైల్లో ఉంచారు.

ఆంధ్ర రాష్ట్రంలో ఆనాడు బ్రిటిష్ వారిని విమర్శించినందుకు మొదటి సరిగా రాజ ద్రోహం కేసులో జైలు శిక్ష పడిన పత్రికా సంపాదకుడు గాడిచర్ల హరి సర్వోత్తమరావు. ఆనాడు స్వరాజ్య పత్రిక బ్రిటిష్ పాలకులపై మాటల తూటాలను ప్రయోగించేది. దీని సంపాదకుడైన హరిసర్వోత్తమ రావు ఏం.ఏ వంటి ఉన్నత విద్యా చదివినా పెద్ద ఉద్యోగాలు చేసే అవకాశాలను సైతం వదిలివేసి దేశసేవ కోసం పత్రికా రచన ద్వారా స్వరాజ్య పత్రిక సంపాదకత్వ బాధ్యతను నిర్వర్తించిన త్యాగశీలి.

స్వతంత్ర పోరాటంలో ప్రజలను చైతన్యవంతం చేసిన మరొక తెలుగు పత్రిక జమీన్ రైతు. 1934 ప్రాతంలో ఈ పత్రిక ప్రభావం చాలా ఎక్కువ. తర్వాత దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరావు ప్రజాసేవ చేయడం కోసం 1908 అక్టోబర్ 9 తేదీన ఆంధ్ర పత్రికను స్థాపించారు. ఈ పత్రిక మద్రాస్ కేంద్రంగా తన కార్యకలాపాలు సాగించింది. హరిసర్వోత్తమరావును నాగేశ్వరరావు తన పత్రిక సంపాదకునిగా చేశారు. ఆంధ్ర పత్రిక ఆంధ్రుల జాతీయ పత్రికగా వ్యవహరించింది. అర్వాచీన భావరీతుల సంగమ క్షేత్రంగా ఈ పత్రిక తెలుగు జాతి సర్వతోముఖవికాసానికి బాధ్యత వహించింది.

తెలుగు పత్రికలు ఆనాడు తెలుగు ప్రజలలో రగిలిస్తున్న స్వతంత్ర కాంక్షను చూసి ఓర్వలేక ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వం ఆంధ్ర పత్రికతో సహా మొత్తం 17 తెలుగు పత్రికలను బెదిరించి ఆనాటి ప్రచురణ కర్తల నుండి సెక్యూరిటీ మొత్తాలను వసూలు చేసింది. ఆంధ్రపత్రిక ఆంధ్రప్రదేశ్ లో జాతీయ ఉద్యమానికి స్వతంత్ర ఉద్యమానికి వేదికగా నిలిచింది. మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో యుద్ధ వార్తలను అందించడంలో ఆంధ్ర పత్రిక విశేష కృషి చేసింది. 1930 వ దశకంలో బ్రిటిష్ సామ్రాజ్యవాద వ్యతిరేఖ ప్రచురణాలను కమ్యూనిస్టు పార్టీకి నెలల తరబడి ఆంధ్రపత్రికలు అడ్వర్టేజ్'మెంట్'లుగా దేశభక్తిని నిరూపించుకొన్న పత్రిక.

తెలుగు ప్రజలలో స్వాతంత్ర కాంక్ష రగిల్చిన పత్రిక ఆంధ్రప్రభ. ఖాకా సుబ్బారావు, న్యాయపతి నారాయణ మూర్తి, నార్ల వెంకటేశ్వరావు, నీలం రాజు వెంకట శేషయ్య వంటి వారు సంపాదకీయాలను ప్రచురించి జాతీయోద్యమానికి ఊపునిచ్చారు. రామనాధ గియోంకా ఇండియన్ ఎక్స్ ప్రెస్ గ్రూపు పత్రికలను స్థాపించారు. ఆ గ్రూపు నుండి మద్రాస్ లో ప్రారంభమయినది ఆంధ్రప్రభ దినపత్రిక. దీని తొలి సంపాదకుడు ఖాకా సుబ్బారావు, తర్వాత న్యాపతి సుబ్బారావు, నార్ల వెంకటేశ్వరావు వరుసగా సంపాదకత్వం వహించారు. ఆనాడు బ్రిటిష్ వారికి తలవంచక జాతీయ భావాలను ప్రజలలోకి

సమర్థవంతంగా తీసుకెళ్ళే ప్రయత్నం ఆంధ్రప్రభ చేసింది. క్విక్ ఇండియా ఉద్యమ సమయంలో పత్రికా వార్తలపై ప్రభుత్వం "ప్రీసెన్సార్‌షిప్" విధించినప్పుడు అందుకు నిరసనగా ఆంధ్రప్రభ కొంతకాలం వార్తా ప్రచురణనలను నిలిపివేసిందే కానీ ఆంక్షలకు తలొగ్గలేదు. తెలంగాణా ప్రాతంలో రజాకార్ల దౌర్జన్యాలకు వ్యతిరేఖంగా వార్తలను ప్రచురించి ప్రజలలో చైతన్యం కలిగించింది.

ఆంధ్రప్రభ తెలుగు భాష ముఖ్యంగా సరళా గంధికం నుండి పూర్తి వ్యవహారిక భాషలోకి తీసుకువచ్చింది. వ్యవహారిక భాషను సరళతరం చేసింది. వార్తా రచనా విధానంలో, అనువాదంలో కొత్తదనాన్ని ప్రవేశపెట్టింది. అంతర్జాతీయ విషయాలను కూడా పాఠకులకు అర్ధమయ్యేలా వివరించింది. ఆంధ్రప్రభలో ముఖ్యంగా నార్ల వారి సంపాదకీయాలు ప్రజలలో దేశభక్తిని రగిల్చేవిగా ఉండేవి.

ఈ విధంగా భారతదేశ స్వాతంత్రోద్యమ కాలంలో తెలుగు పత్రికలు ఆంధ్ర దేశంలో ప్రజలలో స్వతంత్ర కాంక్ష నెలకొల్పడంలో విజయం సాధించాయని చెప్పవచ్చు. ఆనాడు ఎన్ని రకాల ఒడిదుడుకులను వచ్చినా, వెనకడుగు వేయక అనేకమంది మహనీయులు పత్రికలు నడిపి దేశానికి సేవచేశారు.

## సంప్రదింపు గ్రంథాలు

1. తెలుగు పత్రికలు సాహిత్య సేవ – పురాణపండ రంగనాథ్. యోజన, 1995 ఫిబ్రవరి 28
2. మనము మన పత్రికలు - ఎస్.హెచ్.సౌభాగ్యమ్మ
3. ఆంధ్రాలో స్వాతంత్రోద్యమం – తెలుగు అకాడమీ ప్రచురణలు.

# తెలుగు భాషాభివృద్ధి - ఆధునీకరణ

**డా॥ పి. విజయకుమార్**
సహాయ ఆచార్యులు (తెలుగు)
ఆంధ్రప్రదేశ్ కేంద్రీయ విశ్వవిద్యాలయం
అనంతపురం.
98493 02546
vijaymanusha@gmail.com

శాతవాహనుల ఏల్బడిలో తొలి అడుగువేసింది తెలుగు / కాకతీయుల గొడుగు నీడలో కదను తొక్కింది తెలుగు / కృష్ణదేవరాయల పాలనలో పడగెత్తి నిలిచింది తెలుగు /నవీనయుగాన వివిధ రీతులకు నాంది పలికింది తెలుగు / కడలి అంచులు దాటి కదిలింది తెలుగు / ఎడదలోతులను మీటి ఎగిసింది తెలుగు / ఎక్కడున్నా యెన్ని చిక్కులెదురౌతున్నా / తలయెత్తి నిలువుమని తెలిపింది తెలుగు. ఆవేశమై / విశ్వాసమై /విన్యాసమై / జ్ఞానమై / ధ్యానమై / గానమై / ప్రాణమై / నీ ఉన్నతికి రక్షిత సోపానమై నిలిచింది తెలుగు" అంటారు సి. నారాయణరెడ్డి. తలచినంతనె తన్మయత్వము కల్గి / తీపినొందించు పీయూష తెలుగు భాష / చదివినంతనె మదిలోన సుధలు గురియు / దివ్యకావ్య సమున్మేష తెలుగు భాష అంటారు కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ. తెలుగు పతాకం ఎగరని దిశయే లేదు / తెలుగు దివ్వె వెలుగనట్టి నిశయే లేదు / తెలుగు పులుగు చేరలేని దేశం లేదు / తెలుగు వెలుగు దూరలేని కోశం లేదు అంటారు దాశరథి.

"నిరక్షరకుక్షి మాట్లాడినా తెలుగు శ్రవణానందకరంగా ఉంటుంది. తెలుగు ద్రావిడ భాషలన్నిటిలో మధురాతి మధురమైనది" అని హెన్రీ మోరిస్ చేత కీర్తిపొందిన భాష తెలుగు. "శబ్ద సంపదలోనూ, శబ్ద సౌష్ఠవంలోనూ, భావ వ్యక్తీకరణలోనూ, శ్రావ్యములోనూ తెలుగుభాషకు అత్యంత సమన్వయశక్తి ఉన్నది. దీనికి విభిన్న స్రవంతుల్ని తనలో లీనం చేసుకునే సమర్థత ఉన్నది" అని ఎ.పి. క్యాంప్‌బెల్ చేత కీర్తిపొందిన భాష తెలుగు.

"భారతీయ భాషలన్నింటిలోకి పరభాషా పదాలను తెలుగు గ్రహించినంత సులభంగా మరే భాషా స్వీకరించలేదు. కాబట్టి ఎప్పటికైనా సైన్సు, మెడిసన్, ఇంజనీరింగ్‌ల బోధనలో హిందీకి తెలుగే ధీటైన ప్రత్యర్థి అవుతుంది. జాతీయభాషకు కావాల్సిన లక్షణాలు తెలుగుకు ఉన్నాయి అని జె.బి.ఎస్. హాల్డెన్ చేత తెలుగు భాష శ్లాఘించబడింది. "వెన్నెల్లో పడవ ప్రయాణం చేస్తూ అప్పుడే వికసించిన మల్లెపూలను అఘ్రాణిస్తే కలిగే గొప్ప అనుభూతి తెలుగు భాష వింటున్నప్పుడు కల్గుతుంది" అని 'సుందర తెనుంగు' అని తమిళ మహాకవి 'సుబ్రహ్మణ్య భారతి' స్తుతించారు.

"అన్యభాషా పదాలను కలుపుకునే భాషయే సుసంపన్నంగా ఉంటుంది, తెలుగు దీనికి మంచి ఉదాహరణ. సంస్కృత పదాలను జీర్ణించుకున్న ఘనత తెలుగుది. 14వ శతాబ్దిలోనే శ్రీనాథుడు 20–30 పార్సీ పదాలు వాడాడు. ఖుసీ (ఖుషీ), దుకాణం, బజార్ వంటివి ఇప్పటికీ కొన్ని వాడుకలో ఉన్నాయి. ఇస్త్రీ (పోర్చుగీస్), అల్మారీ – బొత్తాం

పదాలను తెలుగు భాష తనలో ఇముడ్చుకుంది. భాషకు మడి శ్వాసకు ముడి లాంటిది. మడికట్టుకు కూర్చుంటే ఏ భాష బతకలేదు. కాలానుగుణంగా అన్యభాషాపదాలనూ స్వీకరించాలి. అది తప్పుకాదు. రాసినట్లే ఉచ్ఛరించడం, ఉచ్ఛరించినట్లే రాయడం తెలుగుకు ఉన్న ప్రధాన లక్షణం. ఏ భాషకూ ఈ సౌలభ్యం లేదు" అంటారు సి. నారాయణరెడ్డి. సి.పి.బ్రౌన్ తన మాతృభాష కాకపోయినా తెలుగు భాషాసాహిత్యాల సముద్ధరణకు పాటుపడి 'తెలుగు భాషోద్ధారకుడి'గా, 'తెలుగు సూర్యుడు'గా కీర్తి గడించారు. బ్రౌన్ భాషకు నిఘంటువును రూపొందించారు. ద్రావిడభాషలలో అతి ప్రాచీనమైన భాషగా 'తమిళం'ను పేర్కొంటాం. కాని భాషాశాస్త్రవేత్త నోమ్ చామ్‌స్కీ అంచనా ప్రకారం మూలద్రావిడ భాష నుంచి మొదటగా విడిపోయింది తెలుగే, తమిళం కాదు. ఋగ్వేదకాలం నాటికే అంటే 3,500 సంవత్సరాలకు పూర్వమే తెలుగు భాషకు అస్తిత్వం ఏర్పడింది. తెలుగులో 1780 క్రియా ధాతువులుంటే తమిళంలో ఉన్నది కేవలం 400 మాత్రమే అంటారు. దేశంలో ఎక్కువమంది మాట్లాడే వారిలో నాల్గవస్థానం, ప్రపంచంలో అత్యధికులు వ్యవహరించటంలో 15వ స్థానంలో తెలుగుభాష ఉంది. ఆంగ్లంలో 2.5 లక్షల పదాలుంటే తెలుగులో 6 లక్షల పదాలున్నాయని ఒక అంచనా

మొలక లేతదనము తవిరుల నవకంబు  మొగ్గ సోగదనము పువ్వు తావి / తేనె తియ్యదనము తెనుగునకే గాక పరుష సంస్కృతాఖ్య భాషకెద్ది? అన్నారు హరికథా పితామహుడు ఆదిభట్ల నారాయణదాసు. "భాషలొక పది తెలిసిన ప్రభువు చూచి / భాషయన నిద్దియని చెప్పబడిన భాష / తనర ఛందస్సులోని యందమ్ము నడక / తీర్చి చూపించినట్టిది తెలుగు భాష అని విశ్వనాథ సత్యనారాయణ పేర్కొన్నారు.

ఇంతటి తెలుగు భాషను ఆధునీకరించాల్సిన అవసరం ఉంది. ప్రపంచంలో ఏ కొత్త వైజ్ఞానిక సమాచారం వచ్చినా రాత్రికి రాత్రే కంప్యూటర్ల సహకారంతో వారి భాషల్లోకి అనువదించుకుంటారు. ఆయా శాస్త్రాల్లో నిపుణులైన ఆచార్యులు వాటిని సరళమైన భాషలో తిరగరాస్తారు. వాటిని ప్రచురించి తక్కువ ధరల్లోనే అందరికీ అందుబాటులోకి తెస్తారు.

సమాజం ఆధునికతమవుతుందంటే భాష కూడా ఆధునికత చెందుతున్నదని ఇంకా ఆధునీకరణ జరగాలి అనే కోణంలో ఆలోచించాలి. భిన్న రంగాలలో ప్రణాళికాబద్ధంగా తెలుగు భాషాభివృద్ధిని సాధించగలిగితే సర్వసమర్థమైన స్వతంత్రభాషగా తెలుగుభాష పరిణతి చెందగల్గుతుంది. అయితే సమాజంలో ఆయా రంగాలలో భాష ద్వారా జరిగే కార్యకలాపాలను దృష్టిలో ఉంచుకొని ప్రణాళికలు రూపొందించుకోవాలి. బోధన, పరిపాలన, సమాచార, విజ్ఞానవ్యాప్తి రంగాలలో భాషావినియోగం తప్పనిసరి. శాస్త్ర, సాంకేతిక రంగాలలో దినదినాభివృద్ధి చెందుతున్న విజ్ఞానం మన తెలుగు భాషలోకి తీసుకురాగలగాలి. సామాన్యునికి చేరువలోకి విజ్ఞానం తీసుకురాగలిగి నపుడే ఒకవైపు భాషాధునీకరణ, ఒకవైపు మాతృభాషాఋణం తీర్చుకున్నవాళ్ళమవుతాము. సృజనాత్మక సాహిత్యం తెలుగు భాషలో విస్తృతంగా వెలువడుతుంది. కాని మన సృజనాత్మక విజ్ఞానం ప్రపంచానికి ఊహించిన స్థాయిలో అందటం లేదు; అలాగే ప్రపంచ ప్రసిద్ధమైన రచనలు మన తెలుగు భాషలోకి అనువాదం కావడం లేదు. ఈ కోణంలో ఆలోచించినపుడు మనం చాలా వెనకపడి ఉన్నామని తెలుస్తుంది. పరిభాషా పదాల రూపకల్పన ఆశించిన స్థాయిలో జరగడం లేదు. తెలుగు వర్ధిల్లితేనే వెలుగు అనే భావన అందరిలో స్ఫురించాలి. ఐక్యరాజ్యసమితి

2019ని దేశీయ భాషల సంవత్సరంగా ప్రకటించింది. భాషను వాగ్రూపంలోనే కాకుండా లిఖితరూపంగా అభివృద్ధి చెందితేనే భాషాభివృద్ధి సాధ్యం. తెలుగు భాషాస్వరూపంలో చాలా సారళ్యం స్పష్టమవుతుంది. ఇతర భాషాపదాలను ఆదానంగా తెలుగుభాష సునాయాసంగా స్వీకరిస్తుంది. వైజ్ఞానిక, శాస్త్ర సాంకేతిక రంగాల అంశాలను, భావనలను సులభంగా తనలో ఇముడ్చుకోగలిగిన అమృతభాష మన తెలుగుభాష. అందుకే సాంకేతిక విప్లవంలో భాగంగా యువతను భాగస్వామ్యం చేసి విశ్వవిద్యాలయాలు, అకాడమీలు, ఆయా భాషాభివృద్ధి సంస్థలు సహకారంతో అనువాద రంగంలోనూ, పరిభాషాపదాల రూపకల్పనలో శిక్షణనిచ్చి ఎప్పటికప్పుడు కొత్త పదాల పరికల్పన చేపట్టి భాషను ఆధునీకరించుకోవాలి. “జాతికి జీవననాళిక జానపదగీతిక అన్నాడు. పల్లెమాగాణంలో గ్రంథాలకెక్కని ఎన్నో అమూల్యమైన పదపరిజాతాలు కనిపిస్తాయి. పరిశోధక విద్యార్థులను భాగస్వాములను చేసి గ్రంథాలకెక్కని పదాలను గ్రంథస్థం చేయాలి. భాషలో వస్తున్న మార్పులను సామాన్యులకు కూడా తెలియజేయాలి. లేకపోతే శాస్త్ర సాంకేతిక విజ్ఞానం సామాన్యుడికి అందదు. తెలుగు భాషాభివృద్ధి, ఆధునీకరణ అనే యజ్ఞం ఆచరణాత్మకంగా ప్రతి ఒక్కరు కృషిచేస్తేనే సఫలీకృతమవుతుంది. భాష వాగ్రూపంలోనే కాకుండా లిఖిత రూపంగా అభివృద్ధి జరిగితే భాషకు భవిష్యత్తు ఉజ్జ్వలంగా ఉంటుంది. మీడియా రంగంలో ప్రధానంగా ఎలక్ట్రానిక్ & ప్రింట్ మీడియాలో యువత తనదైన ప్రత్యేక భాషానైపుణ్యాలతో రాణిస్తున్నారు. ఉపాధి అవకాశాలు ఒకవైపు యువతకు కల్పిస్తూ వాళ్ళను భాగస్వామ్యంతో భాషాధునీకరణకు సమాయత్తం కావాలి.

# సమకాలీన తెలుగు కథ – స్త్రీ పాత్రల మనోవిశ్లేషణ (2005 - 2015)

డా|| ఎ. రవీంద్రబాబు
అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలుగు విభాగం
ఆంధ్రప్రదేశ్ కేంద్రీయ విశ్వవిద్యాలయం
అనంతపురం, ఆంధ్రప్రదేశ్- 02
సెల్- 8008636981

వర్తమాన సమాజంలో కథాసాహిత్యానికే ప్రాధాన్యత ఎక్కువ. సమకాలీన పరిస్థితులను లోతుగా వివిధ నేపథ్యాల నుంచి ఆలోచనాత్మకంగా, విశ్లేషణాత్మకంగా, మారుతున్న జీవనవిధానాన్ని అన్ని కోణాల నుంచి చిత్రిస్తుంది. సమాజాన్ని చిత్రికపడుతుంది. దశాబ్దకాలంగా స్త్రీల జీవితాల్లో వచ్చిన, వస్తున్న పరిస్థితులను సవ్యంగా వివరిస్తూనే, లోపాలను, స్త్రీల అభివృద్ధికి అడ్డుగా ఉన్న పలు సామాజిక, సంప్రదాయ అంశాలను కథా సాహిత్యం చర్చకు పెట్టింది. సమస్యలు వచ్చినప్పుడు వాటిలో మునిగి పోకుండా, ఎదిరించి ధైర్యంగా ఎలా ముందడుగు వేయాలో మహిళా పాత్రల మనోవిశ్లేషణ ద్వారా తెలియజేసింది. సమజాన్ని కళాత్మకంగా శిల్పబంధంలోంచే స్త్రీల ఆంతరంగిక ఆవేశాలను, ఆలోచనలను, వాటివెనకున్న వాస్తవాలను మనోవిశ్లేషణాత్మక దృష్టితో ముందుకు తెచ్చింది కథ సాహిత్యం.

మనిషికి, మనసుకు ఉన్న సంబంధాన్ని, అంతఃచేతన సంఘర్షణలను వెలుగులోకి తేవడమే కాక, జీవితాల్ని చక్కదిద్దుకునే మార్గాన్ని చూపాయి ఈ దశాబ్దంలో వచ్చిన కథలు. మూఢనమ్మకాల్ని, సంప్రదాయ ఛాందసాల్ని వదులుకొని ఆధునిక స్త్రీ ఎలా ముందుకెళ్లాలో చెప్పాయి. మారుతున్న మానవీయ విలువలు, వస్తువినిమయ మాయలో పడిపోకుండా విలువలను స్త్రీలు ఎలా బతికించుకోవాలో కూడా ఈ కథలు మనోవిశ్లేషణాత్మకంగా చూపాయి.

**దశాబ్ది సమాజం - స్త్రీల జీవన పరిస్థితులు**

2005 నుంచి 2010 వరకు తెలుగు సమాజంలో ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, రాజకీయ మార్పులు ఎన్నో వచ్చాయి. చదువుకున్న మధ్యతరగతి యువతులు కార్పొరేట్ ఉద్యోగాల్లో స్థిరపడుతున్నారు. వారి ఆలోచనా ధోరణుల్లో మార్పులు సంభవించాయి. స్త్రీలలో వచ్చిన చైతన్యం వల్ల నిర్భయ వంటి చట్టాలు వచ్చాయి. కుటుంబాల విచ్ఛిత్తి స్త్రీల జీవితాలను చిన్నాభిన్నం చేస్తున్నాయి. అద్దెగర్భం, కుటుంబ బాధ్యతలను, ఉద్యోగ జీవితాన్ని సమర్థవంతంగా మోయలేని స్త్రీల బతుకులు, వస్తుమాయాజాలం స్త్రీలలో తెచ్చిన మార్పు, ముఖ్యంగా గ్రామాల్లో, పల్లెల్లో ఇంకా మారని మహిళల జీవన స్థితిగతులు, కునారిల్లుతున్న వృత్తుల ప్రభావం, రాజకీయాల్లో కొత్తగా అడుగుపెట్టిన మహిళలు ఎదుర్కొంటున్న సమస్యలు ఎన్నో, ఎన్నెన్నో..

మనోవైజ్ఞానిక సిద్ధాంతాలు పాశ్చాత్య దేశానివే అయినా మన సాహిత్యంపై చాలా ఎక్కువ ప్రభావం చూపాయి. ఈ సిద్ధాంతాలకు ఆద్యుడు ఫ్రాయిడ్. అతను ప్రతిపాదించిన కలల సిద్ధాంతం, బాల్యం, స్త్రీ పురుషుల సంబంధాలు, కోరికలను అణచి వేయడం... మొ॥లైనవి. ఆడ్లర్, యూంగ్, ఎరిక్సన్ లు ఈ మనోవైజ్ఞానిక సిద్ధాంతాలను మరింత ముందుకు తీసుకెళ్లారు. మనిషి అంతఃచేతనలోని రహస్యాలు గుట్టు విప్పే ప్రయత్నం చేశారు. మనిషి మనలు చేసే ఆలోచనల వెనకున్న కారణాలను వివరించారు. శ్రీశ్రీ కోనేటిరావు కథలు మొదలుకొని గోపీచంద్, బుచ్చిబాబు, వడ్డెర చండీదాస్, త్రిపుర, కాశీభట్ల వేణుగోపాల్, అంపశయ్య నవీన్ వంటి ఎందరో రచయితలు ఈ సిద్ధాంతాల నేపథ్యంతో రచనలు చేశారు.

**దశాబ్దికాలం – తెలుగు కథ**

ఈ దశాబ్ది తెలుగు కథను గమనించినప్పుడు రచయితలు సామాజిక సమస్యల పట్ల సానుకూలంగా స్పందించారు. అనేక అస్తిత్వాల నుంచి కథలు పుష్కలంగా వచ్చాయి. ప్రభుత్వం అభివృద్ధి పేరిట చేస్తున్న అరాచకాన్ని ఎండగట్టారు. ఎస్. శ్రీదేవి రూపాయి చొక్కా కథలో గోదావరి నదిపై కట్టే ప్రాజెక్టుల వల్ల అక్కడి చెంచుల జీవితాలు ఎలా ఛిన్నాభిన్నం అవుతాయో చెప్పారు. భార్యా భర్తలు ఉన్నత ఉద్యోగాలు చేస్తున్నా వారి మధ్య ఎలాంటి బంధాలు ఉన్నాయో, పురుషాధిక్యత ఎలా కొనసాగుతుందో సన్నపరెడ్డి వెంకటరామి రెడ్డి రాసిన **సెగలోపలి** కథ తెలియజేస్తుంది. తెలుగు సంస్కృతిలోని ఆత్మీయమైన మల్లె వాసనను బాలకృష్ణ మూర్తి రాసిన **రామిల్లి** కథలో గమనించవచ్చు.

యాంత్రికతతో మానవబంధాలు సన్నగిల్లడాన్ని, అభద్రతా భావాన్ని పి. సత్యవతి **పిల్లాడొస్తాడా** కథలో బహు చక్కగా చెప్పారు. పూడూరి రాజిరెడ్డి రాసిన **రెక్కల పెళ్లాం** కథ స్త్రీ, పురుషుల మధ్య కావాల్సిన స్వేచ్ఛను మ్యాజిక్ రియలిజం కథన పద్ధతిలో వివరిస్తుంది. ప్రపంచీకరణను అన్ని కోణాల్లో రచయితలు విమర్శిస్తూ కథలు రాస్తూనే ఉన్నారు. ఇక వాస్తవ జీవితాలను యాధాతథంగా కథలుగా మార్చిన కథకులు ఈ దశాబ్దంలో కొంతమంది కనిపిస్తున్నారు. వి. చంద్రశేఖరరావు రాసిన **సూర్యుని నలుపురంగు రెక్కలు** కథ చదివితే శివసాగర్ జీవితం గుర్తుకువస్తుంది. అలాగే చండూరు సంఘటనను గుర్తుకు తెచ్చే **థూ** కథ. తెలంగాణ దళితుల జీవితాల్లో వచ్చిన సరికొత్త మర్పులను **అవుటాఫ్ కవరేజ్ ఏరియా**గా ముందుకు తెచ్చారు పసునూరి రవీందర్. ఇలా ఎన్నో సమస్యలను, ఎన్నో కోణాల నుంచి ఈ దశాబ్దపు తెలుగు కథ పరిపుష్టం చేసింది. కథలను వస్తువు దృష్ట్యా చూస్తే ప్రాంతీయ, మైనార్టీ, స్త్రీ, దళిత, బీసీ, వృత్తులు, ప్రపంచీకరణ, అమెరికా జీవితం, సాఫ్ట్ వేర్ రంగం వంటి అనేక అంశాలు ఉన్నాయి.

**స్త్రీల నేపథ్యం**

దశాబ్దకాలంలో వచ్చిన తెలుగు కథల్లో స్త్రీల నేపథ్యం నుంచి వచ్చిన కథలు ఎక్కువగానే ఉన్నాయి. మహిళా కథకులు ఎక్కువగా స్త్రీల సమస్యలను చిత్రిస్తే, పురుషులు కూడా మహిళల సమస్యలను తమ కథలలో చెప్పే ప్రయత్నం చేశారు.

ఓల్గా, కుప్పిలి పద్మ, పి. సత్యవతి, వినోదిని, వి. ప్రతిమ, అపర్ణ తోట, కల్పనా రెంటాల, విమల, రాధిక, షాజహానా, వారణాసి నాగలక్ష్మి వంటి ఎందరో స్త్రీ కథకులు స్త్రీల జీవితాలను తమ కథల్లో వైవిధ్యమైన ఇతివృత్తాలతో రాశారు. మారుతున్న సామాజిక జీవన స్థితిగతుల్లో భార్యాభర్తల బంధాలు, కార్పొరేట్ జీవనంలో స్త్రీలు ఆలోచనలు, నేటికీ ముస్లీం స్త్రీలు అనుభవిస్తున్న ధాష్టీకాలు, కాసింత ప్రేమకోసం ఇతరులను చేరదీసే స్త్రీల అంతఃసంఘర్షణలు, ఒంటరితనాన్ని భరించలేని మహిళల మానసిక వేదనలు, అద్దెగర్భం వల్ల అనారోగ్యాన్ని కొని తెచ్చుకున్నా బాగుపడని కుటుంబ ఆర్థికపరిస్థితులు, ఎంత చదువుకున్నా పురుషుల చేతుల్లో మోసపోతున్న యువతులు, కులం కట్టుబాట్లను దాటాలని ప్రయత్నించి విఫలమైన దళిత స్త్రీలు స్త్రీలు రాస్తున్న కథల్లో ఎక్కుగా కనిపిస్తున్నాయి.

పురుషులు చిత్రిస్తున్న స్త్రీల జీవితాలను కూడా తక్కువగా చూడలేం. భిన్న నేపథ్యాల నుంచి మహిళలు ఎదుర్కొంటున్న అన్ని రకాల సమస్యలు వారి కథల్లో ఉన్నాయి. స.వెం.రాసిన **పాంచాలమ్మ పాట** కథలో సునంద గ్రామీణ పురుష భావజాలానికి బలవుతుంది. వంశీధర్ రెడ్డి రాసిన **ఐస్ క్యూబ్** కథ పరస్త్రీ పొందుకోసం పురుషుడు పడే తహతహని చెప్తుంది. బి.ఎస్. రాములు రాసిన **తప్పు** కథలో జ్ఞానవంతులు కూడా ఇంట్లో తమ ఆడ పిల్లలకు ప్రేమించననే విషయాన్ని చెప్పే స్వేచ్ఛను ఇవ్వరన్న విషయాన్నిచెప్తుంది. స్త్రీ స్వేచ్ఛ లేమిని కచ్చితంగా బటపెట్టింది ఈ కథ. ఇలా చూసినప్పుడు ఈ దశాబ్దం కథలు భిన్న వైరుధ్యాల నుంచి, వివిధ నేపథ్యాల నుంచి, స్త్రీల జీవితాల మానసిక సంఘర్షణలను సమగ్రంగా చిత్రించాయి.

**స్త్రీ పాత్రల మనోవిశ్లేషణ**

కథల్లోని స్త్రీ పాత్రలను, వాటి ఆలోచనా ధోరణులను, మానసిక సంఘర్షణల్లో కనిపించే వాస్తవాలను, మనో విశ్లేషణ దృష్ట్యా చూడాలి. వివిధ సందర్భాల్లో, సంఘటనల్లో స్త్రీల చిత్తవృత్తి, అందుకు కారణమైన ప్రభావాలను మనోవైజ్ఞానిక సిద్ధాంతాల ఆధారంగా అర్థం చేసుకోవాలి.

**వాళ్లు ముగ్గురేనా?** కథలో యాదమ్మ చదువుకోకపోయినా ధైర్యంలో జీవితం పట్ల నమ్మకంతో ప్రవర్తిస్తుంది. ఎదురైనా ప్రతి సమస్యను తనకు అనుకూలంగా మలచుకుంటుంది. మధురాంతకం నరేంద్ర రాసిన **నిశ్శబ్దపు చప్పుడు** కథలో రాణిది సర్దుకుపోయే మనస్తత్వం, భర్త పెట్టే కష్టాలను భరించే పాతకాలపు మనిషి. కానీ కూతురు జీవితంలో అలాంటి పరిస్థితే వస్తే... స్వేచ్ఛ కావాలంటుంది. పాలగిరి విశ్వప్రసాద్ రాసిన **ఆకులు రాల్చిన కాలం** కథలో ఒంటరి స్త్రీ జీవన వేదన కనిపిస్తుంది. మగాళ్లు చొరబడిన జీవితంలో ఆమె

ఎదుర్కొనే సంఘర్షణల పైనం కనిపిస్తుంది. చివరకు కూతురుకు ప్రశాంతత ఇవ్వాలనే తపన ఉంది. అలాగే సాయి బ్రహ్మానందం రాసిన **ఐ హేట్ మై లైఫ్** కథ భిన్న ఆలోచనల మధ్య నలిగిపోయే స్త్రీ మనస్తత్వానికి చిహ్నం. టీనేజ్ ఆకర్షణ, తల్లిదండ్రుల పెంపకంలో వచ్చిన సంప్రదాయపు భావాలు, తన చుట్టు ఉన్న ఆధుని జీవనంలో ఒదగలేని తత్వం... ఇలా అన్నింటిలో ఆమె ఎదుర్కొనే భావచిత్రణ కనిపిస్తుంది.

అపర్ణ తోట రాసిన **రిఫైన్డ్ ప్రేమకథ** కూడా ఇలాంటిదే. అయితే ఇందులో పెళ్లై అసంతృప్తితో మరో మనిషికి దగ్గరవ్వాలనే మధ్యవయస్కురాలి భావనా ప్రపంచం ఆవిష్కృతమవుతుంది. అలాగే సమాజపు నీతులు, విలువులవల్ల వ్యక్తిగత స్వేచ్ఛ నలిగిపోవడాన్ని రచయిత్రి చెప్పారు. సత్యవతి రాసిన **పిల్లాడొస్తాడా** కథలో అత్యాధునిక జీవన విధానంలో మారని తల్లిమనసు పిల్లల గురించి ఎలా తపిస్తోందో కనిపిస్తుంది. ఇక ప్రతిమ రాసిన **విత్తనం** కథలో భర్త నంపుశకుడైతే భార్యపడే వేదన, అత్త వేదింపులు తట్టుకోలేని కోడలు మనసుపడే చిత్ర హింసలు, చివరికి గర్భంకోసం వాయివరసలు మారి తల్లికావడంలో స్త్రీ పడే బాధను వివరిస్తుంది.

వినోదిని రాసిన **తప్పిపోయిన కూతురు** కథలో దళిత స్త్రీ చదువుకుంటూ తన సంస్కృతిని తక్కువగా చూసి, బ్రాహ్మణ సంప్రదాయాన్ని అనుసరించాలనే తపనతో నిజం తెలుసుకుంటుంది. చివరకు వారిలోని లోపభూయిష్టమైన మనసును అర్థం చేసుకుని తన ఇంటి దారి పడుతుంది. ఆ క్రమంలో ఆ పాత్ర రెండు సంస్కృతుల మధ్య పడే మనో సంఘర్షణ అంతా ఇంతా కాదు. వెంకటరామిరెడ్డి రాసిన **రూపాయి చొక్కా** కథలో అవని పాత్ర గోదావరి నదిపై కట్టే ప్రాజెక్టు పనిలో ఉన్న భర్త ఉద్యోగి అయితే... అక్కడి నిజాలను తెలుసుకొని, తన ఒంటరి తనాన్ని భరించలేక తనకుతానే మానోవేదనకు గురై హిస్టీరియా కొని తెచ్చుకుంటుంది. కుప్పిలి పద్మ రాసిన **సెకండ్ హస్బెండ్** కథలో దాంపత్యం పురుషుడికి సహజంగా అందించిన సౌకర్యాల్ని, హక్కుల్ని అంతే సహజంగా స్త్రీకి ఇవ్వకపోవడం వల్ల ఆమె పడే మనస్సులోతుల్ని చెప్తుంది. సరస్వతి రమ రాసిన **బాలామణి** కథ అద్దెగర్భం దార్వా బిడ్డల్ని కనిచ్చే స్త్రీ పడే మాతృస్పర్శలోని మనో వేదనను అద్భుతంగా చిత్రించింది. ఇలా చెప్పుకుంటూ పోతే ఈ దశాబ్దకాలంలో వచ్చిన కథల్లో స్త్రీల మనోవిశ్లేషణకు కొదవేలేదు. ఎన్నో నేపథ్యాల నుంచి వచ్చిన కథల్లో స్త్రీలు మానసిక వేదనకు గురైన విధానం కనిపిస్తుంది.

**కథా కథన పద్ధతులు**

ఏ రచన కైనా వస్తువు ఎంత ముఖ్యమో, శిల్పం కూడా అంతే ముఖ్యం. కథ రూపపరంగా చిన్న నిడివి కలది. ఆశ్చర్యమైన ఎత్తుగడతో, ఊహించని ముగింపుతో ఉంటుంది. జీవితం మొత్తాన్ని నవల విస్తృతంగా వివరిస్తే, కథ జీవితంలోని ఓ సన్నివేశమో, సంఘటననో ప్రతిబింబించి జీవితాన్నే వ్యాఖ్యానిస్తుంది. అందుకే నేటకీ కథకున్న ప్రాధాన్యత తగ్గలేదు. తెలుగులో ముఖ్యంగా వల్లంపాటి వెంకట సుబ్బయ్య, పోరంకి దక్షిణామూర్తి వంటి పరిశోధకులు తెలుగు కథన శిల్పం మీద విస్తృతమైన చర్చ చేశారు.

ప్రారంభం, సన్నివేశం, సంఘటన, ముగింపు, భాష, శైలి, పాత్రలు, కథనవిధానం, దృక్కోణం... ఇలా ఎన్నో లక్షణాలతో కథా శిల్ప రహస్యాలను కనుక్కోవచ్చు. కుప్పిలి పద్మ రాసిన **సెంకడ్ హస్బెండ్** కథ వర్ణనాత్మకతతో ప్రారంభమవుతుంది. అలాగే బి.ఎస్. రాములు రాసిన **తప్పు**కథ పాత్రలను పరిచయం చేయడంతో మొదలవుతుంది. **సూర్యుని నలుపురంగు రెక్కలు** కూతురి దృష్టికోణంలో డైరీల ఆధారంగా చెప్పడం కథన శిల్పంలోని రహస్యం. ఇక పసునూరి రవీందర్ రాసిన **జాగీరు** కథ పాత్రలైన వినయ్, నారాయణ రెడ్డి కోణాల్లో నడుస్తుంది. వినోదిని రాసిన **చాకలి కూడు** కథ అలంకార రహితంగా సాగి వాస్తవాన్ని కళ్లకు కడుతుంది. స.వం. రమేష్ రాసిన **పాంచాలమ్మ పాట** కథ ఒక ఆత్మీయవ్యక్తితో మాట్లాడినట్లు కనిపిస్తుంది. మల్లిపురం జగదీష్ రాసిన **చంద్రన్న**కథ ముగింపు పాఠకుడి ఊహకు వదిలేయబడుతుంది. యాజి రాసిన ప్రవల్లిక **నిర్ణయం** కథ అబార్షన్ గురించి. ఆ కథ ముగింపు పాత్ర తీసుకున్న నిర్ణయాన్ని ఆచరణాత్మకంగా చూపుతుంది. రాధిక రాసిన **భీష్మా... నాతో పోరాడు!** కథ పాత్ర అంతఃసంఘర్షణలోంచి పుట్టిన కేకతో ముగుస్తుంది. ఎక్కువ కథల్లో పాత్రోచిత భాషే కనిపిస్తుంది. మరికొన్ని కథలు పూర్తిగా ఆయా ప్రాంతీయ మాండలికాల్లో కొనసాగాయి.

**కొన్ని కథలు - కథకులు**

వాళ్ళు ముగ్గురేనా – విమల
ప్రవల్లిక నిర్ణయం – యాజి
నిశ్శబ్దపు చప్పుడు – మధురాంతకం నరేంద్ర
ఆకురాల్చిన కాలం – పాలగిరి విశ్వప్రసాద్
రెక్కల పెళ్లాం – పూడూరి రాజిరెడ్డి
విత్తనం – వి. ప్రతిమ
పిల్లొడొస్తాడా – పి. సత్యవతి
చాకలి కూడు – వినోదిని
పాంచాలమ్మ పాట – స.వెం. రమేష్
మాయ – గంటేడ గౌరనాయుడు
రామల్లి – గూళూరు బాలకృష్ణమూర్తి
తప్పిపోయిన కుమార్తె – వినోదిని
అతడు – స్కైబాబా
ముస్తఫా మరణం – అఫ్సర్
సూర్యుని నలుపురంగురెక్కలు – వి.చంద్రశేఖరరావు
హేట్ మై లైఫ్ – సాయి బ్రహ్మానందం గొర్తి
భీష్మా నాతో పోరాడు! - రాధిక
థూ – పి.వి. సునీల్ కుమార్
నూనె చుక్క – కొట్టం రామకృష్ణారెడ్డి
బాలమణి – సరస్వతి రమ
ప్రేమకథ – రిఫైన్డ్ – అపర్ణ తోట
సెంకడ్ హస్బెండ్ – కుప్పిలి పద్మ
తప్పు – బి.ఎస్. రాములు
ఐస్ క్యూబ్ – వంశీధర్ రెడ్డి
రూపాయి చొక్కా – ఎస్. శ్రీదేవి
సెగ లోగలి – సన్నపు రెడ్డి వెంకటరామిరెడ్డి
క్రానికల్స్ ఆఫ్ లవ్ – డా।। వి.చంద్రశేకరరావు
మహిత – సామాన్య
దమయంతి కూతురు – పి. సత్యవతి

**ఉపయుక్త రచనలు**

కథ (వార్షిక సంకలనాలు) – వాసిరెడ్డి నవీన్, పాపినేని శివశంకర్

బ్లాంక్ ఇంక్ - వినోదిని

సత్యవతి కథలు – పి. సత్యవతి

దశాబ్దం తెలుగు కథలు – మదధురాంతకం రాజరాం

కథనరంగం – వేదగిరి రాంబాబు

కథాశిల్పం – వల్లంపాటి వెంకట సుబ్బయ్య

కథానికా స్వరూప స్వభావాలు - పోరంకి దక్షిణామూర్తి

ఔట్ ఆఫ్ కవరేజ్ ఏరియా – డా. పసునూరి రవీందర్

తెలుగు నవలా సాహిత్యంలో మనోవిశ్లేషణ – కోడూరి శ్రీరామమూర్తి.

A general Introduction to psycho analysis – Freud

---------------------------

# వీరచోడవ్వ చరిత్ర - పరిశీలన

**డా॥ జి. పార్వతి**
సహాయాచార్యులు, తెలుగు శాఖ
యోగివేమన విశ్వవిద్యాలయం, కడప
drparvathigollayvu@gmail.com

వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యచరిత్ర అనేక ప్రక్రియలకు పురుడుపోసింది. మన ప్రాచీన సాహిత్యం పరిశీలిస్తే కవులు సృష్టించిన పురాణ, కావ్య, ప్రబంధ, శతక, యక్షగాన, సంకీర్తన, నాటకాది ప్రక్రియలు మనకు కనిపిస్తాయి. ఇలా వివిధ ప్రక్రియలో రచింపబడిన రచనలు వెలుగులోకి వచ్చినవి కొన్నైతే రావాల్సినవి మరెన్నో. అలా వెలుగులోకి రాని సాహిత్య సంపద ఎంతోభాగం కాలగర్భంలో కలిసిపోగా మిగిలిన కావ్య సంపద ప్రాచ్యపరిశోధన సంస్థల్లో కొట్టుమిట్టాడుతోంది. అలాంటి అపురూపమైన కావ్యసంపదలో ఒక ఆణిముత్యం వీరచోడవ్వ చరిత్ర. దీనికి సంబంధించిన రాతప్రతులున్నాయి. ఇవి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తర్వాత మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంతాలయం నుండి అనేక తాళపత్ర రాతప్రతులతో పాటు సంస్థకు చేరిన తాళపత్ర ప్రతి ఒకటి కాగా రెండవది కాగితపు ప్రతి. ఈ రెండిటిలో ఒకటి డి. 1941 అనే నెంబరు గల తాళపత్ర ప్రతి. ఇది మూలప్రతి. రెండవది డి. 1940 అనే సంఖ్య గల కాగితపు ప్రతి. ఇది పైన పేర్కొన్న తాళపత్ర ప్రతికి పుత్రిక. ఈ కాగితపు ప్రతి మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో ఉంది.

వీరచోడవ్వ చరిత్ర యక్షగాన ప్రక్రియకు సంబంధించినది. తెలుగు సాహిత్య చరిత్రలో 'యక్షగాన' ప్రక్రియ విలక్షణమైనది. ఎందుకంటే సంగీత సాహిత్యాల మేలుకలయిక ఇది. పైగా దేశీయత లక్షణాలు తనలో యిమిర్చుకొని ముందుకు సాగుతుంది. పండిత పామరలకు అలరించే ప్రక్రియ ఇది. ఇందులో తాళ ప్రధానమైన దరువులు (లేదా) రేకులు, ద్విపదలు, ఏలలు, అర్థచంద్రికలు, ధవళాలు, శోభనాలు వంటి గీత ప్రబంధాలు, వచనాలు, పద్యాలు ఉంటాయి. ఎన్ని ఉన్నాగాని మాత్రాగణ భరితమైన దేశిరచనలకే ప్రాధాన్యం ఉండటం వల్ల ఎక్కవగా సాహిత్యంలో యక్షగాన ప్రక్రియ నిలదొక్కుగా గలిగింది.

తెలుగు సాహిత్యంలో యక్షగాన సంబంధమైన ఆటపాటలు ప్రసక్తి మొదట పాల్కురిక సోమనాధుని కృతుల్లోనే కనిపిస్తుంది. అసలు యక్షగాన వాఙ్మయంలో పదాల గురించి చెప్పింది ఆయనే. అయితే 15వ శతాబ్దం ఉత్తరార్థంలో ప్రోలుగంటి చెన్నశౌరి రచించిన ' సౌభరి చరిత్ర ' తో తొలియక్షగాన వాఙ్మయ సాహిత్యం ఆవిర్భవించినట్లు పరిశోధకులు నిర్ధారించారు. తరువాత చక్రపురి రాఘవాచార్యుని 'విప్రనారాయణ చరిత్ర', కందుకూరి రుద్రకవి ' సుగ్రీవ విజయం ' యక్షగాన వాఙ్మయాన్ని సుసంపన్నం చేశాయి. అయితే వీరశైవాంధ్ర వాఙ్మయాన్ని ప్రజా సాహిత్యంగా చేసిన పాల్కురిక సోమన తర్వాత యక్షగాన వాఙ్మయం శైవంలో కూడా విరివిగా వచ్చింది.

రెగళిగె నిమ్మ నాథుని – నిజలింగ చిక్కయ్యకథ, గురునంబిచరిత్ర; వాలెకోటయ్య – చిఱు తొండ భక్తకథా నిధానము; అనుమోదసన్యాసి – బసవకల్యాణము; కానూరి వీరవీరభద్రుని బసవమహిమామృత విలాసము; బుక్కము సాంబయ్య– భల్లాణచరిత్ర పేర్కోదగినవి. ఈ వరుసలోనిదే గుబ్బము – చినకపోతయ్య 'వీరచోడవ్వచరిత్ర'.

మనం ముందే చెప్పుకున్నట్లు వీరచోడవ్వ చరిత్ర యక్షగాన రచయిత గుబ్రము చినకపోతయ్య. ఇతని మరో రచన దారుకా వనక్రీడ. ఇతని తాత ఫాలాంకవిభుడు. అవ్వ పర్వతమ్మ . తండ్రి గుబ్బము గణేశుడు. తల్లి సోమమాంబ. ఈ కవి తండ్రి ధర్మవర్తనుడు, మానఘనుడు, అన్నదాన చక్రవర్తి అనిపించుకొన్నాడట కవి తండ్రి. కవి అన్న పెదకపోతి. తమ్ముడు రాచయ్య, కవి గురువు రేవణసిద్ధదేవుడు. కవి కులం గురించి స్వయంగా 'శైవకులపవిత్రుడ' నని చెప్పుకున్నాడు. కవి తనను అనఘవర్తనుడని, శివకవీంద్రుడని, రసికశేఖరుడని చెప్పుకున్నాడు. ఇది అక్షరసత్యం. రసికశేఖరుడనడానికి వీరచోడవ్వచరిత్రలో పలుచోట్ల బలం చేకూరుతుంది. ఇతని మరోరచన 'దారుకావనక్రీడ' ఇందుకు ప్రత్యక్ష నిదర్శనం.

మహా శివభక్తుడైన ఈయన తనకు పూర్వం శివభక్తులను కూడా తన కావ్యంలో చోటిచ్చాడు. అసలు పాల్కురిక సోమనాథుడు రాసిన బసవపురాణం శైవభక్తుల చరిత్ర అనేది అందరికీ తెలిసిన విషయమే. ఆ పరంపరలో భాగంగా భక్తులను స్మరించుకోవడం వీరశైవ వాఙ్మయంలోనే కనిపిస్తుంది. తన కావ్యాలలో కల్యాణ బసవణ్ణి, భల్లాణ రాయని, చిఱుతొండ నంబిని, హలాయుధుణ్ణి, కాళప్పను, కన్నప్పనే గాక స్త్రీ భక్తులను కూడా స్మరించాడు.

కం. నిమ్మవ్వను, తిలకవ్వను
అమ్మవ్వను, వైజకవ్వ, నా కమలవ్వన్
రెమ్మవ్వను, అరసవ్వను
సమ్మతి వినుతింతు భక్తి సంపద గలుగన్ (పుట 22)

చినకపోతయ్య వీరచోడవ్వ చరిత్రను రొంపిచర్లలో నెలకొనియున్న శంకరేశ్వరునికి అంకితం చేశాడు. రొంపిచర్ల కడపిజిల్లా వాయల్పాడు తాలుకాలో ఉందని ఆచార్య యస్.వి. జోగారావు పేర్కొన్నారు. అప్పటికి (1961) కడపజిల్లాలో ఉండిన రొంపిచర్ల నేడు చిత్తూరు జిల్లాలో ఉంది. ప్రస్తుతం రొంపిచర్ల మండల కేంద్రం, శివాలయం గ్రామానికి బయట చెరువు కట్టక్రింద నెలకొని ఉంది. ఆలయ పరిసరాలు వృక్షాలు, ప్రాచీనతను చాటుతున్నాయి. ఆలయంలో నిత్యపూజలు నామమాత్రంగా సాగుతున్నాయి. శివరాత్రికి మాత్రం విశేషపూజలు జరుగుతాయి. అయితే ఈ శివాలయం చినకపోతయ్య కాలంలో ఒక వెలుగు వెలిగి ఉండి ఉండవచ్చని ఊహించవచ్చు. ఇష్టదేవతాస్తుతిలో గణపతిని ప్రస్తుతించి అతని సోదరుడు రాచవీడు వీరభద్రుని కొనియాడినాడు. రాచవీడు అంటే నేటి రాయచోటి. ఇది రొంపిచెర్లకు 20 కి.మీ దూరంలో ఉంటుంది. అక్కడ వీరభద్రస్వామిని స్తుతించడం ద్వారా ఈ కవిది రొంపిచెర్ల ప్రాంతమని నిర్ధారించవచ్చు. ఈయన కాలాన్ని 1750–1800 మధ్యగా ఊహించవచ్చని ఎలవర్తి చంద్రమౌళి ఊహించారు. ఈ కవి రాసిన రెండు వచనలను శంకరేశ్వరునికే అంకితం చేశాడు.

ప్రస్తుత పరిశోధనాంశం వీరచోడవ్వ చరిత్ర కథకు మూలంగా

కం. చాతుర్యంబగు నీ కథ
గీతార్థములందు మిగులఁ గీర్తన కెక్కన్
ఆతెఱ గెల్లను నేను పు
రాతన నివహంబు కరుణ రచియిస్తిఁ జుమీ

ప్రసిద్ధమైన ఇలాంటి పురాతన నివహం గీతార్థాలతో ప్రసిద్ధికెక్కాలని భావించాడు కవి.

శివరామకృష్ణశాస్త్రి 'ఈ కథ బసవపురాణమున నొక యుపాఖ్యానముగా పాల్కురికి సోమనాథుచే రచింపబడెను. దానినే ఈకవి గ్రహించి యక్షగానముగా రచించెను' అని అభిప్రాయపడ్డాడు. (వీరశైవాంధ్ర వాఙ్మయం, పుట 40) పాల్కురికి సోమనాథుని బసవపురాణం, పండితారాధ్య చరిత్రలలో కొన్ని కథా సందర్భాలలో వీరచోడవ్వ ప్రస్తావన కనిపిస్తుంది.

బసవ పురాణంలో పలుమార్లు వీరచోడవ్వ ప్రస్తావన కనిపిస్తుంది.

సంగమేశ్వరుడు జంగమరూపం ధరించి బసవని మూడవ కన్ను అడిగే సందర్భంలో బసవడు 'మిగిలిన భక్తుల్లాగానేనేమి కోరను ' ' నీదు సకల వియోగంబు మావారలైయుండ ' నాకేమిటి కొరత? అని అంటాడు. ఆ భక్తుల వరుసలో –

" ఆరగింపఁగఁ బెట్టు నవసరంబులది
వీరచోడవగారు విశ్వైక వినుత! " – ( బసవపురాణం పుట 40)

అలాగే బెజ్జమహదేవి కథా సందర్భంలో శివుడు పాలు తాగడం మానివేస్తే ఆ సందర్భంలో బెజ్జమహాదేవి దుఃఖిస్తూ రాచవీటిలో పిట్టివ్వ దగ్గర పిట్టారగించడాన్ని, సామవేదుల ఇంట చచ్చిన పెయ్యను వండి పెట్టగా తినడాన్ని, కరికాళవ్వ ఇంట మామిడి పండ్లు తినడాన్ని , చెన్నయ ఇంట పుల్లని అంబలి తాగడాన్ని, చిరుతొండనంబి కొడుకు మాంసాన్ని కోరి విందు చేయడాన్ని , నిమ్మవ్వ ఇంట భుజించడాన్ని పేర్కొంటూ –

"యారగింపఁగఁ జవియైనఁ జోడవ్వ
కోరతో నిచ్చినఁ గొని యారగించి" అంటూ చోడవ్వ సమర్పించిన పులగాన్ని తినినగాథ పేర్కొనబడింది.
(బసవపురాణం – పుట 60)

అదే బసవపురాణంలో సురియచౌడయ్య కథలో కూడా శివుడికి భక్తులు వడ్డించిన వరుసలో –

"వీరచోడవ్వ దాక్షారామమందు
నారగింపఁగఁజవియైనఁగంపించెఁ
గుడుకతోడన మఱి గడియెత్త నోడి
తడయక పులగంబు దాసిచేఁ బనుపఁ
బుత్తెంచె మాయక్క పులగంబు నీకుఁ
జిత్తజాంతక! యిదె చేకొనుమనినఁ
బ్రీతిమైఁ జెయి సాఁచి భీమేశుఁ డతివ

చేతిపులగముఁ జెచ్చెరఁ బుచ్చికొనుచు
నారోగణము సేసి యందఱుఁ జూడఁ
గోరఁ గ్రంగన వైచె గుడివెలి ననఁగ"

అని వీరచోడవ్వకథ సంగ్రహరూపంలో కనిపిస్తుంది. (బసవ పురాణం, పుట 144)

పండితారాధ్యచరిత్రలో దీక్షాప్రకరణంలో సామవేదికథలోను, గురుభక్తాంబరీ కథలోను వీరచోడవ్వ ప్రస్తావన కనిపిస్తుంది. ఈ విషయాలనన్నింటిని పరిశీలిస్తే వీరచోడవ్వ గొప్పశివభక్తురాలు. పరమేశ్వరునికి అన్నం వడ్డించిన అంగన. ఆమె దివ్యచరిత్ర వివిధ సందర్భాల్లో ప్రస్తావించిన అవలోకన చేసుకున్న గుర్రము చినకపోతయ్య ఆ సంగ్రహకథను పెంచి యక్షగానంగా రచించాడని చెప్పవచ్చు.

'వీరచోడవ్వచరిత్ర' ఇతివృత్తాన్ని పరిశీలిస్తే 'దారుకావనం' లో కథ ప్రారంభం అవుతుంది. దారుకావనంలో సనకాదిమునులు ఈశ్వరభక్తిని వదిలిపెట్టి, స్త్రీలోలురురై నియమాలు తుంగలో తొక్కి విచ్చలవిడిగా ప్రవర్తిస్తున్నారు. అక్కడికి పరమేశ్వరుడు దిగంబర స్వరూపంతో వచ్చాడు. అక్కడి స్త్రీలను తనవైపుకు తిప్పుకున్నాడు. దానిని మునులు సహించలేకపోయారు. ఆ మునులు కోపించి కొన్ని మాయలు చేశారు. ఈశ్వరుడు ఆగ్రహోదగ్రుడైనాడు. అప్పుడు పరమశివుడు మునులను అంగవిహీనులు కమ్మని శపించాడు. వారి స్త్రీలను భూలోకంలో సానివంశంలో జన్మించి, తనను సేవించి మోక్షం పొందేటట్లు చెప్పి అదృశ్యమైనాడు, అంతవరకు దారుకావనంలో సాగిన ఈకథ అక్కడినుండి దాక్షారామం చేరింది.

దాక్షారామంలో సానివంశంలో ప్రముఖుడు మల్లినాయకుడు. అతని భార్యనన్నెచోడమ్మ. వీరికి సంతానం లేదు. సంతానం కోసం కేదారవ్రతం తలపెట్టారు.

సీ. కైలాసగిరి మీఁద గరకంఠు డొకనాడు
వేడుకతో జూదమాడుచుండి
నవ్విన, హిమశైలనందన వీక్షించి
'యెత్తుదప్పదు నవ్వనేటి' ? కనిన
ఇంగువలకై కాదు ఏణాక్షి విను ! దక్ష
వాటి లోపల సానివారలెల్ల
బాలికామణులతో బరిణయంబొనరించి
నను నల్లుదని కొల్వ నవ్వు వచ్చె.

ఆ.వె. ననియె; కేలుమొగిచి యభవ! యామీదుట
బరిణయంబునకును వెరవు గలుగు
నట్టి వంశమందు బుట్టి మీ చిత్తంబు
వచ్చినట్లు మెలగ నిచ్చగలదు ( వీరచోడవ్వ చరిత్ర పుట 27)

అంటూ పార్వతీదేవి దాక్షారామంలో మల్లి నాయకుని దంపతులకు రతిరూపంలో, సరస్వతిదేవి వాగ్బలంతో, లక్ష్మీదేవి లాంటి సిరి సౌభాగ్యంతో వీరచోడమగా పుట్టి విలసిల్లుతోంది. దాక్షారామంలో ఆచారం ప్రకారం ఆడపిల్లను దాక్షారామభీమేశ్వరునికిచ్చి పెండ్లి చేయాలి. కాబట్టి వీరచోడవ్వకు అలానే చేశారు. అయితే అందరిలా కాకుండా వీరచోడవ్వ భీమలింగాన్ని గాఢంగా ప్రేమించింది. చిన్నతనంలో ఆమె అమాయకత్వాన్ని చోసి తల్లిదండ్రులు, బంధువర్గం ఎంతో సంతోషించారు. భీమేశ్వరుడు చోడవ్వప్రేమను. రూఢి చేయడానికి, ఒకనాటక మాడాడు. విటవేషం ధరించి నన్నెచోడమకు డబ్బు ఆశ చూపాడు. నన్నెచోడమ భీమలింగంమీది ఆశ వదలు కొమ్మంటుంది. ధనవంతుడైన విటుని వివాహం చేసుకొమ్మంటుంది. వీరచోడవ్వ తల్లిని, బంధుజనాలను తిరస్కరించింది.

'భీమనాయకుఁ డింక నామనోనాయకుఁడు
సీమనాయకులనేఁ గామించనేరన్ '

అని తన అభిప్రాయాన్ని స్పష్టం చేసింది.

వీరచోడమను సమర్తాడింది. ఆశుభసందర్భాన బంధువులు నానారకాల సుగంధద్రవ్యాలు తెచ్చారు. పులకండం, జున్ను, నెయ్యి కలిపిన పులగం తెచ్చారు. ఆపులగాన్ని వీరచోడవ్వ రుచి చూసింది. ఒక గిన్నెలో భీమేశ్వరుని కిమ్మని చెలికత్తెద్వారా పంపింది. భీమలింగం పులగాన్ని తీసుకొని ఆరగించాడు. గిన్నె తిరిగి ఇవ్వకుండా ఆలస్యం చేశాడు. పులగం తెచ్చిన మరదలు భీమ భావను.

' కోరయియ్యఁగదవె భీమభావ! కోరయియ్య గదవె ! ' అని గిన్నె ఇమ్మని అడిగింది. భీమలింగం సగం పులగం తిని సగం ఉంచుకొని గిన్నె ' తిరిగి ఇవ్వలేకపోయాడు. మరదలు మళ్ళీ అడిగింది. పూజకోసం పూజారులు తెచ్చిన బంగారుగిన్నెను భీమేశ్వరుడు విసిరివేశాడు. వెండి గిన్నెకు బదులు బంగారు గిన్నె ఇచ్చాడని మరదలు సంబరపడింది. బంగారు గిన్నెను చోడవ్వ కిచ్చింది. భగవంతుని అనుగ్రహాన్ని వివరించింది. బంధు జనులు సంతోషించారు. వీరచోడమను 'వీరశైవాచార విఖ్యాతమతివి ' అని కొనియాడారు. కొంతమంది చెలికత్తె బంగారు గిన్నెను దొంగిలించిందని అనుమానించారు.

'ఎక్కడి భీమేశుఁ డెక్కడి పులగ!
మెక్కడి చోడవ్వ యెక్కడి గిన్నె! ' ( పుట 60 )

అని తమ అభిప్రాయాలు వెల్లడించి వెళ్ళిపోయారు. పూజ చేయడానికి పూజారులు వచ్చారు. బంగారుగిన్నె లేకపోవడాన్ని గమనించారు. ' ఎవరు తీసి ఉంటా'రని తమలోతాము చర్చించుకున్నారు. అందులో ఒకడు ' వీర చోడవ్వ చెలికత్తె ఇంతకు మునుపు తలుపు దగ్గరకు వచ్చిం'దని చెప్పాడు. పూజారులు వీరచోడవ్వ దగ్గరకు వచ్చి విచారించారు. అందుకు వీరచోడవ్వ ' సానివంశంలో దొంగతనం లేదు. భీమలింగం వెండిగిన్నె తీసుకన్నా'దని చెప్పింది. అప్పుడు పూజారులు ' నువ్వు చెప్పింది నిజమైతే నిన్ను గంగతో, పార్వతితో సమంగా చూస్తా' మన్నారు. అపుడు చోడవ్వ ' దేవుని సభలోకి రప్పించి గిన్నె ఇప్పిస్తా ' నని , ' మీకు వరాలిప్పిస్తా ' నని చెప్పింది.

పూజారులు చోడవ్వభక్తిని పరీక్షించడానికి చాటింపువేశారు. భీమేశ్వరుని పూజించి తలుపులు తాళంవేశారు. ముఖమంటపంలో అందరూ చేరారు. అపుడు చోడవ్వ శుచిస్నానం చేసి, భీమేశుని మనస్సులో నిలిపింది. ప్రజలు

తమతమకుతోచిన విధంగా భావించారు. వీరచోడవ్వ భీమేశ్వరుని స్తుతించింది. భీమేశ్వరుని నుండి ఏమీ బదులు లేదు. జనులు వీరచోడమను నిందించారు. వీరచోడమకు కోపం వచ్చింది. దేవదేవుడైన భీమశంకరుని నిందించింది. భీమేశ్వరుడు సాక్షాత్కరించాడు. అందరూ అభయం వేడారు. వీరచోడవ్వ భీమేశ్వరుణ్ణి భక్తి తన్మయురాలై స్తుతించింది.

భీమేశ్వరుడు ' పులగం భుజించడం నిజమని' స్వయంగా చెప్పాడు. ' నాకు శక్తి, కలిమి, వంశం ముఖ్యంకాదు. అవన్నీ బాహ్య విషయాలు. భక్తులై నాకు ప్రాణబంధువులు ' అని స్పష్టంగా పలికాడు. వీరచోడవ్వను ' మహాభక్తురా' లన్నాడు. ' ఏంకావాలో కోరుకొమ్మన్నాడు. ' ' నీదర్శన భాగ్యం కన్న ఏంకావాలి? కానీ ఒక్క కోరిక కోరుతున్నా' నని అంటూ ' ఇక్కడి ఈ ప్రజలంతా కొలుస్తుండగా కైలాసంలో ఉండాలన్నది నా కోరిక ' అని చెప్పింది. అప్పుడు శంకరుడు వీరచోడవ్వతోపాటు పురజనుల్ని కూడా కైలాసానికి తీసుకొని వెళ్ళాడు.

**రచనా విశిష్టత :**

తెలుగు సాహిత్యంలో ' యక్షగాన ' ప్రక్రియ విశిష్టమైనది. సంగీత సాహిత్యాల మేలుకలయిక యక్షగానం. యక్షగానాల్లోని ప్రధాన రచనాంగాలన్నీ దాదాపుగా వీరచోడవ్వ చరిత్రలో ఉన్నాయంటే ఆశ్చర్యపడనవసరంలేదు. ఇందులో పద్యాలు - 31, గేయాలు - 60, వచనాలు - 67 ఉన్నాయి. ఇందులోని గేయాలకు రాగనిర్దేశం చేయబడలేదు. తాళనిర్దేశం మాత్రం ఉంది. ఈ యక్షగానంలో ఛందో వైవిధ్యం స్పష్టంగా కనిపిస్తుంది.

కావ్యారంభాన్ని గమనిస్తే శ్రీ అనే అక్షరంతో కావ్యం ప్రారంభమైతే శుభమని, కావ్యానికి, కవికి మంగళం కలుగుతుందని ప్రాచీన లాక్షణికుల అభిప్రాయం. శ్రీకారంతో గ్రంథం మొదలుపెడితే దోషాలు తొలిగి , శ్రేయస్సు కలుగుతుందని అప్పకవీయంలో ఉంది. తెలుగు సాహిత్యంలో నన్నయ నుండి నేటి పద్యకవుల వరకు ఈ సంప్రదాయాన్ని పాటించారు. అయితే శైవకవి పాల్కురిక సోమనాథుడు మాత్రం దీనికి మినహాయింపు కానీ గుర్రము చినకపోతయ్య తన పూర్వ వీరశైవ కవులలాగా కాకుండా శ్రీకారంతోనే కావ్యారంభం చేశాడు.

సీ. శ్రీరాగలలిత ! సుస్థిరభావ ! కల్యాణ
చరిత! గౌరీప్రియ ! సలలితాంగ !
శంకరా ! భరణ భుజంగ ! నీలాంబర
సన్నుత ! భైరవజనక ! భర్గ !
మలహార ! యభవ ! రామక్రియాన్విత ! దేవ !
గంధర్వ యక్షలోక ప్రసన్న!
కాంభోజ సౌరాష్ట్ర గౌళ భూపాల సం
సేవిత పాదరాజీవ యుగళ

యనుచు ననురాగమతి గొనియాడి, విభుధ
జన మహీజాత నివహ వసంతు డగుచు
సిరులు దయసేయుచును రొంపిచెరుల పురుని
ఇరువు శోభిల్లు శంకరేశ్వరుని గొలుతు. ( పుట 19 )

అంటూ తన ఇష్టదైవమైన శంకరేశ్వరుని మనసారా కీర్తించాడు. ' రొంపిచెరులపురిని ఇరువుశోభిల్లు శంకరేశ్వరుని గొలుతు ' అంటూ స్వామికి ప్రాంతీయ అస్థిత్వాన్ని తెలియజేశాడు. ఇది కవి నివాసాన్ని కూడా నిర్ధారించడానికి అనువైన అంశం.

వీరచోడవ్వ చరిత్ర యక్షగానంలో శృంగారరసం అంగిరసంగా ప్రవహించింది. కావ్యారంభంలోనే దారుకావన వర్ణనతో ప్రారంభమైనదే కవి సూచ్యార్థంగా ఇది శృంగారరస ప్రధానంగా సాగే రచనగా తెలియజేసినట్లు ఉంది. ఈ శృంగార రసం రెండు రకాలు . 1. సంభోగ శృంగారం. 2. విప్రలంభ శృంగారం. నాయికా నాయకులు సన్నిహితంగా ప్రవర్తించినపుడు వర్ణించేది సంభోగ శృంగారం. ఇది కేవలం కలయికరూపంలోనే కాకుండా నాయికా నాయకుల ఆలోచన. చుంబన, ఆలింగన జలక్రీడల్లో కూడా ఉంటుందని ఆలంకారికులు నిర్ణయించారు. ఇకనాయికా నాయకుల వియోగాన్ని వర్ణించేది విప్రలంభశృంగారం. ఇది

1) అభిలాషా విప్రలంభం
2) ఈర్ష్యా విప్రలంభం
3) విరహ విప్రలంభం
4) ప్రవాస విప్రలంభం

అని నాలుగు విధాలుగా ఉంటుందని భట్టుమూర్తి కావ్యాలంకార చూడామణిలో పేర్కొన్నాడు. ఈ శృంగారానికి స్థాయి భావం రతి. ' రమ్యతే, రమతే రమయాతీతి రతిః ' అని వ్యుత్పత్తి. అంటే రమించడం రమిపంజేయడం అని శబ్దార్థాలు. ఈ భావన నాయికలో మొదట నాయకుని గురించి వినడం, చూడటం, మనస్సులో లగ్నం చేసుకోవడం ద్వారా కలిగి క్రమవికాసాన్ని పొందుతాయి.

ప్రస్తుత వీరచోడవ్వ చరిత్రలో కూడా వీరచోడవ్వ భీమలింగంతో పెళ్లి అయిన తర్వాత భీమేశ్వరుని లీలలను తల్లిదండ్రుల ద్వారా, బంధువుల ద్వారా విని అతనిపై గాఢమైన పెంచుకుంది. తనకు జరిగిన పెళ్ళి నామమాత్రమని తను గ్రహించలేదు. నిజమని నమ్మింది. తన నాయకుడు భీమేశ్వరుడు అని గట్టిగా విశ్వసించింది. అతనిపై మనసు పారేసుకుంది. వీరచోడవ్వలో మన్మథుడు ప్రేరేపణలు కలిగించాడు. అప్పుడు వీరచోడవ్వలో

" పులకించి చెక్కిళ్ల - బొడమిన చెమట
లలసత దుడిచి, ప - య్యెద చలించుటయు "          ( పుటలు 29, 30 )

అంటూ మార్పులు కలిగాయి. ఇక్కడ అభిలాషా విప్రలంభం పోషింపబడింది. తన ముఖ మెత్తి వెన్నెలను చూడనీయని చంద్రుడ్ని, పూబాణాలతో విల్లెత్తి పెట్టిన మన్మథుడిని, చికాకకు కలిగిస్తున్న చిలకలను, కోయిల పాటలు కోపాన్ని తెప్పిస్తున్నాయి. ఈ కావ్యంలో శృంగారం కూడా సమయోచితంగానే పోషింపబడింది.

వీరచోడవ్వ పెళ్ళి సందర్భంలో పాడిన పాట పాఠకులను ఎంతగానో ఆకట్టుకుంటుంది.

శ్రీమించు గోదారి - తీరామునానూ
ప్రేమాతొ నెలకొన్న - భీమలింగముకూ

వీరశైవాచార – మారుఢి నడపీ
పేరెన్నికైనట్టి – వీరచోడమకూ
గౌరీకల్యాణమే ! వైభోగమే !
భూమితేరుగ నెక్కి – పురమూలు గెలచీ
ధీమంతుడైనట్టి – భీమలింగముకూ
వారింపగారాని – మారూని మాయా
దీర నోపినయట్టి – వీరచోడమకూ
గౌరీకల్యాణమే ! వైభోగమే!
కామితంబుగ గొల్చు – భక్తూల కెల్లా
కామితార్థము లిచ్చు – భీమలింగముకూ
వారకామినులలో – సారస్యముననూ
మీఅజాలిన యట్టిన – వీరచోడమకూ
గౌరీకల్యాణమే ! వైభోగమే ! (పుట 39 )

అంటూ సాగిన పెండ్లి పాట భీమేశ్వరుని మహిమలను చాటేదిగా ఉంది. అయినా వారవనితలకు, పరమేశ్వరునికి నక్కకు, నాగలోనికి ఉన్నంత తేడా ఉన్నా వివాహం కుదిరే ఆచారం ఉండటం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

ఒక కాలంలో సృజింపబడిన సాహిత్యంలో తప్పకుండా నాటి సామజికాంశాలు కొద్దో గొప్పో చోటు చేసుకుంటాయి. ఎందుకంటే ఆ సాహిత్య సృష్టికర్త అయిన కవి సమాజంలోని వ్యక్తే కాబట్టి తనకాలపు సామాజిక విషయాలు అతడ్ని ఎక్కువగా ప్రభావం చేస్తాయి. కథ జరిగిన కాలం వేరైనా కావ్య రచనకు పూనుకున్నకవి ఆ కథను తీసుకొని తన కాలపు విషయాలను మేళవిస్తాడు. ఆ పాత్రలు కూడా తనచుట్టు ఉన్న వారివలె ప్రవర్తించాలని భావిస్తాడు. ఆ కారణం చేతనే సామాజింకాంశాలు సర్వసాధారణంగా కావ్యంలోకి ప్రవేశిస్తాయి.

వీరచోడవ్వ చరిత్ర రాసిన గుర్రము చినకపోతయ్య సంధియుగంలో జీవించిన వ్యక్తి. తెలుగు భూమి ముక్కలు చెక్కలై జమీందారులు , మండలాధీశ్వరులు సామంత పాలకుల చేతిలో పడిన కాలమిది. రాజు కూతురు మేడెక్కి నిలబడితే కూలివాని కూతురు గుడిసెక్కి కూర్చుందన్నట్లు ప్రజలు జీవనం సాగిస్తున్నారు. అలాంటి కాలంలో రాయబడిన వీరచోడవ్వ చరిత్ర రచయిత అసమాన పరమేశ్వరభక్తుడు. ఈ కథ పౌరాణికమే అయినా సామాజికాంశాలు బాగానే చోటు చేసుకున్నాయి.

జాతి సంస్కృతికి ఆచార వ్యవహారాలు అద్దం పడుతాయి. సంఘశ్రేయస్సుకోసం పెద్దలు కొన్ని కట్టుబాట్లను, కొన్ని నియమాలను ఏర్పరచడం జరుగుతుంది. అవే క్రమంగా ఆచార వ్యవహారాలుగా పరిణామం చెంది సంస్కృతిగా మిగులుతాయి.

వీరచోడవ్వ చరిత్రలో దాక్షారామంలోని సానివారు తమ ఇంట్లో పుట్టిన ఆడపిల్లలను భీమేశ్వరునికిచ్చి పెళ్ళి చేసే ఆచారం ప్రధానమైనది. ఆ ఆచారాన్ని తెలియజేస్తూ

తే.గీ. మన కులస్వాములకు నెల్ల – మనసు రాను
భీమ లింగంబునకు నిన్ను – బెండ్లి చేతుఁ
బిదప నీయిశ్చ; నేడింక – బెండ్లికూఁతుఁ
జేయగావలె రావమ్మ! – చిగురుబోణి ’ ( పుట 35)

అని వీరచోడవ్వ తల్లి తెల్పిన విధానాన్ని బట్టి ఆ విషయాన్ని బలపరుస్తుంది. అలాగే పెళ్లి కొడుకు గురించి బంధుజనులు పొగడటం కనిపిస్తుంది. స్త్రీల అలంకరణ పెళ్ళి సమయంలో ఎలా చేస్తారో ఈ కావ్యంలో కనిపిస్తుంది.

ఈవిధంగా సాగిన గుర్రము చినకపోతయ్య వీరచోడవ్వ చరిత్ర అచ్చతెలుగు పదాలతో అల్లిన మేలుబంతికావ్యం అనక తప్పదు.



# చిత్తూరు జిల్లా కథాసాహిత్యం - అగ్రకులాధిపత్యం

యం. రాజేష్ బాబు
పరిశోధక విద్యార్థి
తెలుగు శాఖ
ద్రావిడ విశ్వవిద్యాలయం
చరవాణి: 7989915437

భారతీయ నిచెనమెట్ల కులవ్యవస్తలో దళితులను కులం పేరుతో దూషించటం, దాడులు చేయటం, దళిత ఉద్యోగులకు ఇల్లు అద్దెకు ఇవ్వకపోవటం, అగ్రకులాల వాళ్ళు వస్తే దళితులు లేచి నిలబడాల్సిరావడం, ఎదురిస్తే సాంఘిక బహిష్కరణకు గురి చేయడం, హోటలల్లో రెండు గ్లాసుల పద్ధతి ఆచరించటం, పోలీసులు, అధికారులు దళితులను నిర్లక్ష్యం చేయడం, దళిత ప్రజాప్రతినిధులను విధినిర్వహణ చేయనివ్వకపోవటం, ఇవన్నీ కూడా అగ్రకులాధిపత్యం కారణంగా కింది కులాలవాళ్ళు అనుభవిస్తున్న అణచివేతలు. ఈ విషయాలను చిత్తూరుజిల్లా కథా రచయితలు తమ కథా సాహిత్యంలో ఏవిధంగా ప్రతిఫలించారో తెలియజేయడం ఈ వ్యాస లక్ష్యం.

యస్.కె.రమణ 'భోదివృక్షం' కథలో ఒక దళితున్ని అగ్రకుల దురహంకారం ఎలా దోచుకుంటుందో తెలియజేశారు. మంచి పేరుతో ఆస్తిని, ఆధిపత్యంతో శ్రమను, అగ్రకులస్తులు దోచుకుంటారు,ఎలాగైనా మానసికంగా కృంగదీయాలంటే పరువుపైన వేటు వేయాలనుకుంటారు. తమప్రవర్తనను హీనాతిహీనంగా చిత్రించైనా తమకు కావాల్సిన అవసరాలను దళితులనుండి అగ్రకులాధిపత్యం ఎలా తీర్చుకుంటుందో రచయిత ఈకథ ద్వారా తెలిపారు.

పెద్దిరెడ్డి, చిన్నిరెడ్డి అన్నాదమ్ముళ్ళు. వీళ్ళ పాలేరు కోటేసు. మంచితనంతో పెద్దిరెడ్డి, ఆధిపత్యంతో చిన్ని రెడ్డి, ఇద్దరూ చేసే పనులు ఒక్కటే. పై పూతలా పూసుకున్న మంచితనం కారణంగా పెద్దిరెడ్డి ఉర్లో అందరికీ మంచివాడు, చిన్నిరెడ్డి తాగుబోతు ,తిరుగుబోతు. అప్పులడిగి ఇవ్వకపోతే బెదిరించి మరీ తన అవసరాలు తీర్చుకొనేవాడు. ఇలా వేరు వేరు దారుల్లో పయనించిన ఇద్దరు పెద్దలూ దళితులను దోచుకోనే జీవిస్తున్నారు. అడిగితే తమ్ముడి గురించి ఆలోచించద్దు అనో, దార్లోకి తెచ్చుకోలేక ఉన్నాననో అనే లేనిపోని కబుర్లు చెప్పి పంపిస్తుంటాడు. కోటేసు తన భార్య చనిపోతే కార్యానికని అప్పుగా డబ్బు తీసుకుంటాడు. ఎంత శ్రమ పడినా అసలు అసలు గానే మిగిలిపోతుంది. అవసరాలకోసం మళ్ళీ అప్పు అడగడానికి సిద్ధపడితే డబ్బు ఇస్తానుగానీ, కాగితం మీద సంతకం పెట్టమని ఇచ్చినడబ్బుని తమ్ముడు అడుగుతాడని చిన్నిరెడ్డి పేరుచెప్పి సంతకాలు మంచితనంతో పెట్టమని ఆస్తిని తమ పేరుతో రాయించుకున్నారు. కోటేసు తనకూతురికి పెళ్ళి చేయడానికి పెద్దిరెడ్డి దగ్గరున్న పొలాన్ని తీసుకోని ఆ పొలాన్ని కట్నంగా ఇచ్చి పెళ్లి చేయాలనుకుంటాడు. ఈ విషయానికి పెద్దిరెడ్డి అంగీకరించడంతో ఎంతగానో సంతోషిస్తాడు కోటేసు. అంతలో చిన్నిరెడ్డి ఈ విషయాన్ని గ్రహించి తనకూతురు రాములుతో తిరుగుతోందని ఊరంతా ప్రచారం చేస్తాడు. అవమానం భరించలేక కూతుర్ని చితకబాది ఊరు వదిలి వెళ్ళిపోవాలని నిర్ణయించుకుంటారు. ఊరంతా కలిసి రాముల్ని కొట్టగా చిన్నిరెడ్డే అలా చేశాడనే వాస్తవాన్ని జనాలు తెలుసుకుంటారు. దీంతో కోటేసుకు అన్నదమ్ముళ్ళ అసలు స్వరూపం తెలిసిపోతుంది. దీంతో ఎవ్వరు ఎంతచెప్పినా వినకుండా కూతురితో పాటు ఊరు వదిలి వెళ్ళిపోతాడు కోటేసు.

ఒక నమ్మిన బంటును, బహీనుడైన దళితున్ని అగ్రకులాహంకారం ఏవిధంగానైనా దోచుకోగలదనే వాస్తవాలని చిత్రించారు. ఈ విషయాన్ని రచయిత మాటల్లో చూస్తే " కాదురా నువ్వు దూకుడుగా ఆలోచిస్తే ఎట్లా! కోటేసు నమ్మిన బంటు వాడిని మంచి తనంతో జయించాలా ఊరందరితో మంచిగాను ఉండాలా ఈరెండు కావలంటె కొంత దూరదృష్టి అవసరం కోటేసు. అయ్యకు మనం చేసిన అన్యాయం కోటేసును చేరదీయటంతో కప్పబడిపోయింది. యిప్పుడు కోటేసును వదిలించికోవాలంటే నాకు ఉపాయం తోచలేదు. నువ్వు సమయానికి రాములుగాణ్ణి

ఉసిగొలిపినావు. నాటకంలాగా రక్తి కట్టింది. ఇక ఊర్లో తలెత్తుకోలేడు కోటేసు. నేనింక భయపడ్డాను యీ సీతాలుపైన నువ్వేమైనా చెయ్యి వేశావేమోనని, వెయ్యలేదు కదా! ఇంతకు ముందు సుబ్బిగాని కూతురు ఆత్మహత్య కేసు తప్పించేసరికి నా తలప్రాణం తోకకొచ్చింది. యేది వ్యవహారంగా చేయవు. అని తమ్ముడికి దళితులను ఏవిధంగా దోచుకోవాలో నేర్పిస్తాడు. ఈ విధంగా అన్నదమ్ముళ్ళు ఇద్దరూ కలిసి తమ ఆధిపత్యాలను చెలాయిస్తారు. అదేవిధంగా

మధురాంతకం రాజారాం రచించిన 'అజ్ఞాతవాసం' కథలో ప్రభుత్వం కల్పించిన రిజర్వేషన్ల కారణంగా దళితుడు అగ్రకుల కబంధహస్తాల్లో చిక్కి కనీసం తన తిండి తాను సంపాయించుకునే స్వేచ్చను కూడా పోగొట్టుకుంటాడు. పేరుకుమాత్రమే ప్రసిడెంటు అధికారం మాత్రం అధిపత్య వర్గం చేతుల్లో చిక్కుకుపోయిన విధానాన్ని దాని నుండి బైటపడవలసిన ఆవశ్యకతను రచయిత ఈ కథ ద్వారా తెలియజేశారు.

ఈ కథలో తరతరాలుగా పోలిరెడ్డి అతని కుటుంబ సభ్యులే పరకబయలు గ్రమపంచాయితీ ప్రసిడెంటు అధికారాన్ని చెలాయిస్తున్నారు. ప్రభుత్వం అమలుపరచిన రిజర్వేషన్ల కారణంగా ఒక దళితుడు నుండి పంచాయితీ ప్రసిడెంటుగా నిలబడాల్సి వస్తుంది. అందుకు పోలిరెడ్డి ఆ ఊరి నుండి ఆసాదిగంగడిని పిలిచి గ్రమప్రసిడెంటుగా ఉండమంటారు. ఆరోజు నుండి గంగడిని ఊర్లో ఎవ్వరూ కూలికి పిలవరు. దాంతో భార్య సంపాదన మీదనే బతకాల్సివస్తుంది. దాని వల్ల పక్క ఊర్లో కూలికి పోతానంటే ఊరి పెద్దలు రామప్పనాయుడు కరణం మల్లయ్య పక్క గ్రమానికి వెళ్తే బాగుండదని పరకబయలు ప్రసిడెంటు ఆఊర్లో కూలికి పోతున్నాడు అని అనుకుంటారని దగ్గర్లో ఉన్న చిత్తూరుకు పోయి పని చేసుకోమనొ, అది టవును కాబట్టి ఎవ్వరూ పట్టించికోరు అని సలహా ఇస్తారు. దాంతో చిత్తూరు పోయి అక్కడ పరిస్థితులు అడవికన్నా ధారుణంగా ఉన్నాయనే విషయాలను, తన గోడునంతా కూడా గాంధీ విగ్రం ముందు కూర్చొని వెలిబుచ్చుతాడు. అతని కేరాఫ్ అడ్రస్ కూడా మహాత్మాగాంధీ నాలుగు రోడ్ల కూడలి చిత్తూరు అని తన ఊరి ఆధిపత్యులకు రాయాలనుకుంటాడు.

దళితులు కూడా అందరితో సమానంగా ఎదగాలనే ఆశయంతోటి వచ్చిన రిజర్వేషన్లు అదే దళితులను మరింత దిగజార్చడానికి ఆధిపత్యులకు ఉపయేగపడుతున్న విధానాన్ని తెలిపారు. అదేవిధంగా వాటిని సమూలంగా ఖండించి దళితులే సద్వినియేగం చేసుకోవాలనే భాద్యతను రచయిత ఈకథ ద్వారా అందించారు.

పులికంటి కృష్ణారెడ్డి రచించించిన 'ముత్తడు గొప్పోడు' కథలో దళితుల రిజర్వేషన్స్ ని అగ్రవర్ణస్తులు ఉపయోగించుకొని ఉద్యోగాలు సంపాయిస్తున్న అగ్రకులదౌర్జన్యాలను దోపిడీలను బట్టబయలు చేస్తున్న కథ.

ఈకథలో పర్దేసిరెడ్డి ఆ గ్రమభూస్వామి అందరిముందు కుల పట్టింపులేని మహాను భావుడిలాగా ప్రవర్తిస్తుంటాడు. దీనిని రుజువు చేసుకోవాడానికి తన పాలేరైన ముత్తడికి తనకొడుకును దత్తతకిస్తాడు. ముత్తడు పెళ్ళి, పిల్లలు లేని ఒంటరి వాడు, పర్దేసి దగ్గరే పాలేరుగా పని చేస్తుంటాడు. అలాంటి వాడికి తన కొడుకును దత్తత చేశాడన్న ఆనందంతో ముత్తడు తన ఐదు ఎకరాల భూమిని పర్దేసి రెడ్డి కొడుకు గాంధీరెడ్డి పేర రాయిస్తాడు. గాంధీరెడ్డి దళితుడి బిడ్డగా మారి రిజర్వేషన్స్ పుణ్యమా అని ఆజిల్లా కలెక్టర్ అవుతాడు. కొడుకు ఇంత పెద్ద ఉద్యోగం సంపాదించాడన్న ఆనందంతో కొడుకును కౌగిలించికోవాలని వెళ్తే సహించలేక ముత్తడిని అవమానిస్తాడు. ఆ అవమానన్ని భరించలేక ముత్తడు ఆత్మహత్య చేసుకుంటాడు. మూడు రోజులకు సంస్మరణ సభ పెట్టి కళ్ళుబిల్లి కన్నీరుతో అందర్ని నమ్మిస్తాడు. ఈ విషయం తెలుసుకోలేక అందరూ ఆ ఏడుపు నిజమని పర్దేసిరెడ్డిపై జాలిని ప్రదర్శిస్తారు. దళితులంతా తమ రిజర్వేషన్లు ఏ విధంగా పక్కదోవ పడుతున్నాయో, వీటిని ఆసరాగా తీసుకోని దళితులపై అజమాయిషి చెలాయిస్తున్న అగ్రకులాధిపత్యాన్ని ప్రశ్నించాలని, వారి దుర్మార్గాలను అణచివేసే పోరాటాలు జరగాలని, దళితులు కోసం నిర్ణయించిన రిజర్వేషన్లు వారే వినియోగించికోవడం వారికి కల్పించిన హక్కు, అనే

స్పృహను రచయిత ఈ కథ ద్వారా తెలిపారు.

ఇతను రాసిన మరో కథ 'పండగ పూట పరమాణ్ణం' కథలో దళితుల పరిస్థితి సమాజంలో ఎలా ఉందనే విషయాని ఈకథలో తెలియజేశారు. ఈ కథలో లచ్చుంగాడు రెడ్డి పాలేరు. రోజు రెడ్డికి సారాయి తెచ్చిచ్చేవాడు. అందులో మిగిలిన కమీషన్ తోటి తన భార్య లచ్చిమికి పూలు తెచ్చేవాడు. రెడ్డి రెడ్డెమ్మ సరసన కూర్చొని సారాయి తాగేది చూసి తాను ఎప్పుడైనా తన భార్యతో కలిసి తాగాలని కోరుకొనేవాడు. అతి కష్టం మీద తన భార్యను ఒప్పించుకున్నాడు. అంతలో ఉగాది రావడంతో దొంగ సారాయి కాచడం మొదలు పెట్టారు. అది తెలుసుసుకున్న పోలీసులు వాడలోని నాటుసారా కుండలను నాశనం చేశారు. లచ్చిమి ఇంట్లో ఉన్న ఊటను కాపాడబోయి పోలీసులకు బంధిగా మారింది.

ఈ కథలో ప్రభుత్వం కూడా అగ్రకులాధిపత్యం చేతుల్లో కీలుబొమ్మలా ఉంటుంది. అగ్రకులస్తులు ఎన్ని అనధికార చర్యలకు పాల్పడినా చట్టం వారి వైపే ఉంటుంది. అదే దళితుడు తన జీవనం కోసం ఒక్కరోజు తన ఆనందం కోసం నాటుసారా చేసుకుంటే అది దేశ ద్రోహంగా మారిపోతుందని, దేశంలోని దళితుల స్థితిని తెలిపారు. ఇతను రాసిన 'మల్లమ్మ ఉసురు' కథలో కూడా వడ్డి వ్యాపారుల చేతుల్లో దళితులు ఎదుర్కొంటున్న సమస్యలను చిత్రించారు.

నీలకంఠ రచించిన 'సారాదేవత' కథలో దళితులు స్వేచ్ఛగా బతకటానికి వీలు లేనివిధంగా అగ్రకులాధిపత్యం వీరంగం చేస్తున్న విధానాన్ని రచించారు. మాల కులానికి చెందిన కుటుంబం హొటల్ పెట్టుకోని సొంతంగా బతుకుదామనుకుంటే కేవలం కులం కారణంగా మాత్రమే ఆ హొటల్ని మూసివేయడం జరుగుతుంది. ఎవరి దయాదాక్షణ్యాలతో హొటల్ పెట్టుకోలేదు గనుక ఈ ఊరు కాకపోతే మరో ఊరు అనుకోని వలస వెళ్ళి బతుకుతుంటే ఆగ్రమానికి వెళ్ళినా అగ్రకులస్తుడు అక్కడ అందరికి కులం పేరు చెప్పి ఎవ్వరూ తనవద్దకు వెళ్ళొద్దని చెప్పి అక్కడ కూడా హొటల్ని మూసేయించడం జరిగింది. ఈవిధంగా ఒక దళితుడు తన సొంత కాళ్ళపై నిలబడాలని ప్రయత్నిస్తేకూడా కులం పేరుతో వారిని బతకనివ్వకపోవటం ఎప్పుడూ దళితులు అగ్రకుల బానిసలుగానే బతుకుతేనేతప్ప అగ్రకులాధిపత్యం చెలాయించలేమనే కుంచిత బుద్ధితో వారినే దళితులుగా , బానిసలుగా తీర్చిదిద్దుతున్న క్రమాన్ని చిత్రించారు.

వి.ఆర్.రాసాని రచించిన 'వీరజాటి' కథలో దళితుడి భూమిని అగ్ర కులస్తులు దోచుకోని అతన్ని తిరిగి గంగమ్మను మోసుకుంటూ అందరూ ఇచ్చే ధాన్యాన్ని,చిల్లరను తీసుకుంటూ చిందులు వేస్తూ , వీరజాటితో కొట్టుకుంటూ అందర్ని వినోధ పరిచే వృత్తిలోకి నేట్టివేయడం జరిగింది. అగ్రకులస్తులను ఎదురించలేక , తన భూమిని తాను సంపాదించుకోలేక ఆకసిని, ఆకోపాన్ని తనను తాను హింసించుకోవడంలో చూపించాడు రచయిత.

ఈకథలో కోటప్ప గంగమ్మను నెత్తిన పెట్టుకోని, వీరజాటితో కొట్టుకుంటూ, చిందులు వేస్తూ అందర్ని వినోధపరుస్తూ వారిచ్చే కానుకలతో జీవిస్తుంటాడు. ఆపనిని పక్కన పెట్టి అడవిలో రెండెకరాల భూమిని సాగుభూమిగా మార్చుకుంటాడు. ఆపొలాన్ని పండించడానికి కావాల్సిన మూలధనాన్ని వీరమనాయుడిని అడిగి పత్రం రాయించుకోమని వేలిముద్ర వేస్తానని ఆరువందల రూపాయలు తీసుకుంటాడు. ఆడబ్బుకు రెట్టింపు రాయించుకోని క్రమంగా అతని భూమిని తన పేర రిజిస్ట్రేషన్ చేసుకుంటాడు నాయుడు. ఆబాధ భరించలేక తిరిగి తన వృత్తిని స్వీకరించి జీవనం కొనసాగిస్తాడు.

ఇలా దళితుల్ని అగ్రకులస్తులు తమస్వార్థం కోసం ఉపయోగించుకుంటున్నారు. దళితుల బలహీనతల్ని అవకాశం తీసుకోని వారిని నిట్టనిలువునా మోసం చేస్తూ అగ్రకులస్తులు ధనవంతులుగా, భూస్వాములుగా చెలామణి అవుతున్నారనే విషయాని రచయిత ఈకథ ద్వారా తెలిపారు.

పులికంటి కృష్ణారెడ్డి రచించిన 'కాణిపాకం వినాయకుడి సాక్షిగా' అనే కథలో నిజం

నిర్భయంగా చెప్పినందుకు, దానిని రుజువు చేయాలని పంచాయితీ తీర్మాణం మేరకు ప్రమాణం చేయాలని దళితులని అగ్రకులస్తుడు దేవుడి ముందే చంపేస్తే కూడా దేవుడు రాయిగా మిగిలాడే కానీ దోషులను శిక్షించలేదు. ఎందుకంటే దేవుడు కూడా అగ్ర కులస్తుడే కదా! కాబట్టే దళితులను పట్టిస్తున్నాడు, అగ్రకులస్తులను తప్పిస్తునాడుఅనే భావాన్ని రచయిత ఈకథలో వ్యక్తం చేశాడు.

అక్కిరెడ్డి చెల్లెల్లు తన పక్కింటిపిల్లవాడి మెడలోని బంగారు గొలుసును దొంగిలించి, తన అన్నకు ఇచ్చి తన బిడ్డను పెళ్ళి చేసుకోమంటుంది. అందుకు అక్కిరెడ్డి ఒప్పుకుంటాడు. తన కొడుకు కాదన్నాడని, తన చెల్లి ఆగొలుసును ఇవ్వలేదని చెప్పి ఆమెని ఏడిపిస్తాడు ఈవిషయానికి అక్కిరెడ్డి పాలేరైన మాకడు సాక్షి. ఈవిషయం కాలక్రమంగా పంచాయితీకి వెళ్తుంది. దొంగతనం చేసినవారు కాణిపాకం వినాయకుడి గుడిలో ప్రమాణం చేయాలని నిర్ణయిస్తారు. మాకడు పీడిత కులం కనుక అతడు చెప్పిన మాటల్ని పంచాయితీ పంట్టించుకోని ఒక అగ్రకులస్తుడిని నిందించడం తగదని వాడినే ప్రమాణం చేయని చెప్తారు. అందుకు అక్కిరెడ్డి, మిగిలిన అందరూ అంగీకరించి ప్రమాణం చేయాల్సిన రోజుని నిర్ణయిస్తారు. అంతకన్నా రెండు రోజుల ముందే గుడి ముందు రక్తం కక్కుకోని మాకడు చనిపోయింటాడు.

నేరం చేసింది ఆధిపత్యకులస్తుడు అక్కిరెడ్డి. శిక్ష పడింది మాకడికి ,ఇక్కడ ఆధిపత్యం గెలిచిందేకానీ న్యాయం కాదు. న్యాయం దళితుల వైపు ఉంది కనుకనే దళితులను దేవుడు కూడా కాపాడలేకపోయాడు. ఇలా అగ్రకులస్తుల నుండి దళితులను దేవుడు కూడా కాపాడలేడనే విషయాన్ని రచయిత చిత్రించారు.

ఇటువంటి కట్టుదిట్టమైన మనుధర్మ వ్యవస్థలో దళితుడి మనుగడ సాగలేదనీ, దానిని ధ్వంసం చేయగలిగినప్పుడే దళితుడికి అసలైన స్వాతంత్ర్యం లభిస్తుంది. అప్పటి వరకు దళితులు మరింత వేధనలను, అణచివేతలను, అంటరానితనాలను భరించాల్సి వస్తుందంటూ హెచ్చరించారు రచయిత.

ఎండపల్లి భారతి రచించిన 'కుట్టేవానికి మెట్టుకరువు' కథలో దళితులను ఆధిపత్య కులస్తులు ఏవిధంగా వారిని హింసకు గురి చేశారో ఈకథలోని అవ్వ పాత్ర ద్వారా తెలియజేశారు. దళితుల్లో మాదిగ కులస్తులు చెప్పులు కుట్టి ఆధిపత్య కులస్తులకు ఇవ్వాల్సి ఉంటుంది. కాళ్ళకు ఆనెలు వచ్చాయని మిగిలిన చర్మంతో చెప్పులు కుట్టుకున్నాడు దళితుడు, ఆ నెపంతో అది పెద్ద రాజ ద్రోహం అన్నట్లు వాళ్ళని అందరి ముందు తిట్టి పంచాయితీ పెట్టించే దుర్మార్గమైన సంఘటనే ఈ కథలోని అంశం.

నేటి సమాజంలో దళితులు ఎలా బతుకుతున్నారో, అప్పుడు ఎలా బతికారో ఈ కథలోతెలిపారు రచయిత. ఆమె మాటల్లో చూస్తే " ఆకాలమే కాదు ఈకాలం కూడా అట్లానే ఉండాదవ్వా. కాకపోతే అబ్బుడు దాపరికం లేకుండా వేధించేవాళ్ళు, ఇబ్బుడు దాచిపెట్టి వేధిస్తుండారు. అబ్బుడు ఎదురుగ్గా చెప్పుతో కొట్టేవాళ్ళు, ఇప్పుడు గుడ్డలో పెట్టి కొడుతుండారు, యాడమారిందిలేవ్వా కాలం. "ఆధిపత్య కులం ఏవిధంగానైనా తమ యాజమాన్యాన్ని, తమ అధికార దృక్పధాన్ని నిలబెట్టుకుంటూ దళితులని హింసిస్తున్నారేకానీ, దళితుల పరిస్థితులు మాత్రం మారలేదనే విషయాన్ని రచయిత్రి ఈ కథలో చిత్రించారు. 'తడికెతోసిందెవరు' అనే కథలో కూడా అగ్రకులాధిపత్యాన్ని చిత్రించారీ రచయిత.

పి. కేశవరెడ్డి రచించిన 'దిరోడ్' కథలో కూడా అగ్రకులాధిపత్యం కనిపిస్తుంది. ఈ కథలో గాంధేయవాదం నడిచింది. తరతరాలుగా దళితులు బానిసత్వంలో మగ్గుతున్నారు. ఆ బానిస సంకెళ్ళు తెంచుకోవాలనే హితాన్ని రచయిత సుబరాయుడు పాత్ర ద్వారా తెలియజేశారు. దళితులంతా వారిపై జరుగుతున్న హింసలను, దౌర్జన్యాలన, దోపిడీలను గుర్తించి విజ్ఞానంతో నడుచుకోవాలని, వారికన్నా దిగువన ఉన్న దళితులను చైతన్యవంతం చేసి ముందుకు నడిపించాలనీ, చదువుకున్న దళిత మేధవులను రచయిత హెచ్చరిస్తాడు. ఎంత చైతన్యవంతం

చేయాలని ప్రయత్నించినా దళితుల్లో ఐఖ్యత లోపిస్తే విజయం అసంభవమనే విషయాన్ని అంతర్లీణంగా ఈ కథలో స్ఫూరిస్తుంది.

ఈ కథలో సుబ్బరాయుడు తన తండ్రి చేసిన అప్పును తీర్చడానికి మునసబు ఇంట్లో పాలేరుగా పని చేయాల్సి వస్తుంది. ఆ బానిసత్వాన్ని భరించలేక సీతారాములుతో కలిసి సైన్యంలో చేరి డబ్బు సంపాయించి వడ్డితో సహా అప్పుతీర్చేస్తాడు. ఒక మాలవాడు అప్పు తీర్చడం మునసబు జీవితంలో మొదటిసారి కావటంతో అతని అహం దెబ్బతిన్నది. ఈ ఆలోచనను మనసులో ఉంచుకున్నాడు ఎక్కడో ఒక చోట దెబ్బ వేయానే నిర్ణయంతో ఉన్నాడు మునసబు. మాలపల్లికి, అగ్రహారానికి రోడ్డు వేయాలని దళితులు అగ్ర్హారంఅంతా కలిసి ఒక ఒప్పందానికి వచ్చి, మట్టి రోడ్డును దళితులు వారి శ్రమను దానం చేసి వేస్తారని, కంకర రోడ్డును అగ్రహార ప్రజలు చందాలేసుకోని రోడ్డునుపూర్తి చేయాలని వారి ఒప్పందం. అలా మట్టి రోడ్డు వేస్తున్నప్పుడు మునసబు మెడలో బంగారు గొలుసుపోయిందని దానిని దళితులే దొగలించారని, ధైర్యం ఉంటే కాణిపాక దేవాలయంలో ప్రమాణం చేయమని చెప్తాడు. అందరూ అందుకు అంగీకరిస్తారు. సుబ్బరాయుడు అందుకు అంగీకరించడు. ఆ కారణంగా అతన్నే దొంగగా పరిగణిస్తాడు రోడ్డుపని అర్థాంతరంగా ఆగిపోవలసి వస్తుంది.

అగ్రవర్ణస్తుల అప్పు తీర్చగలిగే శక్తి దళితులు సంపాయించారని, వడ్డీ డబ్బుతో సేవ చేయించికుంటున్న మునసబు బానిసత్వం నుండి దళితులు బయట పడ్డారనే విపరీత బుద్ధితో ఇంత చేశారు అగ్రవర్ణస్తులు.

కె. సభా రచించిన 'కళ్ళుముంత' కథలో అగ్రకులాధిపత్యం కారాణంగా దళితుల బతుకులు జైలుపాలు కావడం, దళితాడవాళ్ళు ముష్టెత్తుకొనే పరిస్థితికి దిగజారిపోవటం ఈ కథలో కనిపిస్తుంది. ఆ ఊరిలో అందరికన్నా బాగా బతికిన జాబితాలో పొట్టేలుగాడు ఒకరు. ఎవ్వరూ చేయనంత గొప్పగా తన కొడుకు ద్రోణాచలం పెళ్ళి అంగరంగ వైభవంగా జరిపించారు. కల్లుదుకానాలు లేనప్పుడు పొట్టేలుగాడి జీవితం రెండు పూరిల్లులు, ఎద్దులు గుర్రాలు ఇలా అందరికన్నా బాగా జీవించాడు. మద్యం దుకాణాలు తెరిచారు. పొట్టేలుగాడు ఆస్తినంతా పోగొట్టుకున్నాడు. మద్యం మత్తులో పరాయి ఆడదాని సాంగిత్యంలో పడ్డాడు. (రామమ్మ శూద్ర వితంతువు) మద్యం కోసం తన కోడలి కాలిగజ్జెలు దొంగిలించి అమ్ముకున్నాడు. ఈ విషయం తన కొడుకు ద్రోణాచలం అడిగితే నా సొమ్ము నేను అమ్ముకున్నానని ఎదురు తిరుగుతాడు. దాంతో తండ్రి కొడుకుల మధ్య గొడవ పెరిగింది. దీనితో ఐతేపల్లి వచ్చి జోక్యం చేసుకోని ఇద్దరిని విడదీస్తారు.

ఈ వ్యవహారమంతా నాయుడు గారికి తెలుస్తుంది. దీనిని ఇద్దరికీ పది, పదిరూపాయలు జరిమాన విధిస్తాడు. ద్రోణాచలంను కట్టనవసరం లేదని నాయుడే తెలియజేస్తాడు. పొట్టేలుగాడు రామమ్మ దగ్గర పదిరూపాయలు అడిగి తీసుకొస్తున్నతరుణంలో ఐతేపల్లి అడ్డగించి తప్పుదోవ తీసుకెళ్తాడు. ఈ విషయం నాగరత్నం ద్వారా నాయుడిగారికి తెలుస్తుంది. దీంతో నాయుడు కల్లుదొరకు రిపోర్ట్ చస్తాడు. పొట్టేలుగాడు దొంగసారా కాచడం కారణంగా తన మద్యం దుకాణం సరిగా జరగలేదని అదీకాక కల్లుదొరకు నాయుడితో ఉన్న స్నేహం కారణంగా ఒక పథకం ప్రకారం పొట్టేలుగాడిని మాత్రమే జైలు పాలు చేశారు. ఐతే పల్లి మాత్రం మిలట్రీలో చేరాడు. నాయుడు ద్రోణాచలం చేత ఎద్దుల్ని అమ్మించి వాటిని తానే నాలుగు వందలకు కొన్నాడు. ఇలా కాలక్రమంగా ద్రోణాచార్యుడు బికారయ్యాడు. తల్లిని ఇంట్లో నుండి వెళ్ళగొడతాడు. తన బతుకంతా నాయుడుగారి చేతికిందే మిగిలిపోతుంది. ఎవ్వరూ పని ఇవ్వకపోవటంతో పొట్టేలుగాడి భార్య భిక్షమెత్తుకుంటూ జీవనం కొనసాగిస్తుంది. నాయుడు మాత్రం పట్నంలో మద్యం దుకాణాలకు యజమానిగా ఎదుగుతుంటాడు. ఇది కథలోని అంశం.

ఈ కథలో అగ్రకులాధిపత్యం ఒక దళితుడు ఎదుగుతుంటే చూడలేనితనం, తనకన్నా బాగా బతుకుతున్న వైనాన్ని భరించలేనితనం కనిపిస్తుంది. అందుకే పొట్టేలుగాడి తోపాటూ ఐతేపల్లి కూడా అరెస్టు అవ్వాలి కానీ నాయుడు అలా కానివ్వడు పొట్టేలును మాత్రమే అరెస్టు

చేయించి శిక్ష పడేలా చేస్తాడు. అలాగే తండ్రి కొడుకులు గొడవపడుతున్నప్పుడు ఇద్దరూ కట్టాల్సిన జరిమానాను ఒకరికే పరిమితం చేసి తానే స్వయంగా ద్రోణాచలంని కట్టవద్దని తెలియజేస్తాడు. ఈ విషయాన్ని తన మాటల్లోనే గమనిస్తే "నాయుడు గారు ద్రోణాచలాన్ని మాత్రం దగ్గరకు పిలిచి నీవు చెల్లించ వలసిన అవసరం లేదు. నాకు సాయంగా ఉంటే చాలు అన్నాడు. "దీంతో దళితున్ని తన ఆధిపత్యం కింద బతకాలనే ధోరణి దాగి ఉందని అర్థమవుతుంది. అందుకనే ద్రోణాచలంతో తనకాదరువైన ఎడ్లను తానే అమ్మించేలా చేసి వాటిని నాయుడే కొన్నాడు. ఇలా ఒక పథకం ప్రకారం అగ్రకులాధిపత్యం కారాణంగా దళితున్ని అంచలంచలుగా విచ్ఛినం చేసి తన ఆధిపత్యాన్ని కాపాడుకున్నాడు నాయుడు.

ఏ. పుష్పాంజలి రంచించన 'ఆశలపాశం' కథ లో కూడా అగ్రవర్ణాధిపత్యభావజాలం కనిపిస్తుంది. మనిషి ఇంకొన్ని రోజుల్లో చనిపోతాడు అని తెలిసినప్పుడు మాత్రమే సమాజంలోని రుగ్మతలను పారద్రోలాలని ప్రయత్నిస్తున్నాడు. పోతున్న ప్రణం తిరిగి వచ్చినప్పుడు గతంలోకన్నా మరింత అజమాయిషినీ, పెత్తనాన్ని చెలాయిస్తున్నాడు .ఇలాంటి పరిస్థితి సమాజంలో ఉన్నన్నాళ్ళు ఈ ఎగుడుదిగుడు వ్యవస్థ సమసిపోదని రచయిత తెలిపారు.

ఈ కథలో జగన్నాథానికి ఆరోగ్యం క్షీణించింది. ఎప్పుడు స్వాస వదిలేస్తాడో తనకే తెలియనంత దగ్గరలో ఉన్నాడు. అలాంటి వ్యక్తిని ఒక కిరస్తాని కుటుంబం రక్షించదలచి నప్పుడు కృతజ్ఞత కనబరచాడు. తన ఆస్తిని పేదలకు, దళితులకు పంచిపెట్టమని నోటీసులు రాయించాడు. జోసెఫ్ దంపతులు కేరళ తీసికెళ్ళి ఆరోగ్యవంతునిగా తయారు చేసిన తరువాత తిరిగి తన ఆధిపత్యాన్ని చెలాయిస్తాడు. అది గమనించిన జోసెఫ్ దంపతులు బాధపడకపోగా మనడ్యూటి మనం చేశాం అని సమర్థించుకుంటారు.

ఈ విధంగా అగ్రకులాధిపత్యం చిత్తూరుజిల్లా ప్రంతంలో నేటికీ అమలులో ఉంది .ఇప్పటికీ దళితులు ఊరి వెలుపలే ఉన్నారు. దాదాపుగా అగ్రకులాధిపత్యానికి గురి అవుతూనే ఉన్నారు. అగ్రకులస్తులు దళితులను దోచుకుంటూనే ఉన్నారు. వారి రిజర్వేషన్లను కూడా పరోక్షంగానో, ప్రత్యక్షంగానో ఎలా వీలుపడితే అలా అగ్రకులస్తులు అనుభవిస్తున్నారు. దళితులకు పట్టం గట్టి అధికారం వాళ్ళు చెలాయించటం నేటికీ మనం గమనిస్తున్నాం. దళితులను కాపాడవలసిన ప్రభుత్వాలు, చట్టాలు కూడా కులానికీ, ధనానికీ లొంగిపోతున్నాయనే విషయాలను చిత్తూరుజిల్లా రచయితలు ప్రస్ఫుటంగా తెలియజేశారు.

అలాగే దళితులకు ఉన్న అరాకొర ఆస్తినికూడా నయానా ,భయానా లాక్కుంటున్నారు. చివరకు దళితులను దోచుకోవడానికి వీలున్న అన్ని ప్రక్రియలను అగ్రకులస్తులు ఉపయోగించుకుంటున్నారనే విషయాలను చిత్తురుజిల్లా కథాసాహిత్యం తెలియజేసింది. అగ్రకులస్తులు చేసిన నేరాలకు దళితులు బలైపోతున్నరు. ఏతప్పు చేయకుండానే దళితులు నేరస్తులుగా సృష్టింపబడుతున్నారు. అన్యాయంగా శిక్షకు గురి అవుతున్నారు. ఇలాంటి అనేకానేక సమస్యలను చిత్తూరుజిల్లా రచయితల కథల్లో పరిశీలించాం. అయితే దళితులకు వారిలోవారికి లేనిఐఖ్యత కారణంగా వారు అనేక అవకాశాలను కోల్పోతున్నారు. వారిలో వారు ఐఖ్యత కలిగి ఉంటే అన్ని అవకాశాలను అందుకోగలరని, సమానత్వాన్ని సాధించుకోగలరని, సమస్యలను పరిష్కరించుకోగలరని, చిత్తూరుజిల్లా రచయితలు తమ రచనల ద్వారా తెలియజేశారు.

# మాతృభాషలో విద్యాబోధన - గిడుగు రామమూర్తి పంతులు కృషి

**డా. పట్టపు. శివకుమార్**
తెలుగు ఉపన్యాసకులు,
శ్రీ గోవిందరాజస్వామి ఆర్ట్స్ కళాశాల,
తిరుపతి.
pattapu.siva@gmail.com
Mobile: 9492032640

**పరిచయం**

ఈనాడు వాడుక తెలుగులోనే మనమంతా రాయడం, చదవడం, ఇతరమైన సామాజిక వ్యవహారాలన్నీ కొనసాగించడానికి గిడుగు రామమూర్తి పంతులు, గురజాడ అప్పారావు పంతులు అనే ఇద్దరు మహనీయులు ముఖ్యకారకులు. వీరిరువురూ ఎంతో ముందుచూపుతో ఆలోచించి, తర్వాత రానున్న సమాజాల అవసరాలను తీర్చగలిగే సాధనం ప్రజల వ్యావహారికభాష మాత్రమేనని గుర్తించారు. గిడుగువారు, అప్పారావుగారు ఆనాటికే ఆధునిక భాషావాదంపై అవగాహన కలిగిన పండితులు. ఆంగ్ల ప్రభుత్వం వలన తెలుగువారికి ముద్రణ సహాయం లభించింది. దానిఫలితంగా క్రీ.శ. 1720 నుంచి వ్యావహారికంలో ఉన్న క్రైస్తవ వాఙ్మయం తెలుగులో రావటం మొదలైందని నిడదవోలు వెంకట రావు గారు పేర్కొన్నారు. ఆంగ్ల ప్రభుత్వం 'ఛార్టర్ ఆక్ట్' ద్వారా సెయింట్ పోర్ట్ జార్జ్ కోటలో స్థాపించిన కళాశాల 1813లో ప్రారంభమైంది. అందులో వేదం పట్టాభిరామశాస్త్రి గారు సంస్కృతాంధ్రశాఖలకు ప్రధానులు. రావిపాటి గురుమూర్తిశాస్త్రి వంటి పండితులు అధ్యాపకులుగా ఉండేవారు. 1839లో మద్రాసు, మచిలీపట్టణాలలో ఇంగ్లీషు(బోధన మాధ్యమంగా)పాఠశాలలు ఏర్పడ్డాయి. వీటివలన కులమత భేదం లేకుండా అందరికీ చదువుకొనే అవకాశం కలిగింది. అంతేకాకుండా ఆంగ్లభాషా పరిచయం, దానివలన ప్రపంచ సాహితీ విశేషాలు తెలుగు ప్రజలు తెలుసు కొనే అవకాశం కలిగింది.

ఆంగ్ల ప్రభుత్వ పరిపాలన వలన పాఠశాలలు, కళాశాలలోని పాఠ్యప్రణాళికలో విశేషమైన మార్పులు కలిగాయి. వీటివలన ఆనాటి విద్యావిధానంలో కూడా గుర్తించదగిన మార్పులు అనేకం చోటుచేసుకొన్నాయి. "అంతవరకూ పంచకావ్యాలకూ తర్కవ్యాకరణాదులకూ పరిమిత మైన విజ్ఞానబోధలో చరిత్ర, భూగోళం, ప్రకృతి భౌతిక శాస్త్రాలు, విభిన్న సారస్వత ప్రక్రియలూ చోటుచేసుకున్నాయి. గురుమూర్తి శాస్త్రి గారి 'విక్రమార్కుని కథలు' (1819), 'విక్రమార్కుని కథలు' (1834), ఏనుగుల వీరాస్వామయ్య గారి 'కాశీయాత్రా చరిత్ర' (1838), మామిడివెంకయ్య గారి 'ఆంధ్రదీపిక' (1848), బ్రౌన్ 'బైబిల్ అనువాదము' (1827), ఆర్డెన్ 'తెలుగు వ్యాకరణము' (1873), జార్జిబీర్ 'ప్రపంచభూగోళము' (1852), గురుమూర్తిశాస్త్రి గారి 'తెలుగు వ్యాకరణము' (1836) మొదలైనవి పాఠ్యగ్రంథాలుగా ఉండేవి.'' (కృష్ణమూర్తి,భద్రిరాజు.2006.273) ఆంగ్లప్రభుత్వ పరిపాలనలోనే భారతదేశంలో సార్వజనీనమైన విద్యావిధానం ప్రవేశించింది. అయితే ఆనాటి ఆంగ్ల ప్రభుత్వం ఆశించినట్లుగా దేశంలో విద్యావ్యాప్తి కలుగలేదు.

1901లో గవర్నర్ జనరల్ గా ఉన్న లార్డ్ కర్జన్, సిమ్లాలో విద్యాసంబంధమైన సమస్యలపై చర్చ జరిపించాడు. ఆ సభలో ఆమోదించిన 150 తీర్మానాల ఆధారంగా కర్జన్ విద్యావిధానం రూపొందింది. దానివలన పాఠశాలల్లోను, కళాశాలల్లోనూ మాతృభాషా బోధన పట్ల విద్యాధికారుల కు కూడా శ్రద్ధ కలిగింది. ఈ విషయాన్ని గురించి ప్రస్తావిస్తూ పోరంకి దక్షిణామూర్తి గారు 'భాష-ఆధునిక దృక్పథం' అనే గ్రంథంలో, "మాతృ భాషలో వ్యాసరచనలను నిర్బంధ పాఠ్యాంశంగా ప్రవేశపెట్టాలనీ, అట్లాగే ఇంగ్లీషులోని పుస్తకాలను ప్రాంతీయభాషల్లోకి అనువదించేప్పుడువారికి శిక్షణకలిగేందుకు గాను అనువాద పద్ధతులను నేర్పాలనీ నిశ్చయించారు''. (దక్షిణామూర్తి, పోరంకి. 1992. 35) అని కర్జన్ విద్యావిధానంలోని అంశాలను గురించి పేర్కొన్నారు. కర్జన్ విద్యావిధానం అమలులోనికి వచ్చిన కాలంలో (1906) గంజాం, విశాఖపట్నం, గోదావరి జిల్లాలకు పరీక్షాధి కారిగా జె. ఏ. యేట్స్ అనే ఆంగ్లేయుడు ఉండేవాడు. ఆయనకు తెలుగుభాషలో కొంత ప్రవేశం ఉంది. పాఠశాల తనిఖీ సమయంలో పుస్తకాల్లో ఉన్న తెలుగుకు, పండితులు తరగతిగదిలో మాట్లాడే తెలుగుకు సంబంధం లేకపోవటం యేట్స్ దొరకు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఈ వ్యవహారం గురించి ఆనాటి కళాశాల అధ్యక్షులైన పి.టి.శ్రీనివాసయ్యం గారి సలహా మేరకు యేట్స్ దొర గురజాడ అప్పారావు గారిని, గిడుగు రామమూర్తి గారిని కలుసుకొని ఆ విషయంలోని పూర్వాపరాలను గ్రహించారు. దానికి పరిష్కారంగా  యేట్స్ దొర ప్రతియేటా నిర్వహించే ఉపాధ్యాయ వార్షిక సమావేశాలలో గిడుగు వారి చేత భాషాపరిణామ వివేచనాదృక్పథంతో ఉపన్యాసాలను ఇప్పించారు. ఇటువంటి సమయంలోనే స్కూల్ ఫైనల్ పరీక్ష, ఎఫ్. ఏ. బదులుగా రెండేళ్ల ఇంటర్మీడియట్ వచ్చింది. అప్పుడు మాతృభాషలో వ్యాస రచనకు, అనువాదానికి పాఠ్యాంశాలను ఎన్నుకొనే విషయంలో గిడుగువారు వ్యావహారిక భాషాప్రాశస్త్యాన్ని గురించి పునరుద్ఘాటించారు.

నూతన బోధనపద్ధతులను వివరించడానికి 1910 ప్రాంతంలో విశాఖపట్నంలో ఉపాధ్యాయులను సమావేశపరిచిన గిడుగువారు వ్యావహారిక భాషలోని రచనలను పాఠ్యగ్రంథాలుగా అనుమతించమని అభ్యర్థించారు. గిడుగు వారి వాదానికి సమర్థనగా గురజాడ అప్పారావు గారు 'గ్రామ్యశబ్ద విచారణ' అనే వ్యాసం, 'వాడుకభాష-గ్రామ్యము' అనే వ్యాసం రాశారు. వీటితో విద్యాబోధనకు గ్రాంథిక వ్యావహారిక భాషల్లో ఏది ఉపయుక్తమనే వాదన శాస్త్రచర్చకు దోహదం చేసింది. అయితే సంప్రదాయ పండితులు వ్యావహారిక భాషకు దూరమై మాట్లాడటం కూడా మరిచిపోతున్న కాలంలో దాని విలువను గుర్తించినవారు గిడుగు రామమూర్తి పంతులు గారు. అప్పటికి ముప్పై సంవత్సరాలుగా ప్రాథమిక పాఠశాల స్థాయి నుంచి కళాశాల స్థాయి వరకు అపారమైన బోధనానుభవం కలిగినవారు. అంతేకాకుండా ఇంగ్లండులో, ఫ్రాన్సులో, ఇతర దేశాల్లో విద్యారంగం సాధించిన ప్రగతిని గురించి రాసిన పుస్తకాలను అధ్యయనం చేశారు.

పర్లాకిమిడి మున్సిపల్ కౌన్సిల్ సభ్యులుగా, గ్రామీణ పాఠశాలల మేనేజరుగా, పురపాలక సంఘ పాఠశాలల సూపరింటెండెంటుగా, ఇతర విద్యాసంస్థలకు సంబంధించిన అపారమైన అనుభవం గిడుగు రామమూర్తి గారి వాదానికి ఎంతగానో దోహదం చేసింది. ఆంగ్లదేశంలో ఆనాటికే అధునాతనమని భావించదగిన 'ప్రత్యక్ష పద్ధతి' లో విద్యాబోధన చేయటాన్ని తెలుగు ప్రాంతంలో మొదటగా ప్రవేశపెట్టిన ఘనత గిడుగు వారికి దక్కుతుంది. అంతేకాకుండా విద్యావిధానంలో విజ్ఞాన సముపార్జనకు పురాతనమైన కావ్యభాష ఎంతమాత్రం ఉపయుక్తం కాదని గిడుగువారు భావించారు. దానికి అధునాతన వ్యావహారికమే చాలా యోగ్యమైనదని గ్రహించిన గిడుగు రామమూర్తి పంతులుగారు వ్యావహారిక భాష ప్రాధాన్యతను గురించి ప్రచారం చేయడానికి సంసిద్ధులైనారు. సునిశితమైన ఆధునిక భాషాశాస్త్ర పరిజ్ఞానం గిడుగువారి సొంతం. దానికి

తోడు, సహేతుకమైన లోకజ్ఞానం, తమవాదం సరైనదన్న ఆత్మవిశ్వాసం, ఆ వాదాన్ని విద్యావంతులకు వివరించి వారందరూ అంగీకరించే విధంగా చెయ్యాలనే గట్టి పట్టుదల మొదలైనవన్నీ గిడుగువారిలో సమపాళ్లలో మేళవించాయి.

బూదరాజు రాధాకృష్ణ గారు గిడుగువారి వ్యావహారికభాషా వాదంలోని సిద్ధాంతాలను గురించి ప్రస్తావిస్తూ, "గిడుగువారి వాదంలో ప్రధానమైన సిద్ధాంతాలు నాలుగు :

(1) సామూహిక విద్యాసౌకర్యాలకు కావ్యభాష చాలదు.

(2) శాస్త్రగ్రంథాలను, వచన రచనలను శిష్టవ్యవహారభాషలో రాయటమనే సంప్రదాయం మనకుంది.

(3) ఆధునిక విద్యాబోధన పద్ధతికి శిష్టవ్యవహారభాషే తగింది.

(4) గ్రాంధికభాష పండితులకే రాదు; దాన్ని ఆభ్యసించటం కష్టసాధ్యం. అందరు విద్యార్థులకు ఆ భాషాజ్ఞానం అక్కరలేదు.'' అని గిడుగు రామ మూర్తి గారు అభిప్రాయపడినట్లుగా పేర్కొన్నారు. (కృష్ణమూర్తి, భద్రిరాజు. 2006. 275)

గిడుగు రామమూర్తి పంతులు గారు, గురజాడ అప్పారావు గారు ఆనాటి మద్రాసు విశ్వవిద్యాలయం సెనేట్ లో తమకు గల పలుకు బడిని ఉపయోగించి వ్యావహారిక రచనలు పాఠశాలల్లో, కళాశాలల్లో పాఠ్యగ్రంథాలుగా ఉండవచ్చుననే ప్రభుత్వ నిర్ణయాన్ని సంపాదించారు (20-09-1912 నాటి జి.వో.ఎమ్మెస్.నెం. 3098). అయితే ఈ నిర్ణయం ఎక్కువకాలం నిలవలేదు. ఆ సమయంలో ప్రభుత్వ నిర్ణయానికి ప్రత్యుత్తరంగా గిడుగు రామమూర్తి పంతులు గారు ఆంగ్లంలో 'ఏ మెమొరాండమ్ ఆన్ మాడర్న్ తెలుగు' అనే కరపత్రాన్ని ప్రకటించారు. దానికి ప్రతిగా జయంతి రామయ్య పంతులు గారు 'ఏ డిఫెన్స్ ఆఫ్ లిటరరీ తెలుగు' అనే కరపత్రాన్ని ప్రచురించారు. అప్పుడు గురజాడ అప్పారావు గారు వ్యావహారికభాషలో విద్యాబోధనకు అనుకూలంగా 'డిసెంట్ పత్రం' ఆంగ్లంలో రాసి మద్రాసు విశ్వవిద్యాలయం వారికి సమర్పించారు. ఆధునిక వ్యావహారిక భాషను ప్రామాణిక భాషగా గుర్తించి, ప్రాథమిక పాఠశాలల్లోనూ సెకండరీ పాఠశాలల్లోనూ విద్యాబోధనకు అనుమతించడం వలన కలిగే ప్రయోజనాలను వివరించడం గిడుగు, గురజాడల రచనల్లోని ప్రధానోద్దేశం. కాని ఆనాటి గ్రాంధికవాదుల పరపతితో స్కూల్ ఫైనల్ విద్యార్థి ప్రాచీన నవీన పాఠ్యగ్రంథాల్లో వేటినైనా చదువుకొనే అవకాశం ప్రభుత్వం కల్పించింది. తద్వారా పాఠశాలల్లో తిరిగి గ్రాంధికమే వాడుకలోనికి వచ్చింది. అప్పటినుంచి బోధనరంగంలో గ్రాంధికభాష ప్రాబల్యం పుంజుకుంది. అయితే తర్వాతకాలంలో వెలువడిన వచనరచనల్లో వ్యావహారిక భాష వినియోగం మాత్రం పెరిగింది.

**మెమొరాండం**

మాతృభాషలో విద్యను బోధించవలసి ఉన్న బడిపిల్లల పాఠ్యపుస్తకాలలోనే కాకుండా ప్రభుత్వం నుంచి కాని, ప్రభుత్వాధికారుల నుంచి కాని తెలుగు ప్రజలకు వచ్చే ఉత్తరాలలో పంపే వర్తమానాలలో, ప్రచురించే పుస్తకాలలో, కరపత్రాలలో, వ్యవసాయం, వాణిజ్యం, పరిపాలన, పారిశుధ్యం మొదలైన విషయాలు, సామాన్య ప్రజలకు తెలియడానికి ప్రచురించే వాటన్నిటిలోనూ వాడుకభాషనే వినియోగించడానికి అనుమతించాలనే ఉద్దేశాన్ని తెలపడానికి గిడుగువారు ఈ కరపత్రాన్ని ప్రచురించారు. 1903 మార్చి 11నాడు గవర్నర్ జనరల్ కౌన్సిల్ వారి తీర్మానంలో పేర్కొన్న విధంగా దేశభాషలను ఉపేక్షించడం జరుగుతుందని గిడుగువారు ఇందులో పేర్కొన్నారు. ఇటువంటి దుస్థితికి మూలకారణం ప్రజలు మాట్లాడే మాతృభాషను ఉపేక్షించడమేనని గిడుగువారు తేల్చిచెప్పారు. ఆంగ్ల ప్రభుత్వం ప్రవేశపెట్టిన సార్వజనిక విద్యావిధానం మొదలైన కొంతకాలానికి వచన రచనలు చేసే ప్రయత్నం జరిగినప్పటికీ
అవి భాషాభేషజం ప్రదర్శించే పండితులవి కావటం దురదృష్టకరమని గిడుగువారు విచారించారు.

ఆధునిక అవసరాలకు తగినట్లుగా కావ్యభాషను సరళీకరించే ప్రయత్నం కందుకూరి వీరేశలింగం పంతులు వంటివారు కొద్దిమంది తప్ప తక్కినవాళ్లు సాధించలేకపోయారని గిడుగువారు భావించారు. ఈ సందర్భంలోనే పాశ్చాత్య భాషావేత్త అయిన గ్రియర్సన్ భారతీయ భాషలను గురించి చేసిన వ్యాఖ్యలను గిడుగువారు పేర్కొన్నారు. "The vernacular has been split into two sections-the tongue which is understanded of the people, and the literary dialect, known only through the press and not intelligible to these who do not know sanskrit. Literature has thus been divorced from the great masses of the population and to the literary classes". (దక్షిణామూర్తి,పోరంకి. 1992.44) అదేవిధంగా వ్యాకరణశాస్త్ర అధ్యయన లక్ష్యాన్ని గురించి 'న్యూ ఇంగ్లీష్ గ్రామర్' రచయిత స్వీట్ చెప్పిన విషయాలను గిడుగువారు తమ మెమొరాండంలో ప్రస్తావించారు.

1822లో సర్ థామస్ మన్రో మద్రాసు ప్రెసిడెన్సీలో అమలులో ఉన్న భాషాబోధన సామగ్రి గురించి పేర్కొన్న మాటల ప్రకారం దేశీయ భాషాబోధన విషయంలో ఎటువంటి పురోగతి లేదని గిడుగువారు తమ అభిప్రాయాన్ని తెలిపారు. గిడుగు రామమూర్తి గారు తమ మెమొరాండంలో ప్రతిపాదించిన ముఖ్యాంశాలు ఇవి;

(1) విద్యార్థి తాను సులువుగానూ బలంగానూ సరిగానూ ఏదైనా చెప్పడానికి రాయడానికీ భాషాబోధన తోడ్పడాలి.

(2) మనస్సులో అనుకున్నది సొంతంగా చెప్పగలిగేలా చెయ్యాలి.

(3) నిర్దిష్ట శ్రోతలకు నిర్దిష్టలక్ష్యంతో చెప్పగలిగేటట్టు చెయ్యాలి.

(4) క్రమబద్ధమైన ఆలోచనకు విద్యార్థి అలవాటుపడేటట్టు చెయ్యాలి.

(5) వాస్తవ విషయాల గురించి ఊహించగల శక్తి, లోకజ్ఞానం విద్యార్థిలో పెరగాలి.

(6) ఒక విషయం మీదినుంచి దృష్టి మళ్ళకుండా నిలకడగా కొనసాగే అలవాటు కావాలి.

(7) మనస్సుకు విషయగ్రహణశక్తి బాగా అలవడాలి.

ఈవిధంగా భాషాబోధన విద్యార్థిలో సమగ్ర వికాసం కలగడానికి తోడ్పడుతుందని ఆంగ్లభాషావేత్త చెప్పిన విషయాలు గిడుగువారు ఆనాటి తెలుగు పండితుల దృష్టికి తీసుకువచ్చారు.

'విద్యార్థులకు నిర్ణయించే పాఠ్యపుస్తకాలు సులువుగా అర్థమయ్యే భాషలో రాసినవే కావాలికాని పరిచయం లేని కావ్యభాషాశైలిలో రాసినవి కాదు' అని 'ది ఇండియన్ ఎడ్యుకేషనల్ పాలసీ'లో పేర్కొన్నారు. ఇక్కడ ఉద్దేశించినట్లుగా సులభంగా అర్థమయ్యే భాష అంటే ప్రజల వాడుకభాషేనని అర్థం. అయితే వాడుకభాషలో ఏకరూపత, ప్రామాణికత లేవనే కారణంతో బోధన చేయటానికి నిరసించేవారికి గిడుగు రామమూర్తి గారు సహేతుకమైన సమాధానమిచ్చారు. ఇంగ్లండులో కూడా కింది వర్గాలవాళ్ల పిల్లలు తమతమ మాండలికంలో మాట్లాడు కుంటారని, కాని వాళ్లందరికీ అక్కడ ప్రామాణికభాషనే బోధిస్తున్నారని గిడుగువారు పేర్కొన్నారు. అదేమాదిరిగా తెలుగు ప్రాంతంలో కూడా

ప్రామాణిక భాష (వాడుకభాష) బోధించవచ్చునని గిడుగు రామమూర్తి గారు సూచించారు. కావ్యభాషలో ఉన్నంత రూపభేదం వాడుకభాషలో లేదని భావించిన గిడుగువారు 'ఒకర్తె' అనే మాటకు 52 రూపాంతరాలు, 'ఒకడు' అనే మాటకు దాదాపు 16 రూపాంతరాలు ఉదాహరించారు. 'పండితుడి నిరంకుశత్వం వల్లనే తెలుగులోకి విజ్ఞానం రాకుండా పోయింది' అని గిడుగు వారు పరితపించారు. తెలుగులో బోధన సామాన్యమూ ఐచ్ఛికమూ అని రెండు విధాలుగా ఉండాలని గిడుగువారు ప్రతిపాదించారు. ఐచ్ఛికం ప్రాచీన సాహిత్యాన్ని అధ్యయనం చేయదలుచుకున్న వారికి బోధిస్తే సరిపోతుందని, సామాన్యం విద్యార్థులందరికీ నిర్బంధంగా బోధించాలనీ గిడుగువారు సూచించారు.

సామాన్యం ఆధునికభాషలోనే ఉండాలనేది గిడుగువారి అభిప్రాయం. చరిత్ర, పౌరశాస్త్రం, భూగోళశాస్త్రం మొదలైనవన్నీ ఈ విభాగం లోనికే వస్తాయని, ఈ శాస్త్రాలు బోధించే ఉపాధ్యాయుడే వివిధ విషయాల మీద తెలుగులో కాంపోజిషన్ రాయిస్తాడని గిడుగువారు సూచించారు. ఈ విధానాన్ని సక్రమంగా అమలు చేయగలిగినప్పుడు ఆధునికభాషకు తగిన స్థానాన్ని కల్పించినట్లని గిడుగువారు తమ వాదాన్ని ముగించారు. మెమొరాండం అనే తమ కరపత్రంలో చివరగా గిడుగువారు రెండు అనుబంధాలను చేర్చారు. మొదటి దానిలో, తెలుగువారి ఉచ్చారణలో వచ్చిన ధ్వని విపరిణామాల తీరుతెన్నులు, పదస్వరూప నిర్ణయంలో గ్రాంథికభాషా వాదుల్లో కనిపిస్తున్న గందరగోళం, కాలానుగతంగా ప్రాచీన, ఆధునిక రూపాలలోను, అర్థాలలోను కలిగిన అంతరాలను గిడుగువారు ఉదాహరణలతో నిరూపించారు. రెండో అనుబంధంలో, మద్రాసు ఆంధ్రసాహిత్య పరిషత్తు సమావేశంలో పండితులు చేసిన తీర్మానాలు ఒక్కొక్క దానిని గిడుగు రామమూర్తి పంతులుగారు సహేతుకంగా ఖండించారు. అందులో ముఖ్యంగా విద్యార్థుల పాఠ్యపుస్తకాలలో శృంగార ప్రధానమైన కావ్యభాగాలు ఎంపికచేసే విషయంగా పండితులు వెల్లడించిన అభిప్రాయాలను గిడుగువారు తీవ్రంగా విమర్శించారు.

**ముగింపు**

గిడుగు రామమూర్తి పంతులు గారి ప్రోద్బలంతో బోధనరంగంలో ప్రవేశించిన వాడుకభాష తర్వాత కాలంలో సమాజంలోని అనేక రంగాలను ఎంతగానో ప్రభావితం చేసింది. ఆనాటి విద్యావిధానంలో చోటుచేసుకొన్న ప్రగతిశీలమైన ఈ మార్పులు సాహిత్యరంగంలో కూడా ప్రతిఫలించాయి. అందుకు నిదర్శనంగా సంఘసంస్కరణాభిలాషతో వెలువడిన కందుకూరి వీరేశలింగం పంతులు గారి వచన రచనలు, గురజాడ అప్పారావు గారి 'కన్యాశుల్కం' వంటి రచనలు కనిపిస్తాయి. ఈవిధంగా తమ జీవితాన్ని యావత్తూ తెలుగు భాషాభివృద్ధికి అంకితం చేసి, భవిష్యత్తు తరాల వారికి ముందుగానే వెలుగు దారులు తీర్చిదిద్దిన మహనీయులుగా గిడుగు రామమూర్తి పంతులు గారు తెలుగు భాషా బోధనా ప్రపంచంలో చిరస్థాయిగా, చిరంజీవిగా నిలిచి ఉంటారని చెప్పవచ్చు.

**ఉపయుక్త గ్రంథాలు**

1. కృష్ణమూర్తి,భద్రిరాజు. 2006. తెలుగు భాషాచరిత్ర.
2. దక్షిణామూర్తి,పోరంకి. 1992. భాష-ఆధునిక దృక్పథం.
3. కృష్ణమూర్తి,భద్రిరాజు. 2004. భాష-సమాజం-సంస్కృతి.
4. నాగయ్య,జి. 2009. తెలుగు సాహిత్య సమీక్ష.

# సంసార సాగరంలో కుటుంబ వ్యవస్థ

కె. ఏసురత్నం
తెలుగు పరిశోధక విద్యార్థి
ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయము
cell:9059111040
E-mail:yasuratnam.k@gmail.com

**ఉపోద్ఘాతం:**

నూరేళ్ళు దాటిన తెలుగు నవల పుట్టు పూర్వోత్తరాలు తెలుసుకోవటం అవసరం. ఇంత విస్తృత నవలా సాహిత్యరంభం అర్థం కావటం చాలా అవసరమే ! అందువల్ల తెలుగులో నవలు విస్తృతంగా తెలియటం అవసరమే.కాని అంతకు పూర్వం ఇంగ్లీషులో నవలలు ఉన్నాయని, వాటి కారణంగా తెలుగులో నవలా రచన ప్రారంభమైందని అందరికీ తెలుసు.

రచయితలకు తెలుసో తెలియకో ప్రత్యక్షంగానో పరోక్షంగానో ప్రతి నవల ఏదో ఒక జీవిత భాగాన్ని ,జీవిత సమస్యల్ని చిత్రీకరించటం ఆధారపడి ఉంటుంది ఆ నవల.

క్రీ.శ.19వ శతాబ్దం ఉత్తర భాగంలో భారతదేశం సాంస్కృతికంగా, రాజకీయంగా అనేక మార్పులు లోనయ్యింది.పాశ్చాకత్య సాహిత్య, సంస్కృతుల ప్రభావంతో ప్రజల ఆలోచనా సరళిలోనే గొప్ప మార్పు సంభవించింది. తత్ఫలితంగా కావ్యాలు, ప్రబంధాలకే పరిమితమైంది.తెలుగు రచయితలు పాశ్చాత్య సాహిత్యంలోకి ప్రక్రియలో నవల అత్యంత ప్రధానమైన ప్రచారం పొందింది.పాశ్చాత్య సాహిత్యంలో నవలా ప్రక్రియ నిలదొక్కుకున్న తరువాతనే భారతీయ భాషల్లోకి ప్రవేశించింది.జాతీయ భావ ప్రేరణ కలిగిన తరువాత ఆలోచన సరళిలో అనేక మార్పులు చోటుచేసుకున్నాయి.ఆ మార్పు సాహిత్యంలో వివిధ ప్రక్రియలుగా ప్రకాశించింది.ఆ సందర్భంలో అవిర్భవించింది.నవల సాంఘిక సమస్యలను దృష్టిలో పెట్టుకుని అనేక మంది నవలా రచయితలు మంచి నవలలు రాశారు.

సమాజంలో వ్యక్తులు కోరిక విధానాన్ని చిత్రీకరించడానికి సంఘంలో వ్యక్తులు అచార వ్యవహారాలను సహజంగానే వర్ణించటానికి నవల ఒక సాధనమని చెప్పవచ్చు. ఆ తర్వాత ఎన్నో సిద్ధాంతాల్లో విభిన్న ధోరణలు నవల సాహిత్య వింత వింత పోకడలు పోతూ ఎంతో విస్తృతి చెందింది.

జీవితాన్ని సర్వసమగ్ర రీతిలో సులువైన రీతిలో చెప్పగలిగిన ఏకైక ప్రక్రియ నవల. ఇందులో తరాల తరబడి ఎదిగిన కథ ఉంటుంది.ఆ నవలలో ఎన్నెన్నో పాత్రలన్నీ కల కలిపేందుకు ఎన్నో సంఘటనలు తోడ్పడతాయి.ఇలాంటి ఉత్తమ నవల చదివినప్పుడు మనసు కెంతో ఆహ్లాదం కలుగుతుంది.తెలుగు నవలా సాహిత్యం వటవృక్షంలా విస్తరించింది.తెలుగు సాహిత్యంలో ఎంతో మంది రచయితలు అనేక నవలలు రచించారు.వారిలో సి. ఉమాదేవి గారు ఒకరు.సమాజంలో జరుగుతున్న అనేక విషయాలను ఆమె రచనల ద్వారా తెలియజేస్తున్నారు.

**రచయిత్రి పరిచయం:**

సరస్వతీదేవి ,నారాయణరెడ్డి దంపతులు కుమార్తె సి.ఉమాదేవి గారు ఫిబ్రవరి 4, 1947 , ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం, తిరుపతి దగ్గర మదనపల్లిలో జన్మించారు. సి ఉమాదేవి గారు విశాఖపట్నంలో ఎం.ఏ , బి.ఇడి. పూర్తి చేశారు.విద్యా రంగంలో పదిహేడు సంవత్సరాలు శ్రీ నగర్ లో విద్యానికేతన్ ప్రారంభించి , ఆ కళాశాల ప్రిన్సిపాల్ గా విధులు నిర్వర్తించారు.రచన వ్యాసంగం ప్రవృత్తిగా సి.ఉమాదేవి గారు అనేక కథలు , నవలలు రచించారు

వీరి నవలలు 'శిలాపుష్పాలు', 'సాగర కెరటం', 'కేర్ టేకర్', కథాసంపుటాలు 'చిన్నగుండె చప్పుళ్లు', 'మాటే మంత్రం' ,ఉన్నాయి.సి.ఉమాదేవి గారి రచనల్లో 'అమ్మతనం' కవితకు డా॥ పోతుకూచి సాహితి అవార్డు, 'మానవతకు చిరునామా' కవితకు ఎక్స్‌రే అవార్డు వచ్చాయి.సాహిత్యబుధిలో నీటి బిందువు కావాలన్నది సి.ఉమాదేవి గారి ఆకాంక్ష.

**సాగర కెరటం ఇతివృత్తానుశీలన:**

రచయిత్రి ఈ నవలకు పేరు ఎన్నుకోవటమే ఉమ్మడి కుటుంబాల పరిస్థితులను సూచిస్తుంది. తల్లిదండ్రులు పిల్లల మీద ఎన్నో ఆశలు పెట్టుకుని వాళ్ళకోసమే కష్టపడతారు.సంసార సాగరమే మాట వాడుకలో స్థిరపడిపోయింది. సముద్రానికి ఆటు,పోట్లు ఉన్నట్లే సంసారాన్ని కూడా ఒడిదుడుకులు ఉంటాయి.సంసారంలోని కష్టాలను ఆహ్లాదాన్ని కష్టసుఖాలను,ఆలోచనలను అన్నిటినీ సమన్వయం చెయ్యడానికి ఎన్నుకున్న పేరు సాగర కెరటం అని అర్థమవుతుంది.

జనార్ధనం రాజ్యలక్ష్మి దంపతులు. వాళ్లకు ముగ్గురు పిల్లలు జగన్, పూజా,పవన్.జనార్ధనం చేసే చిన్న ఉద్యోగంతోనే పిల్లలను స్థిరపడేటట్లు చెయ్యాలనుకున్నాడు. ఆడపిల్ల విషయంలో మాత్రం అందరిలాగే ఆలోచించాడు. డిగ్రీ చదివించి పెళ్లి చేస్తే చాలనుకున్నాడు.నవల కథ నడవటం కోసం ప్రవేశపెట్టిన మరొక పాత్ర చలపతి.చలపతి సంపన్నుడు,జనార్ధనానికి అవసరమైనప్పుడల్లా డబ్బులు సర్దుబాటు చేస్తుంటాడు.అది తిరిగి తీసుకోవలసిన పట్టుదల కూడా చలపతికి లేదు.పూజను డిగ్రీ వరకు చదివించి మధు అనే అబ్బాయికి ఇచ్చి పెండ్లి చేశాడు. జగన్ కు ఇంజనీరింగ్ లో ఎంట్రెన్స్ సరైన ర్యాంకు రానందువల్ల చలపతి ఆర్థిక సహాయంతో ప్రైవేట్ కాలేజీలో చేర్చి ఇంజనీరింగ్లు పూర్తి చేశారు.పవన్ కూడా చలపతి సహాయం తో అమెరికాకు పంపి చదివించారు. మధు మెడికల్ షాపు పెట్టుకుని స్థిరపడి పూజను పి.జి. చేయించాడు.

పక్క వీధిలోనే ఉన్న సంపన్నుడు(చలపతి) జగన్ కు పిల్లనిచ్చి ఇల్లరికం తీసుకుపోయాడు.జగన్ మొదట ఇల్లరికానికి వెళ్లటానికి బెట్టు చేసినా తరువాత ఆర్థిక పరిస్థితికి లోబడి శిల్పాతో సర్దుకుపోయాడు. అత్తగారికి అనుకూలంగా మారాడు కానీ.శిల్ప వదిన శ్వేత నెమ్మదిగా శిల్పకు అర్థమయ్యేట్లు నచ్చజెప్పి అత్తగారింటికి వెళ్ళేటట్లు చేసింది.శిల్ప తల్లి ఈ సంఘర్షణకు చమత్కారమే పరిష్కారంగా కూతురికి,అల్లుడికి ఫ్యాక్టరీ దగ్గరలో ఇల్లు కట్టించి వేరే కాపురం పెట్టించింది.ఈ సందర్భాలకు

సర్దుబాటు కాలేని రాజ్యం మానసిక క్షోభతో అనారోగ్య సమస్య కూడా కలిగింది.పవన్ కూడా మంచి సంబంధమే చూసి పెళ్లి చేసుకున్నాడు.జగన్ పరిస్థితులన్నీ చూసి సర్దుబాటు చేసి తిరిగి తల్లిదండ్రులకు దగ్గరయ్యారు. రాజ్యం మనస్సు కెరటాలు తగ్గిన సముద్రంలాగా ప్రశాంతమైంది.

**ఉపసంహారము:**

మధ్యతరగతి జీవితాన్నే ప్రధానమైన ఇతివృత్తంగా ఎంచుకున్నారు.కధాంశం లో సంపన్నులతో సంబంధం వర్ణించిన మధ్యతరగతి వారి ప్రభావం సంపన్నుల మీద పడేటట్లు వారి స్వభావమే వీరికి అనుకూలంగా మారేటట్లు వర్ణించారు.నీతి సూత్రాలు,సాంఘిక మర్యాదలు మధ్యతరగతి వారు పాటించినట్లుగా అట్టడుగు వర్గం వారు గానీ, ఆర్థిక స్థితి ఉన్న వారు గాని పాటించలేదు అని వర్ణించాడు.

కల్తీ లేని మధ్యతరగతి పాత కాలపు ఇల్లాలు రాజ్యం.ఒక పక్క భర్తకు ఇష్టమైనట్లుగా ప్రవర్తించడం.ఒక తల్లిగా పిల్లలకు కావాల్సినవి వండిపెట్టి వాళ్లు తింటుంటే ఆనందించటం. తన వంటలు ఎవరైనా మెచ్చుకుంటే సంబరపడిపోవడం.కొన్ని సందర్భాల్లో పిల్లలకు, తల్లిదండ్రులకు ఎడబాటు తప్పదు. పిల్లల అల్లరి అన్ని దూరమవుతున్నారని రాజ్యంలో పూడ్చలేని వెలితి ప్రవేశించింది.ర్యాంకు తెచ్చుకోలేక దూరములో ఉన్న కాలేజీల్లో జగన్ చేరాడు. ర్యాంకు వచ్చి ఉన్నత చదువుల నిమిత్తం విదేశాలకు బయలుదేరాడు పవన్.పిల్లల మీద బెంగతో రాజ్యం మానసిక క్షోభతో జబ్బుపడింది."సాగరాన్ని వీడిపోలేని కెరటం కీరవాణి రాగమాలపిస్తోంది".తన పిల్లలు తన విడిచి పోరు. నా దగ్గరికి తిరిగి వస్తారు ఎప్పటికైనా.వీళ్ళు కెరటాలు.పూజ చెప్పింది నిజమే. ఆమె ముఖంలో ప్రసన్నత చూసి అందరూ సంతోషించారు.డాక్టరుకు థ్యాంక్యూ చెప్పి తల్లి మంచం దిగుతుంటే చేయందించాడు ప్రేమగా ఫరవాలేదు నేను నడవగలను.రాజ్యం సున్నితంగా అడుగు ముందుకేసింది.అమ్మా మేమున్నాము అని అల్లరిగా నవ్వుతూ ఇద్దరు వచ్చి చెయ్యందించారు.సాగరం కెరటాన్ని వెనకకు రాకుండా ఆపగలదా?. బంధాలు బాంధవ్యాలు మనసు లోపలి పొరలలో నిక్షిప్తమై, వెలువడినప్పుడు మాత్రం కెరటాల ఉధృతిని గుర్తుకు తెస్తాయనేది మాత్రం కాదనలేని సత్యం.ఏ సాహితీ ప్రక్రియకైనా ఇతివృత్తమే ప్రధానం అనే విధంగా సాగర కెరటంలోని ఇతివృత్తాన్ని మలిచి సమాజానికి సందేశాన్ని అందించిన రచయిత్రి సి.ఉమాదేవి గారు తెలుగు సాహితీ జగత్తులో సుస్థిర స్థానాన్ని సంపాదించుకున్నారు.

**ఆధార గ్రంథాలు :**

1. శిలాపుష్పం -సి.ఉమాదేవి విశాలాంధ్ర పబ్లికేషన్స్ (2006)
2. సాంఘిక నవల - కథా శిల్పం - సి మృణాళిని విల్ కమల్ పబ్లికేషన్స్
3. నవలా శిల్పం -పల్లపాటి వెంకటసుబ్బయ్య విశాలాంధ్ర పబ్లికేషన్స్ (2006)
4. సాగర కెరటం మ-సి.ఉమాదేవి విశాలాంధ్ర పబ్లికేషన్ (2008)

# నన్నయ కవితా దృక్పథం

**తోట వెంకటస్వామి**
సహాయ సంపాదకులు
ప్రచురణల కేంద్రం
ద్రావిడ విశ్వవిద్యాలయం, కుప్పం
మొబైల్: 9492631323

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తి లో
నారసి మేలునా, నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు దెనుంగునన్ మహా
భారతసంహితారచనబంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్"

ఆంధ్ర సాహిత్య ప్రపంచంలో ఆదికవిగా, ఆంధ్రకవితాలోకంలో త్రిమూర్తులుగా ప్రఖ్యాతిగాంచిన కవిత్రయంలో ప్రథముడుగా వెలసినకవి నన్నయ. కవి అంతరాత్మ కావ్యంలో ప్రతిబింబించును. కవి ఆత్మకు, కావ్యానికి బింబ ప్రతిబింబ భావం ఉంది అన్న లౌకిక ప్రపంచంలోని కవి భౌతిక స్వరూపంగాని, వాస్తవిక ప్రపంచంలోని కవి ఆత్మీయతకాని కావ్యంలో కన్పించదు. కావ్యంలో కన్పించేది కవి అంతరాత్మ మాత్రమే. అది అతని దివ్యస్వరూపం. నన్నయ దివ్యస్వరూపాన్ని సాక్షాత్కరింపచేసుకోవాలనుకొన్న పాఠకుడు ఆ మూర్తిని నన్నయ భారతంలోనే దర్శింపగలుగుతాడు. నన్నయ విపుల శబ్దశాసనుడు. నన్నయ భారతం ఆంధ్ర సాహిత్యంలో ఆది కావ్యం.

నన్నయ అప్పట్లో దేశీయాలైన శబ్దాలను సంస్కృత శబ్దాలను ఏర్చికూర్చి నుడికారపు సొంపులు తీర్చిదిద్దిన శబ్దశాసనుడు. నన్నయకు పూర్వం తెలుగులో శిలాశాసనాలు కన్పిస్తాయి. ఆంధ్రభాషలో సాహిత్య వ్యవసాయం నన్నయకు పూర్వమే మొదలైంది. వ్యవహారంలో, శిలాశాసనాలలో వ్యవస్థితం కాకుండా ఉన్న విపులశబ్దాలను తీర్చిదిద్ది ఒక క్రమ పద్ధతిని పాటించిన కవి నన్నయభట్టు. తెలుగు పదాలకు, సంస్కృత శబ్దాలకు, తెలుగు ఛందస్సుకు, సంస్కృత ఛందస్సుకు వరుసలు దిద్ది పద్యాలు వ్రాసినవాడు నన్నయ భట్టారకుడు. నన్నయ అవిరళ జపహోమ తత్పరుడు. సంహితాభ్యాసుడు. 'తెలుంగునన్ మహాభారత సంహితా రచన బంధురుడు'. బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాన నిరతుడు. లోకజ్ఞుడు. నన్నయకు అర్థంమీద కంటే శబ్దం మీద పట్టు ఉంది. దీనికి కారణం నన్నయ శబ్ద శాసనుడు కావటం కాదు. నన్నయ నిష్ఠ శబ్దం మీద మాత్రమే కాక రమణీయార్థాన్ని ప్రతిపాదించే శబ్దాలు, వాని కూర్పు, గురులఘువుల అనుక్రమం మాత్రమే కాక వాటి ఉచ్చారణమీద మక్కువ ఎక్కువ. దీనినే అక్షర రమ్యత అని నన్నయకవి చెప్పుకొన్నాడు. ఈ అక్షర రమ్యత శబ్దాల కూర్పులో అక్షరాల ఆనుపూర్వితో వాటి ఉచ్చారణ వల్ల వ్యక్తమయ్యే నాదంలో ఉంది. నన్నయ నాదబ్రహ్మోపాసి. లలితములైన సంస్కృత పదాలు, కమ్మని నుడికారపు సొంపులు కురిపించు తెలుగు పదాలు నన్నయ పద్యాలలో అనుక్రమంలో అక్షర రమ్యతగా వెల్లివిరిసిశాయి.

"నిండుమనంబు నవ్యనవనీత సమానము" అన్న పద్యంలోని రమణీయార్థాన్ని అటుంచితే తెలుగు పదాల కూర్పు సంస్కృత పదాల సమాసము రెండింటిని మేళవించిన పద్యం నడక, ఆ నడకలో పుట్టే నాదం, అక్షర రమ్యతగా సాక్షాత్కరిస్తుంది. ఈ అక్షర రమ్యత సర్వజనైక వేద్యం. శబ్దార్థాలకు అతీతం, విశిష్టం. అంటే తెలుగు రానివారు సహితం విని ఆనందించగలుగుతారు. అక్షర కూర్పు వల్ల పుట్టే నాదంపై నన్నయకుగల నిష్ఠ కచదేవయాని ఘట్టంలో నన్నయ కవితాహృదయాన్ని చీల్చుకొని స్వయం ప్రకాశమౌతోంది. కచుడు – శుక్రుని ఉదరాన్ని చీల్చికొని వచ్చాడు. ఆ సందర్భంలో–

"విగత జీవుడై పడియున్న వేదమూర్తి
అతని చేత సంజీవితుడై వెలింగె
దనుజమంత్రి యుచ్చారణ దక్షుచేత
అభిహితంబగు శబ్దంబు నట్లపోలె"

మృతుడైన వేదమూర్తి శుక్రుడు ఉచ్చారణ దక్షుచేత అభిహితమైన శబ్దంవలె తిరిగి బ్రతికించబడ్డాడు. భంగ్యంతరాన చెప్పవలసి వచ్చిన ఉచ్చారణ దక్షుడు కానివాడు ఉచ్చరించు శబ్దం మృతప్రాయము. ఉచ్చారణ దక్షుడు వేరు, సంగీత విద్వాంసుడు వేరు. సంస్కృత మహాభారతంలో లేని ఈ ఉపమానాన్ని నన్నయ కవితా హృదయం నుండి వెల్లివిరిసింది. నన్నయ కవితా రీతిలో అక్షర రమ్యతకు సహకరించింది. "ప్రసన్నకథాకవితార్థయుక్తి" నానారుచిరార్థ సూక్తినిధి నన్నయ కావ్యంలో ఈ అక్షర రమ్యత, ప్రసన్న కథా కవితార్థయుక్తి గజిబిజిగా అల్లుకోని ఉన్నాయి. పూర్వం చెప్పిన సూత్రాలకు నన్నయ మహాభారతమంతా నిదర్శన ప్రాయమే.

"వాడిమయూఖముల్ గలుగువాడ పరాంబుధి గ్రుంకె ధేనువుల్
నేడిటవచ్చె నేకతమ నిష్ఠమెయిన్ భవదగ్ని హోత్రముల్..."

ఇవి దేవయాని కచునిరాకకు ఎదురుచూస్తూ తన తండ్రితో పల్కిన పల్కులు. పై పద్యంలో 'సూర్యుడు' అనే అర్థంలో "వాడిమయూఖముల్ గలుగువాడు" అని నన్నయ ప్రయోగించాడు. సూర్యుని చండ ప్రచండ కిరణాలు "వాడిమయూఖములతో" కనిపించదు. ఈ దీర్ఘ సమాసాన్ని, ఈ దీర్ఘాక్షరాలను పలికినపుడు పుట్టే నాదం సుకుమార స్త్రీ కంఠస్వరం, లేజవరాలు, శుక్రుని గారాలపట్టి, ఆశ్రమవాటికలోని తాపసకన్య దేవయాని నోటిలో 'తీక్షణ ప్రచండ కిరణుడు' వాడిమయూఖములుగల వాడైనాడు. ఇట్లే ఈ పద్యాన్ని పూర్తిగా చదివినచో గురులఘువుల అనుక్రమం, దీర్ఘాక్షరాలు ప్లుతములుగా నినదించుట, వాడి... మయూఖ... మృగ రాక్షస... ఈ తూర్పు కన్యకా కంఠస్వరాన్ని మాత్రమే ప్రకటింపజేస్తుంది. నన్నయ అక్షర ప్రపంచంలో మేటి శిల్పి. దుశ్శాసనుడు ద్రౌపదిని సభలోనికీడ్చి తెచ్చినాడు.

"ఆవన జాననన్ గురుకులాపశదుండు గడంగి రాజసూ
యావబృథంబునందు వసుధామర మంత్ర పవిత్రవారి ధా
రావళిజేసి పావనములైన శిరోజములన్ దెమల్చి పా
పావహు డీడ్చి తెచ్చె...."

పై పద్యంలో రమణీయార్థ ప్రతిపాదాలైన శబ్దాలు మాత్రమే నన్నయ కవితా శిల్పానికి తార్కాణాలు కాలేవు. నన్నయ వాడిన ఆ శబ్దాలనే వాడి ఆ పద్యాన్ని గద్యంగా చెప్పిన ముందటి రసస్ఫూర్తి కలగదు. లేతగులాబి పువ్వును రేకలు రేకలుగా విడదీసి అరచేతిలో పెట్టి చూసినట్లు ఆ అందం మటుమాయమైపోతుంది. తిక్కన మహాకవి కూడ నన్నయ కవితారీతిపై పూజ్యభావం కలవాడనుటకు ఈ పద్యం ప్రముఖ నిదర్శనం. తిక్కన కూడా చంపకమాలనే, ఆ 'వ' కార ప్రాసతోనే, 'రాజసూయావ బృథంబునందు' అనే ఆ మాటలనే వాడి శ్రీకృష్ణునితో ద్రౌపది తన పడిన భంగపాటును వ్యక్తపరిపించినాడు. శ్రీకృష్ణుడు ధర్మరాజుకు పద్నాలుగువేల ఏనుగులను రాజసూయ యాగ సమయంలో బహుమానంగా ఇచ్చాడు.

"మందిత సూర్యరశ్మిరుచి మన్మణిహార చయంబుతో గట
స్యంది సుగంధి దాన జలసంపద నొప్పెడు వాని దేవకీ
నందను డిచ్చె బ్రీతి పదునాలుగువేల గజంబులన్"

పద్నాలుగువేల ఏనుగులు, కనుచూపు మేరకు అందకుండ కదలివస్తున్నాయి. ఆ ఏనుగులు సాలంకృతాలు,

మణిహారాలలో ప్రతిబింబించు సూర్యరశ్మి సూర్యకాంతిని తిరస్కరిస్తున్నది. ఈ రమణీయార్థాలను శబ్దాలచే ప్రతిపాదించాడు నన్నయ.

"మందిత సూర్యరశ్మి రుచి న్మణిహార చయంబుతో, గటస్యంది
సుగంధి దానజల సంపద నొప్పెడు వాని దేవకీనందనుడిచ్చె..."

ఈ దీర్ఘసమాసాలు, వాటి ఉచ్చారణ వలన పుట్టే నాదం, ప్రాసయైన 'ంద' కారముల పునరావృత్తి మదించిన ఏనుగుల సమూహాల గంభీర మంద గమనాన్ని స్ఫురింజేస్తున్నాయి. విశ్వసాహిత్య ప్రపంచంలో శబ్దార్థాలకు, ఛందస్సుకు భిన్నమైన నాదంచే కవితారీతిని నిర్మించిన మహాకవులను వ్రేళ్ళపై లెక్కించవచ్చు. ఈ మహాకవులలో నన్నయ మణిపూస వంటివాడు. దుశ్శాసనుడు ద్రౌపది వలువలొలిచినప్పుడు భీముని ప్రతిజ్ఞ తెలిపే పద్యం –

"కురువృద్ధుల్ కురువృద్ధ బాంధవులనేకుల్ చూచుచుండన్ మదో
ద్ధరుడై ద్రౌపదినిట్లు జేసినఖలున్ దుశ్శాసనున్ లోకభీ
కరలీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైల రక్తౌఘ ని
ర్ఝర ముర్వీపతి చూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్"

పై పద్యంలో కురువృద్ధుల్ గురువృద్ధ... మదోద్ధరుడై – మొదలైన సమాసాలు 'ద్ధ' కార ప్రయోగ పునరావృతి భీముని రౌద్రాకృతిని, భీమసేనుడు తన గదాదండాన్ని పలుమార్లు నేలపై ఝళిపించి ప్రతిజ్ఞ చేయటాన్ని చెప్పకనే చెబుతున్నది. 'తద్విపుల వక్షశ్శైల... నిర్ఝర' అనే దీర్ఘసమాసాన్ని ఉచ్చరించినప్పుడు భీముడు పళ్ళు పటపట కొరికినట్లు, 'ఉగ్రాకృతిన్' అని అన్నప్పుడు భీముని ఉగ్రరూపం స్ఫురిస్తుంది. పద్యాలలో ఉన్న ఏ పదం ఈ అర్థం చెప్పకున్నా అక్షరాల అనుక్రమం వాటి ఉచ్చారణలో పుట్టే నాదం వలన ఇదంతా ద్యోతకమౌతోంది.

ఇట్లే రాజసూయ యాగాన శిశుపాలుని నిందావాక్యాలను ధర్మరాజును అధిక్షేపిస్తూ శిశుపాలుడు "అవనీ నాథులనేకులుండగ విశిష్టారాధ్యులార్యుల్ మహీదివిజుల్ పూజ్యులు పల్వురుండగ ధరిత్రీ నాథ..." అనుచు సభనుండి లేచివెళ్ళిపోయినాడు. అవనీనాథులనునపుడు 'నీ' గురువు మాత్రమే కాదు. ప్లుతంకూడా. ఆశీనుడైన శిశుపాలుడు రెండు చేతులను నేలపై మోపి లేవటాన్ని స్ఫురింపజేస్తున్నది. "విశిష్టారాధ్యులు" – ఆరాధ్యులు అని ఆరాలను ప్లుతంగా ఉచ్చరించి గిర్రున తిరిగినాడు. 'ధరిత్రీనాథ' అను సంబోధనలో 'రిత్రీ' రెండు గురువులు, రేఫం, 'రిత్రీ' అనుటలో జారి రెండడుగులు ముందుకు వేశాడు. "దాశార్హుండు పూజార్హుడే" అని ఏకారంతో తల పలుమార్లు పంకించి ప్రశ్నించాడు. ఇది నన్నయ కవితారీతిలోని విశిష్టత. ఛందస్సుతో, ఛందస్సుకంటె అతీతమైన విశిష్ట నాదంతో గురులఘువుల అనుసరణలో వాటి ఉచ్చారణలో పుట్టే నాదంచే నన్నయ రసప్లుతం వ్యక్తపరుస్తున్నాడు. కవి ఉపాదించే అర్థం అనిర్వాచ్యమని, వాచామగోచరమని, వర్ణనాతీతమని ఆలంకారికులు వర్ణిస్తున్నారు. కవి అతీంద్రియాలైన సత్యాన్ని, సౌందర్యాన్ని మనోనేత్రంతో దర్శించి కావ్యంలో ప్రదర్శిస్తాడు. కావ్యం రసాత్మకం అనుట రసానందం సద్యపరః నిర్వృతి అనుట ఋషికల్పులైన భారతీయాలంకారికుల ప్రాచీన సిద్ధాంతం.

**ఆధార గ్రంథాలు**

కోరాడ మహదేవశాస్త్రి, *ఆంధ్రవాఙ్మయ పరిచయము.* మద్రాసు: సరస్వతీ ప్రచురణము, 1987.

బేతవోలు రామబ్రహ్మం, డా॥ గొల్లకోట సూర్యభాస్కరరావు (సం.) *నన్నయభారతి,* (ప్ర.సం.) 1993. హైదరాబాదు: తెలుగు విశ్వవిద్యాలయం.

విశ్వనాథ సత్యనారాయణ, నన్నయగారి భారతాంధ్రీకరణము – *ఆంధ్రమహాభారతోపన్యాసములు.* హైదరాబాద్: ఆంధ్ర సారస్వత పరిషత్తు. 1981.



# ప్రాగ్రూప విమర్శ

డా॥ ఎస్. చిన్నరెడ్డయ్య
ఎం.ఏ., ఎం.ఫిల్, పిహెచ్.డి.
అసోసియేట్ ప్రొఫెసర్, తెలుగుశాఖ,
ద్రావిడ విశ్వవిద్యాలయం
కుప్పం – 515 426, చిత్తూరు జిల్లా.
సెల్ నెం. 94406 11033

**1. ప్రవేశిక:**

విమర్శ అనే మాటను ఇంగ్లీషులోని 'క్రిటిసిజమ్' అనే పదానికి సమానార్థకంగా, సాహిత్యరచనా ప్రక్రియగా ఈనాడు వాడుతున్నారు. ఈ 'క్రిటిసిజమ్' అనే మాటకు విమర్శ, తప్పులు ఒప్పులు పరిశీలన చేయడం, ఆక్షేపణం, ఖండనం అనే అర్థాలు బ్రౌన్ నిఘంటువులో ఉన్నాయి. బహుజనపల్లి సీతారామాచార్యులు రూపొందించిన శబ్దరత్నాకరంలో విమర్శ అనే మాటకు 'చక్కగా విచారించుట' అనే అర్థముంది. సూర్యరాయాంధ్ర నిఘంటువులో విమర్శనము అన్న మాటకు పర్యాలోచనము, సమీక్షణము, పరిశీలనము, యుక్తియుక్తముగా వాదించుట వంటి అర్థాలున్నాయి. నైఘంటికార్థాలన్నిటిని పరిగణనలోకి తీసికొని విచారించాక 'సాహిత్య గ్రంథాలను సమగ్రంగా పరిశీలించి గుణదోషాలను వివేచించి, నిరూపించటం సాహిత్య విమర్శ' అని నిర్ధారించి చెప్పవచ్చు.

**2. సాహిత్య విమర్శ:**

సాహిత్య విమర్శ ప్రధానంగా రెండు విధులు నిర్వర్తిస్తుంది. అందులో మొదటిది – ఒక గ్రంథాన్ని బహుకోణాలనుండి ఎలా అధ్యయనం చేయవచ్చో వ్యాఖ్యానించి చూపుతుంది. ఇక రెండవది, సాహిత్య రంగంలో ఆ గ్రంథానికున్న విలువలను నిర్ధారించి చూపుతుంది. సాహిత్యానికి ఒక వస్తువు, రచనారీతి ఉంటాయి. అందువల్ల సాహిత్య విమర్శ కూడా వస్తువునూ, రూపాన్ని ఆశ్రయించి సాగుతుంటుంది. సాహిత్య విమర్శ ఒక సాహిత్య రచన లేదా గ్రంథంలో రచయిత తీసుకున్న వస్తువు ఏమిటో, ఆ వస్తువుకూ జీవితానికి ఉన్న సంబంధం ఏమిటో చర్చిస్తుంది. వస్తు చర్చలోనూ, రూప పరిశీలనలోనూ విమర్శ మొత్తం సాహిత్యరచన లేదా గ్రంథాన్ని సమగ్రంగా అవగాహన చేసుకుని ఉచితానుచితాలను, తప్పొప్పులనూ బేరీజువేసి విలువ కడుతుంది. ఒక రచనను సాకల్యంగా చదవటం, ఇతివృత్తంలో ప్రదర్శించిన జ్ఞాన విజ్ఞానాలను, నిర్మాణవిషయంలో ఉపయోగించిన శిల్ప శక్తులనూ అర్థం చేసికోవడం, ఆ అర్థం చేసికున్న వాటిని సమగ్రంగా నిష్పక్షపాతంగా విశ్లేషించటమే విమర్శ చేసే పనిగా పేర్కొనవచ్చు.

అన్ని ప్రక్రియలలాగే సాహిత్య విమర్శ కూడా ఒక ప్రక్రియగా పరిగణించ బడుతున్నది. ఇది దాదాపు అన్ని ప్రక్రియలను స్పృశిస్తుంది. విమర్శ ప్రాచీన కాలం నుంచి కూడా ఉంది. భాష్యం, వ్యాఖ్యానం వంటి పేర్లతో ఇది ప్రాచీన సాహిత్యంలో కనిపిస్తుంది. అయితే ఆధునిక కాలంలో ఈ విమర్శ పరిధి విస్తృతంగా పెరిగింది. వివిధ కోణాలూ ఇందులో చోటుచేసికున్నాయి. వాటిని ఇలా పేర్కొనవచ్చు.

1. అభినందనాత్మక విమర్శ, 2.తులనాత్మక విమర్శ, 3.నిర్ణయాత్మక విమర్శ, 4.గ్రాంథిక విమర్శ, 5.ఆలంకారిక విమర్శ, 6.సాంప్రదాయక విమర్శ, 7.పునర్నవ సాంప్రదాయక విమర్శ, 8.కాల్పనిక విమర్శ, 9.సాంకేతిక విమర్శ, 10.సామాజిక విమర్శ, 11.జీవితానుశీలన విమర్శ, 12.సామాజిక విమర్శ, 13.మార్క్సిస్టు విమర్శ, 14.మనస్తత్వశాస్త్ర విమర్శ, 15.ఔపదేశిక విమర్శ, 16.సౌందర్య దృక్పథ విమర్శ, 17.ప్రమోదకాముక విమర్శ, 18.సిద్ధాంత విచార విమర్శ, 19.మౌలిక పరిణామ దృక్పథ విమర్శ, 20.సముద్దేశ నిర్ణయ విమర్శ, 21.విశదీకరణ విమర్శ, 22.తర్కసహవిమర్శ, 23.మౌలిక విమర్శ, 24.వర్ణణాత్మక విమర్శ, 25.ప్రాదేశిక విమర్శ, 26.వివరణాత్మక విమర్శ, 27.వ్యాఖ్యానాత్మక విమర్శ, 28.ప్రమాణాత్మక విమర్శ, 29.రసదృక్పథ విమర్శ, 30.గుణదృక్పథ విమర్శ, 31.రీతి దృక్పథ విమర్శ, 32.ధ్వని దృక్పథ విమర్శ, 33.సామాజిక దృక్పథ విమర్శ, 34.హేతువాద విమర్శ, 35.కవిజీవిత విమర్శ, 36.శిల్ప విమర్శ, 37.మనోవైజ్ఞానిక విమర్శ, 38.ప్రాగ్రూప విమర్శ, 39.శైలీశాస్త్ర విమర్శ, 40.కథా కథన విమర్శ వంటి వివిధ విమర్శారూపాలున్నాయి. ప్రతి విమర్శా ప్రామాణికమైనదేగాక, నేటి సాహిత్యానికి

అవసరమైనదే. ఒక రచనపై ఇన్ని రకాల విమర్శలు నిష్పక్షపాతంగా జరిగితే ఆ రచన సమగ్ర మూర్తిమత్వం తేటతెల్లమవుతుంది. ఒక రచనలోని విభిన్న కోణాలు బయటకు తీయాలంటే వివిధ రీతుల్లో విమర్శ జరగాల్సిన అవసరం ఉంది. ఈ విమర్శ రీతుల్లో ఒక ప్రత్యేక స్థానాన్ని సంతరించుకున్నది ప్రాగ్రూప విమర్శ.

**3. ప్రాగ్రూప విమర్శ**

సర్వమానవాళి హృదయాలను స్పందింపజేసేశక్తి సమిష్టి అచేతన మనస్సును ఆవరించుకున్న ప్రాచీన విజ్ఞానంలోని ప్రాగ్రూపాలకుందని ప్రఖ్యాత మనో వైజ్ఞానిక శాస్త్రజ్ఞుడు కార్ల గుస్టాఫ్ యూంగ్ భావించాడు. రచయిత సమిష్టి అచేతన మనస్సులోని ప్రాగ్రూపాలు పాఠకుల సమిష్టి అచేతన మనస్సులోని ప్రాగ్రూపాలతో అన్వయించి, వారిని స్పందింపజేస్తాయని యూంగ్ ప్రాగ్రూప సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. యూంగ్ ప్రతిపాదించిన ప్రాగ్రూప సిద్ధాంతం సంస్కృతీ చరిత్రను, ప్రాచీన మత స్వరూప స్వభావాదులను, మానవ మానసిక వికాసాదులను పరిశీలించడానికి దోహదం చేస్తున్నది. అదేవిధంగా అతీతశక్తులతో మానవుడేర్పరచుకున్న తాత్విక జగత్తును అర్థం చేసుకోవడానికి కూడా తోడ్పడుతున్నది. ఈ ప్రాగ్రూపాలు భూత, వర్తమాన, భవిష్యత్తులను అనుసంధిస్తూ సమాజం ఒకే బాటలో పయనించడానికి ప్రయత్నిస్తాయి. వ్యక్తి ప్రవర్తనలను వివిధ కోణాలనుండి పరిశీలించి యూంగ్ ప్రతిపాదించిన ప్రాగ్రూపసిద్ధాంతం శాస్త్రవేత్తలనేగాకుండా భావుకులను, వేదాంతులను, మతాధిపతులను, శాస్త్రవేత్తలను ఆకట్టుకున్నది.

ప్రపంచంలో మానవుడు ఏ ప్రాంతం వాడైనా, ఏ జాతికి చెందినా పుట్టుక, చావు, ప్రేమ, దయ, కోపం, ఈర్ష్య, అసూయ, సంతోషం, సంవేదనం మొదలైనవి వాటికి ఒకేవిధంగా స్పందించి ప్రవర్తిస్తాడు. ఒకేవిధమైన అనుభూతిని పొందుతాడు. అనాది నుండి వస్తున్న ఈ భావనలనే యూంగ్ Arche Types (ప్రాగ్రూపాలు) అన్నాడు. మంచికి పుణ్యమనీ, చెడుకి పాపమని, పుణ్యానికి స్వర్గమని, పాపానికి నరకమని, జీవికి పూర్వజన్మ పునర్జన్మ పరజన్మలుంటాయని తరతరాల నుండి మనలో పాతుకున్న ఈ భావాలన్నీ ప్రాగ్రూపాలే. మాతృభావనను దేవతగా, పితృభావనను తండ్రిగా, ఆధ్యాత్మిక భావనను భక్తిగా, సృష్టి కర్తృత్వ భావనను భగవంతునిగా వినాశక శక్తి భావనను రాక్షసునిగా లేదా దయ్యంగా మానవుడు రూపకల్పన చేసుకున్నాడు. ఈ భావాలు తరతరాలుగా పునరావృత్తమవుతూ, సమిష్టి అచేతనలో స్థిరీకృతం చెందుతాయి. కాలక్రమంలో ఇవి ప్రాగ్రూపాలుగా నిలచిపోతాయి. యూంగ్ ప్రాగ్రూపాలను Dominants, Primordial Images, Mythological Images, Behaviour Pattern అని పేర్కొన్నాడు. తెలుగులో ఈ ప్రాగ్రూపాలను మూలరూపాలు, ఆదిమరూపాలు, అనుభూతి రూపాలు, ప్రథమచ్ఛదం అని వ్యవహరిస్తున్నారు.

సామూహిక సుప్త చైతన్యంలో ఉన్న అంశాలు (ఆచారాలు, విశ్వాసాలు, పురాణ గాథలు మొదలైనవి) వేరు వేరు జాతులకు వేరు వేరుగా ఉన్నట్టు భ్రాంతి కలుగుతుంది. కానీ వాటి మధ్య ఎన్నో పోలికలున్నాయి. అవి సంకేతాల రూపంలో, ప్రతీకల రూపంలో మానవుని సామూహిక సుప్త చైతన్యంలో అణిగి ఉంటాయి. ఇవి సాహిత్య రచనలో రచయితకు కొంత తెలిసీ, కొంత తెలియకా వ్యక్తమౌతాయి. కథన విన్యాసాలలో, మాదిరి (టైప్) పాత్రలలో, నిర్దిష్ట మానవ ప్రవర్తనలో వీటిని మనం చూడవచ్చు. మొత్తం మానవ జాతికి సంబంధించిన సుప్తచైతన్య భావాలు కొన్ని ప్రతీకల ద్వారా సాహిత్యం లోనూ, జీవితం లోనూ వ్యక్తమౌతాయి. ఆ భావాలూ, ప్రతీకలూ చాలా ప్రాచీనమైనవి కాబట్టి వాటిని "ప్రాగ్రూపాలు" అంటారు. వీటిని "చిరంతన ప్రతీకలు", "ఆదిమ ప్రతీకలు" అని కూడా అనవచ్చు. సాహిత్య కృతులలో ఎదురయ్యే ప్రాగ్రూపాలకు ప్రాధాన్యతనిచ్చి, వాటిని విశ్లేషించే సాహిత్య విమర్శా విధానాన్ని ప్రాగ్రూప విమర్శ అంటారు.

ప్రాగ్రూప సిద్ధాంతానికి పునాది వేసినాడు జేమ్స్ ఫ్రేజర్. అతడు కేంబ్రిజ్ విశ్వవిద్యాలయంలో తులనాత్మక మానవశాస్త్రంలో అధ్యాపకుడుగా ఉండేవాడు సుదూర ప్రాంతాలలో, ఒక దానితో మరొకటి సంబంధం లేకుండా జీవిస్తూ ఉండిన మానవ సమూహాల పురాణగాథల్లో, ఆచార వ్యవహారాలలో, విశ్వాసాలలో కొన్ని ప్రధాన భావాలు (Motifs) పునరావృతం గావటాన్ని అతడు గమనించాడు. జాతుల వేరైనా, మతాలు వేరైనా మానవులు ఆలోచించే విధానం, తమ జాతుల పురాణాలను (Mythis) సృష్టించుకున్న విధానంలో అనేక పోలికలున్నట్టుగా కూడా అతడు గుర్తించాడు. తన పరిశోధనల్ని క్రోడీకరించి అతడు "గోల్డెన్ బో" (Golden Bough) అన్న గొప్ప గ్రంథాన్ని రాశాడు.

మానవశాస్త్ర పరిధిలో, పరిభాషలో ఫ్రేజర్ చెప్పిన విషయాలను బాగా విస్తరింపచేసి మనస్తత్వ శాస్త్రానికి అనువర్తింప జేశాడు యూంగ్. దేశాలకూ, మతాలకూ, జాతులకు అతీతంగా ప్రాగ్రూపాలు పునరావృతం కావటానికి కారణం సామూహిక చైతన్యమేనని సూత్రీకరించాడు.

యూంగ్ ప్రాచీ, పాశ్చాత్యదేశాల సంస్కృతుల్లో మౌలికమైన తారతమ్యం ఉందన్నాడు. పాశ్చాత్య సంస్కృతి మానవుని తార్కిక శక్తికీ, బుద్ధిశక్తికీ ఇవ్వవలసిన దానికంటే చాలా ఎక్కువ ప్రాధాన్యతనిచ్చి అతనిలో అంతర్గతంగా ఉన్న మానసిక శక్తిని

నిరాదరించిందని యూంగ్ భావించాడు. చుట్టూరా ఉన్న ప్రపంచాన్ని అర్థం చేసుకోవటానికి మనకు ఎంతో సహాయపడే అంతర్గత మానసిక శక్తిని మనం మళ్ళీ పునరుద్ధరించుకోవాలని యూంగ్ గట్టిగా వాదించాడు. చుట్టూరా ఉన్న ప్రపంచంలోని అన్ని విషయాలనూ అర్థం చేసుకోవటానికి బుద్ధిశక్తి చాలునన్న భ్రమలోనుంచి మానవజాతి బయటపడటానికి ప్రయత్నించాలన్నాడు. ఆంతరిక జ్ఞానశక్తి సహాయం లేకుండా సామూహిక సుప్తచైతన్యంతో రూపొంది, ప్రాగ్రూపాల ద్వారా వ్యక్తమయ్యే అంశాలను అర్థం చేసుకోవటం వీలుకాదని చెప్పాడు.

యూంగ్ అభిప్రాయం ప్రకారం కాలం ఒక గొలుసు. వర్తమానంలోని ప్రతిపక్షమూ, భూతకాలంలోని ప్రతిక్షణంతోనూ అనుసంధించబడి ఉంటుంది. వర్తమాన కాలంలోని ఒక చావుకు మనం ప్రతిస్పందించే విధానం వెనక గతంలోని అసంఖ్యాకమైన చావులకు మానవజాతి స్పందించిన అనుభవం ఉంటుంది. అందుచేత కాలాన్ని అవిభిన్నంగా చూడాలని యూంగ్ ప్రతిపాదించాడు. మానవ ప్రవర్తన కాలానికి అతీతంగా పునరావృతం అవుతూ ఉంటుంది. దానికి ఆధారం సర్వమానవ జాతికి ఉమ్మడి సంపద అయిన సామూహిక సుప్తచైతన్యం. అది ప్రాగ్రూపాల ద్వారా వ్యక్తమౌతూ ఉంటుంది. ఇవి యూంగ్ ప్రతిపాదనల్లో ముఖ్యమైనవి.

యూంగ్ మానవ జీవితంలోని కొన్ని ప్రధానమైన నమూనాలను గుర్తించాడు. అవి అత్యంత ప్రాచీన కాలం నుంచీ ఎడతెరపి లేకుండా కొనసాగుతూ వచ్చాయని చెప్పాడు. అవి సాధారణంగా ద్వంద్వాలుగా అంటే జంటలుగా ఉంటాయి. మరణం-పునర్జన్మ, భూమాత- ఆకాశపిత, ఆలోచన - ఆవరణ, ప్రమాణం - అన్వేషణ, సుఖం - దుఃఖం, వెలుగు - చీకటి మొదలైనవి ఆ నమూనాలలో ముఖ్యమైనవి. ఇవి జీవితంలో పునరావృతం అవుతూ వుంటాయి. కాబట్టి సాహిత్యంలోనూ పునరావృతం అవుతాయి.

ప్రాగ్రూపాలుగా బహిర్గతమయ్యే నమూనాలను (Archetypal Patterns) మాత్రమే కాకుండా కొన్ని ప్రాగ్రూప పాత్రలను (Archetypal characters) కూడా యూంగ్ గుర్తించాడు. తిరుగుబోతు, తాగుబోతు, ప్రేమికుడు, విప్లవకారుడు అలాగే ప్రేమ, జాలి, మోసం, ద్వేషం మొదలైనవి ఆర్కిటైప్ వస్తువులు. యూంగ్ అభిప్రాయం ప్రకారం రచయిత సృజనశక్తి స్థూలంగా ఈ చట్రంలో నమూనాలలో పని చేస్తుంది.

ఇరవయ్యవ శతాబ్దంలో ప్రాగ్రూప విమర్శకు గొప్ప ప్రచారాన్ని కల్పించిన వాడు నార్తన్ ఫ్రై, అతడు అమెరికన్ సాహిత్య విమర్శకుడు. తాను రాసిన 'Anotomy of criticism' అన్న గ్రంథంలో యూంగ్ సిద్ధాంతాలను సమగ్రంగా చర్చించాడు. అంతే కాకుండా ప్రాగ్రూపాలను నాలుగు దశలుగా విభజించాడు. ఒక రోజులోని నాలుగు దశలు సూర్యోదయం, మధ్యాహ్నం, సూర్యాస్తమయం రాత్రి (చీకటి) ఈ నాలుగు దశలూ ఒక సంవత్సర కాలంలోని వసంతం, వేసవి, ఆకురాలు కాలం, శీతాకాలం అన్న నాలుగు రుతువులలో సమన్వయమౌతాయి. అలాగే మానవ జీవితంలోని ప్రధానదశలైన పుట్టుక, పెళ్లి, వార్ధక్యం (శిథిలావస్థ), మరణ రోజులోని నాలుగు దశలకూ, సంవత్సర కాలంలోని నాలుగు దశలకూ సమాంతరంగా ఉంటాయి. కాలంలోనూ, జీవితంలోనూ కనిపించే నాలుగు దశలు సాహిత్యంలో నాలుగు సాహిత్య ప్రక్రియలుగా దర్శనమిస్తాయని నార్తస్ ఫ్రై భావించాడు. ఆ సాహిత్యపు ప్రక్రియలు రొమాన్స్, కామెడీ, ట్రాజడీ, సెటైర్‌లు. ప్రాగ్రూప విమర్శకుడు సాహిత్యంలో ఈ నమూనాలను - చట్రాలను - గుర్తించి, వాటి సాంకేతికార్థాలు ఏవిటో వివరిస్తాడు.

ప్రాగ్రూప విమర్శ ప్రకారం ఒక గ్రంథం పుట్టిన కాలానికీ ఆ గ్రంథానికీ సంబంధంలేదు. రచయిత భావజాల దృక్పథం కూడా రచనను ప్రభావితం చేయదు. ప్రాగ్రూప విమర్శ రచనను దాని కాలం మంచీ, సమకాలీన భావాల నుంచీ, రచయిత భావజాలం నుంచీ వేరు చేస్తుంది. శాస్త్రీయంగా చెప్పాలంటే ప్రాగ్రూప విమర్శ చారిత్రక విమర్శకు దాదాపు పూర్తిగా వ్యతిరేకమైంది. యూంగ్, ఫ్రై చెప్పిన "ప్రాగ్రూప చట్రాలు" ఉన్న మాట నిజమే. కానీ రచయిత సృజన శక్తి పూర్తిగా ఆ చట్రాల పరిధిలోపలే పనిచేస్తుందని చెప్పటం అతిశయోక్తి మాత్రమే. ప్రాగ్రూప విమర్శకు భావాల మూలాల వద్దకు వెళ్ళగలిగిన శక్తి - కొంతవరకు మాత్రమే-ఉంది. కానీ ప్రాగ్రూప విశ్లేణలో ఒక ప్రమాదం కూడా ఉంది. విమర్శకునికి జాగ్రత్త తక్కువైనా, ప్రాగ్రూపాల మీద ఎక్కువ గౌరవమూ అభిమానమూ ఉన్నా అన్ని పాత్రలూ, అన్ని సంఘటనలూ, అన్ని వస్తువులూ ప్రాగ్రూపులుగా కనిపించవచ్చు. అప్పుడు రచయిత ఉద్దేశాలకు హాని కలగవచ్చు. రచనలోని సాహిత్యకతే (Literarians) నిరాదరణ గురికావచ్చు.

**4. ప్రాచీన సాహిత్యంలో ప్రాగ్రూపాలు:**

సంస్కృతాంధ్ర ప్రాచీన సాహిత్యంలో లెక్కలేనన్ని ప్రాగ్రూపాలు కనిపిస్తాయి. సృష్టిలో అధర్మం పెరిగినప్పుడు ప్రళయం వస్తుందనీ, ప్రపంచం అంతా నాశనం అవుతుందని, మహాపురుషులుమాత్రం ప్రళయం నుండి తప్పించుకొని పునఃసృష్టికి కారకులవుతారని తెలిపే ప్రాగ్రూపాలు ప్రపంచవ్యాప్తంగా ఉన్నాయి. ఈ ప్రాగ్రూపాలు ప్రాచీన, ఆధునిక, జానపద, ఆటవికుల సాహిత్యంలోని ప్రవేశించాయి. మత్స్యపురాణంలో, భాగవతంలో మత్స్యరూపంలోని విష్ణువు ఆదేశం ప్రకారం సత్యవ్రతుడు

ప్రళయం వచ్చినప్పుడు ఒక నావలో సర్వపదార్థాలను, సత్వాలను భద్రపరచుకొని ప్రళయం తర్వాత వాటితోనే పునఃసృష్టి కావించినట్లు చెప్పబడింది. ఇలాంటివి ప్రతిపురాణం, కావ్యం ప్రబంధం, స్మృతి, శ్రుతి గ్రంథాల్లో విరివిగా కనిపిస్తాయి. ఈ ఒరవడే ఆధునిక సాహిత్యంలోకి ప్రవేశించింది.

**5. ఆధునిక సాహిత్యంలో ప్రాగ్రూపాలు:**

అధర్మం ప్రబలినపుడు పాపులను భగవచ్ఛక్తి అంతమొందిస్తుందని, ప్రళయం వస్తుందని, సర్వం నాశనమవుతుందని తిరిగి పునఃసృష్టి ప్రారంభమవుతుంధని అభ్యుదయ కవి శ్రీశ్రీ తన అవతారం కవితాఖండికలో ఇలా తెలిపాడు.

**'కనకదుర్గ చండ సింహం జూలు దులిపి, ఆవులించింది. ఇంద్రదేవుని మదపుటేనుగు ఘీంకరిస్తూ సవాల్ చేసింది! నందికేశుడు రంకెలేస్తూ – గరిగ దోలును కదిపిగంతేడు'** –అంటాడు.

రాక్షస శక్తుల్లాంటి దౌర్జన్యపరులు విజృంభించినపుడు ప్రజాశక్తి ఆదిశక్తిలా వారిని అంతమొందిస్తుందనీ, కనకదుర్గ వాహనం సింహం. ఇంద్రదేవుని వాహనం ఐరావతం కూడా రాక్షసశక్తులను ఎదుర్కొంటాయని శ్రీశ్రీ పౌరాణిక ప్రతీకలతో సూచించాడు. లయకారుడైన పరమశివుని వాహనం నందికేశుడు గంగడోలును కదిపి గంతు లేయడంతో ప్రళయం పరిసమాప్తం అవుతుందని తెలియజేస్తాడు.

**6. విరుద్ధ దృక్పథ ప్రాగ్రూపాలు:**

సమాజంలో మార్పులు సంభవించేకొలది స్థిరమైన ప్రాగ్రూపాలకు విరుద్ధ భావాలను ఆపాదించడానికి, పౌరాణిక పాత్రల ప్రతీకలను రూపుమాపడానికీ, సంప్రదాయాన్ని ధిక్కరిస్తూ కొంతమంది రచనలు చేశారు. రంగనాయకమ్మ 'రామాయణ విషవృక్షం' నార్ల 'నరకంలో హరిశ్చంద్రుడు', ' సీత జ్యోస్యం', త్రిపురనేని రామస్వామి చౌదరి 'ఖూనీ', 'శంబూకవధ', 'భగవద్గీత', చలం 'సావిత్రి' వంటి రచనలు ప్రాగ్రూప విశ్వాసాలకు విరుద్ధంగా రాయబడ్డాయి.

భాగవతం ప్రకారం విష్ణువు వామనావతారంతో బలిచక్రవర్తిని మూడడుగులు దానం అడిగే నెపంతో పాతాళానికి తొక్కివేస్తాడు. అయితే ఈ ప్రాగ్రూపాన్ని త్రిపురనేని రామస్వామి చౌదరి తిరగరాశాడు. మనిషి నాచేత బలిచక్రవర్తిని చంపించాడని, అది తప్పని, నాకు బలికి ఎలాంటి ద్వేషం లేదని, అసలు ఎందుకుంటుందని ప్రశ్నించినట్లు రామస్వామి ఇలా రాశాడు.

**బలియే పాపముఁజేసినాడని అతనిపై వైరంబు నాకేల? త**
**ద్బలి రాజ్యంబు హరింప వంచకుండనై ధర్మంబుఁబో ద్రోసిదో**
**ర్బల హీనుండగు నింద్రుఁ బ్రోవనవతారంబెత్తినానంచుతో**
**కులునమ్మన్ వచియింతు వింకయినబొంకుల్ మానవా? మానవా?**

అంటాడు. బలిచక్రవర్తికి తనకు ఎలాంటి విరోధం లేదంటాడు విష్ణువు. భావవిప్లవచైతన్య సృష్టి కర్త అయిన రామస్వామి చౌదరి అలా విష్ణువుచేత ప్రకటింపజేస్తాడు. అయితే అనుకూల భావం, ప్రతికూల భావం చెప్పడానికి ప్రాచీన, ఆధునిక కవులు ప్రాగ్రూపాలను వినియోగించు కుంటున్నారు. ఈ ప్రాగ్రూప విమర్శ ద్వారా ఒక రచనలోని ఆధ్యాత్మిక, తాత్విక, సాంస్కృతిక, చారిత్రక, సాంఘికాంశాలు స్పష్టంగా బయట పడతాయి.

**ఉపయుక్త గ్రంథాలు**

1. సాహిత్య విమర్శ – (సం) ఆచార్య యస్వీ రామారావు, డా॥ బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయ ప్రచురణ, హైదరాబాద్, 2005
2. సాహిత్య వివేచన – అచార్య చేకూరి రామారావు, ప్రచురణ : డా॥ బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం, హైదరాబాద్, 2015
3. సాహిత్య భావలహరి – ఆచార్య యస్వీ జోగారావు, ప్రచురణ : తెలుగు అకాడెమి, హైదరాబాద్, 1985
4. ప్రౌఢ్య నిఘంటువు,ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి, హైదరాబాద్, 1983
5. మహాప్రస్థానం – శ్రీశ్రీ, ప్రచురణ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్, 1980
6. శతకాలు – గీతాలు – త్రిపురనేని రామస్వామి చౌదరి, ప్రచురణ : సరళా పబ్లికేషన్స్, తెనాలి, 1965

*****

# తెలుగు భాషా, సాహిత్యాలకు పాశ్చాత్యుల కృషి

డా॥ భూక్య తిరుపతి
అసోసియేట్ ప్రొఫెసర్
తెలుగు & అనువాద అధ్యయన శాఖ
ద్రావిడ విశ్వవిద్యాలయం, కుప్పం

**పరిచయం**

ప్రాఙ్నన్నయ కాలం నుండి తెలుగు భాషా, సాహిత్యాలు దినదినాభివృద్ధి చెందుతూనే ఉన్నాయి. రోజురోజుకు కొత్త కొత్త పదాలు భాషలో నుండి ఉద్భవిస్తూనే ఉన్నాయి. ప్రాఙ్నన్నయ కాలం నుండి తెలుగు సాహిత్య పరిశోధకులు, వివిధ రకాలుగా సాహిత్య యుగ విభజన చేశారు. రాబోవు రోజులలో కూడా ఇంకా మరో కోణంలో కూడా విభజిస్తారు. ప్రస్తుతం తెలుగు భాషకున్నంత పద సంపద నన్నయ భారతాంధ్రీకరణ కాలంలో లేకపోయినప్పటికి, నన్నయ రెండున్న పర్వాల భారతాన్ని తెలుగులోకి ఆంధ్రీకరించి తెలుగు భాషాభివృద్ధికి పునాది వేశాడు. అప్పటినుండి ప్రారంభమైన తెలుగు సాహిత్య రచన వివిధ కవుల సాహిత్య రచనల ద్వారా అభివృద్ధి చెందుతూనే ఉన్నది. అయితే ప్రాచీన కవుల రచనలు అన్ని తాటాకుల పైన, రాగి రేకుల పైన శిలా శాసనాల పైన వివిధ రూపాలలో గ్రంథస్థమైనది. భారతదేశానికి వచ్చిన పాశ్చాత్యుల మూలంగా తెలుగు భాషపై విస్తృత స్థాయిలో శాస్త్రీయ పద్ధతిలో పరిశోధనలు జరిగినవి. ప్రారంభ కాలంలో వాటి ఆధారంగా పాఠకలోకానికి తెలుగు భాషకు సంబంధించిన అనేక విషయాలు తెలుస్తున్నాయి.

క్రీ.శ. 16వ శతాబ్దంలో పాశ్చాత్యులు తమ స్థావరాల్ని ఆంధ్ర రాష్ట్రంలో మచిలీపట్నం ప్రాంతంలో ఏర్పాటు చేసుకున్నారు. వారి వర్తక వ్యాపారాల కోసం మచిలీపట్నంలో డచ్చివారు, ఫ్రెంచివారు తరువాత ఆంగ్లేయులు వ్యాపారాలు చేసేవాళ్ళు. వీరి రాకతో వ్యాపారంతోపాటు, ఆంధ్ర ప్రాంతంలో క్రైస్తవమత వ్యాప్తి, తెలుగు భాషా సాహిత్యాలపై విశేష ప్రభావం చూపింది. ఆ కాలంలోనే ముఖ్యంగా ఆంగ్లేయుల కాలంలో తెలుగు వారికి క్రైస్తవమత దీక్ష ఇప్పించి ఆంగ్ల భాష నేర్పించి, వారి సహాయంతో క్రైస్తవమత గ్రంథం బైబిల్‌ను తెలుగులోకి అనువాదం చేయించారు.

భారతదేశానికి వచ్చే పాశ్చాత్యులు భారతదేశంలోని ఏ రెండూ భాషలనైనా కనీసం నేర్చుకోవాలి అనే నిబంధన ఉండేది. అయితే ఆనాడు తెలుగును నేర్చుకున్న పాశ్చాత్యులలో మూడు వర్గాల వారు ఉన్నారు. వారు (1) క్రైస్తవమత వ్యాప్తికై తెలుగును నేర్చుకొన్నవారు. (2) ఉద్యోగ ధర్మాన్ని అనుసరించి వాణిజ్యాభివృద్ధిని కాంక్షించి వ్యావహారిక పరిజ్ఞానంతో తృప్తిపడి తెలుగు నేర్చుకొన్నవారు. (3) తెలుగుపై భాషాభిమానాన్ని పెంచుకొని విశేషకృషి చేసినవారు. పైన పేర్కొన్న మూడవ వర్గం వారి మూలంగానే తెలుగు భాషకు మహోపకారం జరిగింది. వారిలో ప్రముఖులు సి.పి.బ్రౌన్ దొర, మెకంజీ, కాంబెల్, ఛార్లెస్ ఇ. గోవర్స్. టి. బరో, ఎం.బి. ఎమెనో, జె.ఎ. బోయల్స్, బిషప్ కాల్డెవెల్, కేప్టన్ ఎం. డబ్ల్యు మొదలైనవారు ఉన్నారు.

పాశ్చాత్యుల కాలంలో మరీ ముఖ్యంగా క్షీణ యుగంలో క్రీ.శ. 1806లో అచ్చు అక్షరాలు తయారు చేయించారు. ఇదే విషయాన్ని "క్షీణయుగమున పండిత వేద్యమైన కవిత ప్రజాపరమై సభా గౌరవమును చూరగొన్నది. తాటాకు పత్రముల నుండి భూర్జపత్రములకు, కాగితాలకు వ్యాపించినది. క్రీ.శ. 1806లో తెలుగు అచ్చు అక్షరములను తయారు చేసినారు. క్రీ.శ. 1817లో తెలుగు లిపిలో అచ్చయిన మొదటి గ్రంథము శబ్దమంజరి. క్రీ.శ. 1834 నాటికి తెలుగు గ్రంథాలు అసంఖ్యాకముగ అచ్చయినవి. అందువలన ఎక్కువమంది చదువుటకు వీలయినది. సంస్కృత గ్రంథములతో

పాటు తెలుగు గ్రంథములపై అభిమానం హెచ్చినది. మెకంజీ, బ్రౌన్ వంటి పాశ్చాత్య పండితుల కృషివలన ప్రాచీన గ్రంథములనేకములు సేకరించి భద్రపరచుట జరిగినది" అని డా॥ జి. నాగయ్యగారు పేర్కొన్నారు.

అదే కాలంలోనే తెలుగు నిఘంటువులు, వ్యాకరణ గ్రంథాలు, పురాణ ఇతిహాస గ్రంథాలు అనేకం వెలుగులోకి వచ్చాయి. అలాగే భారతదేశంలోని భాషాకుటుంబాలు, ద్రావిడ భాషల వ్యాప్తి, ఆంగ్ల భాషలకు ద్రావిడ భాషలకు ఉన్న తేడాలు, తెలుగు భాష ఆర్య భాషా కుటుంబానికి చెందినది కాదని, ఇది ద్రావిడ భాషా కుటుంబానికి చెందినదని తెలియజేశారు. వాటికి సంబంధించిన స్పష్టమైన ఆకరాలను చూపించారు. ఇదే విషయాన్ని ఆరుద్రగారు ఈ విధంగా ప్రస్తావించారు. "తెల్లవాళ్ళ వల్ల మనదేశానికి రాజకీయంగా ఎన్నో అనర్థాలు వచ్చినా, సాహిత్య సాంస్కృతిక రంగాలలో చాలా మేళ్ళు కలిగాయి. ఒక్కొక్క దేశ భాషకు కొందరు తెల్లవాళ్ళు మళ్ళా ప్రాణం పోశారు. నిఘంటువులు, వ్యాకరణాలు, వాచకాలు వ్రాశారు, వ్రాయించారు. అచ్చు కూటాలు నెలకొల్పారు. మూలమూలలలో ఉండే వ్రాతప్రతులను ఒక దగ్గర సమీకరించారు. గ్రంథాలను ప్రచురించారు. గ్రంథాలయాలను స్థాపించారు. మన పాత చరిత్రను అక్షరాలా తవ్వి పైకి తెచ్చారు. పురాతన శిల్పాలను కనిపెట్టారు. ప్రపంచానికి మన భాషల గురించీ, సంస్కృతి గురించి చాటి చెప్పారు" అని అన్నారు.

మెకంజీ దొరను భారతీయ గణిత శాస్త్రం మీద విస్తృత పరిశోధనలు చేయాలనే ఆలోచనే తనని భారతదేశానికి తీసుకువచ్చింది. వీరి గురించి ఆరుద్రగారు ఇలా అన్నారు "లూయిస్ దీపానికి ఆ రోజుల్లో లార్డు ఫ్రాన్సిస్‌గారు ప్రభువులు. ఆ వంశంలోని వాళ్ళను నేపియర్ ప్రభువులని పిలుస్తారు. వీళ్ళ మూల పురుషుడు జాన్ నేపియర్ గొప్ప గణిత శాస్త్రజ్ఞుడు. ఈయన "లాగర్దామ్స్" ఘాథాంశాలను కనిపెట్టిన మేధావి. వీరికి అయిదవ తరంలోని మనుమడు ఫ్రాన్సిస్ దొరగారు తమ పూర్వీకుని జీవిత చరిత్రను వ్రాయదలిచారు. అందులో హిందువుల గురించి ప్రస్తావించాలి. ఆ అంశంమీద పరిశోధనలు జరపడానికి ఫ్రాన్సిస్ దొరగారు కాలిన్ మెకంజీ సమర్థుడని భావించారు. ఆ పనిలో నియోగించారు. స్టార్నవె గ్రామానికి కమ్‌ప్ట్రోలర్‌గా మెకంజీ ఆ రోజుల్లో పనిచేస్తూ ఉండేవారు. పరిశోధనా పిపాస పెరిగిన మెకంజీగారు చేస్తున్న ఉద్యోగానికి రెండేసి నెలలు, మూడేసి, నాలుగేసి నెలలు సెలవు పెట్టి గ్రంథ పఠనమునూ, విషయ సేకరణలోనూ పడ్డారు. మూడేళ్ళపాటు ముమ్మరంగా ఈ వ్యాసంగం సాగింది. అయితే దురదృష్టవశాత్తు ఫ్రాన్సిస్ ప్రభువు మరణించారు. ఆయన చనిపోయినా మెకంజీలో ఆయన నాటిన విజ్ఞానాంకురం చనిపోలేదు. తాను స్కాట్లండులో హిందువుల గణితంపై ప్రారంభించిన పరిశోధనలను భారతదేశంలోనే కొనసాగించాలని మెకంజీ నిశ్చయించుకొన్నారు" అని అన్నారు.

మెకంజీ భారతదేశానికి వచ్చిన తరువాత మధురకు వెళ్ళి, అక్కడ ఫ్రాన్సిస్ కుమార్తె అయిన హెస్టర్ దొరసాని ఇంట్లో అతిథిగా దాదాపు పదమూడు సంవత్సరాలు ఉన్నారు. అక్కడ హెస్టర్ దొరసాని తన ఇంట్లో ఒక పండిత కేంద్రాన్ని, నిష్ణాతులైన బ్రాహ్మణ విద్వాంసులతో ఒక సభను నడుపుతుండేది. భారతదేశంలోని వివిధ ప్రాంతాల్లో ఉన్న గణితశాస్త్రానికి సంబంధించిన గ్రంథాలు సేకరించేవారు. వాటిని క్రోడీకరించేది. ఇక్కడే ఉంటున్న మెకంజీ దొరగారు భారతదేశంలోని ప్రాంతాలు సర్వే చేయాలని, దేశ చరిత్రను తెలుసుకోవాలనే ఆలోచన కల్గింది. భారతదేశానికి వచ్చిన ఇతను మొదట్లో దిండిగళ్, కోయంబత్తూరు ప్రాంతాలకు బదిలీ మీద వెళ్ళాడు. అక్కడినుండి నెల్లూరు, ఒంగోలు మార్గాలకు సర్వే చేస్తున్న కాలంలో చినబళ్ళ పడేరు చెప్పిన కంభం కైఫీయతులను మెకంజీ రాసుకునేవారు. అలాగే నెల్లూరు కచేరిలో ఉన్న పత్రాలను చదివి వాటిని క్రోడీకరించారు. కడప, కర్నూలు జిల్లాలో పర్యటించి నిజాం ప్రాంతపు భూముల్లో ఉన్న ఖనిజాలు, వజ్రాలకు సంబంధించిన ఆకరాలను సేకరించారు. సేకరించిన విషయాల్ని ఏషియాటిక్

రీసెర్చెస్ పత్రికలో శ్రీశైలం ఆలయ విషయాలు, అమరావతి స్థూప విషయాలు, దక్షిణ భారతదేశంలోని జైనస్థానాల వివరణలు ప్రచురించారు.

మెకంజీ, బ్రౌన్‌ల కాలంలోనే 'డాక్టర్ లాడెన్' ఉద్యోగిగా 1803లో మద్రాస్ వచ్చాడు. దాదాపుగా తొమ్మిది సంవత్సరాలు వివిధ ప్రాంతాలు పర్యటించి తెలుగు, తమిళ, కన్నడ భాషా గ్రంథాలను సేకరించారు మైసూర్ ప్రాంత పర్యటన సమయంలో ప్రకృతి శాస్త్రం మీద పరిశోధనలు చేశారు. ఆ ప్రాంతంలో ఉన్న కొండలు, అక్కడ దొరికే ఖనిజాలు, లోహాలు వాటితో ఎటువంటి రోగాలు తగ్గుతాయో అనే విషయం మీద విశేషమైన కృషి చేశారు. అలాగే సీమ ప్రాంతంలో పర్యటించినప్పుడు అక్కడ పండే పంటలు, కాయలు, కార్తెలూ, ఆ ప్రాంతంలో మాట్లాడే భాషలు, వాటి వివరాలు తెలుసుకునేవారు. శ్రీరంగపట్నంలో ఉన్నప్పుడు సంస్కృత భాషను నేర్చుకొని కథలను అనువాదం చేశారు. తాను తిరిగిన ప్రతి ప్రదేశంలోను శాసనాలు భారతీయుల చరిత్ర, ఆచారాలు, మత నియమాలు మొదలైన విషయాలు తెలుసుకునేవారు. తన జీవిత కాలంలో సేకరించిన విషయాలను క్రీ.శ. 1875లో లాడేన్ గారి కవితలు, కథాగేయాలు గ్రంథరూపంలో ప్రచురితమైనాయి.

డేవిడ్ బ్రౌన్, మిస్ ఫ్రాన్సిస్ కౌలేల ద్వితీయ పుత్రుడు ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్. బ్రౌన్ చిన్నతనంలోనే హీబ్రూ, సిరియన్, అరబ్బీ, పారశీక, గ్రీకు, లాటిన్ భాషలతో పాటు సంస్కృతం రాయడం చదవడం నేర్చుకున్నారు. తండ్రి దగ్గరే గ్రంథ పరిష్కరణలో శిక్షణ పొందాడు. ఇది అతనికి తరువాత కాలంలో ఆంధ్ర సాహిత్య పరిష్కారానికి బాగా ఉపయోగపడింది.

సి.పి. బ్రౌన్ 1817లో మద్రాస్ సివిల్ సర్వీసులో రైటర్‌గా మొదటిసారిగా ఉద్యోగంలో చేరారు. మద్రాసులో ఉద్యోగం చేస్తూనే కోదండరామ పంతులు వద్ద తెలుగు నేర్చుకొన్నారు. 1820లో కడపజిల్లా డిప్యూటి కలెక్టర్‌గా బదిలీ అయ్యారు. ఉద్యోగరీత్యా అనేక ప్రాంతాల్లో పనిచేసినప్పుడు తెలుగులో మాట్లాడటం తప్పనిసరి అయ్యింది. 1822లో కడప నుండి మచిలీపట్నం జిల్లాకు బదిలీ అయ్యారు. అక్కడినుండి తిరిగి మద్రాస్‌కు వచ్చారు. అక్కడ "హిందువుల ఆచారాలు" అనే గ్రంథం ఇతనికి లభించింది. ఆ పుస్తకాన్ని తన వెంట తీసుకెళ్ళారు. అందులో అతనికి తెలియని అనేక విషయాలు కనిపించాయి. ఆ పుస్తకం చదువుతుంటే కడపజిల్లాలో ఒక గొప్ప కవి ఉన్నాడని తెలిసింది. అప్పుడే వేమన గురించి సి.పి.బ్రౌన్ అన్వేషిస్తే ఇతను రెడ్డి కులానికి చెందినవాడని 17వ శతాబ్ది కవియని, తాత్త్విక కవని అర్థమైంది. అప్పుడు వేమన ప్రతుల్ని సేకరించి కాగితాల మీదికి రాయించి వాటిని 1824లో ఆంగ్లంలోకి అనువదించాడు. ఇతనికి రాజమండ్రిలో ములుపాత బుచ్చయ్యశాస్త్రితో పరిచయం ఏర్పడింది. అతను రచించిన వెంకటేశ్వర మాహాత్మ్యం, మాఘమాహాత్మ్యం కావ్యాలను చదివి, అతని దగ్గరే ఛందస్సు నేర్చుకొన్నాడు. తదనంతరం విష్ణుపురాణం, పద్మపురాణాన్ని ప్రత్యేకంగా చదివారు.

కావ్యాలను చదువుతున్నప్పుడు బ్రౌన్‌గారికి ఒక ఆలోచన వచ్చింది. ఇప్పటివరకు కాలేజీ బోర్డు వారు తెలుగును అభ్యసించడానికి వీలుగా వ్యాకరణాలు, నిఘంటువులు, పదకోశాలు మొదలైన వాటిని సెలక్షన్లూ ప్రకటిస్తున్నారే తప్ప తెలుగు కావ్యాల పరిచయం పూర్తిగా తెలుసుకోవడానికి ఆంగ్లేయులకు ఉపయోగపడే ఛందోగ్రంథాలు మద్రాసు కాలేజీవారు ఇంతవరకు ప్రకటించలేదు అని ఆలోచించి ఆ కార్యానికీ తానే పూనుకొన్నాడు. అప్పుడే 'Analysis of Telugu Prosody' అనే రచనను చేశారు. 1825లో 'ఆంధ్ర గీర్వాచ్ఛందసు' అనే తెలుగుపేరుతో "The Prosody of the Telugu and Sanskrit Languages Explained" అనే గ్రంథాన్ని రచించారు. కడపలో ఉన్నప్పుడు సాహిత్య కార్యక్రమాలు నిర్వహించారు. ఆంధ్ర గిర్వాణ ఛందంలో బ్రౌన్ తెలుగు సాహిత్యాన్ని చదువవలసిన క్రమాన్ని ప్రత్యేకంగా

వివరించారు. ప్రతి వ్యక్తి వేమన పద్యాలు చదవాలి. వీటి తరువాత చక్రవర్తి రాఘవాచార్యులు గారి 'నల చరిత్ర' అనే ద్విపద కావ్యంలో ఉన్న కథ చదవాలి. ఆ తరువాత రంగనాథ రామాయణం చదవాలి. వీటి తరువాత ఆంధ్ర మహాభారతంలోని పద్యాలు, భాగవత అష్టమ, దశమ స్కంధాలు అధ్యయనం చేయాలని అన్నారు. ఆ తరువాత అలంకార కావ్యాలు తారాశశాంకం, సుభద్రా పరిణయం, మనుచరిత్ర, దశావతార చరిత్ర, హంసవింశతి వంటివి చదవాలి వాటన్నిటి తరువాత రాఘవ పాండవీయం, నైషధం, విష్ణుచిత్తీయం చదివి చివర్లో వసుచరిత్ర చదవాలని అన్నారు.

తెలుగు భాషకు చక్కని నిఘంటువు తయారు చేయాలని నిర్ణయించుకొన్నారు. అప్పటికే ఉన్న కాంబెల్ నిఘంటువులో మధ్యలో తెల్లకాగితాలు చేర్చి బైండింగ్ చేయించేవారు. తెల్ల కాగితాలపై కొత్త పదాలు రాసేవారు. ఇలా రాసినవి మొత్తం సుమారుగా నాలుగువేల పదాల వరకు ఉన్నాయి. ఆంధ్ర సాహిత్య వ్యాసంగాన్ని ఆరంభించిన నాటి నుంచి తన జీవితాంతం వరకూ గ్రంథ సేకరణ ఒక పవిత్రమైన కర్తవ్యంగా భావించి అనేక సంపుటాలను సంపాదించేవారు. క్రీ.శ. 1830లో భారతీయ హిందువులు ఎక్కువగా ఇష్టపడే సరుకుల మీద ఒక వాణిజ్య వ్యాసాన్ని కూడా రాశారు. ఇది బెంగాల్ పత్రికలోను, అమెరికన్ పత్రికలో ప్రచురితమైంది. హిందువుల ఆచార వ్యవహారాల మీద ఒక వ్యాసం రాశారు. 1835లో "A Grammar of the Telugu Language" అనే పేరుతో ఇంగ్లీషులో ఆంధ్ర వ్యాకరణాన్ని, సంస్కృత ఛందస్సు గురించి "A Familiar Analysis of Sanskrit Prosody" అనే పేరుతో వ్యాసాన్ని ఏషియాటిక్ జర్నల్‌లో ప్రచురించారు. తెలుగు కన్నడ గ్రంథాలకు కేటలాగులు తయారుచేశారు. 1842-1850 వరకు పల్నాటి వీరచరిత్ర ప్రతిని పరిష్కరించారు.

ఛార్లెస్ ఇ. గోవర్ తమిళ, మలయాళం, బడగ, కన్నడం, కొడగు భాషలలో జానపద గేయాలు సేకరించి "Folk Songs of Southern India" అనే పేరుతో గ్రంథాన్ని రచించారు. ఇందులో వేమన పద్యాలున్నాయి. జె.ఎ. బోయల్ 1874లో రాయలసీమలో ఉద్యోగిగా ఉన్నప్పుడు తన అధికారక పర్యటనల్లో గ్రామాల్ని సందర్శించినప్పుడు రాత్రి సమయాల్లో పల్లె ప్రజలు పాడే పాటల్ని వాటి తాలుకూ సంగీతాన్ని వింటూ ఉండేవాడు. కెప్టెన్ ఎం. డబ్ల్యూ కౌర్ 'ఆంధ్ర లోకోక్తి చంద్రిక' అనే పేరుతో తెలుగు సామెతలు సేకరించి ప్రచురించాడు. ఎం.బి. ఎమెనొ, టి. బరో మొదలైన వారు ద్రావిడ భాషల మీద విశేషమైన కృషి చేశారు. ఈ విధంగా పాశ్చాత్యులు తెలుగు భాషా సాహిత్యాభివృద్ధికి ప్రారంభ కాలంలో ముఖ్యంగా క్షీణయుగాలలో విశేషమైన కృషిచేశారు.

**ఆధార గ్రంథాలు**

1) ఆరుద్ర - సమగ్ర ఆంధ్ర సాహిత్యం.
2) జి. నాగయ్య - తెలుగు సాహిత్య సమీక్ష.
3) మెకంజీ కైఫీయత్తులు - మొదటి భాగం, సి.పి.బ్రౌన్ మెమోరియల్ ట్రస్ట్, కడప.
4) ప్రతిభామూర్తుల జీవిత చరిత్రలు - తెలుగు మణిదీపాలు, కృష్ణాజిల్లా రచయితల సంఘం.
5) పి.ఎస్. సుబ్రహ్మణ్యం - ద్రావిడ భాషలు.
6) ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి - తెలుగు భాషా చరిత్ర.



# శ్రీకాళహస్తి మాహాత్మ్య ప్రబంధం – సాంస్కృతిక ప్రసరణం

డా॥ డి. ఉదయకుమారి
కేంద్రాధ్యక్షులు, అసోసియేట్ ప్రొఫెసర్ & డిప్యూటి డైరెక్టర్
ప్రచురణల కేంద్రం
ద్రావిడ విశ్వవిద్యాలయం, కుప్పం

డా॥ వి. పళని
అసిస్టెంట్ ప్రొఫెసర్
తెలుగు & అనువాద అధ్యయనశాఖ
ద్రావిడ విశ్వవిద్యాలయం, కుప్పం

ప్రబంధం తెలుగువారి మొట్టమొదటి స్వతంత్ర రచన. ప్రబంధాలు అనువాద రచనలు కావు. తెలుగు ప్రబంధాలకు సంస్కృతంలోని మహాకావ్య లక్షణాలకు వస్తు స్వీకృతి, వర్ణనా చమత్కృతి వంటి అనేక సారూప్యతలు ఉన్నప్పటికీ అనేక వైరుధ్యాలు కూడా ఉన్నాయి. సంస్కృత మహాకావ్యాలు ఒక్కొక్క సర్గ ఒక్కొక్క ఛందస్సులో ఉంటే తెలుగు ప్రబంధాలు ప్రతి ఆశ్వాసము ఛందో వైవిధ్యాన్ని కలిగిఉన్నాయి. మహా కావ్యాలు పద్య కావ్యాలు, ప్రబంధాలు గద్య పద్యోభయమైన చంపువులు. మహాకావ్యాల్లో వీర, శృంగారాల్లో ఒకటి అంగి రసంగా ఉంటే ప్రబంధాల్లో భక్తి, శాంత, శృంగార రసాల్లో ఒక్కటి అంగిరసంగా ఉంది.

అయితే ఈ రెండింటి నిగూఢ తత్త్వంలో మాత్రం విశిష్టమైన భారతీయ సాంస్కృతిక ప్రసరణ మాత్రం సమానంగా దర్శనమిస్తుంది. భారతీయ సంస్కృతీ మహా వృక్షానికి వేసిన తెలుగు సంస్కృతీ శాఖలో పూసిన స్వేచ్ఛాసుమం ప్రబంధం. సంస్కృతి అంటే ఒక జాతి జీవన సర్వస్వం. ఇది లౌకికము, పారమార్థికమని రెండు విధాలు. సంస్కృత సాహిత్యంలోని వైదిక, లౌకిక వాఙ్మయాలు రెండూ భారతీయ సంస్కృతికి దర్పణాలుగా నిలుస్తున్నాయి.

ఇక, ధూర్జటి మహాకవి రచించిన శ్రీకాళహస్తి మాహాత్మ్యం బహుముఖంగా సంస్కృతిని ప్రతిబింబిస్తూ ఉంది. ధూర్జటి ఇతివృత్త స్వీకృతిలోనే సాంస్కృతిక ప్రసరణకు తగిన రంగాన్ని సిద్ధం చేసుకున్నాడు.

ఇతివృత్తం ప్రఖ్యాతం, కల్పితం, మిశ్రమం అని మూడు విధాలుగా రామరాజభూషణుడు పేర్కొన్నాడు. (1–19) 'కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నము లాద్య సత్కథల్ వావిరిఁ బుట్టు రత్నములవారిత సత్కవి కల్పనా విభూషావహ పూర్వవృత్తములు సానలఁ దీరిన జాతి రత్నముల్" అంటే కేవల కల్పనాకథలు, ఆద్య సత్కథలు (ప్రాచీన పురాణేతిహాస కథలు) కాకుండా పూర్వ కథలు అనే వావిరి పుట్టు రత్నములకు కల్పనలతో మెరుగులు పెట్టి, వర్ణనలతో పెంచి పోషించి రచించిన ప్రబంధమే సానబెట్టిన రత్నమని భట్టుమూర్తి అభిప్రాయం.

ధూర్జటి మహాకవి కాళహస్తి మాహాత్మ్య ప్రబంధం కోసం తీసుకున్న కథ శివరహస్యఖండంలో ఉంది. శ్రీకాళహస్తి మాహాత్మ్య వృత్తాంతం పురాణ ప్రోక్తమైందని ధూర్జటి స్పష్టంగా చెప్పాడు. "అణిమాది ప్రదమై పురాణ కథితంబై మోక్షదంబైన దక్షిణ కైలాసము'' (1–97). భారతీయుల పారమార్థిక సంస్కృతిలోని నిగూఢమైన శివతత్త్వాన్ని, గహనమైన ఆధ్యాత్మిక చింతనను ఈ పురాణం ఆవిష్కరిస్తూ ఉంది. శివ రహస్యఖండంలోని శ్రీకాళహస్తి స్థల మాహాత్మ్యాన్ని దాదాపు 80 ఏళ్లకు ముందే శృంగేరి మఠానికి చెందిన శ్రీ విమలానంద తీర్థస్వామి తెలుగులోకి అనువదించారు. 30 ఏళ్లకు ముందే ఇది అచ్చయింది కూడా. (శ్రీకాళహస్తి స్థల మాహాత్మ్యము (శివరహస్య ఖండము) శ్రీశ్రీశ్రీ విమలానంద తీర్థస్వామి, శృంగేరి మఠం–1984, ఎ.జి. ప్రసూన, 144, టి.నగర్ తిరుపతి)

ఇక ధూర్జటి, తాను స్వీకరించిన ఇతివృత్తానికి మరింత సానబెట్టి ప్రబంధ రత్నంగా మలిచాడు. ఇది క్షేత్ర మాహాత్మ్యమైనప్పటికీ ప్రబంధ లక్షణాలకు ప్రమాదం కలగని విధంగా ధూర్జటి చేసిన కథా నిర్వహణం అతని ప్రతిభకు నికషోపలమని చెప్పక తప్పదు. ఇతివృత్త నిర్వహణలో కూడా శివ మహాత్మ్యాన్ని సాక్షాత్తు శంకరుడు వివరించడం ద్వారా ముఖ, ప్రతిముఖ సంధులకు బీజంవేశాడు. దివ్య నాయకుడైన శివుని మహత్మ్యాన్ని, భక్త జన సంరక్షణా కారుణ్య హృదయాన్ని ఆవిష్కరించడం ద్వారా ఫలప్రాప్తి సూచన చేస్తూ గర్భ, అవమర్శ సంధులను సాధించాడు. కథాగమనంలో అనావశ్యకమైన శుష్క ప్రసంగాల జోలికి పోకుండా కథలన్నీ శ్రీకాళహస్తిలో సమసింపచేయడం ద్వారా ఏకసూత్రతను

సాధించాడు. ఇక భక్తులకు శ్రీకాళహస్తీశ్వరుడు శ్రేయస్సును ప్రసాదించడం ఫలప్రాప్తిని సాధిస్తున్నది. మొత్తంగా శ్రీకాళహస్తి మహాత్మ్యంలోని ఇతివృత్తం భారతీయుల పారమార్థిక సంస్కృతికి ఆలవాలంగా నిలుస్తున్నది.

వర్ణనలు ప్రబంధాలకు జీవగర్ర. అయితే ఇవి అతిగా విస్తరించి నీరసించకుండా ప్రబంధ సౌష్టవాన్ని పరిరక్షించే విధంగా అలంకార చమత్కృతులతో సౌందర్యాన్ని సాధించాలి. అంతేకాకుండా, వర్ణనలు కవి ప్రతిభకు గీటురాళ్లు. ఆయనకున్న శాస్త్ర వైదుష్యాన్ని, లోకానుభవాన్ని, భాషా పాటవాన్ని, కల్పనా శక్తిని, పరిశీలనా దృష్టిని వర్ణనలు కూడా వెల్లడిస్తాయి. అంతేకాకుండా కవికి సంస్కృతి పట్ల గల అవగాహనకు కూడా వర్ణనలు కొలమానాలు. కాళిదాస మహాకవి రఘువంశ మహాకావ్యంలో నందినీధేనువును అనుసరిస్తున్న సుదక్షిణాదేవిని వర్ణిస్తూ,

"తస్యాః ఖుర న్యాస పవిత్ర పాంసుం అపాంసులానాం ధురి కీర్తనీయా ।

మార్గం మనుష్యేశ్వర ధర్మపత్నీ శృతేరివార్థం స్మృతి రన్వగచ్ఛత్ ॥"

శ్రుతుల అర్థాన్ని స్మృతులు అంటే ధర్మశాస్త్రాలు అనుసరించినట్లుగా వేద రూపిణియైన నందినీధేనువును దిలీపుని ధర్మపత్ని అనుసరించిందని చెప్పడం ద్వారా భారతీయ సంస్కృతిలోని వేద ప్రామాణ్యాన్ని కాళిదాసు ధ్వనించాడు.

శ్రీకాళహస్తి మాహాత్మ్యంలోని వర్ణనలు కూడా భారతీయ సంస్కృతికి దర్పణాలుగా నిలుస్తాయి.

కథాప్రారంభంలోనే శ్రీకాళహస్తి పురి వర్ణన పది పద్యాల్లో ఉంది. ఈ సందర్భంలో ధూర్జటి శాస్త్ర వైదుష్యం, లోక పరిశీలనాశక్తి, ఆధ్యాత్మిక దృష్టి స్పష్టంగా దర్శనమిస్తున్నాయి. భారతీయులు సాంస్కృతికంగా ప్రోదిచేసుకున్న లౌకిక, పారమార్థిక దృక్కోణాలను విశిష్టమైన రీతిలో ధూర్జటి ఆవిష్కరించాడు.

భారతీయులు పాదరసాన్ని అగ్నితోనూ, రాగి లోహాన్ని గంధకంతోనూ నియంత్రిస్తారు. ఈ విషయాలను ఆధ్యాత్మిక దృష్టికి ఆపాదిస్తూ,

"సంసార పారదోచ్చాటనానల కీల కలుషసంచయ తామ్ర గంధకంబు" (1- 17)

శ్రీకాళహస్తి పురము సంసారమనే పాదరసానికి అగ్ని వంటిదని, పాపముల సమూహం అనే రాగిలోహానికి గంధకం వంటిదని వర్ణించాడు. అదేవిధంగా శ్రీకాళహస్తి పురం చంద్రకాంత శిలలతో నిర్మించిన పట్టణ ప్రాకారంలో ప్రతిబింబిస్తూ ఉంది. ఇది లోకాల యొక్క ఉత్పత్తి, స్థితిని తనలో ఇముడ్చుకున్న శివుని వలె ప్రకాశిస్తున్నదని చెప్పడం సామంజస్యమైన సామ్యం. మాయా విలాసం వల్ల ఈ లోకం యదార్థమని మనం భ్రాంతిని పొందుతున్నాం. శివరహస్య పురాణాంతర్గతమైన ఋభు గీత పూర్వ ఖండం, ఆరవ అధ్యాయంలో,

చిత్తభేదో జగద్భేదః అవిద్యాయాశ్చ సంభవః ।

అనేకకోటిబ్రహ్మాణ్డాః సర్వం బ్రహ్మేతి నిశ్చిను ॥ 6.16?

యద్యజ్జగతి దృశ్యేత యద్యజ్జగతి వీక్ష్యతే ।

యద్యజ్జగతి వర్తేత సర్వం బ్రహ్మేతి నిశ్చిను ॥ 6.19?

అనే శ్లోకాలు చిత్త భ్రాంతి వలన, అవిద్య వలన ఈ లోకం యదార్థమని భావిస్తున్నాం. నిజానికి మన చేత చూడబడుతున్నది, చూస్తున్నది, మనం నివసిస్తున్నది అయిన ఈ లోకం అంతా బ్రహ్మమే అని చెబుతున్నవి. ఇదే అంశాన్ని ధూర్జటి కూడా లోకం శివునిలో ఇమిడి ఉన్నట్లు, శ్రీకాళహస్తి పురం చంద్ర కాంత శిలా నిర్మితమైన ప్రాకారంలో ప్రతిబింబిస్తున్నదని చెప్పాడు.

ఋభు గీత లోని సప్త మాధ్యాయంలో,

"అఖణ్డైకరసాకారాదన్యన్నాస్తి నహి క్వచిత్ ।

శృణు భూయో మహాశ్చర్యం నిత్యానుభవసమ్పదమ్ ॥ 7.25"

ఇదే అంశాన్ని ధూర్జటి మనస్సుకు అందని మహాత్మ్యం "హృదయాచింత్య ప్రభావంబునన్" అన్నాడు.

అలాగే, శ్రీకాళహస్తిలో నివసించే గృహస్థులకు భార్యల స్థనాలు, అధరాలు, రతి బంధాలు, సంభోగం ఎలా పర్యవసిస్తాయో వర్ణించే సందర్భం, భారతీయుల తాత్విక దృష్టికి అద్దం పడుతున్నది(1-21). వర్ణ ధర్మానుసారం బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రుల జీవన విధానాన్ని వర్ణించే సందర్భంలో పదచ్ఛేదన ద్వారా అర్థ భేదాన్ని సాధించాడు(1-23). శ్రీకాళహస్తి పురంలోని చతుర్వర్ణాల ప్రజలు నిరుపమానంద విహరణ చేత అప్రమత్తులై రాజయోగైక సామ్రాజ్యంలో సంచరిస్తున్నారని వర్ణించాడు.

బ్రాహ్మణులు బ్రహ్మార్పణ బుద్ధితో నిత్య నైమిత్తిక కర్మలను ఆచరిస్తూ ఉన్నారని చెప్పిన సందర్భంలో శివ మానస పూజా స్తోత్రంలో ఉన్న "యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనం" అన్న వాక్యం స్ఫురణకు వస్తుంది. అలాగే దాసిని యాదవ రాజు శిక్షించిన తర్వాత ఆమె మిండ జంగముని పాదాలపై పడి ఏడ్చిన సందర్భంలో రాసిన పద్యం (1-51) కూడా శివ మానస పూజాస్తోత్రాన్ని తలపిస్తుంది. ఈ సన్నివేశంలో శృంగార రసం కూడా మిండ జంగముని పాదాలపై పడ్డ దాసి లాగా శాంత రసంలో సమసిస్తున్నది.

శ్రీకాళహస్తి పురిలోని కామినీ జనుల వర్ణనలో కూడా ధూర్జటి వేశ్యలకు, యోగులకు అభేదాన్ని సాధించాడు (1-24). వేశ్యలతోడి అన్వయంలో దంతక్షతాలలో నేర్పరితనం, కామస్థానములపట్ల అపేక్ష, కూజితాలు, చిలుక పలుకులు, మమకార విరక్తి అంటే విటులపట్ల నిజమైన అనురాగాన్ని పొందకుండా వృత్తిని నిర్వహించడం వంటివి కనిపిస్తే, యోగుల తోడి అన్వయంలో సూక్ష్మమైన బుద్ధిలో నేర్పరితనం, ఆత్మానుభూతి పట్ల అపేక్ష, ప్రణవ నాదము, శుక మహర్షి వాగమృత ఆస్వాదనానుభూతి, మోహరహిత వృత్తి అంటే అవిద్యను విడిచిన అంతఃకరణాలతో ఉన్నారని అన్వయించాడు.

తృతీయాశ్వాసంలో తిన్నని శైశవావస్థలను వర్ణించే సందర్భంలో ధూర్జటి రాసిన సీస పద్యం భారతీయుల ఉత్కృష్టమైన ఆధ్యాత్మిక దృష్టి ప్రతీకగా నిలుస్తున్నది (3 -30).

సీ. శివ భక్తి రహితమై చెడియె జగంబని
నవ్వినట్లొయ్యన నవ్వసాఁగె
ధృతిమోహ బంధంబు దెగఁ దన్ను గతిముద్దు
టడుగు లెత్తి విదుల్చు కాడఁ జొచ్చె
భవ పరాఙ్ముఖుఁ డైన పగిది సత్త్వముఁ గూడి
పొత్తుల పాన్పుపైఁ బొరలఁ బడియె
శ్రేయో మహారాజ్య సింహాసనంబున
నుందుచందమునఁ గూర్చుండఁ దొడఁగెఁ

తే॥ దడవియాడె వసుంధరా స్థలమునందు
విశ్వపతి తత్త్వమను మణి వెదకు రీతి
దర్పకారి జగత్పూర్ణుఁ దాకు భీతి
నడుగు వెట్టెడు గతిఁ దప్పటడుగు వెట్టె

ఈవిధంగా, ప్రతి ఘట్టంలోనూ భారతీయుల ఆధ్యాత్మిక తత్వం తొణికిసలాడే విధంగా వర్ణించడం నిజంగా ధూర్జటి సాంస్కృతిక దృష్టి వ్యక్తమౌతున్నది.

రసపోషణలో కూడా ధూర్జటి పారమార్థిక చింతన స్పష్టంగా కనిపిస్తుంది. ముఖ్యంగా శృంగార రసపోషణ సందర్భంలో స్థాయీభావమైన రతికి విరుద్ధంగా శాంత రసోద్దీపన చేయడం కాకలు తీరిన ఆధ్యాత్మిక వాదికి తప్ప వేరొకరికి సాధ్యం కాదనిపిస్తుంది.

ఇక, లౌకిక విషయాలను వర్ణించే సందర్భంలో ప్రథమాశ్వాసం లోని మిండ జంగమ వర్ణన. ఇక్కడ జంగమ శబ్దము కుల వాచకం కాదని, వీరశైవులు శివయోగుల్ని జంగమ లింగరూపులుగా భావిస్తారని అంటారు. చర అంటే

జంగమరూపంలో శివుడు శివయోగుల రూపంలోనే సంచరిస్తాడని శైవుల విశ్వాసం. అందుకే, వీరిని నడ లింగ మూర్తులని (1-35) పిలుస్తారు. శివ యోగులను జంగమదేవరలుగా కొలుస్తుంటారు. ఇటువంటి వారిలో వేశ్యా సంపర్కం కలిగినవారిని మిండ జంగములు అంటారు. బసవేశ్వరుడు వేశ్యాగృహాల్లో ఉండి భోగించే పండ్రెండు వేలమంది మిండ జగములకు

"ముప్పూట నోగిరంబులుఁ పదార్థములు తప్పక కావళ్ళ నెప్పుడు" పంపేవాడు. పచ్చ కర్పూరం, గంధము, తాంబూలము, సువాసనలు వెదజల్లే పుష్పాలు, వస్త్రాలు, ఆభరణాలు ఇచ్చేవాడు(బసవ పురాణం).

ధూర్జటి మిండ జంగముని ఆహార్యాన్ని సీస పద్యంలో సహజ సిద్ధంగా వర్ణించాడు. పావుకోళ్ళు, శైవులు ధరించే కంకణం, కౌపీనం, రుద్రాక్ష కంఠమాల, భస్మంతో నింపిన తోలు సంచి, బెత్తం, చంకలోకి వేలాడుతున్న శివలింగం, ఎర్రటి మొలతాడు. నుదుట పూసుకొన్న విభూదిపై గుండ్రంగా దిద్దుకున్న కస్తూరి బొట్టు. నిత్యం తాంబూలం సేవించడం వల్ల కెంపులను తలదన్నే రీతిలో ఎర్రగా ఉన్న దంతాల వరుసతో శివుడు మిండ జంగమ రూపంలో వచ్చాడని వర్ణించాడు. బంగారు పావుకోళ్ళు, గోచి పాతకు బంగారు అంచులు ఉండడం, కెంపులు పొదిగిన బంగారు మొలతాడు మిండ జంగముడు ధరించాడని చెప్పడం శివ భక్తి పారమ్య దృష్టిలో అసహజం కాదు.

చతుర్థాశ్వాసంలో వర్ణించిన ద్రవిడ జంగమ రూపానికి మిండ జంగమ రూపానికి స్పష్టమైన భేదం కనిపిస్తుంది. ద్రవిడ జంగమ రూపంలో శివుడు నుదిటి పై తెల్లని విబూది పట్టీలు, మెడలోనూ కొంచెం బోడిగా వున్న తలపైనా రుద్రాక్షలు, చెవులకు రాగి కుండలాలు, కాషాయం రంగులోని కండువాలు, కౌపీనం, ఎడమ ముంజేతికి తగిలించుకున్న బుట్టలు ధరించి ఉన్నాడు. జంగములు నిత్యార్చనకై వినియోగించే శివలింగాన్ని తాడుకు కట్టి చంకలోకి వేలాడ తీసుకోవడం కానీ, లేదా బుట్టలో ఉంచి చేతికి తగిలించుకోవడం కానీ చేసేవారు. మిండ జంగముని కౌపీననానికి బంగారు అంచులు ఉన్నాయి. ద్రవిడ జంగముని కౌపీనం కేవల కాషాయ వస్త్రం. మిండ జంగముడు ధరించిన కెంపులు పొదిగిన బంగారు మొలతాడు, బంగారు పావుకోళ్ళు ద్రవిడ జంగమునికి లేవు. మిండ జంగముడు పాల భాగంలో పూసుకున్న విబూది మధ్యలో కస్తూరి బొట్టు ఉంది. మొత్తం మీద శైవ సంస్కృతిలో జగముల ఆహార్యం ప్రాంతాన్ని బట్టి స్వభావాన్ని బట్టి విభిన్నంగా ఉంటుందని తెలుస్తున్నది.

ఇక, మూడవ ఆశ్వాసంలో తిన్నని కథ ఆటవికుల జీవన విధానాన్ని సహజంగా, సుందరంగా వర్ణిస్తున్నది. తిన్నని కథలో నడుమూరును వర్ణించే సందర్భంలో చేసిన ముత్యాల వర్ణన ధూర్జటికి రత్నశాస్త్రంలో ఉన్న వైదుష్యాన్ని తెలియజేస్తున్నది (3-4). వరాహాల దంష్ట్రాల నుండి దొరికిన ముత్యాలను రేగుపండ్లు గాను, కుబుసం విడిచిన పాము తల నుండి దొరికిన ముత్యాలను గురివింద గింజలు గాను, మదపుటేనుగుల కుంభ స్థలాల నుండి లభించిన ముత్యాలను ఉసిరిక కాయలుగాను, వెదురు బొంగుల నుండి దొరికిన ముత్యాలను ఈదుగు పండ్లతో సమానం గాను భావిస్తారనడం ద్వారా అడవుల్లో లభించే వివిధ ముత్యాలు వాటి వర్ణాలు, స్వభావాలను స్పష్టం చేశాడు.

చెంచుల జీవన విధానాన్ని నాగరికులతో పోల్చి వర్ణించే సందర్భంలో భారతీయ సాంస్కృతిక వైవిధ్యం గోచరిస్తున్నది. అంతేకాకుండా,

తే. ఎంత సంపద గల్గియు నెట్టి వారుఁ
దమకులాగత ధర్మ కర్మములు విడువఁ
జాలరటు కానఁ దత్పురీ శబర సతులు

మహిమ గలిగియు మానరు సహజవృత్తి (3-6) అని చెప్పడం భారతీయ సంస్కృతిలోని వృత్తి ధర్మాల యొక్క ప్రాశస్త్యాన్ని ప్రస్తావిస్తుంది. "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" అన్న గీతాకారుని వాక్య తాత్పర్యం కూడా ఇదేనని విశ్లేషకులు చెబుతున్నారు.

తిన్నని బాల్యావస్థలను వర్ణించే సందర్భంలో ధూర్జటి తెలుగుల సంస్కృతిలో కనిపించే చిట్ల పొట్లకాయ, సిరి సింగణావత్తి, గుడుగుడు గుంచాలు, కుందెన గుడి, డాఁ గిలి ముచ్చు లాటలు, గచ్చకాయలు, వెన్నెల కుప్పలు, తన్నుబిల్ల,

తూరన తుంకాలు, గీరన గింజలు, పిల్ల దీవి,ఆలంకి, బిల్లగోదు, చిడుగుడు,ఉవ్వల పోటి, చెండు, గట్టిన బోది, అల్లి, ఉప్పెనఁబట్టెలు, అప్పళాలు, చిక్కనా బిల్లలు, ఓటిళ్ళు, చిందఱ వంటి ఆటలను ప్రస్తావించాడు.

అలాగే కాట్రేనికోన జాతరకు కిరాతులు సమాయత్తమైన సందర్భంలో వారి కట్టూ బొట్టు, వంటకాలు నైవేద్యాలు, ఆచారాలు విశ్వాసాలు అన్నింటిని ధూర్జటి సమగ్రంగా చిత్రించాడు (3-46). తిన్నడు వేటకు వెళ్లిన సందర్భంలో బోయల వేట సామగ్రిని, వేటలోని వివిధ పద్ధతుల్ని వివరించాడు(3-54).

తిన్నడు మొగిలేటి దరిని ఉన్న లింగాన్ని నడుమూరికి ఆహ్వానించే సందర్భంలో చెప్పిన తేనెలు, పండ్లు (3-68,69) ఆటవికులకు అడవితో ఉన్న అనుబంధానికి అద్దం పడుతున్నాయి. ఇక తిన్నని మూఢభక్తి ధూర్జటి ఆధ్యాత్మిక పరివేచనకు ఒక మచ్చుతునక. మొత్తంగా తిన్నని కథ ధూర్జటి లోకపరిశీలనాశక్తికి, సాంస్కృతిక అనురక్తికి ఒక ప్రబలమైన ఉదాహరణగా నిలుస్తున్నది.

తృతీయాశ్వాసంలోని నత్కీరునికథలో చేసిన దుర్భిక్ష వర్ణన భారతీయ సంస్కృతిలో జ్యోతిష్య శాస్త్రానికిగల ప్రాధాన్యతను వివరిస్తున్నది. శని గ్రహము మీన రాశి ప్రవేశం, తూర్పున తోకచుక్క గోచరించడం, మధ్యాహ్న సమయంలో మేఘాలు విజృంభించడం, ప్రాతకాలంలో ప్రతిరోజూ మంచు బిందువులు కురవడం, రాత్రి సమయాల్లో ఆకాశం నిర్మలంగా ఉండడం, వెలియండ కాయడం, విదియ నాడు చంద్రుని కొమ్ము తరిగిపోవడం, సూర్యుడు కన్యారాశిలో ప్రవేశించినా కూడా చినుకులు పడకపోవడం వంటివి దుర్భిక్షానికి సూచనలని తెలుస్తున్నది. నత్కీరుని తీర్థయాత్ర సందర్భంలో భారతదేశంలోని అనేక పుణ్యతీర్థ, క్షేత్రాల మహిమను ధూర్జటి వివరించాడు.

చతుర్థాశ్వాసంలోని వేశ్యాపుత్రికల వృత్తాంతంలో దేవదాసి వ్యవస్థలోని పవిత్రత దిగజారి వేశ్యావృత్తిగా పరిణమించిన తీరు ధ్వనిస్తున్నది. భారతీయ సంస్కృతి ధర్మ కామానికి అగ్రపీఠం వేసింది.

త్రిగణమవికలార్థం సాధయన్సాధు లోకః
పరిణయతు సవర్ణాం శాస్త్రతో ऽనన్యపూర్వామ్ ॥
పరిణయసహవాసక్రీడితాదీని మైత్రీ ।
మధమసమధికాభ్యాం నైవ కుర్వన్తి సన్తః ॥

అంటే ధర్మ, అర్థ, కామములనే త్రిగణ సాధనకోసం పురుషుడు సవర్ణంలోని కన్యను శాస్త్రయుక్తంగా వివాహమాడాలని కన్యా విశ్రంభణాధికారంలోను, పరదారాభిలాష కీర్తిహాని కారకమని పారదారికాధికరణంలోను కొక్కోకమనే కామ కళాశాస్త్రమే స్పష్టంగా చెప్తున్నది.

మాణిక్యవల్లి తన కుమార్తెలకు వార ధర్మంబోధించే సందర్భంలో ధూర్జటికి ఉన్న కామశాస్త్ర పరిచయం స్పష్టమవుతున్నది.

క. కళలు ప్రమాణంబులు చూ
పులు జాతులు గతులు బంధములు పరిరంభం
బులు సత్త్వంబులవస్థలుఁ
దెలిసి విటులఁ గలిసికులముఁ దెలియఁగ వలదే?

వేశ్యలు కళలు అంటే కామ స్థానములు, యోని, లింగముల ప్రమాణములు, వశీకరణ దృష్టులు, స్త్రీ పురుషుల్లోని జాతులు, రతిబంధ భేదాలు, ఆలింగన భేదాలు, బలాలు, బలహీనతలు తెలుసుకోవాలని వేశ్యమాత తన కుమార్తెలకు బోధించింది.

సీ. మణిమంత్రతంత్రముల్ మందులు మాయలు
సరస భాషలు వృథాసంభ్రమంబులుఁ
దెచ్చికో వేద్పులు నిచ్చకంబులు వట్టి
యానలుఁదక్కలు నలసగతులు

నలుకలుఁదరితీపులాసలుఁ బ్రియములు
నగవులు బిగువులు నయము భయము
బలిమియుఁజెలిమియు బాసలు ననుపులుఁ
. . . . . . . . . . . . . . . .
తే. జాయవాటులు సన్నలుగాయకములు
మెచ్చులును దచ్చనలుఉబొర పొచ్చెములును
దగవులును వారకాంతా వితానమునకు
జలజలోచనలార! నైసర్గికములు"

– అని చెప్పడం నాటి వార ధర్మాన్ని విశదం చేస్తున్నది. ఇంకా, "వేకు వలయందు విటుని చే వీడియంబుఁ, బుచ్చుకొనఁదగదని" ఒకవేళ పుచ్చుకొన్నా మింగకుండా ఉమిసివేయమని ఎందుకంటే, "వెలఁదులకు మందువెట్టెదు వేళగాన" అంటూ జాగ్రత్తలు కూడా చెప్పింది.

రతి రహస్యమనే పేరున్న కొక్కోకంలో సురత భేద జాత్యధికార పరిచ్ఛేదంలో పద్మిన్యాది జాతులతో బాటు పురుషులలో శశ, వృషభ, తురగములని మూడు జాతులు, స్త్రీలలో హరిణి, తురగి, హస్తిని అని మూడు జాతులకు సంబంధించిన రతి భేదాల వివరణ ఉంది.

అలాగే, వివిధ పరిచ్ఛేదాల్లో వివిధ ప్రాంతాల రతి విశేష లక్షణములు, స్పృష్టక, విద్ధక, ఉద్ఘృష్టక, లతావేష్టిత, వృక్షాధిరూఢ, తిలతండుల, క్షీరనీర, ఊరూపగూఢ, జఘనోపశ్లేష, కుచాశ్లేష, లాలాటికములనే పదకొండురకాలైన ఆలింగనాలును, నిమిత, స్ఫురిత, ఘట్టిత, భ్రాంతి, తిర్యగ, పీడిత, విఘటిత, అధర, ఉత్తర, సంపుట, అనుపద, అన్విత, ప్రాతిబోధ, ఛాయిక, క్రాంత ములనే పదిహేను రకాలైన చుంబనాలను, ఛురిత, అర్ధచంద్ర, మండల, మయూరపదకము, శశకప్లుతము, కుముదపత్రములనే ఆరు రకాలైన నఖక్షతాలను, గూఢక, ఉచ్ఛూనక, ప్రవాళమణి, బిందు, బిందుమాల, ఖండాభ్రక, కోలచర్వితములనే ఏడు రకాలైన దంత క్షతాలను, ఉత్తానకరణ, తిర్యక్కరణ, స్థితకరణ, ఉద్ధితకరణ, వ్యానకరణ ములనే ఐదు పురుషకృత్య బంధాలు, స్త్రీలు పట్టే విపరీతకరణాలనే బంధాలు, వివిధ లక్షణాలతో కూడి గ్రామ్య, నాగరకాదులనే మొత్తం 84 రకాలైన రతి బంధాలను, సమతాడన, ముష్టి తాడనములని రెండు విధాలైన తాడనాలను, ఐదు తాడన స్థానాలను, ఎనిమిది విధాలైన రతి ధ్వనులను, వశీకరణ విధానాలను కొక్కోకం వర్ణిస్తున్నది.

కళా స్థానాలు మొదలైన వాటిని గురించి ధూర్జటి చేసిన సూచన ప్రాచీన భారతీయుల కామ శాస్త్ర ప్రాశస్త్యాన్ని వివరిస్తున్నది.

"బాహుమూలే గళే చైవ నితంబే భుజయోస్తథా
వనితానాముక్తరేత్యా కృష్ణేఽథో గచ్ఛతి క్రమాత్ ।
ఆరభ్య శుక్ల ప్రథమాం మూర్ధానామధిరోహతి
ప్రత్యేకముక్తస్థానేషు సబిందూన్ సవిసర్గకాన్ ॥"

ఈ కళాస్థానాల్లో మన్మథుడు (లేదా కోర్కె కావచ్చు) స్త్రీలకు శుక్ల పక్షం నుండి ఎడమ వైపున ఎక్కి కుడి వైపున దిగుతుంటే, పురుషులకు కృష్ణ పక్షం పాడ్యమి నుండి కుడి వైపున ఎక్కి ఎడమ వైపున దిగుతున్నాడని చెప్పడం కనిపిస్తుంది.

ఈ సందర్భంలో వేశ్యా పుత్రికలు తమ తల్లితో చెప్పిన మాటలు భారతీయ సంస్కృతిలో దేవదాసీలకు ఉండవలసిన భక్తికి, లోకవిరక్తికి సాక్ష్యాలుగా నిలుస్తున్నాయి. ఈ సందర్భంలో ధూర్జటి రాసిన ఏడు పద్యాలు (4-37 నుండి 43 వరకు) నిజంగా భక్తిరస గుళికలు. ఈ కథ ప్రహ్లాదుని కథ లాగా అంత ప్రశస్తిలో ఉన్నది కాకపోవడం వల్ల ఈ పద్యాలకు రావలసినంత ప్రశస్తి రాలేదనిపిస్తుంది.

క. శ్రీకాళహస్తి పతి పద
కో కనదారాధనంబె కులధర్మము త
ల్లోక వ్యాపక చిద్వి
ద్యాకార స్మృతియె కాణయాచి మదంబా !"

కాబట్టి వేశ్యల కులవృత్తి వ్యభిచారం కాదని, ఈ వికృత సంప్రదాయం భారతీయ సంస్కృతిలో భాగంకాదని స్పష్టమౌతున్నది.

మొత్తం మీద, ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్య ప్రబంధం భారతీయ సంస్కృతికి సాకార రూపంగా అవతరించింది అని చెప్పడంలో అతిశయోక్తి ఇసుమంత కూడా లేదు. అంతేకాకుండా ధూర్జటి వంటి కవి పండితుడు, విశుద్ధ భక్తుడు క్షేత్ర మాహాత్మ్యాన్ని రాయడం వల్ల ఈ ప్రబంధం సాంస్కృతిక శోభతో సానబెట్టిన రత్నంలాగా తెలుగు సాహిత్యంలో ప్రకాశిస్తున్నది.

**ఆధార గ్రంథాలు**

1. శ్రీకాళహస్తి మాహాత్మ్యము, ధూర్జటి, సర్వంకషావ్యాఖ్యానం, వంతరాం రామకృష్ణారావు (రెండు సంపుటాలు) – శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం – 2005
2. శ్రీకాళహస్తి స్థల మాహాత్మ్యము (శివ రహస్య ఖండము) శ్రీశ్రీశ్రీ విమలానంద తీర్థస్వామి, శృంగేరి మఠం – 1984, ఎం.జి. ప్రసూన, టి. నగర్, తిరుపతి
3. వసుచరిత్ర – రామరాజభూషణుడు, వ్యాఖ్యానం – తంజనగరం శ్రీ తేవప్పెరమాళ్, శ్రీరామ రాజభూషణ సాహిత్యం పరిషత్, భీమవరం 2001.
4. ధూర్జటి కవితా వైభవం – డాక్టర్ పి. ఎస్. ఆర్. అప్పారావు – 1976, యువభారతి సాహితి సాంస్కృతిక సంస్థ, సికింద్రాబాద్.
5. తెలుగు సాహిత్య చరిత్ర – 1996, డాక్టర్ ముదిగంటి సుజాతారెడ్డి, రోహణమ్ పబ్లికేషన్సు, హైదరాబాదు.
6. తెలుగు సాహిత్య సమీక్ష – 2004, డాక్టర్ జి.నాగయ్య, నవ్య పరిశోధక ప్రచురణలు, తిరుపతి.
7. రఘువంశ మహాకావ్యము – 2013, జ్ఞానశ్రీ ఆర్ష విద్యా గురుకులము, హైదరాబాద్.
8. నాటక శిల్పం – 2008, ఆచార్య మొదలి నాగభూషణ శర్మ, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్.
9. కొక్కోకము (రతి రహస్యం) – 1951 పద్యానువాదం కూచి రాజు ఎఱ్ఱన.
10. వాత్స్యాయన కామ సూత్రాలు – 2013, రెంటాల గోపాలకృష్ణ (వ్యాఖ్యానం), నవసాహితి బుక్ హౌస్, ఏలూరు రోడ్డు, విజయవాడ.
11. శ్రీ శివమహా పురాణం–1991, శివ శ్రీ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు, శ్రీరామ పబ్లిషర్స్ హైదరాబాదు.
12. శివదర్శనమ్ – 2003, బ్రహ్మశ్రీ చందూరి వేంకట సుబ్రహ్మణ్యం, కాశ్యప స్వాధ్యాయ కేంద్రము, హైదరాబాదు.



# విప్లవకవియోగి వీరబ్రహ్మం- సమీక్ష

ఇది ఆచార్య పులికొండ సుబ్బాచారి సరికొత్త క్షేత్రపరిశోధన ఆధారంగా రచించిన పరిశోధన గ్రంథం. ఇందులో నాలుగు వందల ఏండ్ల క్రితం ఒక సంఘసంస్కర్త చేసిన సామాజిక మత సంస్కరణని సరికొత్త కోణంలో రచించిన గ్రంథం.

ఈనాడు అందరిచేతా దేవుడుగా కీర్తించబడుతూ మనకున్న 33కోట్ల దేవతలలో ఒకడుగా ఉండి దేవాలయాలు వెలసి పూజలందుకుంటున్న వాడు పోతులూరి వీరబ్రహ్మం నాలుగు వందల సంవత్సరాల క్రితం మనలాగా మనుషుల మధ్యన మనిషిగా తిరిగి తాను తన లక్ష్యాన్ని సాధించిన వ్యక్తిగా సంఘసంస్కర్తగాచూస్తూ సాగిన పరిశోధన ఇది.

ఇప్పటిదాకా వీరబ్రహ్మం పైన చాలా పరిశోధనలు వచ్చాయి. కాని వాటి అన్నింటిలో ఈయనను భగవత్స్వరూపుడుగానే భావించారు. ఆయన కాలజ్ఞానాన్ని అపురూపమైన దైవవాక్కుగా అందరూ భావించారు. ప్రజలు బావించినట్లే పరిశోధకులు కూడా భావించారు ఆయన సాహిత్యాన్ని విశ్లేషించారు.

ఆచార్య సుబ్బాచారి. వీరబ్రహ్మం ను ఒక ప్రత్యేకమైన కోణంలో చూచారు. ఆయన అవతార మూర్తి కాదని మానవుడుగా మనధ్యన ఉన్నాడని గుర్తిస్తూనే ఆయన భగవంతుడుగా మారిన ప్రక్రమాన్ని ఇందులో విశ్లేషించిచూపారు. పురాకథా శాస్త్రం మానవశాస్త్రాల సూత్రాల ఆధారంగా ఈ గ్రంథంలో విశ్లేషణ చేశారు. ఒక మనిషిని భగవంతుడుగా ప్రజలు ఎప్పుడు భావిస్తారు. మనిషిని భగవంతుడుగా చేయడానికి ఏశక్తి పనిచేస్తుంది అనే విషయాన్ని విశ్లేషించారు. పురాకథా సృష్టి అనే ప్రక్రమమే మనిషిని దేవుడుగా తయారుచేస్తుందని. కొన్ని వందల సంవత్సరాలుగా తరంనుడు తరానికి వచ్చే జానపదమనస్తత్వమే పురాకథా సృజనమే మనిషిని దేవుడుగా తయారు చేయడానికి ఆధారామైన సామాజి ప్రక్రమముఅని ఈ గ్రంథంలో విశ్లేషించి చూపారు. ఆచార్య సుబ్బాచారి. ఒక మనిషి అసాధారణమైన పనులు చేసినప్పుడుకాని అతి వీరోచిత కార్యక్రమాలు చేసినప్పుడుగాని లేదా అనూహ్యమైన నమ్మలేన పరిస్థితిలో మరణించినప్పుడుగాని ఆ వ్యక్తిని భగవంతుడుగా భావించడం చేస్తారని ఇలా చేయడంలో జానపద పనిచేస్తుందని చెప్పారు.

ఒక వీరబ్రహ్మం మాత్రమే కాక తులతాత్మకంగా తర్వాతి కాలంలో వచ్చిన వ్యక్తులు చరిత్రలను లేదా పురాకథలను గ్రహించి ఈ విశ్లేషణ చేశారు. ఈ కాలంలో కూడా మన మధ్యన సజీవంగా నడయాడుతున్న కొందరు స్వామీజీల కథలను కూడా తులనాత్మకంగా పరిశీలించి మనషి దేవుడుగా మారే క్రమాన్ని విశ్లేషించి చూపారు. ఇది వీరబ్రహ్మం పైన వచ్చిన పరిశోధనలో కొత్తకోణం. ఈ దృష్టితోనే వీరబ్రహ్మం చేసిన సామాజిక విప్లవాన్ని అర్థంచేసుకునే క్రమం కోసం వీరబ్రహ్మం తిరిగిన ప్రధాన మైన ప్రదేశాలు అన్నింటిలో కడప కర్నూలు జిల్లాలలో పర్యటించి ప్రజలనుండి సమాచారం సేకరించి ఈ పరిశోధన గ్రంథాన్ని రచించారు ఆచార్య సుబ్బాచారి.

వీరబ్రహ్మం సాగించిన సామాజిక ఉద్యమం సంఘసంస్కరణ గురించి క్లుప్తంగానైనా ఇక్కడ చెప్పుకుంటే తర్వాత సాహిత్యం గురించి దాని ద్వారా ఆయన ప్రచారం చేసిన ఉద్యమ స్వరూపం అందులో ఎలా ఉందో గుర్తించవచ్చు.

ప్రతి ఆత్మలోను పరమాత్మ ఉంటుంది. లేదా ఉంటాడు. ప్రతి జీవిలోను ఉండే వెలుగు ఇదే. తనలోని పరమాత్మను ప్రతి జీవిలో ఉండే పరమాత్మను తెలుసుకోవడమే పరమమైన ఆధ్యాత్మికత. విగ్రహారాధన అవసరం లేదు. దాని చుట్టూ ఉన్న తంతులు ఆచార కాండ అవసరం లేదు. యోగసాధన ద్వారా తనలోని పరమాత్మను తాను గ్రహించవచ్చు. ఈ రాజయోగ సాధనకు అందరూ అర్హులే, స్త్రీలు ఆధ్యాత్మిక తత్త్వాన్ని తెలుసుకోవడానికి సాధన చేయడానికి లేదా మొక్షాన్ని పొందడానికి అడ్డంకి కాదు, వారూ ఈ యోగసాధన చేయవచ్చు. అన్ని కులాలు మతాల వారు ఈ సత్యాన్ని గ్రహించి ఈ యోగాన్ని సాధన చేయవచ్చు. అన్ని కులాల వారిలో ఉన్న పరమాత్మ సమానమే అందరూ ఇలా సమానమే అనేది ప్రధానంగా ఈ ఉద్యమం ప్రచారం చేసిన తత్త్వం. మీమీ వృత్తులు కొనసాగిస్తూనే ఈ యోగసాధన చేయవచ్చని. సన్యసించవలసిన అవసరం లేదని బోధించి తానూ తన వృత్తిని చేశాడు.

అఖిల భూతములకు ఆత్మ యొక్కటియని
గుత్తెరంగి మెలగు గుణికి నెందు
మోహశోకములు సమ్మూలముగదెగు
కాళికాంబ హంసకాళికాంబ (కాళికాంబశతకం)

హృదయమందె యుండె హృత్కమలేశుండు
లింగసారమెఱుగు లింగవిభుడు
వంగిఱాలకు మొక్క వచ్చునా మోక్షంబు
కాళికాంబ వీర కాళికాంబ (వీరకాళికాంబశతకం)

ఆత్మలోన నుండు నదియె వైకుంఠమ్ము
కోణదేశమున వికుంఠుడుండు
లోకమేది లేదు లోకోత్తరుడు లేడు
కాళికాంబ హంస కాళికాంబ

బ్రహ్మమనగ వేరె పరదేశమున లేదు
బ్రహ్మమనగ జూడు బట్టబయలు
తనకు తానె బ్రహ్మము తారకమౌనురా
కాళికాంబ హంసకాళికాంబ.

ఇది వీరబ్రహ్మం ప్రచారం చేసిన తత్త్వం. ఇలా ఆయన పద్యాలలో ప్రచారం చేశాడు. ఇది ఉపన్యాస కాలంలో బోధలు చేసే కాలంలో అలవోకగా చెబుతూ పోయిన పద్యాలు. అలా కాక తత్త్వాలు పాటగా పాడుతూ కూడా ప్రచారం చేశాడు.

చిల్లర రాళ్ళకు మొక్కుతు ఉంటే
చిత్తము చెడునుర ఒరే ఒరే
చిత్తమునందున చిన్మయజ్యోతిని
చూచుచు నుండుట సరేసరే..
ఇలా సాగుంతుంది ఈ పాట.

కులాన్ని నిరసించే పాటలు, మూఢ విశ్వాసాలను ఎండగట్టే పాటలు ఇంకా మిగిలి పోయినవి మనకు చాలా కనిపిస్తాయి. వీరబ్రహ్మం సాధించిన సామాజిక సంస్కరణ ఉద్యమం గురించి ఇక్కడ చర్చిస్తే ఆనాడున్న సామాజిక రాజకీయ పరిస్థితిలో ఆ ఉద్యమాన్ని నడపడం కాని కొనసాగించడం కాని చాలా సాహసంతో కూడుకున్న పని అని తెలుస్తుంది. విజయనగర సామ్రాజ్యం పతనమైన తర్వాత కొంత కాలానికి వచ్చిన పాలెగాండ్ల వ్యవస్థ, ఒక రకంగా దోపిడీ వ్యవస్థ, రాజకీయస్థిరత లేని ఒక అరాచక పరిస్థితి సామాజిక పరమైనది ఉండగా. మతపరంగా చూచినా ఆందోళనకరమైన పరిస్థితి, ఎన్నో రకాల మూఢ విశ్వాసాలు ప్రజలను కుదేలు చేస్తున్న రోజులు. పరిశోధకులు ఇప్పటికే గుర్తించిన దాని ప్రకారం ఏదేవుడో, శక్తో వచ్చి తమ్ము రక్షిస్తే బాగుండు అని సమాజం ఎదురు చూసే పరిస్థితి ఉంది.

భగవంతుడికి భక్తులకు మధ్యన మేమున్నాము అని, మాద్వారానే మోక్షం పొందడం సాధ్యం మేము చెప్పే ఆచారాలు పాటించండి అని చెప్పే బలమైన భూసుర వర్గం వారు స్థాపించి పాలించే ఆధ్యాత్మిక వ్యవస్థ. దీన్ని ఎదుర్కోవలసిన పరిస్థితి చూశాడు వీరబ్రహ్మం. దీనికి వ్యతిరేకంగా సాగిందే ఆయన ప్రతిఘటన ఉద్యమం. విగ్రహారాధన అవసరం లేదు. గుడులకు

పోనవసరం లేదు. నీలో ఉన్న దేవుడిని నీవే గ్రహించే యోగాన్ని సాధించు, నీలాంటి ప్రతి ప్రాణిలో నీలాంటి పరమాత్మను చూడు అని ప్రచారం చేయడం, అన్ని కులాలు సమానం, అందరూ అన్ని మతాల భేదం లేకుండా దీన్ని సాధించవచ్చు, స్త్రీలు యోగసాధనకు అడ్డంకి కాదు వారికీ ఈ ఆధ్యాత్మిక సాధన చేసే అధికారం ఉంది అని చెప్పడం ఒక సామాజిక సమానత్వాన్ని తెచ్చే ఉద్యమం చేయడం ఆనాటికి ఉన్న రాజకీయ ఆధ్యాత్మిక పరిస్థితులతో పెద్ద సాహసంతో కూడుకున్న ఉద్యమమే అని చెప్పాలి. గుడులు అవసరం లేదు, వాటి చుట్టూ ఉన్న ఆచార కాండ అవసరంలేదు అని చెప్పడమంటే ఆ వ్యవస్థకు మూలమైన పూజారి వర్గాన్ని అంటే priestly class ని ఢీకొట్టి ఎదురు నిలవడమే. దీనికి ఎంతో సాహసం కావాలి. ఎంతో మూల్యాన్ని కూడా చెల్లించుకోవాలి. బ్రహ్మం కథని చదివితే అందులో ఈ విషయాలు గమనించవచ్చు. వేమన విషయంలో లాగే వీరబ్రహ్మం విషయంలో కూడా ఈసడింపునకు గురికావడం పక్కకు నెట్టబడం అందుకే ఇటీవల దాకా జరిగింది.

ఈ తరహా ఆధ్యాత్మిక చింతనే కాదు ఎన్నో మూఢ విశ్వాసాలను బద్దలు కొట్టే ప్రయత్నం చేశాడు. రజస్వలానంతర వివాహం పాపం అనుకునే రోజుల్లో అదే సరైనది అని ప్రచారం చేశాడు. తన సిద్ధాంతం ప్రకారమే గోవిందమ్మను పెండ్లాడాడు. అసలు ముట్టు అనేది దోషమనుకోవడమే మూఢ విశ్వాసమని అది పవిత్రమైనదని మానవ జననానికి మూలమైనది పాటలు పాడి ప్రచారం చేశాడు. తను సమాధి చెందిన తర్వాత తన భార్య అప్పటిదాకా ఉన్న బొట్టు పూలు నిషేధించ వలసిన అవసరం లేదని తనకు చిన్నతనం నుండి ఉన్న స్థితిలో ఉండవచ్చునని చెప్పాడు. ఇలా చెప్పడం నేటికీ విప్లవాత్మకమైన భావనే. దీనికి చాలా గట్టి ప్రతిఘటన ఎదుర్కోవలసిన పరిస్థితి ఉందని ఇటీవలి అయ్యప్పస్వామి గుడిలోనికి స్త్రీల ప్రవేశం పైన జరిగిన వివాదాన్ని గమనించినా ఈ విషయాన్ని గ్రహించవచ్చు.

వీరబ్రహ్మం సాహిత్యాన్ని మాత్రమే కాకుండా ఆయన చరిత్రని తిరిగి సేకరించి దాని ఆధారంగా ఈ పుస్తకంలో ఈవిశ్లేషణలు చేశారు పరిశోధకుడు. అంతే కాదు వేమనకు వీరబ్రహ్మానికి మధ్యన ఉన్న తారతమ్యాన్ని కూడా ఈ గ్రంథం విశ్లేషించింది.

స్త్రీని ఎలా అర్థం చేసుకోవాలో అలా వేమన చేసుకోలేదు. మూఢ విశ్వాసాలను వీరబ్రహ్మం లాగే వేమన కూడా ఖండించి ప్రచారం చేసినా వేమనకు వీరబ్రహ్మానికి ఉన్న భేదం ఇంకొకటేమంటే వేమన చేసిన ఉద్యమం ప్రచారం వ్యక్తి స్థాయిలోనే సాగింది. శిష్యులున్నా ఆయన పద్యాలను కొంత కాలం కొనసాగించి తాళపత్రాలకు ఎక్కించడం వరకే ఆగింది. కాని వీరబ్రహ్మం మొదలు పెట్టిన ఉద్యమానికి ఒకవ్యవస్థ కల్పించాడు. మఠాలు స్థాపించాడు. వాటికి అవసరమైన ఆస్తులను తను ఉన్న కాలంలోనే సాధించి పెట్టాడు. ఆయన స్థాపించిన మఠాలు నేటికీ కొన సాగుతున్నాయి.

ఈ గ్రంథంలోని ముఖ్యవిశ్లేషణని చెప్పి ముగిస్తాను.

వీరబ్రహ్మం చూపిన సామాజిక చింతన నేడు ఎక్కువగా చర్చకు వస్తూ ఉంది. అంతర్జాలం ప్రపంచాన్ని చిన్న గ్రామంగా చేసిన నేటి శాస్త్రసాంకేతిక సమాజంలో కూడా సాక్షాత్తు భగవదవతారంగా god man గా భావింపబడే వ్యక్తులు, వేలకోట్ల ఆస్తులతో ఆశ్రమాలతో ఉన్న స్వాములు, గురువులు ఈ నాడూ మన కళ్ళముందు తిరుగుతూ ఉండగా 17 వశతాబ్దిలో ఒక ఆధ్యాత్మిక ఉద్యమాన్ని చేసిన వ్యక్తిని భగవంతుడుగా భావించడం ఆశ్చర్యం కలిగించే విషయం కాదు. కాని "దేవుడు వేరే లేడు. గుడులకు పోవడం విగ్రహాలను ఆరాధించడం అవసరం లేదు అని మీరే దేవుడు మీరే పూజారి" అని సిద్ధాతం చేసి ప్రచారం చేసిన వీరబ్రహ్మానికి గుడులు కట్టడం దేవుడుగా ఆరాధించడం పూజలు చేయడం ఆయన ప్రచారం చేసిన తత్త్వాన్ని వెనుకబట్టించడం నేటి సమాజంలోని వైరుధ్యం, మూఢ నమ్మకాలు వద్దు, మనుషులందరూ సమానమని చెప్పిన సామాజిక సిద్ధాంతాన్ని మరవడం నేటి విషాదం.

ఈ విధంగా వీరబ్రహ్మంగారి పైన సరికొత్త కోణంలో పరిశోధన సాగించిన గ్రంథం ఆచార్య పులికొండ సుబ్బాచారి గారి విప్లవకవియోగి వీరబ్రహ్మం పుస్తకం. (ముగింపు వాక్యాలు చెప్పవచ్చు).

# తెలంగాణ సామాజిక అంతరంగ శోధనే బి.యస్.రాములు 'ఇల్లూ-వాకిలి' కథలు

-ఆచార్య దార్ల వెంకటేశ్వరరావు, తెలుగు ఆచార్యులు&డిప్యూటి డీన్,
స్టూడెంట్స్ వెల్ఫేర్, యూనివర్సిటి ఆఫ్ హైదరాబాద్,
హైదరాబాదు, తెలంగాణ రాష్ట్రం, ఫోను: 9182685231

తెలుగు సాహిత్య చరిత్రలో 'సామాజిక తాత్త్వికుడు'గా పేరొందిన బి.యస్.రాములు విస్తృతంగా కవితలు, కథలు, నవలలు రాయడంతో పాటు, సాహిత్య శాస్త్రానికి సంబంధించిన రచనలు, సామాజిక వ్యాసాలను రాశారు.ఆయన జీవితం, సాహిత్య నేపథ్యం, సాహిత్య పరిణామం తెలియడానికి ఆయన రాసిన 'ఇల్లూ-వాకిలి' అనే కథల సంపుటి ఎంతగానో ఉపకరిస్తుంది. అందువల్ల వ్యాసపరిమితులను ద ృష్టిలో పెట్టుకొని ఈ కథలలో ప్రతిఫలించిన ఆయన జీవితాన్ని, సమైక్య తెలంగాణ నాటి పరిస్థితిని విశ్లేషించేప్రయత్నం చేస్తాను. **"ఇల్లూ-వాకిలి"** అని ఈ కథలకు పేరు పెట్టడాన్ని బట్టి వీటిని రెండు కోణాల్లో అన్వయించుకునే అవకాశం ఉందనుకుంటున్నాను. ఒకటి – ప్రతి ఒక్కరూ తమ ఇంటా బయటా జరిగే సమస్యలతోనే ఈ కథలు చిత్రించారనుకొనే ఆత్మీయతను కలిగి ఉండటం. అంటే' స్వీయ అస్తిత్వ ప్రతిఫలనం'. రెండు– ' ఇల్లు' కేవలం వాచ్యార్థంగా కాకుండా, తన సొంత ప్రాంతం, తన సొంత కుటుంబం, తన సొంత కులం, తన సొంత సంస్కృతి.... వీటి నుండి విడివడి 'వాకిలి'లోకి అంటే బయటి ప్రపంచంలోకి వస్తేనే తన అస్తిత్వమెలా ఉందనేది తెలుస్తుంది. అప్పుడే భిన్న జీవితాల సంఘర్షణ కనిపిస్తుంది. బయట ప్రపంచంతో పోల్చి చూసుకున్నప్పుడే తమ వాస్తవిక స్థితిగతులు స్పష్టమవుతాయని ఈ కథలు మనకు గొప్ప సందేశాన్ని అందిస్తున్నాయనుకుంటున్నాను. వాటిని ఈ పత్రంలో వివరించే ప్రయత్నం చేస్తాను.

## 'ఇల్లూ-వాకిలి' కథల స్వభావం :

బి.యస్.రాములు ఈ *'ఇల్లూ-వాకిలి"* కథల సంపుటిని 2015లో ప్రచురించారు. కానీ ఈ కథల్లో *'ఇల్లూ-వాకిలి'* (2015, *దక్కన్ లాండ్, అంతర్జాల పత్రిక దట్స్ తెలుగు)* పేరుతో రాసిన కథ మాత్రమే 2015లో ప్రచురితమైంది. మిగిలిన 14 కథలూ అంతకు ముందు ప్రచురితమైనవే. *'మనసులు కలిసిన శుభవేళ'* (1999, *ఆంధ్ర ప్రభవారపత్రిక), 'ఎనుకట ఏముండె (1997, ఆదివారం ఆంధ్రజ్యోతి), 'లక్ష్మణ్' (1997, ఆంధ్రప్రభ దినపత్రిక), 'దుస్తులు'(1997, ఇండియా టుడే వారపత్రిక), 'అమ్మ'* పేరుతో1993లో రాసిన తన ఆత్మకథను *'తల్లి సాలు పిల్లదు'* పేరుతో *భూమిక దినపత్రిక* 1995,1996లలో రెండు సార్లు ప్రచురించింది. *'హరి యవ్వనం వారికివ్వు'* రెండు పుటల కథ,2004లో రాశారు. దేనికీ పంపించలేదేమో. దాని ప్రచురణ వివరాలు లభ్యం లేవు. *'మెరుగు' (1997, ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక), 'ముగ్గురు మిత్రులు'(తెల్లబట్ట* పేరుతో 1997 అక్టోబరు నెల *ఆంధ్రజ్యోతి* వారపత్రిక నాలుగు వారాల పాటు ప్రచురించింది.) *'దక్షయక్షం'*(1996 రాసిన ఈ కథ 1997 డిసెంబర్ విపుల మాసపత్రికలో ప్రచురితం), *'మార్పు'* (1995, *ఆదివారం ఆంధ్రజ్యోతి),'చరిత్రహీనులు' (2005), జైలు జీవితం (ఆదివారం వార్త, 2005),' ప్రేమ' (1995, ఆదివారం ఆంధ్రజ్యోతి)* అనేవి దీనిలో ఉన్న కథలు. వీటిలో కొన్ని కథలు వివిధ సంస్థలు ప్రచురించిన వివిధ సంపుటాల్లో కూడా పునః ప్రచురితమైయ్యాయి. వీటిని కథలని రచయిత పేర్కొన్నా, *ముగ్గురు మిత్రులు, దక్షయక్షం* నవలికలుగా చెప్పుకోవచ్చు. వీటిలోని ప్లాట్ కూడా కథ కంటే, నవల లేదా నవలికకు సరిపడేలా ఉంది. అయితే, ముగ్గురు మిత్రులు కథలో స్త్రీవాదాన్నీ, దక్షయక్షంలో నక్సలిజం పేరుతో నలిగిపోతున్నవాళ్ళ జీవితాన్ని చిత్రించడమనేది ఒక కథాంశంగా ఉండడం వల్ల వీటిని పెద్దకథలని కూడా అనొచ్చు. బహుశా అందుకే వీటిని కథలని పేర్కొన్నారు.

బి.యస్.రాములుగారు రాసిన ఈ కథల ప్రచురితమైన కాలాన్ని 1995 నుండి 2015 మధ్యకాలం వాటిగా చెప్పుకునే అవకాశమున్నా, ఈ కథల్లోని జీవితాన్ని, సామాజిక చరిత్రనూ పరిశీలిస్తే, రచయిత పుట్టిన అంటే 1949 కి ముందున్న కాలం నుండి 2015 వరకూ చిత్రించిన అనేక సందర్భాల్ని, సంఘటనల్ని ప్రతిఫలిస్తున్నాయి. రచయిత తన కథలకాలాన్ని వివరిస్తూ *''1970 నుండి సాగిన విప్లవ, దళిత, స్త్రీవాద, తెలంగాణ స్వరాష్ట్ర సాధన ఉద్యమాల ప్రభావం, వాటి తీరుతెన్నులు, వాటి లక్ష్యాలు జీవితంలో ఎలాంటి ప్రభావాన్ని వేశాయో ఈ కథల్లోంచి వెలికితీయాలంటే సామాజిక శాస్త్రాలను అధ్యయనం చేయా''*లన్నారు.(కథల నేపథ్యం, పుటః9)ఈ కథలు వస్తురీత్యా స్వీయ జీవిత అస్తిత్వ ప్రతిఫలనంగా కనిపిస్తున్నట్లనిపించినా పూర్తిగా అదే వాస్తవమని నిర్ధారించే వీల్లేదు. రచయిత *'కథల నేపథ్యం'* గురించి చెప్తూ *"వాస్తవజీవితానికి, కథ సమగ్రత కోసం మరికొన్ని వాస్తవిక సంఘటనలు కలిపి చిత్రించా'*ను (పుట: 9–10) అని స్పష్టంగా చెప్పుకున్నారు. అంతేకాదు మెరుగు కథ గురించి చెప్తూ *"మా కన్నా ముందుతరానికి సంబంధించిన కథ... అందులోని నేను పాత్రనాదే అనుకునే అవకాశం ఉంది"* కనుక ఈ వివరణను ఇస్తున్నానని ప్రకటించారు. శిల్ప నిర్మాణ రీత్యా కూడా వైవిధ్యం కనిపించే కథలు దీనిలో ఉన్నాయి. వీటిని ఈ వ్యాసంలో వివరించే ప్రయత్నం చేస్తాను.

## స్వీయ జీవిత అస్తిత్వ ప్రతిఫలనం:

ఈ కథాసంపుటిలో గల కథల్లో "అమ్మ" పేరుతో బి.యస్.రాములు ఆత్మకథను తెలిపే కథ ఉంది. దీన్ని బట్టి ఈయన 1949 ఆగస్టు 23 వ తేదీన జన్మించారు. (అమ్మ , పుట:72) తండ్రి మిట్టపెల్లి నారాయణ. తల్లి లక్ష్మీరాజు. వాళ్ళ మేనమామ బేతి రాజయ్యగారు ఈయన్ని పెంచుకోవడం ద్వారా తన ఇంటి పేరు మారిపోయింది. "మిట్టపెల్లి" కాస్తా,"బేతి" గా మారిపోయింది. ఈయన పేరు శ్రీరాములు. తన కొత్త ఇంటిపేరుతో "బేతి శ్రీరాములు" అయ్యారు. ఇంటి పేరునీ, తన పేరులోని "శ్రీ"ని పొట్టి అక్షరాల్లో బిగించేసి, బి.యస్.రాములుగా ప్రాచుర్యం పొందారు. తన ఆరో యేట అంటే 1955లో ఆయన తండ్రి చనిపోయాడు.

## మూఢ విశ్వాసాలపై వ్యతిరేకత :

బి.యస్.రాములు గారు అమావాస్య రోజున పుట్టాడట. అమావాస్యరోజున కూతురైతే ఫర్వాలేదుగానీ, కొడుకు పుట్టడం అశుభమని భావించేవారనీ, ఆ మాట నిజం కాదని నిరూపించడానికి తానెంతో ప్రయత్నం చేసినట్లు రచయిత చెప్పుకున్నాడు. దీన్నొక జీవిత పాఠంగా భావిస్తాడు రచయిత. గొప్ప పోరాటంగా అభివర్ణించుకుంటాడు. *"అమావాస్య నాడు పుట్టిన మగ పిల్లడు, నష్టజాతకుడు, వీడి ముఖం చూస్తే జేష్ఠ అంటూ ముఖం చిట్లించేవారు. అనాదరంతో ఈసడించేవారు. నా ప్రతి కదలికను అమావాస్యకు ముడేసి నీచంగా వ్యాఖ్యానించేవారు. నాకది భరించలేని బాధ కల్గించేది. అమావాస్య నాడు మగపిల్లాడు పుట్టకూడదు అని నిర్ణయించిన వాడెవడో వాన్ని తన్నాలని నా చిన్ని కడుపులో చెప్పలేని ద్వేషం రగిలింది.... చిన్నప్పటి నుంచే పెద్దల్ని ఎదిరించటం నా జీవితావసరాల్లో భాగంగా మొదలైంది. పెద్దలకు, వారి సంప్రదాయ విశ్వాసాలకు వ్యతిరేకంగా జీవితంలో చేసిన మొదటి పోరాటం యిది. ఈ అవసరం చేత నా చిన్ననాటి నుండే వాదనా పటిమ అబ్బింది. వాదనతో పాటు వాళ్ళు ప్రేమించే విధంగా నన్ను నేను మలుచుకున్నాను.'* (అమ్మ, పుట: 72–73)

## కులాంతర వివాహలు:

బి.యస్.రాములుగారు పద్మశాలీ కులంలో పుట్టాడు. వీరి తాత ముత్తాతలు చేనేత పని చేసేవారు. కానీ, ఈయన చదువుకొని ఉపాధ్యాయ వృత్తిలోకి వచ్చాడు. తన పద్మశాలీ కుటుంబంలో గౌడ కులస్తులతో కూడా వివాహాలు జరిగినట్లు చెప్పుకున్నాడు. ఈయన నడిపినాన్న కూతురు ముప్పయి యేళ్ళ క్రితమే ఒక గౌడను కులాంతర వివాహం చేసుకుంది. అయితే, ఆమెకు పుట్టిన పిల్లల పెళ్ళిళ్ళు అన్నీ గౌడ కులస్తులతోనే తప్ప మరలా పద్మశాలీలతో జరగనందుకు విచారాన్ని వ్యక్తం చేస్తాడు రచయిత.

## పద్మశాలీల జీవన దృశ్యాలు:

ఈయన కొన్ని కథల్లో పద్మశాలీల జీవితాల్లోని కొత్తకోణాల్ని చూపించారు. తన జీవితానుభవం కూడా పద్మశాలీల జీవితాల్లోని చీకటి కోణాల్ని వర్ణించడానికి తోడ్పడి ఉండొచ్చు. "*. ...నాన్న యింటి వద్దే బట్టలు నేస్తుండేవాడు. నూలుకు రంగులు అద్దే పని కూడా చేసేవాడు. మా యింట్లో బట్టలు నేయడం మానేసి నలభై యేళ్ళయిపోయింది. ఇంట్లో యిప్పటికీ ఆనాటి "యిసిరెలు" (పనిముట్లు) కొన్ని గత చరిత్రకు సాక్ష్యాలుగా మిగిలిపోయాయి*" (**అమ్మ**, పుట: 75) అని తన పద్మశాలీ కుటుంబం గురించి చెప్పుకున్నారు.

పద్మశాలీ కుటుంబంలో పడే కష్టాలను కొన్నికథల్లో వర్ణించారు. "*పడుగు సరిచేసుకోడానికి సందులో ఇక్కడకెల్లి అక్కడికి ఎరుకల కుంచె పట్టుకొని గంజి కాచి పడుగు సరిచేస్తుంటే గంజివాసన అని, ఈగలు అని, ఈ జాగ నీది కాదని ఉప్పిచ్చేటోల్లు. కష్టపెట్టేటోల్లు. ల్యాకబద్దలు కింద ఉంటే కాల్లకు తాకుతున్నయని అటు ఇటు కోపంగా పారేసేటోల్లు. గంజి వాసన వశపడుతులేదని నానామాటలు అనెటోల్లు*" (**ఇల్లూ-వాకిలి**, పుట: 14)

ప్రస్తుతం చేనేత పనిలో అనేకమైన కొత్త పద్ధతులు వచ్చేశాయి. పూర్వం పడుతున్నంత శ్రమ అవసరం లేదు. కానీ పూర్వం చేనేతపనివారి కష్టనష్టాలు, చుట్టుపక్కల వాళ్ళు చేనేత వారిని చీదరించుకునే పరిస్థితుల్నీ రచయిత లోతైన పరిశీలనతో వర్ణించాడు.

పద్మశాలీలపై పెత్తందారీతనం:

తెలంగాణాలోని కొన్ని ప్రాంతాల్లో దొరలకు చాలా కులాలు, వృత్తుల వాళ్ళు వెట్టి చేసినట్లే, చేనేత కుటుంబాల వాళ్లు కూడా ఆ దౌర్జన్యాలకు గురైనవారేనని రచయిత "ఎనుకట ఏముండె" కథలో స్పష్టంగా చెప్పారు. పరదేశీ పాలన పోయినా దొరల పెత్తనం తెలంగాణాలో చాలా కాలం కొనసాగింది. ఆ కాలంలో దొరల దౌర్జన్యాన్ని ఈ కథలో రచయిత ఎంతో విశ్లేషణాత్మకంగా వివరించాడు. సెలవుల్లో జగిత్యాలకు చుట్టు ప్రక్కల 14 కిలోమీటర్ల దూరానికి మల్లేశు కుటుంబం పిక్నిక్ కి వెళ్తుంది. అక్కడ ప్రజలంతా సుఖసంతోషాలతో తింటుంటే, ఒక పెత్తందారీ కుటుంబానికి చెందిన అంజయ్య చాలా బాధపడిపోతాడు. తనలో తానే మాట్లాడుకుంటూ దేశంలో స్వేచ్ఛ ఎక్కువైపోయిందనీ, మిలటరీ పాలన రావాలనీ అరుస్తుంటాడు. ఆ సందర్భంలో మల్లేశం తన తల్లిని 'మన ఇళ్ళల్లో బగార (పలావు) అన్నం ఉండేదా అమ్మా" అని అడుగుతాడు. అప్పుడు తల్లి తన కాలంలో ఎలా ఉండేదో చెప్తుంది. "*ఎనుకట మనిండ్లల్ల ఏం ఉండేది బిడ్డ? పడుగు సరిచేసుకోవడానికి కాసిన గెంజి.అంబలి తాగి బతికిన ఎడ్డికాలం. మా నాయిన చెప్తుండె. ... ఎనుకట అన్నం దొరకక రేగడిమట్టి తిన్నరట.....గా కాలం గుర్తుచేయకు బిడ్డా....పటేండ్లు, పట్వారీలు, దొరలు ఎంత గోసపోసుకున్నరో నీకేం ఎరుకరా...వాల్లకు కోరిన తీరుగ బట్టలన్నీ సొంతంగా నూలు కొనుక్కచ్చి నేసి యియ్యాలె... పైసలు అడుగ వశుమా...పబ్బతివట్టి (రెండుచేతులతో దండంపెట్టి) వంగివంగి నిలబడాలె.... నోటితోటి అడిగేది లేదు..అడుగుతే కతమేనాయె...*" *(ఎనుకట ఏముండె, పుట: 40)* ఇలాంటి సంఘటనలెన్నో ఈ కథలో వర్ణించాడు రచయిత. పద్మశాలీలపై నాటి పటేళ్ళు, దొరలు, పట్వారీల దౌర్జన్యాలకు నిదర్శనంగా నిలుస్తుందీ కథ.

ఎస్వీసత్యనారాయణ ఈ కథ గురించి గతితార్కిక చారిత్రక భౌతికవాద దృష్టి తో చక్కగా వ్యాఖ్యానించారు."చాలామంది వెనుకటి కాలం బాగుండేదని వాపోతున్నారు అది గతితార్కిక చారిత్రక భౌతికవాదాన్ని కి విచిత్రమైన ఆలోచన సమాజం ముందుకు సాగుతూ ఉంటుంది అభివృద్ధి చెందుతూ ఉంటుంది బాగుంది అనే వారు పాలకవర్గాలు దోపిడీ వర్గాలు అన్ని అనుభవించిన ఆధిపత్య అగ్రవర్ణ అగ్రకులాల వారు ఉంటారు అవి కోల్పోవడం వారికి సహజంగానే కష్టం వేస్తుంది అందుకని కాకుండా టి కాస్ట్ కాకుండా తమ ఆధిపత్యాన్ని కొనసాగించడానికి గతాన్ని గత చరిత్ర వైభవాన్ని ఆరాధిస్తూ అపూర్వమైనది గా కనిపిస్తూ వస్తుంటారు"

## బతుకమ్మ పండుగ-పెత్తందారుల అకృత్యాలు:

ఒకప్పుడు బతుకమ్మ పండుగను కూడా కొంతమంది పెత్తందారులు తమ స్వార్థానికి ఎలా ఉపయోగించుకునే వారు కూడా ఈ కథలో తెలియజేశాడు కథకుడు. "*ఊరోల్లందరూ గల్సి దొరల, పట్వారి పటేలు యిండ్లల్లకు బతుకమ్మలు తీసుకొని ఆడటానికి పోవాలె... ఆన్లకెల్లి మంచిగా కనపడ్డోల్లను వాల్లు ఎప్పుడు యింటికి పిలిసి పట్టెమంచం ఎక్కుమంటరో తెలువది...గొడ్లకొట్టంలనో, పెరట్లో మంచెలకాడనో... ఎక్కడకు గుంజుకు పోతారో తెలువది.... మంచి చీర కట్టుకొని భయం తెల్వది... మంచి చీర కట్టుకోను*

*భయం...ఎవనికంట్ల మన్నుపడతదో...తెలువది...నన్ను గేట్లు చిన్న దొర గుంజిండని... ఓ రాత్రి పొలం నుంచి రాంగ మీనాయిన్న మా అన్న గాడు, తమ్ముడు గల్సి పొట్టు పొట్టుతోమి, పురుసోల్లు (పురీషాలు)వడివెట్టి చెయ్యి యిరుగ్గొట్టి ఆ ఊరు యిడిసి పెట్టి యిప్పుడున్న ఊర్లెకు బతుకవచ్చినం....'* (పుట:41) పీడిత కులాలు, పీడిత వర్గాలు ఒకవైపు దొరలు, మరొకవైపు స్వీయవర్గంలోనూ ఎలా పీడనకు గురికావలసి వచ్చేదో ఈ కథలో బతకమ్మ పండుగ, బతకమ్మ పేరుతో జరిగే అత్యాచారాలను ప్రస్తావించిన సందర్భం తెలియజేస్తుంది.

## తత్త్వ వేత్తగా ఎదగడంలో పెదనాన్న ప్రభావం:

బి.యస్.రాములు తానొక సామాజిక తత్త్వవేత్తగా రాసుకుంటారు. దానికి కారణాన్ని అన్వేషిస్తే 'అమ్మ' కథలో కొంత ఆధారం దొరుకుతుంది. ఈయన పెదనాన్న పేరు మెట్టపల్లి రాజయ్య. తొలుత బట్టలు నేసేవాడు. కొంత చదువుకున్నప్పటికీ, తర్వాత 'అచల గురువు'గా మారిపోయాడు. సుమారు ఎనభైయేండ్లవరకూ జీవించాడు. ఆయన సమాధిని కొంతమంది శిష్యులు పవిత్ర గుడిగా భావిస్తూ పూజలు చేస్తుంటారు. బి.యస్.రాములుగారు తత్త్వవేత్తగా ఎదిగిన క్రమాన్ని చెబుతూ '*నేను తత్త్వవేత్తగా ఎదగాలనుకోవడంలో పెదనాన్న ప్రభావం ఉంది. మేనమామ ప్రభావం కూడా కొంతలేకపోలేదు*" అని అన్నాడు. (అమ్మ, పుట:74). నిజంగా బి.యస్.రాములు తాను తత్త్వవేత్తగా రాసుకోవడం కాదుగానీ, ఆయనెంత తత్త్వవేత్తో తెలియాలంటే ఈ కథాసంపుటిలో"మాయ–ప్రేమ" కథను చదవాలి. రెండు ప్రధానమైన తాత్త్విక భావనలతను పాత్రకు పేర్లు పెట్టి, దానిలో మానవులు ప్రేమకీ, మాయకీ మధ్య గల భేదాల్ని తెలుసుకోలేక సతమతమవుతున్న తీరుని చర్చించిన తీరు తాత్త్విక స్థాయిలో కొనసాగింది. బుద్ధుని ప్రేమకీ, ఆచార్య నాగార్జునుని శూన్యవాదానికీ, శంకరాచార్యుల వారి మాయావాదాన్ని ప్రస్తావిస్తూ ఈ కథనం సాగుతుంది. ఈ కథనిజంగా గొప్పతత్త్వసంబంధమైంది. ఇలాంటి గొప్పకథలు రాసినందుకే ఈయన్ని తత్త్వవేత్త అనకతప్పదనిపిస్తుంది.

## నక్సల్ పోరాటాలు: పీడితవర్గాల ప్రతిఫలనం:

'ఇల్లూ–వాకిలి' కథల సంపుటిలో మొత్తం కథలన్నింటినీ చదివితే ఒకవైపు బి.యస్.రాములు చిన్ననాటి నుండి, ఒక తత్త్వవేత్తగా ఎదిగేవరకూ వివిధ పరిణామాలు కనిపిస్తాయనుకోవచ్చు. మరొకకోణంతో పరిశీలిస్తే, తెలంగాణ ప్రాంతజీవన పరిణామాన్ని కొన్ని కుటుంబాలు లేదా ఒక కుటుంబాన్ని ఆధారం చేసుకొని చెప్పినట్లనిపిస్తుంది. తెలంగాణేతర ప్రాంతాల నుండివచ్చి, ఈ ప్రాంతంలో రియల్ ఎస్టేట్ వ్యాపారం కొనసాగించి, కోట్లాది రూపాయాలు సంపాదిస్తుంటే, ఇక్కడే పుట్టి, ఇక్కడే పెరిగిన వాళ్ళు కనీసం నివసించడానికి కూడా స్థలం కొనుక్కోలేని పరిస్థితి కూడా ఈ కథల్లో ప్రతిఫలిస్తుంది. ఇంకొకవైపు తెలంగాణాలో వచ్చిన నక్సల్ పోరాటాల పరిణామక్రమాలు కూడా కనిపిస్తాయి. నక్సల్స్ పోరాటాల్లో బలయ్యే పీడిత వర్గాల గురించీ ఎంతో సునిశితమైన పరిశీలనతో రాసిన కథలు దీనిలో ఉన్నాయి. కొన్ని కులాలు ఎక్కువున్నా తమ ఆధిపత్యాన్ని చెలాయించుకునే స్థితినీ, కొన్ని కులాలెక్కువున్నా అణచివేతకు గురయ్యే పరిస్థితులనూ ఈ కథలు విశ్లేషిస్తాయి. నక్సల్ పోరాటాల్లో నుండి బయటకు వచ్చిన పీడిత వర్గాలు, కులాలు మరలా సమాజంలో కూడా ఎలా పీడనకు గురవుతున్నాయో వివరించిన కథలు దీనిలో ఉన్నాయి.

అవకాశమున్న ఉద్యోగులు లంచాలకు పాల్పడితే వారిని నక్సల్స్ కూడా అవకాశం దొరికినప్పుడు ఏ విధంగా శిక్షిస్తారో **"దుస్తులు"** కథలో వివరించాడు రచయిత. అధికారాలు లేని మనుషులు ఎంత స్వచ్ఛంగా ఉంటారో అధికారం వచ్చిన తర్వాత కొంతమంది ఏ విధంగా కృతకంగా తయారైపోతారో ఈ కథ వివరిస్తుంది. దీన్ని రచయిత ఎంతో చక్కని శిల్పంతో వర్ణించాడు. తెలంగాణలోని దొరల పెత్తనదారీ విధానాన్ని చిత్రించిన కథ **"మెరుగు"** సామాజిక, ఆర్థిక వ్యత్యాసాలు మానవుల మధ్య ప్రేమాభిమానాలను, సంబంధాలను ఎలా దెబ్బతీస్తాయో '**ముగ్గురు మిత్రులు**' కథ చెప్తుంది. కథలో అన్ని విధాల ఈసంఘర్షణకు గురయ్యేది స్త్రీ మాత్రమేనని రచయిత వివరిస్తాడు. పోలీసుల దురాగతాలు, కోర్టుల పనితీరు, సామాన్య ప్రజల పట్ల అగచాట్లు, పెత్తందారుల దౌర్జన్యాలు...వాటిలో న్యాయం, చట్టం, శాసనం ఎలా బలైపోతుందో **దక్షయజ్ఞం** కథలో మనకు కళ్లకు కట్టినట్లు చూపిస్తాడు రచయిత. ముగ్గురు మిత్రుల కథాకథనం ఎంతో ఆసక్తిగా సాగింది.

## సాహిత్యపరిణామగతుల ప్రతిఫలనం:

కేవలం సమాజం మాత్రమే కాకుండా, సమాజంలో సాహిత్యసంబందాలెలా ఉన్నాయో, సాహిత్యపరిణామాలెలా కొనసాగాయో కూడా కొన్ని కథల్లో విశ్లేషించాడు రచయిత. తెలుగుసాహిత్యంలో వచ్చిన స్త్రీవాదంలో గల భిన్న దృక్పథాల్ని దీనిలో వివిధ పాత్రల రూపంలో విశ్లేషించాడు రచయిత.రచయితలు తమ జీవిత కాలంలో రాసిన రచనల పట్లా, తమ భావజాలాల పట్లా తీసుకునే జాగ్రత్తలను, వారి అభిప్రాయాలను తెలుసుకోవడానికి **"లక్ష్మణ్** '' కథ సజీవ ఉదాహరణగా నిలుస్తుంది.

మధ్యమ పురుష కథ రాయటం చాలా కష్టం. కానీ, బి.యస్.రాములు' దక్షయజ్ఞం' కథను మధ్యమ పురుషలో రాశాడు. నక్సలైట్ల పేరుతో సామాన్య ప్రజలను పోలీసులు ఎలావేదిస్తారో ఈ కథ మనకు కళ్లకు కట్టినట్లు వివరిస్తుంది. అనేక కథలలో నక్సలైట్ల కార్యకలాపాలను దాంట్లోని మంచి చెడులను బి.ఎస్.రాములు చాలా స్పష్టంగా వివరించాడు. ఆ కోవకు చెందిందే దక్షయజ్ఞం కథ కూడా! **దక్షయజ్ఞం** కథ చదువుతుంటే సమాజంలో పీడిత వర్గాలు అటు అజ్ఞాతం లోనూ ఇటు సమాజం లోనూ ఎంత భయంకరంగా చిత్రవధకు గురి అవుతున్నాయి కళ్లకు కట్టినట్లు కనిపిస్తోంది. ఒక భయానక వాతావరణం మన కళ్ళముందు కదులుతున్నట్లనిపిస్తుంది. కష్టాలు తీరుతాయని నక్సలిజం లోకి వెళ్లే వాళ్లు కొంతమందైతే, కష్టాలు తీరకపోగా మరిన్ని కష్టాలకు గురైన వాళ్ళు మరికొంతమంది కనిపిస్తారు. అజ్ఞాతంలో ఉన్న సమాజంలో ఉన్న కొన్ని కులాలు కొన్ని వర్గాలు పెత్తనాన్ని చెలాయిస్తున్నాయనే ఆంతరంగిక విషయాలు ఈ కథలో స్పష్టంగా వివరించడం కనిపిస్తుంది.

మొత్తం మీద బి.యస్.రాములుగారి జీవితం, తెలంగాణ ప్రాంతంలో గల వివిధ సమస్యలు, తెలంగాణలో నక్సలిజం పోషించిన పాత్ర, దానిలోని లోటుపాట్లు వంటి అనేకాంశాలు ఇల్లూ-వాకిలి కథాసంపుటిలో ప్రతిఫలిస్తాయి. రచయిత **తాత్త్వికతతో** పాటు, రచనాశిల్పం, వస్తువైవిధ్యంలో తీసుకునే జాగ్రత్తలు కూడా ఈ కథాసంపుటి ద్వారా తెలుసుకునే అవకాశం కలుగుతుంది. రచయిత కథల నేపథ్యాన్ని చెప్తూ" *ఒక ఉద్యమ భావజాలాన్ని ముందుకు తీసుకునిపోతూ అనేక దృక్పథాలు, కష్టసుఖాలు, ఆనందవిషాదాలు*" (బి.యస్.రాములు " **కథల నేపథ్యం**", ఇల్లూ-వాకిలి) 'ఈ కథల్లో ప్రతిఫలిస్తున్నాయి. తెలంగాణను అర్థం చేసుకోవడానికి ఈ కథలు దోహదపడతాయి.

# పురాణాలు - కుటుంబ జీవనం

- ఎ.కె.వేణుగోపాల్ రెడ్డి
శాఖాధ్యక్షులు, తెలుగుశాఖ
ద్రావిడవిశ్వవిద్యాలయం -కుప్పం

ఆది మానవుడు కొండ గుహల్లో ఒంటరిగా జీవిస్తూ, జంతువువలె ఆహార సంపాదన చేస్తూ, క్రూర మృగాల వలె ప్రవర్తిస్తూ, సంతానాన్నికంటూ, సమాజదశ కు పరిమితమైన జీవన విధానంలో నుండి, సంఘటితంగా మానజాతికి చెందిన స్త్రీలు, పురుషులు, పిల్లలు, ముసలివారు అందరూ కలసిమెలసి ఒకానొక చోట స్థిరపడి జీవించే సమాజదశ వైపుగా సాగించిన సుదీర్ఘప్రయాణంలో ఎన్నో డక్కా ముక్కీలు తిని తిని, రాటుదేలి సాధించిన మహాఫలమే కుటుంబమనే అమృతఫలం.

ఈ నిరంతర అన్వేషణలో సుకుమార శరీరంతో, సున్నిత భావాలతో కూడిన స్త్రీమూర్తి సాహచర్యం, కరుడుగట్టిన పురుషుని మనస్సును మెత్తని మైనపు ముద్దగా చేసి కుటుంబానికి ఉపయోగపడే విధంగా మలచుకొన్న గొప్ప నిర్మాణ శిల్పి అతని భార్య (లేదా) ఇల్లాలు. అనుదిన జీవితానుభవం నుండి ప్రోది చేసుకొన్న ఈ సఖి-ప్రేయసి అనే భావన అతని హృదయంలో పుక్కిలింతలు కాగా, ఆ మధురోహలలో అతడు ప్రేమానురాగాలంటే ఏమిటే తెలుసుకోవడమే కాదు, జీవిత కష్టనిష్ఠూరాలనుండి, సుఖదుఃఖాల నుండి మానవత్వం అంటే ఏమిటో, మానవీయ విలువలైన ప్రేమ, కరుణ, దయ, జాలి, స్నేహం కృతజ్ఞత, పరస్పర సహకారం, జీవకారుణ్యం వంటి సామాజిక జీవిత విలువల్ని తెలుసుకున్నాడు. గృహ సంబంధమైన కార్యకలాపాల్లో నిమగ్నుడయ్యాడు. బాధ్యతలను గుర్తించాడు.

పురుషుడు కుటుంబ జీవనానికి ఆలంబనంగా స్వీకరించిన స్త్రీమూర్తిలోని విభిన్న, విలక్షణ, విశిష్ట దశావిశేషాలలో అతనిలో మాతృత్వ లాలన అనే దివ్యపార్శ్వాన్ని కూడ చవిచూపింది. ఈ దివ్య పార్శ్వమే అతనిలోని క్రౌర్య, దౌర్జన్య, హింసాత్మక ప్రవృత్తి, ఆటవిక లక్షణాలు పోయి, మానవీయ లక్షణాలు కలిగిన ఒక నాగరికుడుగా, ఉత్తమ పౌరుడుగా, సంతాన సంరక్షణ, మాతాశిశుపోషణలే ప్రధాన కర్తవ్యంగా ఒక చోట స్థిరనివాసంగా ఉండాలనే దృఢాభిప్రాయానికి దారితీయడంతో కుటుంబ వ్యవస్థకు తొలి బీజం పడిన క్షణాలుగా గుర్తించవచ్చు.

భారతదేశంలో ప్రతి గ్రామానికి ఒక బొడ్డురాయి (బొడ్రాయి) ఉండేటట్లు, ప్రాచీన భారతీయ సమాజానికి కుటుంబం, నాభి లేక బొడ్డు. ప్రాచీనమే కాక - మధ్యయుగం - ఆధునిక యుగానికి కూడ కుటుంబమే నాభి.

**కుటుంబం**

కుటుంబమంటే నేడు భావిస్తున్న భార్య, భర్త, పిల్లలు కాదు. తాతముత్తాతలు, అమ్మమ్మలు, జేజమ్మలు, నాయనమ్మలు, పినతండ్రులు, అన్నలు, వదినెలు, అక్కాచెల్లెళ్లు, బావలు ఇలాంటిది.

కుటుంబంలోని బంధుత్వాలు కుటుంబ వ్యక్తులమధ్య సంబంధాన్ని, ఆత్మీయతను, అనురాగాన్ని, గౌరవాన్ని పెంపొందిస్తాయి. తరతరాలుగా అనుసరిస్తూ వస్తున్న అచారవ్యవహారాలు, సంస్కృతీ సంప్రదాయాలతో కూడిన భారతీయ కుటుంబ వ్యవస్థకు ప్రపంచంలోనే అత్యంత విశిష్టమైన స్థానం ఉంది.

**కుటుంబవికాసం**

అన్నివిధాల అభివృద్ధిచెందడమే కుటుంబ వికాసం. కుటుంబ సభ్యులు విద్యాసాంస్కృతిక ఆర్థిక వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తేనే సమాజం అభివృద్ధి చెందుతుంది. అలాగే కుటుంబంలోని వారందరూ క్రమశిక్షణ, ప్రేమానురాగాలు, సహకారం మొదలైన సద్గుణాలు అలవరచుకొంటే సమాజంలో మానవ సంబంధాలు మెరుగుపడతాయి.

కుటుంబ సంక్షేమం కోసం పురుషుడు చేసే ప్రతిపనిలోను భార్య భాగం పంచుకొంటుంది. భర్తకు సన్మానం చేయవలసివస్తే భార్యను పక్కన కూర్చోపెట్టి సత్కారం చేస్తారు. పురుషుడు ఉన్నత పదవులు అలంకరిస్తే అతని భార్యకు గౌరవ మర్యాదలు పెరుగుతాయి. వివాహం స్త్రీ స్థాయినీ, స్థానాన్ని పెంచుతుంది. అంతవరకు ఒకరికి కూతురుగా ఇంట్లో సభ్యురాలుగా ఉన్న ఆమె పెళ్లి కాగానే ఒకరి ఇల్లాలుగా ఇంటి యజమానురాలుగా మారుతుంది. ఇల్లు, ఇంటిపేరు, గోత్రం అన్నీ మారుతాయి.

**"గృహిణీ గృహముచ్యతే!"**

ఇది ఒక సంస్కృతసూక్తి. ఇల్ల అంటే ఇల్లాలే. ఇల్లాలు అంటే ''ఇల్లు'' అని దీనికర్థం. దీనిననుసరించే, 'ఇల్లు చూడు, ఇల్లాలిని చూడు' అనే లోకోక్తి ఏర్పడిరది. సమాజానికి కీలకం కుటుంబం ఐనట్లుగా, కుటుంబానికి కీలకం ఆ ఇంటి ఇల్లాలే! ఇల్లాలిని బట్టి ఇంటిలోనివారి ప్రవర్తన ఆధారపడి ఉంటుంది. భర్త మొదలుకొని, బంధువర్గంలోనివారు, పిల్లలు, స్నేహితులు, వీరందరి యోగక్షేమాలు అనుక్షణం గమనించే, ఇల్లాలే వారి ప్రవర్తనల్లో పరివర్తన తీసుకురాగలిగిన శక్తి సామర్థ్యాలు గలిగి ఉంటుంది.

ఒక ఎడ్లబండినే ఉదాహరణకు తీసుకుందాం. బండికి గల రెండు చక్రాలలో ఒక చక్రం 'పురుషు'డైతే, రెండవచక్రం 'స్త్రీ' అన్నారు కొందరు. రెండు చక్రాలు తిరిగితేనే సంసారమనే బండి సజావుగా నడుస్తుంది. ఇందులో చక్రానికి 'నాభి' ''ఇరుసు'' ఎంత ముఖ్యమో, కుటుంబమనే బండి చక్రానికి స్త్రీ అంతే ముఖ్యం. మరికొందరు, ''పురుషుడే కదా కుటుంబ భార వాహకుడు'' అన్నారు. సరే, ఒప్పుకుందాం! మరి, ఇల్లాలు ఎవరు? అంటే, ఆ కుటుంబమనే బండి చక్రపు ఇరుసుకు వేసిన 'అడ్డచీల' (ఆణి) (తమిళంలో దీన్నే 'అచ్చాణి' అంటారు) ఇల్లాలు 'అచ్చాణి' వంటిది. ఇరుసుకు ఎంత కందెన వేసినా, 'అడ్డకమ్మి' లేకపోతే చక్రాలు రెండూ అటూ, ఇటూ నేలకొరిగిపోతాయి. గృహస్థుని గౌరవమర్యాదలు సమాజంలో ఆయన కీర్తి ప్రతిష్ఠు, పరపతి, నిజాయితీ, పెద్దమనిషిగా చేసే లావాదేవీలు, పెత్తనాలు, తగాదాలలో తీర్పు "ఈ బహుముఖ ప్రజ్ఞాపాటవాలన్నీ ఇల్లాలు మౌనముద్రతో చేస్తున్న మహాత్యాగం మీదనే ఆధారపడి ఉంటుంది. వాల్మీకి రామాయణంలోదశరథుడు శంబరాసురునిపై

యుద్ధానికి పోతూ కైకేయిని తీసుకొనిపోగా, రథచక్రానికి, గల అడ్డకమ్మి ఊడిపడిపోగా దానికి బదులుగా తన వేలిసే 'అడ్డకమ్మి'గా అమర్చి విజయానికి కారకురాలైందని పురాణకథ. ఒక స్త్రీమూర్తి చేసే త్యాగం పురుషుని విజయానికి కారణమౌతుందన్న సత్యం విస్మరింపరానిది. దీనికి మరో పార్శ్వం కూడ ఈ కథా సన్నివేశంలోనే ఉంది. దశరథుడు కైకకు అప్పుడిచ్చిన రెండు వరాలు, ఆ దశరథునికి ప్రాణాంతకమై ఆయన కుటుంబానికి ప్రళయాంతకం కావడం వల్లనే, 'స్త్రీ బుద్ధీప్రళయాంతకః' అనే సూక్తి ఏర్పడిరది. కుటుంబం బతికి బట్టకట్టాలన్నా, సర్వనాశనం కావాలన్నా అది స్త్రీమూర్తియొక్క అనుగ్రహం మీద ఆధారపడి ఉంటుంది. వాల్మీకి రామాయణం మొత్తం స్త్రీశక్తియుక్తులపై ఆధారపడి రచింపబడిన మహాకావ్యం. మందర, కైక, శూర్పణఖ, సీత, మండోదరి, తార, అహల్య మొదలైన స్త్రీల మీదనే రామాయణమంతా నడిచింది. ఎన్ని ఒడిదుడుకులున్నా, కష్టనిష్ఠూరాలున్నా అన్నిటినీ సహించి రాముడు విజయాన్ని సాధించాడు.

గృహిణి యొక్క నేర్పరితనం, వాక్చాతుర్యం, చాకచక్యం, తెలివితేటలు, సమయస్ఫూర్తి, నిశిత పరిశీలనాశక్తి, ఓర్పు తీర్పు వల్లనే కుటుంబం చెదరిపోకుండా, విచ్ఛిన్నం కాకుండా స్థిరంగా నిలబడగులగుతున్నది.

భారతీయ ధర్మశాస్త్రాల ప్రకారం, ఇంట్లో ఏ శుభకార్యం జరిగినా భర్తతోపాటు, భార్యవిధిగా కూర్చోవాలి! భార్యా సహితుడైన పురుషుడినే 'గృహస్థుడు' అంటారు. భార్య, భర్తకు 'అర్థాంగి'. కనుక ధర్మకార్యాల్లో ఆమె తోడ్పాటు, సమ్మతి, సాహచర్యం తప్పనిసరి. అందుకే భార్యను 'సహధర్మచారిణి', ధర్మనిర్వహణంలో సహకరించేది అని అర్థం! "సహధర్మిణి" అని కూడా అంటారు.

దేవాయాలలో సంప్రదాయబద్ధంగా జరిగే సేవాకార్యక్రమాలలో 'గృహస్థుడైన' వానికే ప్రాధాన్యం ఇవ్వబడిరది. భార్యా సమేతుడై వచ్చిన భర్తే దేవాలయసేవలో పాల్గనే యోగ్యత కల్గి ఉంటాడు. భార్యను తీసుకురాకుండ సేవాకార్యక్రమంలో హాజరవుతానంటే అనుమతించరు. పైగా సామాన్య భక్తుల మధ్యలో కూర్చొని చూడమంటారు.

అలాగే ఒక గృహస్థుడు తీర్థయాత్రలకు, నదీపుష్కర స్నానాలకు పోతున్నప్పుడు భార్యను వెంటబెట్టుకొని వెళ్లాలే తప్ప ఒంటరిగా పోకూడదు. అందువల్ల తీర్థయాత్రాఫలం దక్కదని గృహస్థుడు గ్రహించాలని ధర్మశాస్త్రాలు ఘోషిస్తున్నాయి.

కుమార్తెకు వివాహం చేస్తున్న సందర్భంలో, ముఖ్యంగా కన్యాదాన మహోత్సవంలో భార్యాభర్తలిద్దరు కలిసి వరునికి కన్యాదానం చేయాలి. భర్త గంగాజలాన్ని చేతులపై నుండి పోస్తూ, కన్యను సాంకృతంచేసి, ఉదక పూర్వక ధారాదత్తం చేస్తున్నప్పుడు భార్య కళాన్ని తన రెండు చేతులతో పట్టుకోవాలి. ఎటువంటి పరిస్థితులలోన పురుషుడొక్కడే 'కన్యాదానం' చేయకూడదు. గృహస్థునికి భార్యలేని పక్షంలో అతని తమ్ముడు భార్యా సహితుడై చేయాలి లేదా భార్యవైపు మేనమామ భార్యా సహితుడై కన్యాదానం చేయాలి.

**వివాహమనేది దాంపత్యంలో ఒక యోగమే కాని భోగం కాదు**

భారతీయ సంస్కృతిలో వివాహం, షోడశ సంస్కారాలో అతిముఖ్యమైన సంస్కారం. వివాహమనేది దాంపత్యంలో ఒక యోగమేగాని, భోగంకాదు. వివాహమనేది భార్యభర్త మనోవృత్తులను సంయతమొనర్చి వారిరువురు కలిసియే ధర్మబద్ధమైన అర్థకామాదులను ఆచరించడానికి ఏర్పడింది. కనుక, వరునిచేత వివాహంలో ''ధర్మేచ అర్థేచ కామేచ నాతి చరామి'' అని ప్రతిజ్ఞ చేయిస్తారు. వివాహ సందర్భంలో తల్లిదండ్రులు ఉభయవంశములను గూర్చి ఆలోచిస్తారు. తెలుగునాట, వియ్యము, కయ్యము, నెయ్యము సమానులతో చేయాలనేది సామెత. వివాహ విషయాలన్నీ రాయబారం లేదా మధ్యవర్తిత్వం ద్వారా జరగాలనేది మన సంప్రదాయం.

ఈనాటి యువతీయువకుల్లో విశేషించి యువతులు జీవితానికి వివాహం అవసరమని భావించడం లేదు. వారు కేవలం ఆర్థిక స్వాతంత్ర్యమే జీవిత ధ్యేయంగాను, పెద్దపెద్ద పదవులు పొంది అధికారం చెలాయించడంలోను ఎక్కువ మక్కువ చూపుతున్నారేగాని వివాహమనేది ఒక సామాజిక బాధ్యత (Social Responsibility) అని తెలుసుకోవడంలేదు. స్వతంత్రంగా జీవితాన్ని గడపాలనే ఇచ్ఛగలవారెప్పుడు శరీరం జవసత్త్వాలు బాగున్నప్పుడు అహంకారంతో, అహంభావంతో విర్రవీగినా అరవైయేండ్లు దాటాక మానసిక క్రుంగుబాటు (Mental Deprssion)కు లోనై అకాలమరణం పొందుతారు. మానసికస్థైర్యం వయస్సు ఉడగడంతో క్రుంగిపోతుంది. దీన్ని తెలుసుకొని నలైయేండ్ల లోపల వివాహం చేసుకోవడం మేలు. ఎనభై సంవత్సరాల పైబడి జీవించవచ్చు. ఆడపిల్లలు మూర్ఖపు పట్టుదలే కాదు వారి తల్లిదండ్రులు కూడ ఆమె పతనానికే ప్రోత్సహిస్తున్నారు. వారి జీవితం వివాహంతో స్థిరపడింది. మరి తమబిడ్డ జీవితం ఒంటరితనంలో మగ్గిపోవలసిందేనా? అన్న ప్రశ్న వారిలో ఎందుకుతలెత్తడం లేదో తెలియడం లేదు. ఒంటరి జీవితం స్త్రీకి నిషిద్ధం - ఏ వయస్సులో ఉన్నా ఎల్లప్పుడు స్త్రీకి రక్షణ ఉండితీరాలి 'స్త్రీ' 'పుట్టుక' మొదలుకొని 'మరణం' వరకు ఒకరి సంరక్షణలో ఉండాలి అని మనువు అభిప్రాయం. ఏ క్షణమైనా ఆమె శీలానికి భంగం ఏర్పడవచ్చు. అది వంశానికి తీరని కళంకం తెచ్చిపెడుతుంది. బాల్య, కౌమారదశల్లో తండ్రి సంరక్షణలోను, యౌవనదశలో భర్త రక్షణలోను, వార్ధక్యంలో కుమారుని రక్షణలోను స్త్రీ ఉండాలి. ఎటువంటి సంక్లిష్ట పరిస్థితుల్లోను ఆమె స్వతంత్రించి ఒంటరి జీవితం గడపరాదు. దీనికి విరుద్ధంగా ఈనాటి సమాజంలో ఒంటరిగా ఉన్న స్త్రీలు కోకొల్లలుగా ఉండడంచేత, ఆర్థిక స్వాతంత్ర్యమనే పేరుతో అదుపాజ్ఞలు లేకపోవడం వలన నిన్న మొన్నటి వరకు యువతులపైన అత్యాచారాలు మానభంగాలు విచ్చలవిడిగా వికృతచేష్టలతో జరుగుతున్నాయి. మరీ, ఇటీవలి కాలంలో స్త్రీ శిశువుపైన, ముసలివారిపైన కూడ వయో తారతమ్యం లేకుండా యువకులే కాదు ముసలివారు కూడ అత్యాచారాలకు పాల్పడుతున్నారు. విశృంఖల ప్రవర్తనకు యువతుల వికృతవేషధారణలు తోడై అగ్నికి ఆజ్యం పోసినట్లు వావి వరుసులు లేని మానభంగాలకు అంతులేకుండా పోతున్నది. కొత్త ప్రియుడి కోసం భర్తను, పిల్లల్ని

చంపే గృహిణుల సంఖ్య నానాటికీ పెరుగుతూ ఉంది. ఇది నిజంగా కుటుంబ వ్యవస్థాశైథిల్యమే ఫలితం - సర్వనాశనానికి దారి తీస్తుంది.

కుటుంబవ్యస్థకు మధ్యయుగం తొలినాళ్లనుండే ప్రాధాన్యముంది.

నన్నయ భారతాంధ్రీకరణంలోని నాందీశ్లోకమే గృహస్థాశ్రమ వ్యవస్థను కీర్తిస్తూఉంది.

"శ్రీవాణీ గిరిజాశ్చిరాయ" అని రాయటం వల్ల గృహస్థాశ్రమంలో పురుషునికంటే స్త్రీలకే అధిక ప్రాధాన్యమున్నట్లు తెలుస్తోంది. విష్ణువు-వక్షస్థలంలో, బ్రహ్మ-ముఖంలో, శివుడు-శరీరంలో అర్ధభాగం ఇచ్చారు. దీన్ని బట్టి అన్నింటా సమానమే కాదు ఎక్కువనే గుర్తించాలి. ఇలా ఈ దివ్యదంపతుల దాంపత్య ధర్మం చేతనే స్త్రీపురుష సృష్టి జరుగుతూ ఉంది.

భర్త గృహపతి-గృహసతి, కులపతి-కులసతి, వంశవిస్తారకుడు-వంశవిస్తారకురాలు భార్య గృహస్థ జీవిత ప్రథమ, ప్రధాన కర్తవ్యం-మంచి సంతానాన్ని కని సమాజానికి అందివ్వడమే. ఇక్కడ ఆడ, మగ తేడా లేదు. ప్రయోజనకత్వమే ముఖ్యం. గృహస్థాశ్రమం మీద యావత్తు సమాజం ఆధారపడి ఉంది. సమాజాన్ని ఉద్ధరించేవాడు ఎప్పుడెప్పుడు వస్తాడా అని గృహస్థాశ్రమానికేసి చూస్తూ ఉన్నది ప్రజానీకం. ప్రథమతః గృహస్థాశ్రమమే లేకపోతే ప్రజాభివృద్ధిలేదు. అదెప్పుడు లేదో ఈ ప్రపంచం యొక్క ఉనికి కూడ ఉండదు. కాబట్టి, సర్వకాల సర్వావస్థల్లో మానవోత్పత్తి జీవనవ్యవస్థ, సమాజాభ్యుదయం, గృహస్థాశ్రమం యొక్క ఉనికి వల్లనే జరుగుతూ ఉందనడం అక్షరాల సత్యం.

తండ్రి - భౌతికావసరాలు తీర్చితే

తల్లి - వ్యక్తిత్వ వికాసాన్ని కల్గించి సమాజంలో ఉన్నత వ్యక్తిగా నిలబెడుతుంది.

మనువు ధర్మశాస్త్రంలో- ఇల్లాలిని, "సంసారార్ణవ నౌక" అన్నాడు.

"సంసారార్ణవనౌక" అంటే, సంసారమనే సముద్రంలో ఎన్ని ఆటుపోట్లు వచ్చినా, నావ మునిగి పోతుందనే విపత్కర పరిస్థితులు ఏర్పడినా, దాన్ని తన మనోనిశ్చయంచే కాని, దృఢసంకల్పంచే కాని, రక్షించి అవతలి గట్టుకు చేర్చే నావ గృహిణియే. అందుకే మనువు గృహిణికి పెద్ద కితాబు ఇచ్చాడు. నిజంగా గృహిణి అంతటి శక్తిసామర్థ్యాలు గలది అనడానికి భారతదేశంలోని ఎందరో అజ్ఞాత గృహిణుల జీవితచరిత్రల్ని పరిశోధిస్తే తెలుస్తుంది. ఆమె తన మెట్టింటి వంశగౌరవ ప్రతిష్ఠల్ని కాపాడటమేకాదు, వంశం నిర్వంశం కాకుండా వంశాంకురాన్ని రక్షించి ప్రాణదానం చేసే అమృత స్వరూపిణిగా కూడ ఉందని ఎన్నో కుటుంబ గాథల్లో సాక్ష్యాలు లభిస్తున్నాయి. అందుచేత, ఆమె కేవలం సంసారార్ణవనౌకయే కాదు, "సంసారార్ణవనౌకా కర్ణధారిణి" అనడం అత్యంత సమంజసం!

"Every Mother is a Professor of Home Science" అని అర్థం. ఆమెకొకరు చెప్పవలసిన పని లేదు. ఆమెను చూచి అందరు నేర్చుకోవాలి.

తన సంతానానికి చక్కని సంస్కారాన్ని విద్యాబుద్ధులు నేర్పించి, వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్ది సమాజానికి ఒకచక్కని పౌరుని అందించడమే నిజమైన "గృహనీతి విద్య" ఆ విద్యలో డిగ్రీలు ఉన్నా

లేకపోయినా అత్యంత ప్రవీణురాలు ఇల్లాలు! అందుకే ఆంగ్లంలో ఒక సామెత ఇలా ఉంది. "One good mother is equal to hundred school masters"

మనువు ధర్మశాస్త్రంలో

"యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః"

ఎక్కడ స్త్రీలు గౌరవింపబడుతున్నారో అక్కడ దేవతలు నృత్యమాడుతారు అన్నాడు.

ఒక చెట్టుకు తల్లిపేరు ఎలాంటిదో ఇంటికి గృహిణి అటు వంటిది. సాధు ప్రవర్తన గది, సమంజసంగా మాట్లాడేదియైన భార్య ఇంటిలో లేనట్లయితే ఆ గృహస్థుడు అరణ్యానికి పోయినట్లే లెక్క.

మన వ్యవస్థ కట్టుదిట్టాలన్నీ నిలబెట్టినది మహిళామూర్తులే. అందుకే, వారికి అన్నింటా సముచిత స్థానం ఇవ్వబడింది.

"భర్తకు సంతోషాన్ని కల్గింపని స్త్రీ భార్య అనిపించుకోదు. భర్త సంతుష్టుడైతే చాలు సర్వదేవతలు సంతోషించినట్లే!" ధర్మపత్ని యొక్క ఆరు గుణగణాలను ఏకరువు పెడుతుంది.

శ్లో॥ కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ
భోజ్యేషు మాతా, శయనేషు రంభా!
రూపే చ లక్ష్మీ, క్షమయా ధరిత్రీ
షట్కర్మ యుక్తా ఖలు ధర్మపత్నీ ॥

గృహకార్యాలు నిర్వర్తించడంలో దాసివలె, భవిష్యత్కార్యాచరణంలో భర్తకు మంత్రివలె, భోజనం పెట్టేవేళల్లో కన్నతల్లి వలె, సంభోగ సమయంలో రతిక్రీడా నైపుణ్యంగల రంభవలె, ఇల్లాలిగా అందంలో లక్ష్మీదేవివలె, ఓర్పులో భూదేవివలె ఈ ఆరు గుణాగణాలు కలిగినది "ధర్మపత్ని" గౌతమమహర్షి భార్య అహల్య, పంచపాండవుల పత్ని ద్రౌపది, రాముని భార్య సీత, బృహస్పతి భార్య తార, రావణుని భార్య మండోదరి - వీరే పంచకన్యలు. వీరిని స్మరిస్తే మహాపాతకాలన్నీ తొలగిపోతాయి.

*****

# తులనాత్మకత - ప్రాముఖ్యత

**Dr. N. Shashidhar**
Vignana Jyothi Institute of Arts & Sciences
West Marredpally, Secunderabad.
Mobile: 9885343309
Email: shashinalla77@gmail.com

**ఉపోద్ఘాతం**

భారతావని బహు భాషా నిలయం. కానీ ఒక భాషాసాహిత్యమును తెలిసిన విషజ్ఞులకు ఇతర భాషల్లో గోచరించే భావ సంపద గురించి గానీ, ఆలోచనా ప్రవాహాన్ని గానీ, సాంఘిక సంచలనాన్ని గురించి గాని తెలుసుకోవడం చాల అరుదు. ప్రతి భాషలో వెలసిన విఖ్యాతి చెందిన కొన్ని ఉత్తమ రచనలు ఇతర భాషల్లోకి అనువదించి ఆ రచనలను తులనాత్మక పరిశీలన ద్వారా విపేచించడం ద్వారా ఆయా ప్రదేశాలకు ఆయా భాషాసాహిత్యాలకు సంబంధించిన సాంఘిక జీవితం, సంస్కృతి, సామాజిక వాతారణం, జీవన విధానం, ఆచార వ్యవహారాలను, సాహిత్య పరిచయం మరియు భాషా సౌందర్యం ఇతర ప్రాంతీయులకు తెలియ పరచడం వల్ల ప్రజలకు మరియు భాషా ప్రియులకు పరస్పర పరిచయం ఏర్పడుతుంది. దీనివల్ల జాతీయ సమైక్యత పెంపొంది సాహిత్యం అభివృద్ధి పథంలో నడుస్తుంది. దక్షిణాది భాషల్లోని సాహిత్య పరిశీలన ద్వారా ఉత్తరభారత భాషల్లోని సాహిత్యముల స్థితిగతుల్ని తెలుసుకోవడం వల్ల భాషాసాహిత్యం పరిపుష్ఠం అవుతుంది

దేశంలోని అన్నీ భాషల సాహిత్యాములలోని గొప్పదనం, సౌందర్యం మరియు నిర్మాణాచాతుర్యం మొదలైనవి అందరికి విశదపరచాలన్న ముఖ్యంముగా తులనాత్మకత చాలా ఆవశ్యకం. ఆయా సమాజాన్ని విశ్లేషించి సమస్యల మూలాలను వెల్లడిస్తూ వాటి పరిష్కారాలను సూచించడానికి తులనాత్మకత ఎంతో పాత్రను వహిస్తుంది. ఉత్తమ సాహిత్యం ఉత్తమ సమాజాన్ని నిర్మాణానికి దారితీస్తుంది.

**తులనాత్మక నిర్వచనం**

తులన అనే పదానికి నిఘంటువులలో ' తులనం' తులనీయం అనే పదాలు సమానార్థకాలుగా గోచరిస్తాయి. పోలిక , ఔపమ్యం మొదలైన అర్థాలలో వ్యవహరింపపడును. సంస్కృతంలో సమిష్ఠితనాన్ని సూచించు ఉపసర్గ 'సం' దానికి సమానార్థకమైన ఆంగ్ల ఉపసర్గ 'కం'. అలాగే 'par'(పర్) అనగా అర్థసమత్వం ఈడు, సమమైనది అని గోచరిస్తుంది. ఈ దృగ్విషయంతో సమన్వయత చూపే మార్గమే 'కంపారిటివ్' . దీనికి తెలుగు అనువాదమే తులనాత్మకత. ఈ తులనాత్మకదృష్ఠి కాలానుగుణంగా విజ్ఞానిక ప్రభావంవలన తులనాత్మక సాహిత్యంగా పరిణమించినది. సాహిత్యాలలో 20వ శతాబ్ది ఆరంభమును విమర్శ ఒక ముఖ్యమైన ప్రక్రియగా ఆరంభమైనది. ఇది పాశ్చాత్య సాహిత్య ప్రభావం. ఒక సాహిత్యముపై గాని ఒక భాషపైన గాని ఇంకొక దాని ప్రభావం ఒక దాన్ని ప్రభావాన్ని గుర్తించడం తూలనాత్మక అధ్యమన ప్రధాన ఉద్ధేశ్యం.

S.S.Prawer – comparative literary studies" ఇలా విరించారు - "An examination of literary (including work of literary theory and criticism) in more than one language, though an investigation of contrast, analogy province or influence: a study of literary relations and communications between two or more groups that speak different languages"

భిన్నభాషలను మాట్లాడే ప్రజల మధ్య ఉన్న సాహిత్య సంబంధాలను వాటి సాదృశ్యవైదృశ్యాలను పరస్పర ప్రభావాలను అధ్యయనం చేయడాన్ని కూడ తులనాత్మక అధ్యనయనంగా చెప్పవచ్చు. తులనాత్మక అధ్యయనంలో భిన్న భాషలు గాని భిన్న సాహిత్యములు గాని పోల్చడం వల్ల ఇతర భాషలు మరియు సాహిత్య రచనలలో ఉన్న తుల్య మరియు విషమ విషయాలపై అవగాహన ఏర్పడతాయి.

**తులనాత్మక అధ్యయన పద్ధతులు:**

1. ఒక భాషలోని వ్యవహార సాహిత్యానికి గ్రంథస్థ సాహిత్యానికిగల భేధసాదృశ్యాలను, విశిష్టాంశాలను తులనాత్మకంగా పరిశీలించి తెలియపరచవచ్చు.
2. ఒక సాహిత్యంలో ఒక విషయంపై ఒకే ప్రక్రియలోకాని, వేర్వేరు ప్రక్రియలలో కాని వేర్వేరు కవులు చేసిన రచనలుంటే వాటి ఇతివృత్తంలో పాత్రచిత్రణలో, వర్ణనలలో, రసావిష్కరణలో, రచనా దృక్పథంలో గల సామ్యభేదాలను , విశిష్టతలను తులనాత్మకంగా అధ్యయనం చేయవచ్చు.
3. భావానువాదంగాని, స్వేచ్ఛానువాదంకాని చేసిన రచనలలో మూలానికి, అనువాదానికిగల మార్పు చేర్పులను, దానిలో వ్యక్తమయ్యే దేశీయతను తులనాత్మకంగా పరిశీలించవచ్చు.
4. ఒక భాషలో వెలువడిన రచనలను మరొక భాషలో అదే ఇతివృత్తంతోకాని, సారూప్యంగల వస్తువుకాని ఉన్నటువంటి రచనలతో పోల్చి దానిలో వ్యక్తమయ్యే భావాలను, కథావస్తువుతోగల మార్పులను, దానికివ్యత్యాసములను, కారణాలను, మత, సాంఘీక స్థితిగతులను మరియు ఆచార వ్యవహారాలను తులనాత్మకంగా అధ్యయనం చేయవచ్చు.
5. ఇతివృత్తం లో మార్పు ఉన్నా ఇతర ప్రాంతాలకు, భాషలకు, కాలానికి చెందిన కవులలోకాని వారి రచనలలో కాని వ్యక్తమయ్యే భావసామ్యాలను కవి కాలమును మరియు వారి దృక్పథాలను వాటి నేపథ్యమును తులనాత్మకంగా పరిశీలించవచ్చు.
6. ఏకకాలంలో కాని వేర్వేరు కాలాలలో కాని ఇతర భాషలలో ఉన్న ఉద్యమసాహిత్యమును, జాతీయోద్యమాలను, వాటి ప్రభావంతో వచ్చిన సాహిత్యం లేదా రచనలను, కవులను, సమకాలీన సాంఘీక స్థితి గతులను తులనాత్మకంగా అధ్యయనంచేయవచ్చు.
7. ఒకే ప్రక్రియలో వివిధ భాషలలో వచ్చిన రచనలను వేరొక భాషలో అదే ప్రక్రియలో ఉన్న రచనలతో పోల్చి భేధసాదృశ్యాలను మరియు ఒక భాషపై మరొక భాషకు ఉన్న ప్రభావాన్ని వెల్లడించవచ్చు.
8. వివిధభాషలలో, వివిధ ప్రాంతములలో ఉన్నటువంటి ఆచారవ్యవహారాలను, సంస్కృతి సాంప్రదాయాలను, జీవనవిధానాన్ని, భౌగోళికాంశాలను, అలవాట్లను, చారిత్రాత్మకసంఘటనలను, నమ్మకాలను, వైద్యవిద్యావిధానాలను, జానపదవిజ్ఞానాన్ని మరియు జీవనశైలిని తులనాత్మకంగా పరిశీలించి వాటిలో ఉన్న విశేషంశాలను బహిర్గతం చేయవచ్చు.

**తులనాత్మకత - ఆవశ్యకత**

ఆర్యద్రావిడ భాషలో శబ్దరూపాల్లో, క్రియారూపాల్లో, సంఖ్యావాచకాల్లో, పదనిర్మాణములో, వాక్య నిర్మాణాలలో భేదమున్నను భాషల మూలరూపము మాత్రము ఒక్కటే. ఒకేభాషా కుటుంబానికి చెందిన భాషా

సాహిత్యాలతో సాహిత్యపరంగానే కాకుండ చారిత్రకంగా, సాంఘీకంగా మరియు సాంస్కృతికంగా సామ్యాలుంటాయి. వీటినన్నింటిని తులనాత్మకంగా పరిశోధన చేస్తే అనేక సామ్యములు మరియు విశిష్టతలు బహిర్గతమవుతాయి.

ఉత్తరదక్షిణ భారతావనిలలో ఉన్న జీవనవైవిధ్యాలను తీసుకొన్నచో, రెండు ప్రాంతాలవారి ఆచార వ్యవహారాలు, ఆహారవిహారాలు, జనజీవనవిధానములలో కొంత వైవిధ్యం కనిపించినా సూక్ష్మంగా అధ్యయనం చేస్తే అన్నింటిలో ముత్యాలలోని సూత్రంవలె దాదాపుగా ఒకే సామ్యత ఐక్యత నిహితంగా ఉన్నట్లు తులనాత్మక అధ్యయనం వలన బహిర్గతమవుతుంది. దీనినే మనం వ్యక్తరూపమున భారతీయ సంస్కృతులు అని అంటున్నాము.

జానపద విజ్ఞానాన్ని సశాస్త్రంగా తులనాత్మక అధ్యయనం చేసిన మన చరిత్రాంశాలు, సంస్కృతి, సనాతన ధర్మాలు, విశ్వాసాలు, ఆచార వ్యవహారాలు, జీవన విధానాలు, వైద్య మరియు విద్య మొదలైన ఎన్నో విషయాలు వాటి సామ్యములు మరియు ఐక్యతలు వెల్లడవుతాయి.

మనదేశం ఎన్నోభాషలకు, సాహిత్యాలకు, మతాలకు,ఆచారవ్యవహారాలకు నిలయమైనది. భిన్నత్వంలో ఏకత్వం ప్రతిబింబిస్తుంది. భారతీయులందరు ఒకటే అనే సమైక్య జాతీయ భావం మనందరిలో ఉన్నది. భాషలు వేరైనా భావం ఒక్కటే అనే విషయం ప్రస్ఫుటిస్తుంది. ఇలాంటి భావాల యొక్క ఐక్యతను వెలికితీయాలంటే ముఖ్యంగా తులనాత్మక పరిశోధన మరియు అధ్యయనం చాలా ముఖ్యపాత్ర వహిస్తుంది.

ఉదాహరణలను పరిశీలిస్తే:

తమిళ సాహిత్యములో 2వ శతాబ్ధికి చెందిన తమిళ మహాకవి తిరువళ్ళువర్ సంగయుగానికి చెందిన వారు. ఆయన వ్రాసిన 'తిరుక్కురళ్' ఒక పంక్తిని పరిశీలించిన ,

"ఎప్పొరుళ్ యార్ యార్ వాయ్ క్కేడ్పినుం
అప్పొరుళ్ మెయ్ పురుల్ కాణ్బదరివు"

ఈ భావననే క్రీ.శ 1260 చెందిన సుమతిశతకకారుడైన బద్దెన అదే భావనను ఈ పద్యరూపమున తెలిపాడు.

కం. వినదగు నెవ్వడు చెప్పిన
వినినంతనె వేగపడక వివరింపదగున్
కనికల్ల నిజము తెలిసిన
మనుజుడెపో నీతిపరుడు మహిలో సుమతీ!

వీరిద్దరు భిన్న ప్రాంతాలకు, కాలాలకు, మతాలకు, భాషలకు చెందినవారు. వీరి భావాలు ఒకరికొకరు తెలుసుకొనే అవకాశమేలేదు. అయినా ఇద్దరి భావాలు ఒకేలా ఉండడం పరిశీలిస్తే విస్మయం కలిగిస్తుంది.

ప్రాచ్యపాశ్చాత్య కవిత్వాలను కూడ గమనిస్తే ఇలాంటి ఆశ్చర్యవిషయాలు కనిపిస్తాయి. ఉదాహరణకు పరిశీలిస్తే, రామాయణంలో వాల్మీకి(త్రేతాయుగం) ఇలా అంటారు "స్థిమితం గన్తుమారే ఖే భయాద్గోదావరీ నదీ", భయంకరుడైన రావణాసురిన్ని చూచి అతివేగంగా ప్రవహించే గోదావరినదీ మెల్లగా ప్రవహించసాగినది"-అని

అర్థం. క్రీ.శ 14 వ శతాబ్ధికి చెందిన పాశ్చాత్య ఆంగ్లకవి ఎడ్మండ్ స్పెంసర్ తను థేమ్స్ నదిని ఉద్దేశించి ఇలా అంటాడు "Sweet Thames run softly till end my song" , నా గీతం పూర్తయ్యే వరకు మెల్లగా ప్రవహించు – అని అర్థం. కవులలో విస్తరించిన భావసామ్యం చాలా బలమైనది. ఇలా సామ్యాలెన్నో తులనాత్మక అధ్యయనం వలన తెలుస్తాయి.

**తులనాత్మక అధ్యయనం- ప్రాముఖ్యత**

ప్రస్తుత కాలమున ఈ అధ్యయనం చాలా ప్రాశ్యస్తమును సంతరించుకొంది. దేశకాలాల నిమిత్తం లేకుండా సార్వత్రిక పరిశోధనా దృష్టితో సాహిత్యాన్ని కాని భాషగురించి కాని చేసే ప్రతి తులనాత్మక అధ్యయనం వలన ఎన్నో నూతన విషయాలు వెల్లడవుతాయి.

తులనాత్మక అధ్యయనం వల్ల ఎన్నో రహస్యములు బహిర్గతమవుతాయి. ఇతర భాషాసాహిత్య అధ్యయనం వలన మన స్వీయభాషలోని రచనాసామర్థ్యం తెలుస్తుంది. తారతమ్యములు తెలుస్తాయి. సాహిత్యాల పైననేకాక చారిత్రాత్మక, సాంస్కృతిక విషయాలమీద, సాంప్రదాయ ఆచార వ్యవహారాలమీద, జీవనవైవిధ్యాల మీద తులనాత్మక అధ్యయనం విస్తృతంగా జరిపితే జాతీయభావం పరిపుష్టమవుతుంది.

తులనాత్మక పద్ధతిలో భారతీయ సాహిత్యాలన్నింటిని పరిశోధన చేస్తే జాతీయసమైక్యత, భావ సమైక్యతకు దారితీస్తుంది. వివిధ భాషల స్వరూపస్వభావాలు అవగతమై ఇతర భాషాసాంప్రదాయాలపై సదభిప్రాయాలు వెల్లివిరుస్తాయి. విశ్వమానవసౌభ్రాతృత్వం పెరుగుతుంది. సంకుచిత భావాలు కనుమరుగై విశాలదృక్పధం ఏర్పడుతుంది. జాతీయ అంతర్జాతీయ సాహిత్య సాంస్కృతిక రంగాలలో పరిచయం విస్తృతమై వసుధైక కుటుంబం అనే భావన బలపడుతుంది. దీనివల్ల జాతీయభావము అంకురించి జాతీయసమైక్యతను కలిగిస్తుంది. తులనాత్మక అధ్యయనం జాతీయసమైక్యతకు భారతీయ సంస్కృతిని పెంపొందించే ఒక సులభోపాయమని చెప్పవచ్చు.

**ఉపయుక్త గ్రంథాలు**

1. తులనాత్మక సాహిత్యం –చల్ల రాధాకృష్ణ శర్మ- లక్ష్మీనారాయణ గ్రంథమాల- మధుర-1993
2. తులనాత్మక సాహిత్య అధ్యయనం –డా||ఎడ్లబాలకృష్ణారెడ్డి-చైతన్య ప్రచురణలు-1990.
3. తెలుగుసాహిత్య-1- సమీక్ష-జి.నాగయ్య– నవ్య పరిశోధక -2009
4. తెలుగుసాహిత్య-2- సమీక్ష-జి.నాగయ్య– నవ్య పరిశోధక -2009
5. సుమతీశతకం- బద్దెన-బద్దెన-విక్టరీ పబ్లికేషన్స్- 2008

***

# కె.వరలక్ష్మి గారి "సృష్టికి మూలం" – స్త్రీ విశిష్టత

**పి.దుర్గాదేవి,** పరిశోధన విద్యార్థి,
ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు.
సెల్ నెం.9885414217, 6281316097
pothurajudurga72@gmail.com.

కె.వరలక్ష్మిగారు తెలుగు కథా సాహిత్యంలో ఒక సుస్థిరస్థానం సంపాదించుకున్నారు. తూర్పుగోదావరి జిల్లా, జగ్గంపేటలో పల్లా వెంకటరమణ, బంగారమ్మ దంపతులకు అక్టోబరు 24వ తారీఖు, 1948వ సంవత్సరంలో జన్మించారు. వీరు 140కి పైగా కథలు, 4 నవలలు, "ఆమె" కవితా సంపుటి రచించారు. అలాగే వ్యాసాలు, నాటికలు ఎన్నో రచించారు. వీరి సాహిత్య ప్రస్థానంలో ఎన్నో పురస్కారాలందుకున్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. పూర్తి చేశారు.

వర్తమాన తెలుగు సాహిత్యంలో స్త్రీ జీవిత సంఘర్షణలను చిత్రించిన ప్రముఖ స్త్రీ రచయిత్రి వరలక్ష్మిగారు. వారికి తెలిసిన పల్లెలోని స్త్రీ జీవనపోరాటాలు, రాగద్వేషాలు, నిస్సహాయతలు, అసూయలు, అహంభావాలు కథావస్తువులుగా చేసికొని కథలు రాశారు. గోదావరి నుడికారాన్ని మెట్ట ప్రాంతపు తెలుగుతనాన్ని కలగలుపుకున్న స్త్రీ తనాన్ని అక్షరాల్లో ఇమిడ్చిన రచయిత్రి వరలక్ష్మిగారు.

అడుగడుగున ఆడపుట్టుకను అణిచివేస్తున్న సమాజంలో, స్త్రీ "సృష్టికిమూలం" అని 40 సంవత్సరాల క్రితమే తన "సృష్టికిమూలం" కథ ద్వారా తెలియచేశారు రచయిత్రి. "రవిగాంచనిది కవిగాంచున్" అన్నట్లుగా స్త్రీ జననంపై వచ్చే ఈ అసాంఘిక కార్యకలాపాలు తన అంత:దృష్టితో ఆనాడే చూశారు. ఆడపుట్టుకను అసహ్యించుకునే మగవారికే కాదు ఆడవారికి కూడా కనువిప్పు కలిగించే కథ "సృష్టికి మూలం". సంస్కారం లేని చదువు వ్యర్థం. అమ్మ "డిగ్రీ" ముందు డాక్టర్ డిగ్రీ అయినా తలవంచాల్సిందే. చదువొక్కటి డిగ్రీ తెస్తే, అమ్మతనం జీవితం అంటే తెల్పుతుంది. ఏమి చదవని తల్లి డాక్టర్ చదివిన కూతురికి ఆడపుట్టుక అర్థం తెల్పడం ఈ కథ ప్రధాన ఇతివృత్తం.

## 1. సృష్టికి మూలం కథ ఇతివృత్తం.

### పరిచయం

ఈ కథ 09-10-1987వ సంవత్సరంలో ఆంధ్రజ్యోతి వార పత్రికలో ప్రచురించబడింది. గర్భంలో ఉన్న శిశువు ఆడో, మగో తెలుసుకుని ఆడపిల్ల అయితే గర్భంలోనే చంపేసే సమాజంలో ఉన్నాము. కాని ఆడపిల్ల ఆవశ్యకతను తెలియచేస్తూ స్త్రీ సృష్టికి మూలం అని తెలి చేసే కథ ఈ "సృష్టికి మూలం". చదువుకోగానే సరిపోదు ఆ చదువుకు తగిన విలువలను పాటిస్తూ స్త్రీల ఔన్నత్యాన్ని కాపాడాలి అని డాక్టర్ పల్లవికి ఆమె తల్లి తెలియచేస్తుంది.

### కథ-ఇతివృత్తం

డాక్టర్ పల్లవి గైనకాలజిస్ట్. ఇంకా పెళ్ళి కాలేదు. ఆవిడ ఆ కాలంలో బొంబాయి వెళ్ళి పిండం నుండి సూది ద్వారా అమ్నియోటిక్ ద్రవాన్ని తీసి పరీక్షించి గర్భస్థ శిశువు ఆడో మగో తెలుసుకునే విధానాన్ని నేర్చుకుని వస్తుంది. ఆ ప్రాంతంలో ఆ విధానాన్ని నేర్చుకున్న మొదటి డాక్టర్ ఆవిడే. ఇంకేం! మూడు గర్భస్రావాలూ, ఆరుబేంక్ బేలన్సులూగా వర్థిల్లసాగింది ప్రాక్టీసు. మొదటి కాన్పులోనే కొడుకునే కనేసి అత్తగారి చేత, ఆయనగారి చేత 'శభాష్' అనిపించుకోవాలనే అతివలు, ముందు కాన్పులో ఆడపిల్లల్ని కన్న తల్లులు. అందరూ పల్లవినే ఆశ్రయించసాగారు. కేవలం రెండు వందల యాభై రూపాయల ఖర్చుతో పుట్టబోయే మైనస్ (ఆడ) ప్రాణిని మొగ్గలోనే త్రుంచేయ సాగారు.

డాక్టర్ పల్లవి ఈ మధ్యనే ప్రఖ్యాత న్యూరోసర్జన్ ప్రవీణ్‌ని పెళ్ళి చేసుకుంది. నెల తిరగ్గానే నెల తప్పింది. తన గర్భంలో రూపు దాల్చబోతున్నది ఆడపిల్లని తెలియగానే, అంతం చేయాల దగ్గరుండడానికి తల్లిని రప్పించుకుంది. విషయం విన్న తల్లి

అంది కదా "నిన్ను కనేముందు ఊహించకపోయినా, కన్న తర్వాత నేనలా అనుకుని ఉంటే నువ్వెక్కడుండే దానివే అమ్మాయ్! అమ్మ కావడంలో ఆడదానికి వివక్షకూడదు. తండ్రైనా, అన్నదమ్ముడైనా, కట్టుకున్న వాడైనా సుఖంగా వుంటే చూసి సంతోషించేవాడు మగవాడు. తల్లిగా, చెల్లిగా, కూతురుగా కష్టకాలంలో ఆదుకునేది ఆడదే! ఆడది లేని సృష్టెక్కడుందే? అంతెందుకు ఈ సమయంలోను నాన్నగార్ని పిలిపించుకోవచ్చు కదా నన్ను పిలిపించుకున్నావు ఎందుకు అనగానే నోట మాటరాక డాక్టర్ పల్లవి నిశ్చేష్టురాలై తల్లినే చూడసాగింది.

**ముగింపు**

వరలక్ష్మిగారు నలభై దశాబ్దాల క్రితమే ఆడపుట్టుకను ఆదిలో త్రుంచే విధానాన్ని ఈ కథలో తెలియచేశారు. సృష్టికి మూలం స్త్రీ అని స్త్రీ లేకపోతే సృష్టే లేదని తెలియచేశారు. ఆడతనంలోని ఆంతర్యాన్ని ఎంతో సున్నితంగా పల్లవి తల్లి చేత చెప్పించారు. ఒక సమస్యను వివరిస్తూ విమర్శించాలంటే సున్నితమైన పదాల ద్వారా కూడా పాఠకుడి మనస్సును చేరే విధంగా రచించవచ్చు అని రచయిత్రి నిరూపించారు.

సృష్టికి మూలం స్త్రీ
ఓర్పుకు అర్థం స్త్రీ
నేర్పుకు అర్థం స్త్రీ
త్యాగానికి పరమార్థం స్త్రీ.



# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారి వడ్లగింజలు- విశిష్టత

- డా॥ యమ్. విజయశ్రీ
అసోసియేట్ ప్రొఫెసర్
జె.కె.సి.కాలేజీ, గుంటూరు
ఫోన్ నెం.9704074386
vijayasree.matta1@gmail.com

తెలుగు కథకులలో విశిష్ట స్థానం సంపాదించిన ప్రముఖులు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. 1891వ సంవత్సరము, ఏప్రిల్ 23న తూర్పుగోదావరి జిల్లా, పొలమూరులో జన్మించారు. యావత్తు భారతదేశం ఆదర్శంగా నిలుపుకోగలజాతీయతా స్పృహతో సంస్కరణాభిలాషతో పీడిత జనోద్ధరణ లక్ష్యముతో అద్భుతమైన రచనలుచేసి అనేక తరాలవారి మన్ననలు అందుకున్నారు. వేదం, జ్యోతిష్యం, ధర్మశాస్త్రాలను అభ్యసించారు. కథారచన ప్రధానంగా ఎన్నుకున్నా తరువాత తరువాత నవలలు, వైద్యగ్రంథాలు, అనువాదాలు కూడా రచించారు. వ్యావహారిక భాషావాదిగా గిడుగు ఉద్యమానికి అండదండలందించారు. తెలుగు కథకులలో 1956లోనే కనకాభిషేక గౌరవం అందుకున్న ప్రథములు.

సుబ్రహ్మణ్యశాస్త్రి గారు బ్రాహ్మణుడు. అనగా బ్రాహ్మణీకమే ఆయన రచన. గోదావరి మండలంలో వెలనాటి వైదిక కుటుంబాలు, ఆయన సాహితీ సమరాంగణము వారి పోకడలూ, మెలకువలూ, వాక్యములు వాని కష్టసుఖాలు ఆయన చెప్పిన కథలు. తెలుగు కుటుంబాల ఆపేక్ష అంత:కరణలు ఎలాంటివో, మర్యాదలు, మన్ననలు ఎలాంటివో వీరి కథలు చదివితే అర్థమౌతుంది.

శ్రీపాద గురించి వల్లంపాటి దృష్టిలో "శ్రీపాద-వీరేశలింగం నుంచి వస్తువునూ గురజాడ నుంచి ప్రక్రియను గ్రహించాడు. అచ్చమైన తెలుగు రచయిత అని అంటారు.

పోరంకివారి మాటల్లో ఆయన తన చుట్టూ ఉన్న పరిసరాల్ని బాగా ఆకళించుకున్న వాడు. అక్కడి జన జీవితాన్ని వేయ్యి కళ్ళతో కనిపెట్టినవాడు. ఆ జనం పలుకుబళ్ళ కోసం చెవులు దొరబెట్టుకొని విన్నవాడు. ఇంత నిష్టగా తెలుగు కథను పండించిన రచయితలు చాలా అరుదు.

చిన్న కథ రాయడానికి తన వాజ్మయంలో యెన్నో గ్రంథాలు చదివి గొప్ప పోకడలు, పలుకుబళ్ళు బాగా అర్థం చేసుకుని భాషలో నిరంతరమూ రచన సాగిస్తూ లోకంలో ప్రతీ చిన్న విషయాన్ని ఎంతో పరిశీలన దృష్టితో చూస్తూ రచనలు చేశారు.

తన రచనలో జీవనాడి ప్రభావితం కావడానికి, తన జాతీయత పూర్తిగా అర్ధం చేసుకుని ఉండాలి. "గ్రంథాలు చదివే నేను భాష తెలుసుకున్నాను. స్త్రీ నాశ్రయించి అన్నీ నేర్చుకున్నాను. తెలుగుభాష, ప్రయోగ విజ్ఞానం కూడా స్త్రీలవల్లనే అలవడింది నాకు. పురుషుల భాషలో కంటే స్త్రీల భాషలో మాధుర్యమూ, హృదయాలను పట్టి వేసే జాతీయతా కనపడింది" (చామర్తి కనకయ్య పిహెచ్.డి. సిద్ధాంతవ్యాసం ముందుమాట అన్న శ్రీ పాదవారిమాటలు) ఆయన కథల నేపథ్యాన్ని చక్కగా వ్యాఖ్యానించాయి.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి అనగానే "కలుపు-మొక్కలు" కథ గుర్తుకువస్తుంది. బాధ్యతలు గలవాళ్ళు అవినీతిపరులై, లంచగొండులై సంఘానికి కలుపుమొక్కలు అయ్యారని ఈ కథలో వివరించారు. వీళ్ళని ఏరిపారేస్తే సమాజం నైతికంగా పతనమవ్వదు అంటారు. శ్రీపాద చూపిన నేర్పరితనం, వస్తునిష్ట కథాకథనానికి పరాకాష్ట అన్నది వల్లంపాటి వారి అభిప్రాయం. మొదట ఈ కథ ప్రబుద్ధాంధ్రలో తెనుగు రక్తం చప్పబడిపోతూ ఉంది" అనే పేరుతో ప్రచురించబడింది. దీన్నిబట్టి శ్రీపాద వారి ఆవేదన అర్థం అవుతుంది. అలాగే "గులాబీ అత్తరు", "శుభికేశిర ఆరోహ", "అన్నంతపని జరిగింది". "విమానం ఎక్కబోతూనూ", తాపీమేస్త్రీ, రావు దీక్షితులు "బి.ఏ, మార్గదర్శి" "కన్యాకాలే యత్నాదర్వితా" మొదలైన కథల శీర్షికలు కూడా ప్రత్యేకత సంపాదించుకున్నాయి. కొన్ని కథలు 'నవలిక' వంటివైనా కథలనే పిలిచారు. వస్తువులో నిత్య

నూతనమైన కథగా "ఇలాంటి తవ్వాయి వస్తే" పేర్కొనాలి. ఈ కథ, 1931లో రాసిన 'సాగరసంగం' కథ రెండింటినీ దళిత కథలుగా గర్తించాలి. అంటరానితనం పట్ల హిందువుల్లో గల ఆత్మవంచనని బట్టబయలు చేసిన కథ "ఇలాంటి తవ్వాయి వస్తే" ఆ రోజుల్లోనే ఈ కథలను గురించి పరిశీలిస్తే శ్రీపాదవారిది ముందు చూపే కాని వెనుక చూపు కాదని తెలుస్తుంది. వాస్తవ పరిస్థితులను చిత్రీకరిస్తూ సమాజంలో అన్నివర్గాల అభ్యున్నతిని కోరిన రచయిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి కథలో ఆయనకు బాగా ఇష్టమైన కథ "వడ్లగింజలు". "గులాబీ అత్తరు" అనే గొప్ప కథకి ఈ కథ కొనసాగింపూ ఏమో అనిపిస్తుంది. ప్రభువుల యుగం అయినా, ప్రజాస్వామ్యం అయిన కళాకారుడు ఎప్పుడూ ప్రభువుల ఆశ్రయం కోసం తహతహలడతాడు. అత్తరు సువాసనలను 'కంపు'గా భావించే అధికారులు ఏ యుగంలో అయినా ఉంటారు. కాని శంకరప్ప లాంటి గుండె ధైర్యం, ఆత్మవిశ్వాసం కళాకారుడికి ఎంతైనా అవసరం. లేకపోతే అత్తరు నేలపాలు కాక తప్పదు. చదరంగం బల్లను అడ్డుపెట్టుకుని – బ్రతుకు చదరంగం ఆటలో ప్రత్యర్థుల ఆట కట్టించాలంటే నేర్చవలసిన ఎత్తులను శాస్త్రి పరోక్షంగా చెప్పిన తీరు విలక్షణంగా ఉంటుంది.

అలాగే "వడ్లగింజలు" కథలో "మాట పొందిక ఉంటే విద్య ఎంతైనా రాణిస్తుందని" తెలియచేశారు. అలాగే శంకరప్పను ఉద్దేశిస్తూ దివాన్జీ ఏమిటీ వేషం అంటాడు. దానికి సమాధానంగా శంకరప్ప చిత్తం చిత్తం, ఒక విద్యలో "నేను చక్రవర్తిని". "విద్వత్తు ఉన్నచోట వేషం అక్కర్లేదండి" అని చెప్తాడు. రాజుగారి కొలువులోకి అహ్వానించేలా ఎత్తుకు పై ఎత్తు పెద్దమ్మ శంకరప్ప పాత్ర ద్వారా తెలియచేశారు శాస్త్రి. ఎన్నో పాట్లుపడి ఎట్టకేలకు రాజుగారితో ఆట ఆడతాడు. ఆట మొదలుపెడితే యెవరికో వొకరికే గెలుపు. రెండోవారోడిపోవలసిందే. అయితే, అంతమాత్రాన వారిని తీసిపారేయాల్సింది లేదు. నిజంగా చూడవలసినవి శక్తి, సామర్థ్యాలు, యుక్తి ప్రయుక్తులే కాని జయాపజయాలు కావు. అని కథలో ప్రభువులు ద్వారా పలికిస్తారు శాస్త్రిగారు. అలాగే మరో పాత్ర 'అప్పల నరసింహరాజు' ద్వారా "విజితులూ, విజేతలూ కూడా సమంగా ఆనందించడం – మానవ ప్రవృత్తికి అతీతమైన విషయం" అని చెప్తాడు. శంకరప్ప గెలుపును రాజుగారంగీకరిస్తారు.

ఏమి కావాలో కోరుకో అన్న రాజు గారి మాటకు బదులుగా చదరంగంలో ఉన్న 64 గదులకు గాను ఈ క్రింది విధంగా వడ్లగింజలు ఇప్పించండి అంటారు.

మొదటి గదిలో ఒకటి

రెండో గదిలో రెండు

మూడో గదిలో నాలుగు

నాలుగో గదిలో యెనిమిది యిలాగ వెళ్ళేకొద్ది రెట్టింపు చేయిస్తూ నాకు వడ్లగింజలు దయచేయించండి మహాప్రభూ… అంటారు.

ఆ తర్వాత ఏమీ లెక్కతేలిందా ? అని అడుగుతాడు మహారాజుగారు. చిత్తం తేలింది మహాప్రభూ! అయితే వారి కోరిక తీర్చాలంటే పెద్దాపురం రాజ్యంలోనే కాదు, త్రిలింగదేశం అంతటా వరసగా నూరు సంవత్సరాలు పండిన ధాన్యం అయినా చాలదు అంటూ షరాబు కాగితం మహారాజుకు అందించాడు. అయ్యో అని ఆశ్చర్యపోయారు రాజుగారు. తర్వాత వొక్క క్షణం ఆలోచించి మహారాజు ఇలా శంకరప్పగారు! వడ్లగింజలతో కూడా నన్నోడించేశారు తమరు అంటారు. ఈ విధంగా శంకరప్ప చివరకు రాచమర్యాదలన్ని అందుకుంటారు. సుఖాంతంతో ముగుస్తుందీ కథ.

ఈ విధంగా శ్రీపాదగారు నిగూడార్థాలతో రచనలు చేశారు. వీరి కథలు ప్రజలకు ఆనందంలో పాటు ఆలోచనలు కూడా రేకెత్తిస్తాయి. మాండలిక పదాల, గ్రాంథిక పదాలకలయిక అయినప్పటికి అంతర్లీనంగా సమాజ అభివృద్ధిని కాంక్షించారు, రచించారు. ఫిబ్రవరి 25వ తారీఖు 1961వ సంవత్సరంలో స్వర్గస్థులయినారు కాని వారి కథల ద్వారా చిరస్థాయిగా నిలిచే ఉంటారు.



# 'హేమలతాలవణం-మృత్యోర్మా అమృతంగమయ'

- **Dr. L. Sujatha,** Lecturer,
Department of Telugu
University College for Women,
Kakatiya University, Warangal
Cell No: 94400281016

హేమలత నవయుగ కవి చక్రవర్తి, విశ్వకవి సామ్రాట్, పద్మభూషణ్ బిరుదాంకితులు "నాదు కన్నీటి కథ సమన్వయము సేయ/నార్ద్రహృదయంబు గూడ కొంతవసరంబు'' అని వా పోయిణ జాషువా గారి కుమార్తె. ఆమె జీవిఅనుభవాల సమాహారమే 'మృత్యోర్మా అమృతంగమయ. ఇది ఆమె ఆత్మకథ'.

హేమలత గుంటూరు జిల్లా వినుకొండలో గుర్రం జాషువా మరియమ్మలకు 1932 సంవత్సరం ఫిబ్రవరి 26న ఆఖరి సంతానంగా జన్మించింది. ప్రాథమిక, మాధ్యమిక విద్య గుంటూరులో సాగింది. మద్రాసు క్విన్స్ కళాశాలలో బి.ఏ బంగారు పతక గ్రహీత. 'నాస్తికత్వం ప్రజాస్వామ్య విలువులు, గాంధేయ వాదం' ఈ మూడు విలువలకుకట్టుబడిన గోరా కుమారుదు లవణంతో ఆమె వివావహం జరిగింది. వర్ణ భేదాలను అతిక్రమించి జరిగిన ఈ వివాహం అప్పట్లో సంచలనం కలిగించింది.

దురాచారాల ఊబిలో దించబడి, దారిద్ర్యాన్ని అజ్ఞానాన్ని, దీనత్వాన్నే ఆస్తిగా పెంచుకున్న అమాయకస్త్రీలను, మూడు విశ్వాసాలతొ, అజ్ఞానపు అంధకారంలో మగ్గుతూ జ్ఞానదీపాన్ని చూడలేని కన్నులున్న అందులను మృత్యువు నుండి అమృతంవైపు పయనింపచేసిన సంస్కరణ యోధురాలు హేమలత.

### హేమలతాలవణం రచనలు

హేమలతాలవణం తన తండ్రి జాషువా నుండి సాహిత్య సృజన అంది పుచ్చుకుని కొన్ని రచనలు చేసింది అవి వివిధ ప్రక్రియలకు సంబంధించినవి. 1. అహింస మూర్తుల అమరగాథలు (1970): ఇది అహింస సిద్ధాంతం ద్వారా ప్రజలను చైతన్యవంతం చేసిన భిన్నదేశాల ప్రముఖుల పరిచయం గ్రంథం. 2. మా నాన్నగారు (1972). తన తండ్రి అయిన జాషువాగారి జీవితచరిత్ర 3.జీవన ప్రభాతం (1982). సంఘ సంస్కంణలో భాగంగా ఆ వస్తువునే తీసుకుని హేమలత గారు వ్రాసిన నవల ఇది. 4. నేరస్తుల సంస్కరణ (1985). వృత్తి నేరస్తుల సంస్కరణలో భాగంగా ఆ సంస్కరణ ప్రయత్నాలను నమోదు చేసిన గ్రంథం. 5. తాయత్తు గమ్మత్తు (2001) ఇది వచన కవిత. 6. వృత్యోతార్మ అమృతంగమయ

కుల మత భేదాలు, మూఢనమ్మకాలు వంటివి మానవ కుటుంబాన్ని ముక్కలు చేసి వేరు చేస్తాయి. తరతరాల నాటి నుంచి ఈ నాటి వరకు మానవజాతి దీనిని ఎదుర్కొంటూనే ఉంది. పల్లెటూళ్ళలో అంటరానితనం ఒక ప్రకృతి ధర్మంగా భావించబడి పాటింపబడుతుంది. అంటరానితనం అనే ఆచారం హేమలత చిన్నతనంలో కరుడుగట్టిన అజ్ఞానంగా ఉండేది. వీరు గౌరవింపదగినవారు వారు దూరంగా ఉండవలసిన వారనే భావన ఆచరణలో పేరుకుపోయిన రోజులవి. వినుకొండకు పడమరన నిమ్మలబావి అనే పేరుతో మంచినీళ్ళ బావి ఉండేది. ఊరిలోని స్త్రీలందరు నీళ్ళు తీసుకొని వెళ్ళేవారు. కాని అస్పృశ్యులు , యానాది, ఎరుకల, దొమ్మర వాళ్ళు మాత్రం బావి గట్టున కూడా తాకే హక్కులేదు. హేమలత తన స్నేహితులతో కలిసి ఆడుకుంటు బావి దగ్గరికి నీళ్ళ కోసం వెళ్ళబోతుంటే అది చూసి నీళ్ళు తోడుకుంటున్న గృహిణి గట్టిగా అరచి దూరంగా వెళ్ళేటట్టు గెదిమింది. స్నేహితురాలు విజయలక్ష్మీతో ఆడుకుంటే వాళ్ళ ఇంట్లో ఆమెను తిట్టే వారు. ఈ విషాయన్ని హేమలత తన తల్లితో చెబితే ఏమేమి ముట్టుకోరాదో ఎవరెవరితో ఆడుకోకూడదో కొంత వరక లిస్టు ఇచ్చింది. బావులు, దేవాలయాలు, దుకాణాలు ఎక్కడికి వెళ్ళకూడదో కూడా చెప్పింది అప్పటినుండి తల్లి చెప్పినట్టు నడుచుకుంది.

### గోపరాజు రామచంద్రరావు (గోరా) పరిచయం-ఆమె జీవితంలో తెచ్చిన మార్పు

మన జీవితపు దారి మలుపు ఒక్కొక్కసారి మనం ఊహించని రీతిలో మలుపు తిరుగుతుంటుంది. ఒక్కొక్క మలుపు ఒక్కొక అనుభవాన్ని అందిస్తుంది. గోరా దంపతుల పరిచయం హేమలత జీవితంలో ఒక పెద్ద మలుపు. ఆమె జీవితానికి మహోదయం వంటిది. ఆస్తిక భావాలతో ఉన్న కుటుంబ వాతావరణంలో పుట్టి పెరిగి నాస్తిక వాదం వైపు ఆకర్షితురాలైయింది.

తన తండ్రి సన్మాన సభలో హేమలత గోరా గారితో మాట్లడడం జరిగింది. ఈ పరిచయం ఆమె నాస్తికత్వాన్ని స్వీకరించే విధంగా చేసింది. తర్వాత ఆమె పూర్తిగా నాస్తికురాలిగా మారిపోయింది.

అత్తగారిల్లు ఆమెలో ఉండే సాంఘిక చైతన్య స్ఫూర్తికి దోహదం అయింది. నాస్తికవాదం పుట్టింది ఆ ఇంట్లోనే కాబట్టి పూజలు, వ్రతాలు, పురాణ గ్రంథాల శ్రవణం వంటి వాటికి ఆ ఇంట్లో తావే లేదు. ఎందుకంటే నాస్తిక జీవన విధానంలో దైవం, కర్మ, పునర్జన్మ, స్వర్గం, నరకం వీటిపై నమ్మకం ఉండదు. కాబటి వీటిని అనుసరించి వచ్చే తిథి, వారఫలితాలు, జాతకాలు, వాస్తువులకు అవకాశం లేదు. వీటి స్థానంలో నాడు నేడు, రేపు, స్వయం కృషి, స్వీయ శక్తి పై నమ్మకం జ్ఞానం – విజ్ఞానం అనేవి ఉంటాయి. కుటుంబం మొత్తం నిరాడంబర జీవన విధానాన్ని అనుసరించేవారు. వీరి నివసించే ఇండ్లు అన్ని పాకలే.

**సంస్కరణోద్యమం–హేమలత పాత్ర**

సంస్కరణ ఒక వ్యక్తికి పరిమితం కాదు అది సమాజ వికాసానికి దారితీస్తుంది. సమాజ వ్యాప్తంగా జరిగిన సంస్కరణవల్లనే ఏ జాతి అయినా సమగ్ర సుందరంగా భాసిస్తుంది. ఆ జాతి సంస్కారం, ప్రగతిపైనే దేశ సంస్కృతి ఆధారపడుతుంది. నాగరికతాభివృద్ధితో పాటు సమాజంలో అన్యాయాన్ని అవినీతిని ఎప్పటికపుడు రూపుమాపడం చాలా అవసరం. సంస్కరణ సాంఘిక రాజకీయ మత ఆర్థిక మొదలగు రంగాలన్నింటిలో జరగాలి. సంఘంలో ఆచారాలుగా మొదలైన కొన్ని నియమాలు కొన్ని తరాల తర్వాత దురాచారాలుగా మారి సంఘాన్ని పీడిస్తాయి. బాల్య వివాహాలు, సతీసహగమనం వాటికి ఉదాహరణలు. అందువల్ల ఏ కాలంలోనైనా ఏ పరిస్థితులోనైనా సాంఘిక సంస్కరణ జరగాల్సి అవసరం ఏర్పడుతుంది. అందుకు సంస్కరణాభిలాష, విద్య సంస్కారం గలవారు ఏటికెదురీది సమాజంలోని దురాచారాలను రూపుమాపుమాపడానికి కృషి చేస్తారు.

"ప్రాచీన కాలంలో సామాజిక అసమానత్వంపై మొదటి సారి తిరుగుబాటు చేసి, సంఘం సంస్కరణకు పునాది వేసింది గౌతము బుద్ధుడు.

**జోగిని బసిని వ్యవస్థ**

హేమలత జోగిని వ్యవస్థ నిర్మూలనకు అవిరళ కృషిచేశారు. తల్లిదండ్రులు తమకోరికలు దైవానుగ్రహంతో తీర్చుకొనేదుకు, గర్భిణుల సుఖప్రసవం కోసం, పుట్టిన పిల్లల ఆరోగ్యం కోసం, కుటంబంలో ప్రతికూల పరిస్థితుల ఎదురైనప్పుడు ఎల్లమ్మనో, పోచమ్మనో తలచుకొని తమ సంతానాన్ని 'జోగి' గా ఇదుస్తామని మొక్కుకుంటారు. అలా అనుకొని ఆయా దేవతల పేరు మీద ముడుపులు కడతారు. తర్వాత తమకు కలిగిన పిల్లను 'జోగి' గా ఇడుస్తారు.జోగినిగా మార్చబడిన అమ్మాయికి జోగినిగా మారిన నాటి నుండి కొన్ని నియమాలను పాటించడంతొ పాటు మరికొన్ని కార్యక్రమాలు నిర్వహిస్తారు. అమ్మాయికి 5 ఏళ్ళప్పుడు తల్లిదండ్రుల, కులపెద్దల సమక్షంలో 'తొలిపట్టం' నిర్వహిస్తారు.

రజస్వల అయిన తర్వాత 'మైలపట్టం' కార్యక్రమాన్ని పెద్దయెత్తున జరుపుతారు. మేకను గావుపట్టిన (మేక పీకను పోతరాజు పంటితో కొరికచండపం) రక్తతర్పణం మధ్య బీభత్సవాతావరణం మధ్య ఊరిపెద్ద చేతగాని, పోతరాజు చేతగాని, బావ వరసైన వ్యక్తి చేతగాని తాళికట్టించి 'మైలపట్టం' తంతును పూర్తి చేస్తారు. అప్పటి నుండి పెత్తందార్లు, ఊరి పెద్దలు లైంగికంగా కోరిక తీర్చుకోవడానికి వాడుకుంటారు.

జోగినిగా మార్చబడిన స్త్రీ శవంలా కాలం వెళ్ళదీస్తూ బ్రతుకుతుంది. పిల్లలు పుట్టినపుడు, చనిపోయినపుడు కూడా ఈమెను 'పట్టం' తంతులు నిర్వహించాల్సి ఉంటుంది. 'పట్టం' అంటే నేల మీద చదునుచేసి అలికి ముగ్గుతోటి కుంకుమ పసుపుతోటి ముగ్గలాగా వేసి అందులో ఆమెను కూర్చుండబెట్టి తంతునిర్వహించడం.

గ్రామంలో ఎవరు చనిపోయినా ఆ ఇంటికి వెళ్ళి ఉపవాసంతో కేవలం కల్లుతాగుతూ గడిపి, ఆ శవం దగ్గర నృత్యం చేయాలి. ఇంటి దగ్గర నుండి శ్మశానం వరకు నృత్యం చేసుకుంటూ వెళ్ళాలి. జనాలం విసిరే చిల్లర పైసలను నుదురుతోనూ కంటిరెప్పలతోనూ తీసుకుంటూ ఉండాలి. నోటితో కల్లుసీసాను లేపాలి. తనను

ఎవ్వరు తాకిని కిక్కురుమనకుండా ఉండాలి. ఇలాంటి భయంకర స్థితిలో జోగిని స్త్రీ ఉండవల్సి ఉంటుంది.

దీనితో పాటు ఆమెకు అంతుని వేధింపులు, ఆమె జీవితం ఆమె చేతిలో ఉండదు. బిచ్చం అడుక్కొని బ్రతకాలి. జోగిని స్త్రీని ఆమె పేరుతో కాకుండా 'ఒసేయ్ జోగిపోశి' అని సంభోదించడం జరుగుతుంది.

ఇటువంటి నిస్సహాయస్థితిలో జుగుప్సాకరమైన జీవితాలను సంస్కరించడానికి హేమలతా లవణం దంపతులు కంకణబద్ధులై 1984 సంవత్సరం నవంబర్ 29న తేదీన నిజామాబాద్ జిల్లా 'పర్కి' గ్రామంలో అడుగుపెట్టారు. నాస్తిక మిత్రులతో కలిసి ఏయే గ్రామాలలో జోగినిలు ఉన్నారో తెలుసుకొని ఆ గ్రామాలకు వెళ్ళి వాళ్ళతో మాట్లాడారు. 1985 జనవరిలో గోవూరు గ్రామంలో జోగినిగా మార్చబడిన చిన్న బాలిక ఇంటికి వెళ్ళి ఆమెకు రెండో పట్టం చెయ్యొద్దు అన్నారు. దానికి ముసలివాడు 'నాకు ఇంత ముద్ద అన్నం ఎవరు పెడతారమ్మా?' అని ప్రశ్నించాడు. ఏ ఇంటికి వెళ్ళిన ఇటువంటి ప్రశ్నలనే ఎదుర్కొన్నారు. దీనితో ఈ దురాచారాన్ని ఎలాగైనా అంతమొందిచాలనే తపన ఆమెలో ఎక్కువైంది.

జోగిని, బసిని దురాచారాన్ని నశింపచేసి తోటి సోదరీమణులకు సమాజంలో ఆర్థిక సాంఘిక గౌరవం వచ్చేదాకా హేమలతాలవణం శ్రమించింది.

నిజామాబాద్ జిల్లా కలెక్టర్ అప్పటి ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీమతి 'కుముద్ బెన్‌జోషి', ఆనాటి ముఖ్యమంత్రి సంపూర్ణ సహకారం అందించడంతో వీరి సంస్కరణ ఒక ఉద్యమ రూపం దాల్చింది.

హేమలతాలవణం దంపతులు 'సంస్కార్' సంస్థను స్థాపించి సంస్థ ద్వారా నిజామాబాద్ జిల్లాలో తిరిగి ముందుగా పోతరాజులను కలిసి ఈ వ్యవస్థ గురించి అవగాహన కల్పించారు. సంస్కార్ ద్వారా విస్తృతంగా ప్రచారం చేశారు. పోతరాజులందరిని సమావేశపరిచి వారిలో మార్పు వచ్చి వారిచేత గావు పట్టించడం మాన్పించారు. 1968వ సంవత్సరంలో "జోగిని దురాచార నిర్మూలన చట్టం" అమలులోకి వచ్చేటట్లు ప్రభుత్వం పైన ఒత్తిడిని తీసుకొని వచ్చారు. దీనితో ప్రభుత్వం జోగిని స్త్రీలకు పెద్ద ఎత్తున పునరావాస పథకాలు అందించి వారికి రక్షణ కల్పించేవిధంగా హేమలత తోడ్పడ్డారు. 1991లో నిజామాబాద్‌లో సంస్కార్ సంస్థ వర్నిలో 'చెల్లినిలయాన్ని స్థాపించింది. ఆ సమయంలో పోతరాజులు చాలా మంది తమజుట్టును కత్తిరించుకొని పోతరాజు వ్యవస్థ నిర్మూలనకు నాందిపలికారు.

జోగినిగా, బసివిగామార్చబడిన వారందరు అంటరాని కులాలుగా పరిగణించబడిన మాల, మాదిగ, దొమ్మరవాళ్ళు. ఈ ఉద్యమానికి దురాచార అగ్నిలో మాడిపోతున్న అమాయక జోగినీలు అద్దుతగిలారు. తర్వాత వారే దీని నిర్మూలనకు రణరంగ సైనికులుగా నిలచారు.

12 వందల ఏళ్ళనాటి నుండి వేలమందిని బలిగొన్న దురాచారాన్ని లవణం దంపతులు దాదాపు పదేళ్ళు నిర్విరామ కృషిచేసి ఈ వ్యవస్థను నిర్మూలించారు.

అన్ని జిల్లాలో ఉన్న జోగినీలు అందరు అవివాహిత మాతలు, పిల్లలకు తండ్రి ఎవరో తెలియదు. తెలిసిన తల్లి చెప్పదు. 'సంస్కార్' ఒక వివాహాన్ని గవర్నర్ ముఖ్య అతిథిగా రాజ్‌భవన్‌లో జరిపించింది. ఆ తర్వాత సంస్కార్ 35 వివాహాలు జరిపించింది. ఒక్క నిజామాబాద్ జిల్లాలోనే 2000 మంది జోగినీలు ఉన్నట్లు హేమలత గుర్తించింది. వీరి శ్రమకారణంగా 2004 నాటికి ఈ వ్యవస్థ పూర్తిగా రూపు మాపడానికి అహర్నిషలు కృషి చేసింది.

సమాజం చేత పురుషుడి చేత నీచమైన ఆచారాలను సంప్రదాయాల పేరుమీద అణచి వేయబడిన తోటి మహిళల్లో సామాజిక పరమైన మార్పును కల్గించి వారిలో నూతన భావాలను కల్పించడానికి ప్రయత్నం చేశారు. అదికారుల వల్ల కూడా సాధ్యం కానటువంటి భయంకరమైన అచార కట్టుబాట్లను నమూలంగా రూపూమాపి వారి వ్యక్తిత్వ వికాసానికి తోడ్పడింది.

**స్టువర్టుపురం దొంగల సంస్కరణ:**

హేమలతాలవణం స్త్రీలు ఎవ్వరు కూడ ఎంచుకొని మార్గాన్ని ఎంచుకొని అదిశగా ప్రయాణాన్ని కొనసాగించింది. కరుడుగట్టిన దొంగల జీవితాల్లో మార్పు తెచ్చిన మహిళ. ఒకప్పుడు ఆంధ్రప్రదేశంలో ఏ ఊరి పేరు చెబితే ప్రజలు భయాందోళనకు గురి అవుతారో అటువంటి ఊరికి వెళ్ళి నిర్మలమైన మనస్సుతో వారి సమస్యను అర్థం చేసుకొని ప్రభుత్వానికి దొంగలకు మధ్య వారధిగా నిలిచి వారి బతుకుల్లో వెలుగు నింపింది. దొంగలకు అమ్మగా నిలిచింది. హేమలత బ్రతికి ఉన్నంత కాలం ఎటువంటి ఆర్భాటాలు, ఆదంబరాలు లేని జీవితాన్ని గడిపింది.

ఏ మనిషి అయినా పుట్టుకతోనే దొంగగా పుట్టడు. దొంగకావాలని కోరుకోడు. కుటుంబ పరిస్థితుల మూలంగానో తన చుట్టూ ఉన్న పరిసరాల ప్రభావం చేతనో తప్పని సమయంలో దొంగగా మారవలసిన అవసరం ఏర్పడుతుంది. ప్రతి ఒక్కరూ సమాజంలో తనకంటూ సుస్థిర స్థానాన్ని కల్పించుకోడానికే ప్రయత్నిస్తారు. నీతి నిజాయితీతో బ్రతకాలనుకుంటాడు. కాని తను బ్రతకడానికి ప్రతికూల వాతావరణం ఏర్పడినపుడు మంచి చెడు అనే మాటను మరచిపోయి తన అవసరాలను తీర్చుకోవడానికి మొగ్గుచూపుతాడు. తాను చేసిన ఈ పని సమాజంలో దొంగగానో చెడ్డవాడిగానో అతని మీద ముద్రపడుతుంది.

దొంగగా మారిన ఇతనిని సమాజం దగ్గరికి రానివ్వదు. జాలిచూపదు, ఎందుకంటే అతను అపకారి, అతని స్వార్థంకోసం ఇతరులను దోచుకునే దయాహీనుడు, ఒక్క ముక్కలో చెప్పాలంటే సమాజం కుష్టు,క్షయ రోగుల మీదనైన జాలి చూపి, రోగం నయం అయినంక దగ్గరికి తీసుకుంటుంది. కాని దొంగను మాత్రం దగ్గరకు రానివ్వదు. దూరంగా ఉంచుతుంది. అయితే దొంగ తన కుటుంబానికి, తనకు ఆకలి తీర్చడానికి మాత్రమే నేరం చేస్తాడు. మరొక విషయం ఏందంటే దొంగలు ఊహించని ప్లాన్లను వాళ్ళకు చెప్పి వాళ్ళతో దొంగనాలు చేయించే 'తెల్లచొక్కాల పగటి దొంగలు' సమాజంలో లేకపోలేదు.

ఒకసారి ఒక మనిషి తప్పుచేసి, తాను తప్పుచేస్తున్నానని, తన మార్గం తప్పుఅని తెలుసుకున్న తర్వాత ఒక్కసారి క్షమించి ఒక్క అవకాశం ఇస్తే అతడు బాధ్యతగల పౌరుడిగా బ్రతకడానికి కృషి చేస్తాడు. హేమలత దొంగల సంస్కరణోద్యమం మరువలేని అనుభవం అని తెలియజేసింది. నాలుగు సెటిల్‌మెంట్స్‌లో పనిచేసిన తనకు ఈ దొంగలకంటే "వైట్‌కాలర్ దొంగలే' ఎక్కువ కనబడ్డట్టు పేర్కొంది. ఇటువంటి దొంగలు జైళ్ళలో కంటెజైలు బయటే ఎక్కువంటారు."

1973లో గుంటూరు జిల్లా పోలీసు సూపరింటెండెంటు యం.వి.థామస్ 'నాస్తిక మిత్ర మండలి' స్థాపకుడయిన గోరాతో దొంగల సమస్యను చర్చించి దానికి ఆయన సహకారం కోరారు. ఈ సంభాషణను ఆసక్తిగా విన్న హేమలత దొంగలను సంస్కరించడానికి "నేను వస్తానండి" అని అధికారితో చెప్పడం జరిగింది. ఆమె అన్న ఈ చిన్న మాట ఒక వినూత్నమైన సంస్కరణకు మార్గం వేసింది. ఇది ఒక పెద్ద ఉద్యమానికి నాంది పలికింది.

దొంగలకి మనస్సు ఉంటుంది అనే విషయాన్ని గుర్తించి వారిని సంస్కరించడానికి ముందుకొచ్చిన కరుణామయి హేమలత. ఇటువంటి సంస్కరణలకు పూనుకున్న మొదటి మహిళ బహుశ హేమలత అయి ఉంటారు. సంస్కరణ అనే పదానికి నిలువెత్తు సాక్షిగా నిలిచింది. 1960లో ఆచార్య వినోబాభావే భూదాన ఉద్యమంలో భాగంగా దేశమంతటా పాదయాత్ర చేశారు. ఉత్తర భారతదేశయాత్రకు వెళ్ళేటప్పుడు హేమలతాలవణం దంపతులకు కూడా ఆహ్వానం వచ్చింది. దీనితో వీరు వారితోపాటు వెళ్ళారు. అక్కడ భూదాన ఉద్యమంతో పాటు చంబల్ వ్యాలీలోని బందిపోటు దొంగలను సంస్కరించారు. దొంగలుగా పేరుపొందిన ఠాకూర్‌లు వినోబాభావే పాదయాత్ర తర్వాత వచ్చి లొంగిపోయారు. హేమలతాలవణం దంపతులు ప్రత్యక్షంగా చూసిన ఈ సంఘటన స్ఫూర్తిగా తీసుకొని స్టువర్టుపురంలోని కరుడుకట్టిన నేరస్థుల సంస్కరణ ఉద్యమాన్ని మొదలు పెట్టారు. పేరువింటేనే భయపడే స్టువర్టుపురంలో పోలీసు సిబ్బందితో వెళ్లి, కుర్చీలో కాకుండా దొంగల మధ్య కూర్చున్నారు.

"దురంత పద్మవ్యూహాల వల్లకానిది రవ్వంత అనురాగం వల్ల ఔతుంది' అనే సూక్తిని ఆదర్శంగా తీసుకొని ముందుకు నడిచారు. ఇంటింటికి వెళ్ళి దొంగలుగా మారడానికి గల కారణాలు అడిగి తెలుసుకున్నారు. ఈ దంపతులు కటిక నేలపై పడుకొని 2,3 రాత్రులు దొంగలతోనే గడిపేవారు. దొంగలకు వీరు అమ్మా నాన్నలు అయినారు. వారికి ఏ సమస్య వచ్చినా వీళ్ళతో మాత్రమే చెప్పేవారు. వీరిని అమ్మ నాన్నగా సంభోదించారు. దొంగలు. ఇది పోలీసులకే ఆశ్చర్యం కలిగించింది. పోలీసుల లాఠీలకు లొంగని, భయపడని నేరస్థులకు వీరి మాటనే వేదమైంది. అనేక మంది తమ నేరాలను ఒప్పుకొని జైలుకు వేళ్ళారు. మరికొందరు దొంగతనాలు మానివేశారు. 'సంస్కార్' పేరుతో సంస్థను నిర్మించి స్టువర్టుపురంతో పాటు మూడు జిల్లాలోని వివిధ ప్రాంతాలలో ఉన్న దొంగల ఉన్నతికోసం 19 సంవత్సరాలు శ్రమించారు. దొంగలున్న జైళ్ళకు వెళ్ళి సందర్శించారు.

దొంగల కాలనీలో కరెంట్ ఉండేది కాదు. రాత్రి పగలు ఊరిబయట దిబ్బలే పడకలు. స్త్రీలు, పిల్లలు అమితంగా దెబ్బలు తినేవారు. కష్టాలతో జబ్బులతో వీరు కాలాన్ని గడపడం, చెట్టు పుట్టలే నేస్తాలు. భవిష్యత్తు అంధకారం వర్తమానం భయం అనిశ్చితం,సభ్యసమాజం వీరి వైపు చూడదు జైలు, లాఠిదెబ్బలు, శిక్షణ తప్ప కుంటుంబ కలయిక, ఆనందం,

సానుభూతి, మర్యాద అనే పదాలు వీరికి కరువు, ఇటువంటి వేల గుండెల్లో వెలుగు నింపారు. హేమలతాలవణం దంపతులు ప్రభుత్వానికి దొంగలను మధ్యవర్తిగా పనిచేశారు.

ప్రభుత్వ సహాయంతో సంస్కరించబడిన దొంగలకు పునరావాసం కల్పించారు. సమాజంలో అందరితో పాటు సాధారణ జీవితాన్ని అనుభవించేటట్లుగా చేశారు. అస్తవ్యస్తంగా ఉన్నవారి కుటుంబ ఆర్థిక పరిస్థితులను చక్కదిద్ది, పిల్లలు చదువుకునే విధంగా పాఠశాలలు ఏర్పాటు చేయించారు. సమాజంలో సాంఘిక గౌరవంతో పాటు వారికి వ్యక్తిగత గౌరవాన్ని కల్పించారు.

దొంగలు ప్రభుత్వం అందించిన సహాయంతో జీవనోపాధిని వెతుక్కోని కాలాన్ని గడుపుతున్నారు.

మానవహృదయలో కరుణకే స్థానం. కాఠిన్యం క్షణికం–స్నేహమే మానవనైజం ద్వేషం పరాయిది, ఇటువంటి స్వభావాలతో మిళితమైన హృదయం సహాయానికి, సహకారానికి పెద్దపీఠ వేస్తుంది. తాను అనుభవించిన దానికంటే ఆపదలో ఉన్నవారికి, అన్నార్తులయిన వారికి సహాయాన్ని అందించి సంతృప్తిపడతాడు మనిషి. హేమలతలవణం కూడ ఉప్పెన వల్ల అనాథులైన, అనార్థులైన వారిని ఆదుకొని అందులోనే ఆనందాన్ని పొందింది. ఉప్పెన ఎంతో మంది జీవితాల్లో చీకటినింపింది. వారికి ఆశ్రయం కల్పించడానికి కొంత మందితో కలిసి ఒక సంస్థను ఏర్పాటుచేసి దాని ద్వారా సేవలందించింది.

ఆంధ్రప్రదేశ్‌లో ఉప్పెన వచ్చి నెలరోజులు అయినా కూడా మనుషుల శవాలను, పశువుల కళేభరాలను ఖననం చేయడానికి ఎవ్వరు ముందుకు రాలేదు. ఏ సంస్థ ముందుకు రాలేదు. 'ప్రభాకర్‌జీ ఆధ్వర్యంలో 'శవసేన' ఏర్పాటు అయ్యింది. ఆందులో హేమలత ఒక్కరే మహిళ. ప్రభాకర్‌తో పాటు ఆమె శవాలను ఈడ్చుకొని కాల్చేసేది. స్త్రీలు ఎవ్వరు కూడ చేయలేని పనిని చేసి తానెంతో దయనిండిన మానవమూర్తి అని నిరూపించింది.

**కులమతాంతర వివాహాలు**

నాస్తిక కేంద్రంలోనూ, ఆంధ్రప్రదేశంలోని ఇతర ప్రాంతాల్లో కుల మత రహిత సమాజ నిర్మాణానికి కృషి చేసింది. ఈ వ్యవస్థను రూపుమాపడానికి తనవంతు ప్రయత్నంగా అంతర్వర్ణ వివాహాలకు అధ్వర్యం వహించి చాలా పెళ్ళిలు జరిపించింది. పెళ్ళిలకు నాస్తిక కేంద్రం వివాహ వేదిక అయ్యింది. హేమలత కూడ కులాంతర వివాహం చేసుకొని ఆదర్శంగా నిలిచింది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంనుచి ఆత్మగౌరవ, కర్ణాటక ప్రభుత్వం నుంచి దేశస్నేహి పురస్కారం, అమెరికా నుంచి 'ఎథియిస్ట్ ఏచీవ్‌మెంట్' అవార్డు, 2003 సంవత్సరానికి రెడ్ అంట్ వైట్ బ్రేవరి అవార్డు సావిత్రి పూలే అవార్డు వంటివి ఎన్నోపొందింది. తెలుగు విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్, అంబేద్కర్ శతజయంతి సందర్భంగా భీమరత్న అవార్డును పొందిన ఏకైక మహిళ హేమలత. గుర్రం జాషువా ఫౌండేషన్ స్థాపించి నిష్ణాతులైన కవులకు పురస్కారాలు అందజేసింది. అండాశయపు క్యాన్సర్ వ్యాధితో బాధపుతూ విజయవాడలోని నాస్తిక కేంద్రము 20 మార్చి 2008న కన్నుమూసింది.



# ఆధునీకరణ క్రమంలో తెలుగు భాష

- డా.వి.గోపాల్
అసిస్టెంట్ డైరెక్టర్
ప్రచురణల కేంద్రం
ద్రావిడ విశ్వవిద్యాలయం
కుప్పం - 517 426

శబ్ద సంపదలో శబ్ద సౌష్టవంలో, భావ వ్యక్తీకరణలో, శ్రవ్యతలో "తెలుగు భాషతో" మిగితా భాషలు సాటిరావు. తెలుగు భాషకున్న విశిష్టతను బట్టి, శ్రుతి మాధుర్యాన్ని బట్టి పాశ్చాత్యులు ఈ భాషకు "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్"గా ప్రస్తుతించారు. భారతీయ భాషల్ని విపులీకరిస్తూ జె.టి.యస్ హాల్డెన్ "తెలుగు భాషకు అత్యంత సమన్వయ శక్తి ఉందనీ, దీనికి విభిన్న స్రవంతుల్ని తనలో లీనం చేసుకొనే సమర్థత ఉందని కొనియాడాడు."

ప్రపంచవ్యాప్తంగా అనేక భాషలు పుట్టాయి. వాటిని భాషాశాస్త్రవేత్తలు జాతిపరంగా, రూపంగా ఆధారంగా, భౌగోళిక పరిస్థితుల దృష్ట్యా వివిధ భాషా కుటుంబాలుగా వింగడించాడు. వాటిలో అతిపెద్ద భాషా కుటుంబం ఇండో-యూరోపియన్ భాషా కుటుంబం. ఇందులో భాగంగా వెలువడిందే ఆర్య భాషా కుటుంబం. ఈ కుటుంబంలో ప్రధానమైన భాషా సంస్కృతం. ఇది వివిధ అపభ్రంశ రూపాలతో భారతదేశమంతటా వ్యాపించింది. వేద సంస్కృతికి ఆలంబనగా నిలిచింది. కాబట్టి భారతదేశ కీర్తి ప్రతిష్టలు ప్రపంచం నలుమూలలా వ్యాపించటానికి మూల కారణమైంది. అలాంటి సంస్కృతాన్ని ఆత్మగా స్వీకరించిన తెలుగు భాష తనకున్న విశిష్ట గుణాలతో అభివృద్ధిని సాధించింది.

**ఆదాన స్వీకారం:**

ఏ భాష అయినా స్వంత వనరులతో అభివృద్ధిని సాధించలేదు. కాబట్టి ఇతర భాషల తోడ్పాటును తప్పనిసరిగా తీసుకుంటుంది. ఆంగ్ల భాష గ్రీకు, లాటిన్, ఫ్రెంచ్ మొదలైన అనేక భాషల అండదండలతోనే అంతర్జాతీయ ఖ్యాతినార్జించింది. ఏ భాషకు ఇచ్చిపుచ్చుకునే గుణం అధికంగా ఉంటుందో అది అభివృద్ధిని సాధిస్తుంది. ఈ గుణం వల్ల ప్రపంచంలోని అనంత విజ్ఞానం ఆ భాషలో వచ్చి చేరుతుంది. భాషకు ఆంక్షలు పెట్టి అడ్డుకట్టలు వేస్తే అది అభివృద్ధికి నోచుకోదు. తెలుగు భాష కూడా చాలా కాలం ఛాందవాదుల సంకెళ్ళలో బందీయై తర్వా స్వేచ్ఛను పొందింది. ఈ భాషా స్వేచ్ఛ కోసం గిడుగు, గురజాడ లాంటి దేశీయ పండితులే కాక, జే.ఏ.యేట్స్ లాంటి పాశ్చాత్య పండితులు కూడా అవిరళ కృషి చేశారు.

ఏ భాష అయినా ఆ భాషా నిర్మాణానికి లోబడే ఆదానాలను స్వీకరిస్తుంది. ఈ భాషా నిర్మాణం అనేది భాషకు సహజమైన ప్రత్యేక లక్షణం. దీన్నే ఇంగ్లీషులో Genius of Language అని పిలుస్తారు. ఇది మనిషికి ఉ

న్న వ్యక్తిత్వం లాంటిది. ఈ వ్యక్తిత్వాన్ని జీవితాంతం నిలుపుకుంటూ, తన ఉనికిని నిలబెట్టుకుంటుంది. తెలుగు భాషా నిర్మాణం ఇతర భాషా పదాలను స్వీకరించటానికి సర్వవిధాలా యోగ్యమైంది. ఇది మొదటి నుంచీ సంస్కృత భాషా పదాలను బాగా ఆకర్షిస్తూ వచ్చింది. అందుకే ఎక్కువ సంస్కృత పదాలు తత్సమ రూపంలో వచ్చి చేరాయి. ఇంకా చెప్పాలంటే కర్మణి ప్రయోగం (Possive Usage), యత్తదర్థక ప్రయోగం (Relative Sentence) లాంటి సంస్కృత భాషా నిర్మాణాలను తెలుగు భాష స్వీకరించింది. అలాగే అనేక జాతీయాలను, లోకోక్తులను కూడా ఎరువు తెచ్చుకుంది. ఇక పరిభాషా స్వీకరణలో సంస్కృతాన్ని పూర్తిగా ఆశ్రయించింది. అలాగే అరబిక్, పర్షియన్, పోర్చుగీసు, ఇంగ్లీషు మొదలైన విదేశీ భాషల నుండి మరాఠి, ఒరియా లాంటి స్వదేశీ భాషల నుండి తమిళం, కన్నడం లాంటి సోదర భాషల నుండి వివిధ రకాల భాషా పదాలను, పదబంధాలను తెలుగుభాష తనలో చేర్చుకొని భాషా భాండారంగాన్ని నింపుకుంది.

ఆదానం అనేది రెండు ఉద్దేశాలతో జరుగుతుంది. అవి. 1.అవసర నిమిత్తం (Need filling motive) 2. ప్రతిష్ఠాహేతుకం (Prestige Motive) ఈ ఉద్దేశాలతోనే తెలుగు సమకాలీన పరిస్థితులకనుగుణంగా విస్తృతమైన పదజాలాన్ని ఇతర భాషల నుండి స్వీకరించింది. కొన్ని సాధారణ పదాల స్థాణంలో కూడా ఇతర భాషా పదాలు వాడుకలోకి వచ్చాయంటే ఇతర భాషా ప్రభావాలకు తెలుగు భాష ఎలా లోనయిందో అర్థమవుతుంది. ఈ ఆదాన ప్రక్రియలో తెలుగు భాష వివిధ పద్ధతుల్ని పాటించింది. వాటిలో ఆదాన మిశ్రమం (Loan Blending), ఆదాన స్థాన చలనం (Loan Transfer) అనేవి ప్రముఖ పాత్ర వహిస్తాయి. తెలుగు భాషా వ్యవహారంలో మధ్య మధ్య ఇతర భాషా పదాలను (Code Mixing) ద్వారా, ఇతర వాక్యాలను (Code Switch-ing) ద్వారా అనుమతిస్తుంది. అలాగే అన్యదేశ పదాలను తెలుగు ప్రత్యయాల్ని కాని, సహాయక క్రియల్నిగాని చేర్చి ప్రయోగించడం చాలా ఎక్కువగా కనిపిస్తుంది. ఇవన్నీ కూడా భావ వ్యక్తీకరణ పెంపు చేసుకోవడానికి తెలుగు భాష అనుసరించే పద్ధతులని భావించవచ్చు. భాషాశాస్త్ర దృష్టితో చూసినపుడు వాటిని సహజ పరిణామాలుగా గుర్తించవలసి ఉంటుంది. తెలుగు భాష విశాల దృక్పథం (Flexible Outlook)తో ఆదాన ప్రక్రియను అన్ని విధాలుగా సద్వినియోగం చేసుకుంటుంది. అందులో భాగంగా మిశ్రమ సమాన కల్పన అనేది సహజ లక్షణంగా మారుతూ ఉంది. ఉదాహరణకు ఫిల్మోత్సవ్, రోడ్డు రవాణ సంస్థ గర్భగుడి, బ్యాంక్ ఋణం, రైతాంగం అనే మిశ్రమ పదబంధాలు తెలుగులో చాలా సహజంగా ఒదిగిపోయాయి. ఈ విధంగా తెలుగు భాష సహకారంతో ఆధునికతను సంతరించుకొని, అనంత విజ్ఞానాన్ని తనలో ఇముడ్చికుంటూ సజీవ భాషగా ముందుకు సాగిపోతుంది.

**పదక్రమం:**

తెలుగు భాషలో పదక్రమం (Word Order) ఇదమిత్థంగా లేదు. స్థిరమైనది కాదు. ఇది ప్రధానంగా కర్త, కర్మ, క్రియ అనే పదక్రమాన్ని కలిగి ఉన్నప్పటికీ దానికి ఖచ్చితంగా కట్టుబడి ప్రవర్తించాలన్న నిబంధన

తెలుగు భాషకు లేదు. కాబట్టి అభివ్యక్తిలో ఎన్నో తేడాలను చూపెట్టవచ్చు. ఒకే వాక్యాన్ని అనేక విధాలుగా మార్చవచ్చు.

ఉదా: గాలి చల్లగా వీచింది

వీచించి చల్లగా గాలి

చల్లగా గాలి వీచింది

గాలి వీచింది చల్లగా

చల్లగా వీచింది గాలి

వీచింది గాలి చల్లగా

పదక్రమం మార్పులో వెలుసుబాటు ఉన్నందు వల్ల అభివ్యక్తిలో ఎంతో వైవిధ్యం చోటుచేసుకుంది. దీని వల్ల భాషాపరంగా అనేక ప్రయోజనాలు చేకూరుతాయి. ఇది కూడా తెలుగు భాష విశిష్టతకు చక్కని నిదర్శనం.

అలాగే తెలుగు పదక్రమంలోనే కాక పదాల అర్థాల్లో కూడా అనేక మార్పులు వచ్చాయి. నన్నయ కాలంలో 'వాసన, సువాసన' అన్న అర్థాల్లో ప్రయుక్తమైన 'కంపు' అనే పదం నేడు 'దుర్వాసన' అన్న అర్థంలో మాత్రమే వాడబడుతుంది. ఈ అర్థ పరిణామాలను అర్థ వ్యాకోచం, అర్థ సంకోచం, అర్థగౌరవం, అర్థదుష్టత, లక్ష్యార్థసిద్ధి, అభ్యోక్తి, లోకనిరుక్తి అని వ్యవహరిస్తున్నాం.

తెగులు పదాల్లోనూ, పదాంశాల్లోనూ, వ్యాకరణాంశాల్లోనూ, మాట్లాడే విధానంలోనూ అనేక తేడాలు కన్పిస్తాయి. వీటినే మాండలిక భేదాలుగా గుర్తిస్తాం. అలాగే శైలుల్లో కూడా వ్యత్యాసాలు కనిపిస్తాయి. వాటిని గ్రాంథికశైలి, వ్యావహారికశైలి అని వ్యవహరిస్తున్నాం. ఇంకా వివిధ క్షేత్రాల్లో వ్యవహరించే భాషా బేధాలు అనేకం ఉన్నాయి. అవి బోధనా భాష, పాలనా భాష, పత్రికా భాష, సాహిత్య భాష, సాధారణ భాష, ప్రాచీన భాష, ఆధునిక భాష, మౌఖిక భాష, లిఖిత భాష మొదలైనవి. ఈ పరిణామ శీలత వల్ల భాషకు ఏ సందర్భానికైనా, ఏ కాలానికైనా ఒదిగిపోయే గుణం సంక్రమిస్తుంది.

**ఆధునిక ధోరణలు:**

భాషా వినియోగం ప్రధానంగా మౌఖిక రూపంలో, లిపి రూపంలో రెండు విధాలుగా ఉంటుంది. మనిషి అభివృద్ధి చెందుతున్న కొద్ది అవసరమైన పదజాలాన్ని, కావాల్సిన వాక్య నిర్మాణాన్ని తయారు చేసుకుంటున్నాం. కంప్యూటర్ వాడుకలోకి రావడంతో ఎన్నో ఆంగ్ల పదాలు పుట్టుకొచ్చాయి. గ్లోబలైజేషన్ లాంటి అనేక కారణాల వల్ల ఆంగ్ల భాష ప్రభావంతో నేటి వ్యవహారంలోని వాక్య నిర్మాణంలో ఆంగ్ల పదాలు వాడటం పరిపాటి అయింది. సమగ్రమైన తెలుగు వాక్యం మాట్లాడే వాళ్ళు తగ్గిపోతున్నారు.

# రస సిద్ధాంతాన్ని నవలా మార్గం పట్టించిన సాహిత్య శిల్పి-డా: ముదిగంటి

**ఎలగొండ రాములు**, తెలుగు పండిట్
జి.ప్ర.ప.సె.పాఠశాల, ఇటుకాలపల్లి
మం: నర్సంపేట, జి: వరంగల్ రూరల్
తెలంగాణ రాష్ట్రం-506 132
ఇ-మెయిల్ : ramulualagonda@gmail.com
సెల్:96185 98847

'హితం' అనగా మంచి

హితంతో కూడుకున్నది సాహిత్యం

సామాజికులకు హితాన్ని కల్గించే అద్భుత సాధనం సాహిత్యం

సాహిత్యంలో గల అనేక ప్రక్రియల్లో ఒకటి "నవల". మానవ జీవితంలోని ఎన్నో సంఘటనలను తెలిపే పెద్ద కథ "నవల". ఇదొక ఆధునిక సాహిత్య ప్రక్రియ. పాశ్చాత్య సాహిత్య ప్రభావంతో మన దేశీయ భాషల్లోకి, ముఖ్యంగా మన తెలుగులోకి ఈ ఆదుకనిక కాలంలో ప్రవేశించింది.

తెలుగులో దేదీప్యమానంగా వెలుగొందుతున్న నవలా సాహిత్య ప్రక్రియ, ఆధునిక కాలానికి చెందినదైనప్పటికీ ప్రాచీన కాలంలో ప్రాచుర్యం పొందిన 'రస సిద్ధాంతాన్ని" నిబిడీకృతం చేసుకుని ఒక ప్రత్యేకతను సంతరించుకున్నది. సాహిత్యంలో 'రసం' అనేది కావ్యాలు, నాటాకాలు....మొదలగు వాటిలోప్రాధాన్యతను కలిగి ఉంటదనేది అందరికి తెల్సిన విషయమే. కానీ, నవలల్లో కూడా 'రసం' ఉంటుందని డా: ముదిగంటి వారు కొత్తగా ప్రతిపాదించారు.

సాహిత్య రచన కల్గించే చక్కని అనుభూతిని 'రసానుభూతి (ఆనందానుభూతి)' అంటారు. ప్రాచీన కాలంలో 'రస సిద్ధాంతాన్ని' ప్రతిపాదించి సాహిత్యంలో 'రసం' యొక్క ప్రాధాన్యతను వివరించారు సాహిత్యాలంకారికులు.

ప్రాచీన సాహిత్యంలో ప్రధానంగా నాటకం, కవిత్వం లాంటి ప్రక్రియలకే రసాన్ని ప్రతిపాదించినట్లు తెలుస్తున్నది. 'నాట్య శాస్త్రం' లాంటి గ్రంథాల్లో 'రసం' గురించి విస్తృత చర్చ జరిపినట్లు మనం గమనించవచ్చు.

ఆధునిక సాహిత్యంలోని వచన ప్రక్రియలలో కూడా 'రసం' ఉన్నట్లు విశ్లేషణల ద్వారా అద్భుతమైన చర్చలు జరగడం ఎంతో సంతోషించాల్సిన సందర్భం. ప్రాచీన సాహిత్యాన్ని, పద్యాన్ని తిట్టిన కవుల, రచయితల రచనల్ని పరిశీలిస్తే; రసం, శైలి, శిల్పం లాంటివి రచనల్లో ఉండటం ఆశ్చర్యం. సాహిత్యంపై పూర్తి అవగాహన లేకపోవడమే వారి తిట్లకు కారణంగా భావించవచ్చు.

**నవల-రస నిరూపణం**

నవలలోని కథను, పాత్రల వర్ణనను, సంభాషణలను, పాత్రల చర్యలను **(action)** చదివి పాఠకుడు తన ఊహా శక్తితో తన మనఃఫలకం మీద సమస్తం దర్శిస్తాడు. రచయిత మనఃఫలకం మీద ప్రత్యక్షం చేసే గుణాన్ని సాధించాలి. ఈ గుణాన్ని ప్రాచీన లాక్షణికులు 'భావుకత్వం' అని పేర్కొన్నారు. నవలలో రచయితలు చేసే వర్ణనలు సహృదయులకు ప్రతీ ఘట్టం కళ్ళ ముందు జరుగుతున్నట్లుగా మనఃఫలకం మీద ప్రత్యక్షమయ్యేటందుకు తోడ్పడాలె. ప్రతీ సంఘటన సాక్షాత్తూ కళ్ళ ఎదుట జరుగుతున్నట్లుగా కన్నులకు కట్టినట్టుగా చేయాలంటే రచయితలో 'భావనా శక్తి' అవసరం. అంతేకాక, దాన్ని చదివి కళ్ళముందు ప్రత్యక్షం చేసుకోవాలంటే పాఠకునికి కూడా 'భావనా శక్తి' అవసరం. అటువంటప్పుడు సహృదయ పాఠకులు నవలను చదివి 'రసానుభూతిని' సులభంగా పొందగలుగుతారు. ఇందు కొరకు నవలా రచయిత చేసే వర్ణనలు పాత్రల చర్యల చిత్రణ, సంభాషణ మొదలగునవి సులభ శైలిలో ప్రసన్న రీతిలో ఉండాలె. అలాంటప్పుడే రచయిత చేసిన వర్ణనలు పాఠకుల కనుల ముందు రూపుగట్టి రసానందాన్ని కల్గిస్తయి.ఇట్టి గుణం ఆధునిక వచన ప్రక్రియ అయిన 'నవల' లోనూ ఉండటం అవసరమని డా: ముదిగంటి సుజాతా రెడ్డి ప్రతిపాదించారు.

నవలలో ఇతివృతం గజిబిజిగా ఉండకుండా సరళంగా, పాఠకులకు ఆసక్తి కల్గించేలా ఉండాలె. నవలలో రచయిత చెప్పే ప్రతీ విషయం పాఠకుల కనుల ముందు నిలిచేటట్టుగా ఉండాలె. పాత్రల చర్యలు, సంఘటనలు అన్నీ ప్రత్యక్షంగా జరుగుతున్నట్లుగా పాఠకుల మనఃఫలకం మీద గోచరించాలె. పాత్రల బహిరంగ రూపాలు, సంభాషణలు సహజంగా, వాస్తవిక జీవితానికి దగ్గరగా ఉండాలె. ఇవన్నీ ఉన్నప్పుడే నవలా పఠనం పాఠకుడికి రసానుభూతిని కల్గిస్తుంది. పాత్రల రూపు రేఖలు, వ్యక్తిత్వాలు స్పష్టంగా, ఇతివృత్తం సంభాషణలు యధార్థంగాను, సులభగ్రాహ్యంగాను లేకపోతే, సంఘటనలు

పాత్రల చర్య **(action)**ల వర్ణన సమగ్రంగా లేకపోతే నవల పాఠకుల హృదయంలో ఏదీ ప్రత్యక్షమానం కాదు. భావానుభూతిని కల్గించదని డా: ముదిగంటి సుజాత రెడ్డి విశ్లేషించారు.

నవలలో ప్రత్యక్షమాన గుణం (భావుకత్వ గుణం) ఉన్నప్పుడు పాఠకులు పాత్రలను గుర్తించి, వాటితో తాదాత్మ్యత **(identity)**ను చెందుతారు. నవలలోని తమకిష్టమైన పాత్రతో పాఠకులు తాదాత్మ్యతను పొంది, ఆ పాత్ర లాగానే ఆచరించాలనుకుంటారు. ఒక్కొక్కసారి నవలల్లో దొంగతనాలు, దోపిడీలు, హత్యలు ఉన్నతంగా చేసి చిత్రింపబడినట్లైతే పాఠకులు ఆ చెడు కార్యాలను చేయడానికి ఉత్సాహాన్ని చూపిస్తారు. కాబట్టి నవలలు మంచిని పెంచేవిగా, చెడును తగ్గించేవిగా ఉండాలె. ముదిగంటి వారు చేస్తున్న ప్రతిపాదనలు అద్భుతంగా ఉన్నాయని చెప్పవచ్చు.

నవలల్లోని పాత్రలు పాఠకుణ్ణి తాదాత్మ్యం చెందేటట్లు చేయటమే 'రసానుభూతి', రసానుభూతి అంటే కేవలం నవలను చదువుతున్నంత సేపు కలిగే ఆనందం, దుఃఖం, భయం, ప్రేమ, ఉత్సాహం, ఆశ్చర్యం మొదలగు భావాలు కాదు. కవిత్వమైనా, నవలైనా చదివినప్పుడు మన గ్రంథులను పెకిలించి, మనలో సంచలనం కల్గించి మనల్ని ఒక దిశగా నడిపే శక్తియే 'రసం!' వంట పదార్థాల వాసన, రుచి ఆ

పదార్థాలను తినాలనే కోరికను కల్గిస్తుంది. అదే విధంగా నవలను చదివినప్పుడు దానిలోని పాత్రలు సంఘటనలు మన శరీరంలోని గ్రంథులను ప్రేరేపించి, మనల్ని సంచలితుల్ని చేసి, మనం మనం కాదు ఆ పాత్రలమే అనే భావన దాకా తీసుకుపోయి, మనల్ని భావాత్మకంగా మార్చివేస్తుంది, మనల్ని కార్యోన్ముఖుల్ని చేస్తది. నవల ఉదాత్త చరిత్రను చిత్రించేదైతే సహృదయుల్లో ఉదాత్త గుణాలను ఉద్బుదం చేస్తుందని నవలా పరంగా రసానుభూతిని ఎంతో చక్కగా వివరించారు డా: ముదిగంటి సుజాతా రెడ్డి గారు.

వేలాది ఏండ్ల చరిత్ర గల తెలుగు సాహిత్యంలో 150 ఏండ్లుగా కొనసాగుతున్న నవలా ప్రక్రియలో సాహిత్య రసాలను విశ్లేషించే ప్రయత్నం చేశారు డా: సుజాత రెడ్డి గారు ప్రారంభ దశలో నవలా రచయితలు శృంగార, వీర రసాలను అంగి రసాలుగా, మిగతా రసాలను అంగ రసాలుగా పోషించారన్నారు. సాంఘిక నవలల్లో శృంగారాన్ని, చారిత్రక నవలల్లో శృంగార, వీర రసాలను ప్రధానంగాను, అద్భుత, కరుణ, హాస్యాది రసాలను అంగ రసాలుగా పోషించారన్నారు. నవల చివరలో మంచికి, సత్యానికి, ధర్మానికి, వివేకానికి విజయం కల్గినట్లుగా చిత్రించి పాఠకులలో తదభిరుచిని పెంచాలని ప్రకటన కర్తల, నవలా ప్రచురణ కర్తల అభిప్రాయం. అంటే, 'రస సిద్ధాంతానుసారంగా' పాత్ర చిత్రణ, ఇతివృత్తాలు ఉంటే పాఠకులు ధర్మ, సత్య కార్యాచరణలకు ఉత్సాహాన్నికలిగించే రసానుభవ స్థితిని పొందుతుతారని డా: ముదిగంటి గారు అంటారు.

నవలలో ఉండే ఇతివృత్తం యొక్క క్రమ వికాసంతో పాఠకుల్లో ఒక ఆవేశాన్ని, ఉత్తేజాన్ని కలిగించి జీవితావగాహనకు, కార్య సాధనకు సత్యమార్గ శోధనకు, సైద్ధాంతిక విశ్వాస నిర్మాణానికి తోడ్పడాలె. అదే రసానుభూతి! 'రసానందం'! రసానుభూతిని ఆనందమయం అంటారు. ఈ ఆనంద శబ్దానికి కొత్త వ్యాఖ్యానాలను చెప్పుకుంటే, "రస సిద్ధాంతం" నవలకు చక్కగా అన్వయం ఐతదని సుజాతా రెడ్డి చక్కగా ప్రతిపాదించారు.

అన్నరసం (ఆహారం) శరీరానికి పుష్టిని కలిగించి, వ్యక్తిని ఆరోగ్యవంతునిగా చేసినట్లుగానే, నవలా పఠనానంతరం భావానుభూతులతో పుష్టమైన రసాస్వాదన స్థితికి పాఠకులు చేరుకుంటారు. ఆ రసానుభవ స్థితిలోనే పాఠకులు పాత్ర (ల)తో తాదాత్మ్యం పొంది, ఆ పాత్రల లాగానే వ్యవహరించాలన్న చైతన్యంతో కూడిన స్థితిని పొందుతారు. అదే రసానుభవ స్థితి. అంతేగానీ నవలలో రచయిత ప్రయోగించిన శబ్దార్థ భావాలంకారాల చమత్కారాలు పాఠకుల మనస్సులో ఆనంద భావాన్ని నింపి, అలరించినంత మాత్రాన అది రసాస్వాదన గానీ, రసానుభవ స్థితి గానీ కాదు.

రసానుభూతి, రసానుభవం కవి చమత్కృతుల వల్ల కలిగే ఆనందానుభూతి కన్నా భిన్నమైనది. సాధారణంగా లోకంలో రచయిత ప్రయోగించిన శబ్దార్థ భావాలంకారాల్లోని చమత్కారాలు చదివి పొందే ఆనందననుభవాన్ని రసానందం అని అనడం సామాన్యంగా కన్పిస్తుంది. కానీ, అది రస సిద్ధాంతంలో చెప్పబడే రసానుభవ స్థితి కాక కేవలం హృదయాహ్లాద రూపమైనది.

క్లిష్టమైన వ్యక్తుల ప్రవర్తనను, జీవితాన్ని అవగాహన చేసుకుని తన జీవితాన్ని సరిదిద్దుకునే అవకాశం పాఠకులకు నవలా పఠనం వలన కలుగుతుంది. నవలలోని ఎన్నో భావ పరంపరలు

పాఠకులలో భావాలను ఉద్బుద్ధం చేస్తవి. నవలలు పాఠకుల హృదయాల్లో ఒక మానసిక ఉత్కర్షను కలిగించి, ఉదాత్త భావాలను జాగృతం చేస్తాయి. వ్యక్తిగత సంకుచితత్వం నశించి, పాఠకుల్లో చైతన్యం మేల్కొంటుంది. ఇది రసానుభూతి, రసానంద స్థితి. నవలా పాఠకులు, దానిలోని పాత్రలతో తాదాత్మ్యం పొంది, సమ సమాజమనే భావనతో కార్యాచరణకు ఉత్సాహితులైతరు. ఆ తాదాత్మ్యంతో కూడిన మానసిక స్థితియే రసానుభూతి. ఇందుకు చక్కని ఉదాహరణ ఉన్నవ లక్ష్మీనారాయణ రచించిన సంఘ విజయమనబడే 'మాలపల్లి' నవల అని ఉదాహరిస్తారు డా: ముదిగంటి వారు.

కీలు బొమ్మలు, అతడు-ఆమె, మృత్యుంజయులు, కొమురం భీమ్, దగాపడిన తమ్ముడు, పుణ్యభూమీ కళ్ళు తెరు...., మొదలగునవి సామజిక చైతన్యాన్ని కలిగించిన నవలలుగా వివరిస్తారు సుజాత గారు.

'రసం', 'రసానుభూతి' అంటే ఏమిటో, రసాన్ని నవలలకు ఎంతవరకు, ఎట్లా అన్వయం చెయ్యవచ్చునో "రస సిద్ధాంతం-నవల" అనే వ్యాసంలో వివరించారు ముదిగంటి వారు.

డా: ముదిగంటి సుజాతా రెడ్డి గారి 'రస సిద్ధాంతం-నవల-1' అనే వ్యాసం 'తెలుగు పరిశోధన' (ఐదో సంచిక-నవంబర్ 1988-జనవరి 1989) లో ప్రచురింపబడింది. 'రస సిద్ధాంతం నవల-2' అనే పేరుతో మరో వ్యాసం-తెలుగు వైజ్ఞానిక మాస పత్రిక-ఫిబ్రవరి 1992 (తెలుగు అకాడమీ ప్రచురణ)లో ముద్రితమైంది. మొదటి వ్యాసానికి కొనసాగింపుగా వచ్చిందే రెండో వ్యాసం.

శృంగార, వీర, హాస్య, శాంత, అద్భుత, కరుణ సాహిత్య రసాలు సామాజికుల్లో సుఖప్రదమైన భావ సంచారాన్ని కలిగించి వ్యక్తి వికాసానికి, ఉత్కర్షకు, సమాజ వికాసానికి తోడ్పడతాయి. భయానక, బీభత్స, రౌద్రాది రసాలు మనుషులకు క్లేశాన్ని కలిగించి, ఉద్వేగాన్ని పుట్టించి, వ్యక్తిత్వ వికాసాన్ని నిరోధించటమే కాక సామాజికాభివృద్ధికి ఇవి తోడ్పడవు.

ఏ రసం ఏవిధంగా పాఠకుల్ని చైతన్యపరిచి ఉత్తమ మానవులుగా తీర్చి దిద్దుతుందో, మొదలగు అంశాలను ఉదాత్త భావాల నవలల పరంగా సుజాత రెడ్డి గారు చెప్పడం జరిగింది.

డా: సుజాతా రెడ్డి గారి 'రస సిద్ధాంతం-నవల' వ్యాసం గురించి పత్రికల్లో అనేక సాహిత్య చర్చలు జరిగాయి. ప్రతికూల చర్చలు చేసిన వారిలో ముఖ్యులు బలివాడ రఘునాథ రావు గారు, కె.పి. అశోక్ కుమార్ గారు కాగా, అనుకూలంగా చర్చినవారు కె. గోదావరి శర్మ గారు, చిట్టిప్రోలు వేంకట రత్నం గారు.

రస సిద్ధాంతము-రసా భాసమా' అనే పేరుతో రాసిన లేఖలో బలివాడ రఘునాథ రావు గారు నవలకు రస సిద్ధాంతాన్ని అన్వయించడం కుదరదన్నారు. కె.పి. అశోక్ కుమార్ గారైతే, నవలా పరంగా రస సిద్ధాంతాన్ని చర్చించాల్సిన అవసరం లేదంటూ "నవల-రస చర్చ అవసరమా?" అనే లేఖలో వారి అభిప్రాయాన్ని తెలియజేశారు.

'రస సిద్ధాంతము దృశ్య కావ్యాలకే పరిమితం కాదు' అనే లేఖలో కె. గోదావరి శర్మగారు నవల వంటి ఆధునిక ప్రక్రియలకు కూడా రస సిద్ధాంతాన్ని అన్వయించడాన్ని సమర్థించారు. చిట్టిప్రోలు

వేంకటరత్నం గారు రాసిన 'నవల కూడా కావ్యమే' అనబడే లేఖలో నవల అనేది కథా సహితమైన ప్రక్రియ. కాబట్టి రస సూత్రాన్ని నవలకు అన్వయింపజేయవచ్చన్నారు.

ఉప్పు లేని కూర చప్పగా ఉన్నట్లే, సాహిత్య రసం లేని నవలను సామాజికులు ఆదరించరు. మనిషిని చైతన్యపరిచే, నైతికత దిశగా నడిపించగలిగే నవలగా చెప్పుకోబడాలంటే ఉదాత్తమైన రసం ఉండాల్సిన అవసరం ఉన్నదని డా: ముదిగంటి సుజాతా రెడ్డి గారు అంటారు. ఏది ఏమైనా నవలకు రసాన్వయం చేసిన సుజాత గారి కృషి ప్రశంసనీయం. మనిషి మహోన్నతంగా ఎదగాలంటే, ఉదాత్తతతో కూడిన నవలా సాహిత్యమే ఉపకరిస్తుందని చెప్పక తప్పదు.

**ఆధార గ్రంథం**

'రస చర్చ-ఆధునికత'-డా: ముదిగంటి సుజాత రెడ్డి.

*****

# తరిగొండ వెంగమాంబ సాహిత్యం జానపదాంశాలు

**- భూక్య జ్యోతి,** తెలుగు అధ్యాపకులు
యస్.ఎల్.యస్. డిగ్రీ కళాశాల,
దువ్వూరు. చరవాణి: 9491136834

శ్రీ వేంకటేశ్వరస్వామి భక్తులలో తరిగొండ వెంగమాంబ ప్రముఖులు. తెలుగులో వెలసిన రచయిత్రులలో మకుటమణిగా వెలిగిన వారు మాతృశ్రీ తరిగొండ వెంగమాంబగారు. వీరు తన రచనాబాహుళ్యం చేతను, గుణాధిక్యం చేత, భక్తి పారమ్య సిద్ధాంతాలను ప్రతిపాదించి, వేదాంత రహస్యములను మనోహరంగా రమ్యంగా ప్రబోధించింది. అయినను తెలుగు వాఙ్మయ చరిత్రలో వెంగమాంబగారికి సముచిత స్థానం లేకపోవడం విచారకరం.

వీరు తెలుగుభాషలో 18 కృతులను రచించారు. వీటిలో చాలాభాగం అముద్రితంగా సాహితీపరులకు అందుబాటులో లేనివిగా ఉన్నాయి. వెంగమాంబగారి రచనలు అన్ని ఆధ్యాత్మిక భక్తి యోగ విషయాలకు సంబంధించినవి. వీరి కలం నుండి జాలువారిన రచనలలో శతకాలు, యక్షగానాలు, కావ్యములు, పురాణములను అద్భుతంగా రచించినది. ఆమె రచనలలో తన స్వామి అయిన శ్రీనివాసుని అనేక విధాల కీర్తించి స్తుతించినది. వెంగమాంబగారి రచనలలో భక్తి భావంతోపాటుగా సంస్కృతి సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు, సంగీత, సాహిత్యాలు మేళవించి ఉన్నాయి.

వెంగమాంబగారి రచనలలో అనేక జానపదాంశాలు కనబడుతాయి. వాటిలో సామెతలు, జాతీయాలు, నమ్మకాలు, లోకోక్తులు జానపదులు భాష, భక్తి భావాలు మొదలైన వాటిని చెప్పవచ్చును.

**1. సామెతలు**

తరిగొండ వెంగమాంబగారు తన కృతులలో విరివిగా జాతీయాలను, సామెతలను ఉపయోగించినవారు. పదునైన భావాలను పదునైన మాటలలో చెప్పడం సామెతల లక్షణం, మానవుని సుదీర్ఘ అనుభవం ఆధారంగా రూపుదాల్చిన సంక్షిప్త వాక్యాలను సామెతలు అని చెప్పవచ్చు, మొత్తంగా సంక్షిప్తమైన, వివేకయుతమైన, తక్షణమైన, సాంప్రదాయకమైన, జనప్రియమైన, అనుభవ మూలమైంది సామెత అని చెప్పవచ్చును.

**ఎ. హేమగిరిలో కూచిగుట్ట పోరాడినట్లు**

**జ్ఞానకాంత**

శాంతి బోంది యున్నాడనే సంతోషించే వంతేగానీ
యింత మాత్రమున కేనుమెచ్చేనా
వో భక్తి కాంతా! యిపుడు ముక్తినంటనిచ్చేనా?

**భక్తికాంత:**

హేమగిరిలో కూచిగుట్టా యెదురించి పోరాడెననెడి సామెతగా బలుకుచున్నానే
వోజ్ఞానకాంత! స్వామి మహిమలేమిగన్నావే?

**బి. చల్లలమ్మిన వెనుక నుట్లదిక్కు జాచినగతి**

వెలది! విను చల్లలమ్మిన వెనకనుట్ల
దిక్కు జాచిన గతి గృష్ణుడక్కరగును
వచ్చినప్పుడు పోనాడి మెచ్చి మిగుడి
పిలిచినంతనే వచ్చునే బిసరుహాక్షి?

**సి. ఏనుగుతో దోమ పోర దలించినట్లు**

ఏనుగును జూచి దోమతానేదిరి పోర దలచినటువలేనీవు న్నలిగియిన్ని
యోగ్గులాడిన నీకేమి ఫలమువచ్చే చాలునిక పోవే నీ ప్రేమ సత్యభామ!

డి. ఎలుకలు ద్రవ్విన ఇంటిచందము

"నా తండ్రి రఘువర! నాటుగా నిపుడు నీ తండ్రి రాజ్యంబు నెమ్మదిగాను
బాలింప యువరాజ్య పట్టభద్రుడి – వెలతిసుఖము బెల్లనుభవింపకాయ
యెలుకలుద్రవ్విన యింటి చందమున – గలగుచు దిగులంద గారణమేమి.

**జాతీయాలు**

జాతీయాలనగా జాతికి సంబంధిచనవి, ఇవి ఒక జాతి యొక్క భావవ్యక్తికరణ సామర్థ్యము అనుభవం కలసి ఉండేవి జాతీయాలు అని చెప్పవచ్చును.

**ఎ. కాయో పండో**

"ఓ యోగీశ్వర! సత్కృప
నియెడ కిమ్మాడ్కివచ్చునటిది మేలయ్యెన్
మాయ విరహిత! నాపని
కాయో! పండో నిజంబుగా దెల్పుమయా!

**బి. కొంగు బంగారము**

"పదవే పిలిచి వత్తమూ గోపాల బాలునీ
నా కొంగు బంగారమున నందకుమారునీ"

**లోకోత్తులు**

జానపద సాహిత్యంలో ప్రసిద్ధమైనవి లోకోక్తులు లోక ప్రసిద్ధమైన అర్థమునకు నెలవగు ఉక్తులే లోకోక్తులు అని చెప్పవచ్చును.

తన్నిన నెఱుగడు పిన్నవాడని నేను
గూర్చి దలంపక గొట్టనగునే?
కడుపు లోపల బిడ్డ కాలదన్నెనటంచు
దల్లిక్రమ్మర వాని దన్నదగునే?

బి. "పెట్టిన వారికిన్ మరిక్షిచెట్టినంతయు గల్గు నేటికిన్
వట్టి దరాశలన్ దగిలి వాజతనంబున నన్యసంపదల్"

సి. "వెన్నయ జేత బట్టుకొని వేమరనేయని కూయనేటికో"

డి. "లోకంబంతయు మూయను
మూకుడులే దతని నేల మోహించితేవే
కూతుర మాకును నీకును
బ్రాకట ఋణమింతే కీర్తి రాగలదే మహిన్"

**జానపద నమ్మకాలు**

జానపదుల నమ్మకాలు ప్రాచీన కాలం నుండి ఒక తరం నుండి మరొక తరానికి సంక్రమిస్తూ వస్తున్నాయనడానికి ఏ మాత్రం సందేహంలేదు. మానవుని పుట్టుకతోనే నమ్మకాలు పుట్టాయేమో అనిపిస్తుంది. వెంగమాంబగారిని కూడా మూఢనమ్మకాలు, కట్టుబాట్లు, ఆచారాల పేరుతో గ్రామ పెద్దలు ఎంతో హింసించారు. భర్తచనిపోయిన తరువాత వెంగమాంబను పసుపుకుంకాలు పెట్టుకోరాదని, తలనీలాలు తొలగించాలని నిర్ణయించాయి. అయితే వెంగమాంబ ఈ

కట్టుబాట్లను లెక్కచేయకుండా ఎదురొడ్డుతుంది. ఫలితంగా ఆమెను గ్రామం నుంచి వెలివేయాలని కుల పెద్దలు నిర్ణయించారు. ఈ నమ్మకాలు అంతటిని తన రచనలలో పేర్కొన్నారు వెంగమాంబగారు.

**వెంగమాంబ గారి కృతులలో జానపదుల భాష**

జానపదుల భాషకు పేరున్నా లేకున్నా భాష గురించి తెలుగులో లోతుగా అధ్యయనం చేశారు. తరతరాల నుండి తెలుగు భాషకు జీవనాడిగా వుండే దేశ్యపదాలే జానపద భాషకు మూలస్థంభాలు. ఈ పదాలు ఇతర భాషల నుండి అరువు తెచ్చుకున్నవి కావు. కొన్ని వందల సంవత్సరాల నుంచి తెలుగువారి నాలుకపై నాట్యమాడేపదాలివి.

వెంగమాంబగారు తన విష్ణుపారిజాతము నందలి పలుగుసింగి పల్కులు ప్రథమదృష్టాంతముగా చెప్పవచ్చు.

"వినవేయవ్వ! నీవు తలచినన తలంపులు మరుగబెట్టి పలుకుసుండావ,

అవ్వోయవ్వ! నీ తలంపులు మా కొల్లపురమ్మ వచ్చి సెప్పుసుండాది,

అవ్వోయవ్వా! అదియేమంటే సెప్పెవినవే దుండి!

అవ్వోయవ్వ! ఒక మేలు కదుకుసుండావే భాగ్యశాలీ" అని జానపదుల భాషలో చెప్పారు.

వేంకటాచల మహాత్యం అవతారికలో తరిగొండ వెంగమాంబ తన భాష జానపదుల భాష అని బాలభాష అని చెప్తూ.....

"పండితాగ్రణులారా! ప్రజలారా! యిపుడునా

బాలభాష కసుయపడిక వినుడ

తల్లిదండ్రులు చిన్న పిల్లలు పల్కులు

కానంద మొదెదునట్లు యిందు

మీరు నా తప్పోపులే రీతిగానైనా

గేలిసేయక చిత్తగింప వలయుం" అంటూ తన కృతులలో వెంగమాంబగారు బహుముఖంగా ప్రదర్శించిన భాషా వైచిత్రి అంతయు ఆమె బాలభాష, జానపదుల భాష లక్ష్యమై ఉన్నట్లు తెలుస్తుంది.

**వెంగమాంబ గారి కృతులలో భక్తి**

జానపద దేవతలు లేని గ్రామమంటూ ఏదీ లేదు. దేవతల ప్రీతికోసం పూజలు, జాతరలు, ఉత్సవాలు జరపని జానపదులు ఉండరు. చిన్నరాయి, బండ, కొమ్మ, చెట్టు, పుట్ట కూడా దేవతలని జానపదులు ఆరాధిస్తారు. గ్రామాలను కావలి కాస్తు, సర్వరోగాల నుండి కాపాడేవారిని జానపదులు విశ్వసిస్తారు.

వెంగమాంబ తన కృతులలో సుత్తించిన దేవుళ్ళలో తన ఇలవేల్పు అగు తరిగొండ లక్ష్మీనరసింహుడు, ఆధ్యాత్మిక విద్యాగురువైన సుబ్రమణ్యయోగి, కులదైవమైన చౌడేశ్వరి మొదలైన వారితోపాటు తిరుమల చేరిన తరువాత వెంకటేశ్వరస్వామిని ఆరాధించేవారు. పోతన భాగవతమున భగవంతుడు సాక్ష్యాత్కరించిన ఘట్టములను తన్మయుడై వర్ణించినట్లే ఈ కవయిత్రి తన కృతులలో అట్టి సన్నివేశాలలో తదాత్మ్యము పొంది దేవతాస్తుతులను సంతరించినది ఉదాహరణకు....

"శ్రీనివాసుని జూచి ఆనందపరవశు

లై ఓడట్టిరాడ నాడి యాడి

బుద్ధ మిత్థ మననేర కెనలేని ముదమున

నిందిరేశుని చెంత నెగిరియోగిరి

భక్తి యుక్తావేశ చరితాత్ములై యప్డు

చక్కగ జిందులు త్రొక్కి త్రొక్కి

ఘనపద క్రమ జంట కలిత స్వరంబులు

సకల వేదంబుల జదివి చదివి
నిలిచి యానందదుగ్ధాబ్ధి నెమ్మి సునిగి
శ్రీనివాసుని రూపంబులు ప్రియంబు గదుర
గనుల పండివుగను జూచి మనము లచట
మగ్నములోనర్చి రెంతయు మౌనివరులు"

మాతృశ్రీ వెంగమాంబ గారిది కుగ్రామం కావడం చేత వీరి రచనలు అన్నింటిలోను జానపదాంశాలైన సామెతలు, లోకోక్తులు, జాతీయాలు, నమ్మకాలు, సంస్కృతి సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు, భక్తి, జానపదుల జాతరలు, ఉత్సవాలు గ్రామీన ప్రాంత జానపదుల భాష మొదలైన జానపదాంశాలు వీరి రచనలలో కనిపిస్తుంది.

**ఆధారగ్రంథాలు**

1. Mathrusri Tharigonda Vengamamba (Sankeerthana Ravali)
2. Sri Venkatachala Mahathyam by Veda Vyasa (author), P.r. Kannan (nar)
3. ebooks.tirumala.org, TTd, ebooks in Telugu.
4. Sapthagiri Magazines in Telugu.
5. తరిగొండ వెంగమాంబ రచించిన శ్రీ కృష్ణమాంజ కావ్యం – వావిలకొలను సుబ్బారావు – ("ఆంధ్రా వాల్మీకి" వాసుదాసస్వామి) తమ భక్తిసంజీవని అనే పత్రికలో జనవరి, 1929 సంచికలో ప్రచురిస్తూ ఈమెను మహాయోగిని, భక్తురాలు, కవయిత్రిగా పేర్కొన్నారు.
6. తరిగొండ వెంగమాంబ, దక్షిణాది భక్త పారిజాతాలు, శ్యామప్రియ, యస్.వి.యస్. గ్రాఫిక్స్, హైదరాబాద్, 2003.
7. ఆంధ్రప్రభ దినపత్రికలో ఆమె జీవిత కథ సీరియల్‌గా వచ్చింది.



# సాహిత్య విమర్శ

-మిడమనూరు హిమాలిని
సమన్వయకర్త (కో-ఆర్డినేటర్)
ఐ.టి.ప్రొఫోర్డ్ ఇండియా ప్రవేట్.లిమిటడ్.
himalinimidamanuru@gmail.com

కవిత్వం, నవల, నాటకం, కథలు ఇవన్నీ సృజనాత్మక ప్రక్రియలు. ఈ సృజనాత్మక ప్రక్రియల లోని మంచి చెడుల విశ్లేషణే విమర్శ. కనుక ఇది కూడా సాహిత్య ప్రక్రియ క్రిందే వస్తుంది. ఒక రచనలోని శైలి, వస్తు, నిర్మాణ విమర్శ సౌష్టవం, భావ గంభీరత్వం, పాత్ర పోషణ, మొ॥ వాటిని కూలంకషంగా చర్చించి దానిలోని తప్పులను దిద్దుకోవలసిన విధానాన్ని పరిధులు దాటకుండా ఎవరినీ నొప్పించకుంగా వ్యక్తపరచడమే సద్విమర్శ అనిపించుకుంటుంది. విమర్శ నిర్మాణాత్మకంగా ఉండాలి. విమర్శను స్వీకరించగల సహృదయాన్ని రచయిత కలిగి ఉన్నప్పుడు ఆ విమర్శ వన్నె కెక్కుతుంది.

ఆంగ్ల సాహిత్య ప్రభావం వలన తెలుగు సాహిత్యంలోనికి విమర్శ ప్రవేశించింది. కందుకూరి వీరేశలింగం పంతులు గారిని విమర్శకు ఆద్యులుగా చెప్పవచ్చు కొక్కొండ వేంకటరత్నం పంతులు గారు వ్రాసిన "విగ్రహ తంత్రం" పైన క్రీ.శ.1876లో వీరేశలింగం పంతులు గారు "విగ్రహతంత్ర విమర్శనం" అనే విమర్శను వ్రాసి వినేకవర్ధనిలో ప్రచురించారు. క్షీణయుగంపై వీరేశలింగం పంతులు గారు "సరస్వతీ నారద వివాదం" అనే విమర్శనాత్మక పద్య గ్రంధాన్ని వ్రాశారు. అంతేకాక "రాజశేఖర చరిత్ర" పై కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రి గారు "వివేక చంద్రికా దర్శనం" పేరుతో విమర్శ వ్యాసం వ్రాశారు.

క్రీ.శ. 1914లో కట్టమంచి రామలింగా రెడ్డి గారు వ్రాసిన "కవిత్వతత్త్వ విచారం" అనే విమర్శ గ్రంథం - తొలి విమర్శ గ్రంథంగా విమర్శకుల చేత నిర్ధారింపబడింది. ఆయిన పాశ్చాత్యుల విమర్శ ప్రమాణాలను మన ప్రాచీన గ్రంథాల పరిశీలనలో ప్రయోగించి సద్విమర్శ ఎలా ఉండాలో తెలుగు సాహిత్య ప్రియులకు రుచి చూపించారు. వ్యాసమంజరి, పంచమి ఆయన విమర్శ గ్రంథాలు, విశ్వనాథ సత్యనారాయణ గారు కావ్యానందం, కావ్య పరిమళం, శాకుంతలం యొక్క అభిజ్ఞానత, ఒకడు నాచన సోమన, అల్లసాని వారి అల్లిక జిగిజిగి, నన్నయ్యగారి ప్రసన్న కథా కలితార్థయుక్తి అనే విమర్శన గ్రంథాలను వ్రాశారు. విమర్శనారీతులకు రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మ గారిని మార్గదర్శకులుగా చెప్పుకోవచ్చు. "పెద్దన పెద్దతనం" అనే

విమర్శనాత్మక గ్రంథాన్ని రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ గారు వ్రాశారు. రామలింగారెడ్డి గారి స్ఫూర్తితో బసవరాజు అప్పారావు,దువ్వూరి రామిరెడ్డి, డా॥ జి.వి.కృష్ణారావు, ఆర్.యస్.సుదర్శనం, గుంటూరు శేషేంద్ర శర్మ గార్లు విమర్శనలు వ్రాశారు. పాశ్చాత్య విమర్శనా ధోరణుల దృక్పథంతో ఆచార్య సి.నారాయణ రెడ్డి, కొడవటిగంటి కుటుంబరావు రాచమల్లు రామచంద్రారెడ్డి గార్లు విమర్శ గ్రంథాలు వ్రాసారు. విమర్శ ప్రక్రియలో ఆచార్య రాచపాలెం చంద్రశేఖర రెడ్డి, ఆచార్య కాత్యాయని విద్మహే గార్లకు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు వచ్చింది. సృజనాత్మక విమర్శనాత్మక రచనగా కొడవీటి గంటి కుటుంబరావు గారి "హపూర్వ హపరాధ పరిశోధన కథలను" చెప్పుకోవచ్చు. స్త్రీవాద విమర్శకు గొప్ప ఉదాహరణ కాత్యాయని విద్మహే వ్రాసిన "అలంకార శాస్త్రంలో స్త్రీ" సాహిత్య విమర్శ సూటిగా, ఖచ్చితంగా నిష్పక్షపాతంగా ఉన్నప్పుడే అది మార్గదర్శకంగా ఉంటుంది. విమర్శకుని ఆలోచనలు సాధారణ పాఠకుని స్థాయికంటె ఒక మెట్టుపైనున్నప్పుడే విమర్శకుడు అన్ని కోణాలలోను సాహిత్యాన్ని పరిశీలించి విశ్లేషించి విమర్శించగలుగుతాడు.

విమర్శ శబ్దం "మృశ్" అనే ధాతువుకు 'వి' అనే ఉపసర్గ చేరి ఏర్పడింది. విమర్శ స్థూలంగా రెండు విధాలు.

**1. అలంకారిక విమర్శ లేదా అస్వతంత్ర వమర్శ**

**2. స్వతంత్ర విమర్శ**

**1. అలంకారిక విమర్శ(Judicial Criticism):-** ఇది చాలా ప్రాచీనమైనది. అలంకార శాస్త్రాల్లో ప్రతిపాదించబడిన సిద్ధాంతాన్ని ఆధారంగా చేసుకొని ఏదైనా గ్రంథాన్ని విమర్శించడాన్ని అలంకారిక విమర్శ అంటారు. ఇది అలంకారిక సూత్రాల ఆధారంగా చేయబడుతుంది కాబట్టి దీనిని అస్వతంత్ర విమర్శగా చెప్పవచ్చు. అలంకార నియమాలకు లోబడి వ్రాయబడిన గ్రంథం సద్గ్రంథమని, దానిని అతిక్రమించి వ్రాయబడిన గ్రంథం సద్గ్రంథంకాదని నిర్ణయించుట ఈ విమర్శలోని పద్ధతి. మన దేశంలో సాహిత్యానికి సంబంధించిన సర్వవిషయాలకు అనగా వస్తు స్వీకరణ మొదలు పద ప్రయోగం వరకు సర్వ విషయాలకు అలంకారిక నిబరధనలు కలవు.

పాశ్చాత్యులకు అరిస్టాటిల్ వ్రాసిన పొయెటిక్సు అనునది ప్రమాణ గ్రంథం. వాళ్ల విమర్శ సిద్ధాంతాలు వాళ్ళ కావ్య విమర్శలలోనే అంతర్గతాలై ఉండేవి. సౌందర్యోపేతమైన కావ్యమే ఉత్తమ కావ్యమని, కావ్యంలో సందేశం కంటే ఆనందం ప్రధానమని వారి ఉద్దేశ్యం. భారతీయ అలంకారికులు, లాక్షణికులు లక్ష్య, లక్షణ సమన్వితంగా లక్షణ గ్రంథాలను రచించారు. వీరి సిద్ధాంతాలను ఆధారంగా చేసుకొని విమర్శకులు కేవలం పరిశీలకులుగా విమర్శ చేసేవారు.

**2. స్వతంత్ర విమర్శ**(Inductive Criticism):- నియమ నిబంధనలకు లోబడకుండా స్వతంత్రంగా చెప్పబడే విమర్శను స్వతంత్ర విమర్శ అంటారు. ఒక రచనను ఇంకొక రచనతో కాని, ఒక రచయితను వేరొక రచయితతో కాని, ఒక కాలాన్ని ఇంకొక కాలంతోగానీ పోల్చి చెప్పకుండా, అలంకార నియమాలను అనుసరించకుండా అందులోని విషయాన్ని మాత్రమే విమర్శించడాన్ని స్వతంత్ర విమర్శ అంటారు.

ఆధునిక కాలానుగుణంగా సంభవించిన మార్పుల వల్ల సాహిత్యం ప్రభావితమైంది. అందువలన సాహిత్య విమర్శ కూడా ఎన్నో క్రొత్త రూపాలను సంతరించుకొంది.

**1. గ్రాంధిక విమర్శ**(Textual Criticism):- గ్రంథంలోని విషయాల్ని విమర్శకుడు పరిశీలించి తన అభిప్రాయాల్ని విమర్శ రూపంలో పాఠకులకు అందిస్తాడు. తెలుగులో గ్రంథ పరిష్కరణలు అన్నీ ఈ కోవలోనే.

**2. నైతిక విమర్శ**(Ethical Criticism):- మానవుడు జీవితంలో ఉత్తమమైనవిగా భావించే నైతిక ఆదర్శాలను ఆధారంగా చేసుకొని చేసే విమర్శలను నైతిక విమర్శలు అంటారు. రచనలో చెప్పబడిన నైతిక విలువలకు ఇందులో ప్రాధాన్యమివ్వ బడుతుంది.

**3. మనస్తత్వం విమర్శ**(Psychological Criticism):- మనస్తత్వవేత్తల పరిశోధనల వలన వెలువరింపబడిన నూతన సిద్ధాంతాల ఆధారంగా విమర్శలు చేయబడ్డాయి. ఈ పద్ధతిలో కలలకు, ఊహలకు, కల్పనలకు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వబడి, మానవ మనస్తత్వానికి ప్రవర్తనకు ఉండే సంబంధాన్ని విశ్లేషించి చూపబడుతుంది.

**4. సాంఘిక విమర్శ**(Social Criticism):- కవి ఎలాటి వాడైనా అతనిపై దేశకాల పరిస్థితుల ప్రభావం ఉంటుంది. సమకాలీన అవసరాలు, ప్రభావాలను దృష్టిలో పెట్టుకొని ఈ రచన సాగుతుంది.

**5. కళాత్మక విమర్శ**(Aesthetic Criticism):- కళను కళాదృష్టిలోనే విమర్శించాలి. కావ్యంలో గాని, రచనలోగాని కళాత్మక విలువలను వ్యాఖ్యానించడం మాత్రమే ఇందులో ప్రధానం.

**6. పౌరాణిక విమర్శ**(Mythological Criticism):- ఈ విమర్శ కేవలం పురాణాలకు సంబంధించినది కాదు. ఇందులో సాంస్కృతిక, మానసిక అంశాలకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడుతుంది. దీనిని కావ్యంలోని మౌలిక సాంస్కృతిక రూపాల్ని నిరూపించే విమర్శ అని చెప్పవచ్చు.

**7. చారిత్రక విమర్శ**(Historical Criticism):- సమకాలీన సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక విషయాలు రచనలో ఎంతవరకు ప్రతిబింబిస్తున్నాయో తెలిపే విధంగా చారిత్రక

విమర్శ ఉంటుంది. చారిత్రక విమర్శ ఆధారంగా కవి కాలాదులు, గ్రంథపూర్వాపరాలు నిర్ణయించబడతాయి.

**8. తులనాత్మక విమర్శ**(Comparitive Criticism):- ఈ విధానంలో రచయితపై ఉన్న పూర్వ రచయితల ప్రభావాన్ని తులనాత్మకంగా విశ్లేషణ చేయడం జరుగుతోంది.

విమర్శకునికి రచయిత కంటె జ్ఞానం, సునిశిత పరిశీలనా దృక్పథం, అన్ని కోణాల నుంచి రచనను పరిశీలించగల అనుభవం, తన భావాలను ఎవరినీ నొప్పించకుండా విశ్లేషించి విమర్శించగల స్థాయి ఉన్నప్పుడే ఉత్తమ విమర్శనాత్మక రచనలు వెలువడుతాయి. సాహిత్యం మనసులోపలి పొరల్ని తాకి, పాఠకులలో నిద్రాణమైన ఆలోచనలను మేల్కొలుపుతుంది. ఆలోచనలకు పదునుబెట్టి యుక్తాయుక్త విచక్షణను కలుగజేస్తుంది. విమర్శకుడికి విమర్శ వ్రాసేటప్పుడు రచనలలోని అనేక కోణాలు పరిచయమవుతాయి. విమర్శ చదవటం ద్వారా రచయితకు తన సృష్టియైన రచనపై ఒక ఎరుక కలుగుతుంది. పాఠకులు క్రొత్త కోణాలలో ఆలోచించగలుగుతారు.

ఇతిహాసిక పాత్రల్ని మన దృక్కోణం నుంచి చూడకూడదు. ప్రస్తుత కాలంలోని పాత్రల్ని ఆకాలం నాటి సాంఘిక విలువలతో పరిస్థితులతో అంచనా వేసి వారి దృక్పథంతో ఆలోచించి అర్థం చేసుకోవాలి. విమర్శ అనేది ఒక కోణం నుంచి మాత్రమే కాక అన్ని కోణాల నుంచి రచనను పరిశీలించి తర్వాత మాత్రమే చేయాలి. సామాజిక, ఆర్థిక కోణాలలో ఎంతో గొప్ప రచనలుగా నిలిచిన వేమన రచనలు స్త్రీవాద కోణంలో బలహీనపడ్డాయి. రామాయణ, మహాభారతాలను దళిత స్త్రీవాద కోణంలో నుంచి చూస్తే మనకు తప్పేకనిపిస్తుంది.

**విమర్శ ప్రయోజనాలు:-** విమర్శ విజ్ఞానాన్ని కలుగచేస్తుంది. పాఠకునిలో నూతన చైతన్యాన్ని ఆవిష్కరింపజేస్తుంది. కవి కావ్యాన్ని సృష్టించేటప్పుడు పొందిన అనుభూతిని పాఠకునిలో కలిగిస్తుంది. పాఠకుల యొక్క సందేహాలను నివృత్తి చేస్తుంది. మనకు తెలియని భాషలలోని గ్రంథాలపై విమర్శలు మన భాషలో వెలువడినప్పుడు మనకు ఆ గ్రంథాలలోని జ్ఞానాన్ని గ్రహించడానికి ఆస్కారం ఉంటుంది. విమర్శను చదివిన తర్వాత ఆరచనను అన్ని దృక్కోణాలలో పరిశీలిస్తూ తిరిగి చదవాలనే జిజ్ఞాసను పాఠకునిలో కలుగచేస్తుంది.

# విశ్వకవి వేమన

- డా॥ కడియాల వెంకటరమణ
అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలుగు అధ్యయన శాఖ
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి - 517 502
చరవాణి : 9949517591

వేమన 17వ శ॥ అర్థభాగంలో జన్మించారు. చిత్తూరు జిల్లా మూగచింతపల్లె ఇతని స్వగ్రామం. వేమన మొదట భోగియై, సంసారియై, చివరకు విరాగియై విప్లవ కవిగా మన తెలుగు కవులు ఎవ్వరూ గుర్తించని వేమన పద్యాలను పాశ్చాత్యులు గుర్తించారు. ఈయన పద్యాలను ఇంగ్లీషులోకి బ్రౌన్, ఫ్రెంచిలోకి జె.ఎ. దుబేయ్ తర్జుమా చేశారు. ఈయన పద్యాలు మన భారతీయ భాషలైన సంస్కృతం, హిందీ, తమిళం, కన్నడలోకి తర్జుమా అయ్యాయి. వేమన పద్యాలు అంతర్జాతీయ ఖ్యాతి కాంచి విశ్వకవిగా ఆయనను నిలబెట్టాయి.

వేమనది దేశికవిత్వం. అందువల్ల విమర్శకులు ఈయన కవిత్వాన్ని లల్లాయి పదాలుగా కొట్టిపారేశారు. ఈయన కవిత్వంలోని వాస్తవాన్ని నాటి పండితులు స్వీకరించలేక పోయారు. సంస్కృతంలో పద్యం వ్రాసిన వాడే గొప్పకవిగా నాడు గుర్తింపు ఉండేది. భావ వ్యక్తీకరణలో వేమన నాటి మహాకవులకు తీసిపోడు. జాతీయ నుడికారాలు, పల్లె పలుకులు ఈయన పద్యాలకు అలంకారాలయ్యాయి. వేమన తన చుట్టూ ఉన్న పరిసరాలను తీక్షణంగా పరిశీలించి నిజాల్ని నిర్భయంగా కవితా రూపంలో వెల్లడించాడు.

కృత్రిమ భావాలు, పదాలు ఈయన కవిత్వంలో కనబడవు. సహజత్వం ఈయన కవిత్వాన్ని అందం చేకూర్చింది. వీరి ఆటవెలదులు తేజస్సుతో, సరళతతో పాఠకుల్ని మైమరపిస్తాయి. తెలుగు పలుకుబళ్ళు వేమన కవిత్వాన్ని పండించాయి.

వేమన వేదాలు, పురాణాలు, నీతి, మతం, అధ్యాత్మికం, కపట మోసాలు, చిత్తశుద్ధి, కుల జీతాలు, సాంప్రదాయిక విలువలు, గుడులు, గోపురాలు, నమ్మకాలు, శకునాలు, మొదలగు వాటిపై విప్లవాత్మక ధోరణిలో విమర్శ చేశాడు. సమాజాన్ని చైతన్యం చేసే పద్యాలను రచించి విశ్వకవిగా వినుతికెక్కాడు.

### ఎత్తిపొడుపు

ప్రత్యక్ష విమర్శకు బదులు ఎత్తిపొడుపు మనిషిని కదిలించి వేస్తుంది. తద్వారా ఆ వ్యక్తి సంస్కరణకు అది దోహదం చేస్తుంది. ఇలాంటి ఎత్తిపొడుపులకు వేమన పద్యాలు గొప్ప ఉదాహరణలు

ఓగునోగుమెచ్చు. నొగరంగ నజ్ఞాని
భావమిచ్చి మెచ్చు పరమలుబ్ధు
పందిబురద మెచ్చు పన్నీరుమెచ్చునా? - అని ఎత్తిపొడిచాడు వేమన.

### తీర్థసేవలు

తీర్థసేవల్ని వేమన తీవ్రంగా ఖండించాడు. మనసంతా మలినం, అశాంతి నిండి ఉన్నప్పుడు తీర్థయాత్రలవల్ల ఫలితం ఉండదన్నాడు. ముందు మనసును శుద్ధి చేసుకోమన్నాడు. పవిత్ర నదుల్లో మునిగితే ముక్తికలగదన్నాడు. అలాంటివారిని,

నీళ్ళమునగనేల నిధులు మెట్టగనేల
మెనసి వేల్పులకును మ్రొక్కనేల
కపట కలుషవలలు కడుపులోనుండగా - అని దుయ్యబట్టాడు

**ఉపవాసాలు**

ఉపవాసాలతో కడుపులు మాడ్చుకునే వారి గురించి వేమన

కుండబెట్టుకున్న కుక్షిలో జఠరాగ్ని

భక్షంబు చేయు కుక్షమలము

కందు విడిచి మలము కుదుచురా ఉపవాసి

ఉపవాసాలు ఉండి దేవుళ్ళను మెప్పించి స్వర్గం చేరాలని మనుషులు భావిస్తారు. అది నిరర్థకమని, ఉపవాసం ఉండే వారు జఠరాగ్ని బాధతో తనను తను హింసించుకోడమే. మనిషిలోని సహజ చర్యలను ఎదో ఆశించి బలవంతంగా నియంత్రిచ కూడదన్నది వేమన భావన.

**అంధవిశ్వాసాలు**

అంధ విశ్వాసాల్ని వేమన ఎండగట్టాడు. తద్వారా సమాజంలో హేతు దృష్టిని పెంపొందించాడు. పితృదేవతలకు పిండాలు పెట్టే ఆచారాన్ని వేమన హేళనచేశాడు.

పిండములనుజేసి పితరులను దలపోసి

కాకులకును బెట్టు గాడ్దెలారా

పియ్యదినెడి కాకి పితరుడెట్టాయరా

పరలోకంలో ఉన్న తాత, ముత్తాతలు తమను నిత్యం ఆశీర్వదిస్తూ ఉంటారని జనుల నమ్మకం. ఆ విశ్వాసంతో వారిని ప్రసన్నులుగా చేసుకోడానికి వారికి ఇష్టమైన ఆహారాన్ని వండి కాకులకు పెడతారు. వారు కాకుల రూపంలో వచ్చి అహారాన్ని స్వీకరిస్తారని వీరు భావిస్తారు. ఈ విశ్వాసం వెర్రిదని 'పియ్యదినెడికాకి మన తాత, ముత్తాతలు ఎలా అవుతారని' వేమన దూషించాడు. 17వ శతాబ్దంలోనే యింత హేతు బద్ధంగా వేమన ఆలోచించాడు. సంఘంలోని మూఢవిశ్వాసాల్ని చెండాడాడు.

**యోగము – భక్తి**

యోగులు తమకు తపశ్శక్తులున్నాయని భావిస్తారు. ప్రజలను నమ్మిస్తారు. వివిధ రకాలుగా ప్రజలను పీడిస్తారు. సకల సౌఖ్యాల్ని అనుభవిస్తారు. అలాంటి కపట యోగుల గుట్టురట్టు చేశాడు వేమన తన పద్యాలతో వారికి చురకలంటించాడు.

కడుపుబోరగించి కన్నులు ముకుళించి

బిర్రబిగిసికొన్న బీద వెంగి

యమునిబారిగొర్రె, యతడేమిచేయును

**మతం**

వేమన అద్వైత సిద్ధాంతాన్ని నమ్మాడు. దానిని ప్రచారం చేశాడు. ఈ సిద్ధాంతం సంఘంలో మతసామరస్యాన్ని నెలకొల్పుతుందని భావించాడు. మత వైషమ్యాలనుండి ప్రజలకు వెసులుబాటు కల్పించాలని ఆయన తలంచాడు.

బయలున సర్వముబట్టును

బయలందే లీన మగును, బ్రహ్మంబనగా

బయలని మదిలో దెలిపిన

బయలందే ముక్తి బట్టబయలగు వేమా!

అని, 'అహంబ్రహ్మస్మి' అని చాటుకోగలిగిన స్థితికి వేమన చేరుకున్నాడు.

**నీతి – చిత్తశుద్ధి**

వేమన సాహిత్యంలో నీతి ప్రధాన అంశం. స్వచ్ఛమైన మనసుతో చేసే పని సత్ఫలితం యిస్తుందని ఆయన

భావించాడు.

ఆత్మశుద్ధిలేని ఆచారమదియేల

చిత్తశుద్ధిలేని శివపూజలేల ?

త్రికరణ శుద్ధిగా వేమన వాంచించాడు. త్రికరణ శుద్ధితో తన పరిశీలనలో అనుభవంలోకి వచ్చిన నిజాల్ని నిర్మొహమాటంగా వెలిబుచ్చాడు. ఆ నిజాలు సామాజిక మార్పుకు దోహదం చేశాయి.

వేషాలతో మోసాలు చేసేవారిని వేమన హెచ్చరించాడు.

వేషభాషలెరిగి కాషాయవస్త్రాలు

కట్టగానే ముక్తి కలుగబోదు

తలలు బోడులైనా తలపులుబోడులా అన్నాడు

కాషాయ వస్త్రాలు కట్టగానే జ్ఞానం లభించదు. ఆ వ్యక్తికి మహత్వం సిద్ధించదు. తనలో ఉన్న భావాలు కోరికలు దూరంకావు. కాబట్టి ప్రజలు ఇలాంటి వేషధారులపట్ల అప్రమత్తంగా ఉండాలన్నది పై పద్యంలో వేమన భావన.

**కులం**

వేమన కుల రహిత సమాజాన్ని కోరుకున్నాడు. కులభావన మనుషుల మధ్య అడ్డుగోడలు సృష్టిస్తుందని ఆయన భావించాడు. కులాల మధ్య ఘర్షణలు సమాజాభివృద్ధికి అడ్డంకిగా తలంచాడు. కొందరు తమది గొప్ప కులమని భావించి ఇతరుల్ని పీడిస్తుంటారు. అలాంటి వారిని వేమన తీవ్రంగా విమర్శించాడు.

బాపడనగనేమి? భక్తుడగనేమి?

భోగి యనగ నేమి సొంపులేక

ఎన్ని పేరులైన ఇనజుడు పనితీర్చు" – అన్నాడు.

యముడు శిక్ష విధించేటపుడు. వీడు ఏ కులంలో పుట్టాడని ఆలోచించదు. అతని పాప, పుణ్యాలను మాత్రమే చూస్తాడు. అగ్రకులస్తుల మని విర్రవీగే వాళ్ళకు ఈ పద్యం చెంపపెట్టులాంటిది. మనిషికి యోగ్యత ప్రధానమని కులం ప్రధానం కాదని,

రామనామ పఠన మహిమచే వాల్మీకి

పరగ బోయుడయ్యు బాపడయ్యే

కులము ఘనముకాదు గుణము ఘనంబురా

బోయకులంలో పుట్టిన వాల్మికి రామాయణాన్ని రచించాడు. ఏ కులం? అన్నది ముఖ్యం కాదు. మనిషిలోని గుణం, యోగ్యత ప్రధానం. మనుషులను ఈ దృష్టి నుండి చూడాలన్నది వేమన తత్త్వం. ఏ సమాజమైతే మనుషుల్ని ఈ దృష్టినుండి చూస్తుందో ఆ సమాజం అభివృద్ధి చెందుతుంది. అక్కడ మనుషుల మధ్య విద్వేషాలు ఉండవు. శాంతి, సహృద్భావాలే ఉంటాయి.

**గుళ్ళు – దేవుళ్ళు**

గుళ్ళకు, విగ్రహాలకు ధనాన్ని ఖర్చుచేసేవారు తోటి మనుషుల కష్టాల్ని పట్టించుకోవడం లేదు. మనిషికి స్వార్థం శృతిమించడంతో దైవభక్తి కూడా మిన్నంటింది. దేవాలయాల వద్ద బారులు మైళ్ళ పెరిగి పోయాయి. కోర్కెల సాధనకు దేవాలయాలు, దేవతలు కేంద్రబిందువయ్యాయి. ఈ పరిస్థితిని వేమన విమర్శిశస్తూ,

రాతి బొమ్మలకేల రంగైన వలువలు

గుళ్ళుగోపురములు కుంభములు?

కూడుగుడ్డ తాను కోరునాదేవుడు? – అని అన్నాడు.

**లగ్నాలు – శకునాలు**

మూఢనమ్మకాలపై తిరుగుబాటుతో వేమన,

విప్రులెల్లా జేరి వెర్రికూతలుకూసి
సతిపతులను గూర్చ సమ్మతమున
మును ముహూర్తముంచ ముండెట్లుమోసెరా? అని విమర్శించాడు.

చాలామంది తమ అహేతుక భావాలతో లేని కష్టాల్ని కొని తెచ్చుకుంటారు. చదువుకున్న వారు కూడా ఏ పనిచేయాలన్నా ముహూర్తాలు చూస్తూ కాలాన్ని వృధాచేస్తుంటారు. తమకు ఏ కష్టం వచ్చినా అందుకు తమయింట్లోనే ఏదో అపశృతి జరిగిందని భావిస్తారు. కట్టుకున్న యిల్లును, తెచ్చుకున్న కోడలిని, అల్లుడిని అనుమానిస్తుంటారు. దీంతో వీరు లేని సమస్యలను తెచ్చుకుని కష్టాల సుడిగుండంలో చిక్కుకుని విలవిల్లాడుతుంటారు. ఇలాంటి వారిని వేమన పద్యాలు చైతన్యవంత చేస్తాయి.

**సామెతలు**

సామెతలు జీవితానుభవంనుండి పుట్టుకొచ్చిన విజ్ఞాన వెలుగులు. ఒక విషయాన్ని స్పష్టంగా, తిరుగులేని విధంగా, శాసనం చేసినట్లు చెప్పాలంటే సామెతల్ని ఉపయోగిస్తాం. ఈ సామెతల్ని జానపదులు ఎక్కువగా ఉపయోగిస్తుంటారు. వేమన తన పద్యాల్లో ఈ దేశీయ సామెతల్ని ఎక్కువగా ఉపయోగించాడు.

త్రోయనేర్చు కుక్క దొంతలు పేర్చునా?
పందిబురద మెచ్చు పన్నీరు మెచ్చునా?
చెప్పుతినెడి కుక్క చెరకు తీపెరుగునా?

అని తన సహజ పాండిత్యంతో, లోకజ్ఞానంతో సామెతల్ని వాడాడు.

వేమన లోకం సంచరించి లోకంలోని తప్పులను ఎత్తిచూపాడు. ప్రజలకు నీతిని, ధర్మాన్ని బోధించాడు. అంధవిశ్వాసాల్ని చెండాడిన గొప్ప హేతువాది. తాను చూసిన, భావించిన నిజాల్ని నిర్మొహమాటంగా కుండబద్దలు కొట్టిన సాహసి. సర్వమానవ సమానత్వాన్ని చాటిన మానవతావాది. మొత్తంగా సమాజ అభ్యుదయానికి పాటుపడిన అభ్యుదయవాది వేమన.



# కొత్తపల్లి జానపదుల మడిసేల యాల పదాలు

**డా. గుండ్లూరు వెంకట రమణ, తెలుగు ఉపన్యాసకులు**

**అక్కినేని నాగేశ్వర రావు కళాశాల**

**కృష్ణా జిల్లా, ఆంధ్ర ప్రదేశ్ .** PIN-521301

**మొబైల్**: +91 9000418264 Email:gvrhcu09@gmail.com

చిత్తూరుజిల్లా నిమ్మనపల్లిమండలం కొత్తపల్లిగ్రామంలో నివసించే గుండ్లూరు ఉత్తమ్మ, సలాది అలివేలమ్మ, గుమ్మడి యశోదమ్మ అనే జానపద స్త్రీల నుండి స్వయంగా సేకరించిన పాటలివి. ఇవి ఎక్కడా ఇది వరకూ రికార్డ్ కాలేదు. వీటిని సమాజానికి అందించాలనే ఉద్దేశ్యంతోనే ఈ వ్యాసాన్ని రాస్తున్నాను. ఈ పాటలలో వివిధ రకాలైన వస్తువులు, సరసోక్తులు, భారత రామాయణ ప్రాచీనాది కావ్య ఇతివృత్తాలతో కూడుకొన్నవి.

**పాట-1** పల్లవి. దండమో శ్రీరామ దండమో రఘురామ

దండమో రామ శరణో ఓ రామ. || 2 ||

1. రాతి యొగసాలలో రామన్న కూసోని
   వనమన్ననే పిలిసినో ఓ రామ || దండమో ||
2. ఏమయ్య శ్రీరామ ఏమయ్య రాఘవ
   నన్ను పిలిచినపనులు వివరించు నాతో ఇప్పుడు ఓ రామ
3. అలనాడు మనసీత వలనాడు లచ్చిమి
   చెరలో బొయ్యిండాది ఎదికేవ ఎదకలేవా ఓ రామ
4. వెతికేను బతికేను యొడల వడలయ్యేను
   వలనాడు మమ్మెరుగవా ఓ రామ || దండమో ||
5. వెతకతానచి చెప్పి రాముల దగ్గిర
   వక్కాన బట్టి నాడు ఓ రామ || దండమో ||

రావణుడు సీతను అపహరించి లంకా నగరానికి తీసుకుని వెళ్ళిన తర్వాత శ్రీ రాముడు సీతను వెదుకుమని హనుమంతునితో చెప్పు విధమును పై పాటలో వివరించబడింది.

**పాట – 2: లక్ష్మనుని గురించి సీత ఊర్మిళతో పరిహాసమాడుతూ చెప్పిన మాటలే ఈ పాట .**

**పల్లవి :** వినవే ఉర్మిళ నా ముద్దు చెల్లెల

తవాసకాడమ్మ నామరిది

రఘురాముల తమ్ముడమ్మ నా మరిది.

1. పుట్టెడు నూగులు భూమికి ఎగజల్లి
ఏరి పోపించమనె నా మరిది నన్ను
రాశే చూపించమనె నా మరిది || వినవే ||

2. ఏడు ఏడేండ్ల నాటి ఎండిన గజనిమ్మ
పూత పూపించమనె నా మరిది నన్ను
కాతే కాపించ మనె నా మరిది || వినవే ||

3. పదిపందేండ్లనాడుపాడుబన్న బాయిలోన
నీల్లే చూపించమనె నా మరిది నన్ను
నీల్లే తోడించంమనె నా మరిది || వినవే ||

4. చలచల కాగేటి నూనె గుండములోన
జలకమ్ము లాడ మనె నా మరిది నన్ను
బాసె గెలిపించమనె నా మరిది || వినవే ||

5. యానుగులు దురేటి యెండి జల్లెడతోన
నీల్లే తెప్పించమనె నా మరిది నన్ను
బాసే గెలిపించమనె నా మరిది || వినవే ||

6. రాతి యావును చేసి మొంటి దూడనిడసి
పాలె బిండమనె నమ్మ నా మరిది నన్ను
బాసే గెలిపించమనె నా మరిది || వినవే ||

సీతా దేవిని లక్ష్మణుడు ఒకానొక సందర్భంలో పై విధంగా – అనేక పరీక్షలు పెట్టాడు. వాటినన్నింటినీ తన చెల్లెలయిన ఉర్మిళకు వివరిస్తూ, లక్ష్మణుడు ఏమి తక్కువైనోడు కాదు. ఆయనతో జాగ్రత్తగా ఉండమని చెబుతూ ఇలా పాట రూపంలో వెలువరించినది.మొత్తానికిది లక్ష్మణుని గుణగణాలకు సంబంధించినది.సీత సహనానికి ప్రతీకగా నిరూపించబడిన పాట.

**పాట – 3: సారంగ ధర చరిత్ర**

పల్లవి: కొడుకు కొడుకు ఎవరి కొడుకురా సారంగధర
కొడుకు పైన దుడుకు లేలమ్మ చిత్రాంగిదేవి
నువ్వు తల్లి నేను బిడ్డమ్మ చిత్రాంగిదేవి.
తల్లి తల్లి అనబోకురా సారంగధర

తగిన మేనత్త కొడుకువూ సారంగధర
నీదు పటము నాకు పంపెరా సారంగధర
నీదు ఫోటో నాకు బంపెరా సారంగధర
నీ కంట నన్ను తెచ్చెరా సారంగధర
నీ తండ్రి పెండ్లాడెరా సారంగధర
పాపాలు పాపాలమ్మ చిత్రాంగిదేవి.
దోషాలు దోషాలమ్మ చిత్రాంగిదేవి.
పాపాలు మా నగురురా సారంగధర
పాపార కాయలు బోలు సారంగధర
దోషాలు మా నగురురా సారంగధర
దోష కాయలు బోలురా సారంగధర
నువ్వుతల్లి నేను బిడ్డమ్మ చిత్రంగిదేవి.
తల్లి తల్లి అనబోకురా సారంగధర
తగిని మేనత్త కొడుకువూ సారంగధర
నిన్ను మెచ్చి నేనుండరా సారంగధర
నన్ను మెచ్చి నువ్వుండు రా సారంగధర
కుంచి సిరగాల పైనరా సారంగధర
కుచ్చోనిట్ల లేచి పోరాదా సారంగధర
పైటా చెరగాల పైనరా సారంగధర
పండినిట్లే లేచి పోరాద సారంగధర
బాల ప్రాయము నాదిరా సారంగధర
బాల పెండ్లి కొడుకు నువ్వురా సారంగధర
పట్టలేను నేను పైనురా సారంగధర
నువ్వు నన్ను పెండ్లాడురా సారంగధర.

సారంగధరునికి, తన పినతల్లి అయిన చిత్రాంగి దేవికి మధ్య జరిగిన సంభాషణయే ఈ పాట.చిత్రాంగి పాపాలు తమ నగరని , తన తండ్రి పెండ్లి చేసుకున్నాడని సారంగధరున్ని ప్రేరేపిస్తుంది . అయినా అతడు "నువ్వు తల్లీ నేను కొడుకు" అని చెప్పి తిరస్కరిస్తాడు. వావి వరసాలకు సంబంధించిన అవగాహన జానపదుల్లో సంపూర్ణంగా ఉంటుంది.

**పాట – 4:** చిన్న చిన్న గుంటల్లో చిన్న చిన్న గుంటల్లో
చిర్రాకు కోస్తుంటే సన్యాసి నా బట్ట
కన్నేసి నాడే బాలింత రాలుకు
నా కలికి పలుకులబోలు మరిది రంగన్న చిన బిడ్డ తల్లిని.

2. వగలోగల కోడిపిల్ల వగలోగల కోడిపిల్ల
వాకిట్లో నిలిసుంటే లగడ దన్నకపాయ
నేనేమి చేతు పసి బిడ్డ తల్లిని
నా కలికి పలుకులబోలు మరిది రంగన్న చిన బిడ్డ తల్లిని.

3. తలకట్టు విప్పిండ్ల, మలి కట్టు విప్పిండ్ల
మసిబొట్టు చెదిరిండ్ల, బొట్టు చెదరకుండ
ముద్దాడి పోరా చినబిడ్డ తల్లిని
నా కలికి పలుకులబోలు మరిది రంగన్న చిన బిడ్డ తల్లిని.

ఒక బాలింత రాలును సన్యాసి వాడు చూస్తి కన్నేస్తే ఆ విషయాన్ని మరిదికి వివరిస్తుంది. అలా ఆ సన్యాసిని చివరికి బొట్టు చెదర కుండా ముద్దాడి పొమ్మంటుంది.

పాట – 5: గాజులమ్ముకునే వాడు ఒక పడుచు అమ్మాయికి గాజుల్ని అమ్ముతూ వుంటే వానితో ఆ అమ్మాయి సరసంగా సంభాసిస్తున్న సన్నివేశమే ఈ పాట. పల్లెటూల్లలో ఇలాంటి దృశ్యాలు కోకొల్లలు.

పల్లవి: గాజులో గాజులని మోజుగా అమ్మేవు
గాజుల బేరము చెప్పు చిన్నోడా
మంచి గాజులుంటే వెయ్యి కుర్రోడా

1. చిత్తూరు జిల్లా మదనపల్లె తాలూకా
గునర గుబ్బలపైన గుణసుందరి గాజులు
లవలాకు లంకీలు లచ్చున గాజులు
కుదిరిగ కూచోవె చినదాన
నీకు ఒక బంతి వేశేను ఓ భామ.
అబ్బబ్బ నా చెయ్యి బొబ్బెగిరినాదబ్బి || 2 ||
నలిపి నలిపెక్కించు చిన్నోడ
నాకు నోయ కున్నుంటాది చిన్నోడ || గాజులో ||

అమ్మలక్కలందరు నీల్లకే బోతారు

కోట్లడుకుంటారు గుడ్డులాడుకుంటారు

గాజులోక్కలకొడతారుతోడిగినోన్నితిడతారు

ఒక గాజుల వ్యాపారికి ఒక పడుచు పిల్లకు మధ్య జరిగిన నర్మ గర్భమైన సరస సంభాషణ ఈ పాట.

**పాట -6:** ఆలు మగల కోరికల సరసాల పాట. పొలంలో పని చేస్తున్నప్పుడు ఒక ఎండ్రకాయ తెలు కుట్టిన భార్య తన భర్తతో తన మనసులోని కోరికను బయట పెట్టి పాట రూపంలో వ్యక్తం చేస్తుంది.

పల్లవి: ఓరి మొగుడా వయ్యారి మొగుడా

నా యేలు బడే పాటు చూడరోరి మొగుడా

1. ఏలూరు చెరువు కింద ఓరి మొగుడా

నాకు ఎండ్రక్కాయ కరిసింది ఓరి మొగుడా

ఎత్తించు ఎత్తించు ఓరి మొగుడా

నన్ను ఏలూరు కెత్తించు ఓరి మొగుడా

ఏలూరి ఆస్పత్రిలో ఓరి మొగుడా

కాదంట చెప్పినారు ఓరి మొగుడా

ఎత్తించు ఎత్తించు ఓరి మొగుడా

నన్ను మదనపల్లి కెత్తించు ఓరి మొగుడా

మదనపల్లి ఆస్పత్రిలో ఓరి మొగుడా

కాదంట జెప్పినారు ఓరి మొగుడా

ఎత్తించు ఎత్తించు ఓరి మొగుడా

వాయల్పాడు కెత్తించు ఓరి మొగుడా

వాయల్పాడు ఆస్పత్రిలో ఓరి మొగుడా

కాదంట జెప్పినారు ఓరి మొగుడా

ఎత్తించు ఎత్తించు ఓరి మొగుడా

నిమ్మన పల్లి కెత్తించు ఓరి మొగుడా

నిమ్మన పల్లి ఆస్పత్రిలో ఓరి మొగుడా

కాదంట చెప్పినారు ఓరి మొగుడా

ఎత్తించు ఎత్తించు ఓరి మొగుడా

కొత్తపల్లి కెత్తించు ఓరి మొగుడా

కోరింది పెట్టవయ్య ఓరి మొగుడా

నువ్వు కోరుకున్న మొగుడైతే

నాకు కొన్ని కోసి పెట్టవయ్య ఓరి మొగుడా.

ఒక భార్య తన భర్త చేత కోడి కోపించుకొని తినాలనే వంకతో ఈ యెండ్రక్కాయ కరిసిందని పాటనల్లి తన మనసులో ఉన్న కోరికను బయట పెడుతుంది. పల్లెటూళ్లలో భార్య చెప్పింది వెంటనే భర్త వినడు.కోప్పడతాడు. డబ్బులు లేవంటాడు . అందుకే తన మనస్సులో ఉన్నది డైరక్టుగా చెప్పలేక భార్య ఇలా కథల్లింది.

పాట – 7: రెడ్డోరి జీత గాడ మేటైన మొనగాడ/బంగారు వన్నె కాడ నా మదిలోకి రారా/నన్ను ముద్దులాడి పోరా !

రెడ్డోరి జీతగానిపై ఒకపడుచుపిల్లకు మనసు పడింది.అదతనితో ప్రత్యక్షంగా చెప్పలేక ఇలా పాట రూపంలో వల విసిరింది

**పాట – 8: పచ్చ బొట్టుపై పాట**

నాణ్యమయిన పచ్చ బొట్టు పొడిపించుకోవా

నువ్వు పడవ బన్నావా

బేరమడిగి డబ్బులిస్తే

బేర మాడతావా బావ మల్లా బేరమాడతావా ?

అడగండి అయ్యలార

అదో ఇదో మర్యాద సరేనండి.

**పచ్చ బొట్టు పొడిపించుకోవడానికి ఓ అమ్మాయి అతనితో బేరమాడి బొట్టు పొడిపించుకుంటుంది.**

**పాట – 9: పెళ్ళికొడుకు నలుగు పాట**

1. కమ్మాలు జుమికీలు కలకంచు బావురీలు
కమలా మనోహర ఇదిరా శివలక్ష్మి(లచ్చిమి) తోడే
లేచిరాప్ప నలుగుకు.

2. అత్తరు పన్నీరు అమరిన గంధము
సిలువక పిలువకను
ఇదిరా శివలచ్చిమి తోడే
లేచి రాప్ప నలుగుకి.. **పెళ్ళికి ముందు పెళ్లికొడుక్కి పెట్టె నాలుగు గురించిన పాట ఇది .**

**పాట – 10: నాయుడు గారు పనమ్మాయి.**

నాయినోరి ఇంటి కాడ, నల్ల దుమ్మ చెట్టునీడ
నాయుడేమన్నాడే ఓ బుల్లి నాయిడేమిచ్చాడే.
కట్ట కింద బాయి ఇచ్చా, రంగైన చీరలిచ్చె
వంకరి వడ్డాణమిచ్చె, ముక్కుపుల్ల జేపిస్తాడు
ఓరబ్బీ, బెండ్లి చేసుకోమన్నాడు.

వరసకు మామైనవాడు నాయుడింట్లో పని చేస్తున్న పిల్లను నాయుడేమిచ్చాడని సరసంగా అడిగినప్పుడు, తనిచ్చిన వాటన్నిటిని చెప్పి, పెళ్లి చేసుకోమన్నాడనే విషయాన్ని కూడా ప్రస్తావిస్తుంది.

**పాట – 11: తిరుపతి కాలినడక ప్రయాణం**

పల్లవి. పదవే వోదాము గౌరిపరమాత్ముని జూడ
పదవే బంగారు గౌరి
నీకు నేనుండాను తోడునాకు నువ్వుండావు జోడు
ఇద్దరినీ రచ్చించేవాడు
ఏడుకొండలా వేంకటేశుడే || పదవే ||
గోవింద అన్నావంటే
పోతాయి పాపాలన్నీ
ఇద్దరినీ రచ్చించేవాడు
ఏడు కొండల దొడ్డ దేవుడే || పదవే ||
అడుగడుగు దండాలన్నీ
అబద్దాలు మొక్కే స్వామీ
ఇద్దరినీ రచ్చించేవాడు-
వడ్డీ కాసుల దొడ్డ దేవుడు || పదవే ||

ఒక భార్య భర్త కాలినడకన తిరుపతి కొండకు వెళ్తున్నప్పుడు భార్య భయపడగా భర్త ధైర్యం చెబుతూ ఈ పాటను పాడాడు. ఇద్దరూ కలసి భక్తి భావంతో తిరుమల కొండకు కాలినడకన బయలుదేరతారు.

**పాట – 12:** ఒక భార్య తన భర్తను తనలోని అన్నీ అందాల్ని చూసి వాటికి సరిపడే అలంకార వస్తువుల్ని అన్నీ తెచ్చిపెట్టమని సరసోక్తంగా అడుగుతూ వుంది.

1. నా **కాలు** చూడబ్బి
నా కాలుకు తగినట్లు **కడియాలు** తేరబ్బి

నా సంత పొద్దు మీరిపాయ
తాలర చిన్నోడ నా తాలింపు మాడిపాయ.

2. నా మెడ జూడబ్బి నా మెడ జూడబ్బి
నా మెడకు తగినట్లు సైనలు తేరబ్బి

3. నా నడుము జూడబ్బి నా నడుము జూడబ్బి
నా నడుముకు తగినట్లు డాబులు తేరబ్బి

4. **నా** చెవు చూడబ్బి నా చెవు చూడబ్బి
నా చెవులకు తగినట్లు **కమ్మలు** తేరబ్బి

5. నా ముక్కు చూడబ్బి నా ముక్కు చూడబ్బి
నా ముక్కుకు తగినట్లు **ముక్కర** తేరబ్బి

6. నా కొప్పు చూడబ్బి.నా కొప్పు చూడబ్బి
నా కొప్పుకు తగినట్లు **పూలు** తేరబ్బి

7. నా చెయ్యి చూడబ్బి నా ఏలు చూడబ్బి
నా ఏలుకు తగినట్లు **ఉంగరం** తేరబ్బి

**పాట – 13: ఒకే అమ్మాయి –ఊరంతా మామగారు**

ఉండేది ఒక్కదాన్ని ఊరంత మామగారు రైకకురిపించరేమయ్య
ఓరిజంగమయ్య జోలిపోపించ రేమయ్య.
నేను నల్లాడ దాన్ని నల్ల గుడ్డ దరుము కాదు

2. వీపునవిరజాజులేసి,పక్కన పావురెమ్మలేసి
రైకకురిపించరేమయ్యఓరిజంగమయ్య జోలిపోపించ రేమయ్య.

ఒక ఊరిలో ఒకే ఒకఆడపిల్ల ఉంటుంది. ఆ ఊర్లోని వారందరు వరుసకు అంతా మామగారే, కాబట్టి ఆ పిల్ల తనను జూడమని ఆవేదనతో వ్యక్తం జేస్తున్నది. ఎందుకంటే ఆమె నల్లనిది కాబట్టి ఏమో.

**పాట – 14:** గుడి, షరటు, పంచి, వాచ్చి, కుల్లాయి, శాలువలను చూసి మనసు పడిన అమ్మాయి అదే విషయాన్ని తన మామతో చెప్తున్న సన్నివేశాన్ని ఈ పాటలో గమనించవచ్చు .

1. నీ **జోబిలో గుడి** జూసి నేనోస్తి మామ నా గదారి సీమలింటి/ఇల్ల్యాడ కడదామ మల్ల్యాడ మామ
నేను బోతా బెంగుళూరికి.
2. నువ్వు **తోడిగిండే షరటు** చూసి నె నొస్తి మామ నాగదారి సీమలింటి || ఇల్ల్యాడ ||
3. నువ్వు **కట్టిండే పంచి** చూసి నేనొస్తి మామ నాగదారి సీమలింటి || ఇల్ల్యాడ ||

4. నువ్వు **కట్టిండే వాచ్చి** చూసి నేనొస్తి మామ నాగదారి సీమలింటి || ఇల్ల్యాడ ||

5. నువ్వు **పెట్టిండే కుల్లాయి** చూసి నేనొస్తి మామ నాగదారి సీమలింటి || ఇల్ల్యాడ ||

6. నీ పై **మింద శాలువ** జూసి నేనొస్తి మామ నాగదారి సీమలింటి || ఇల్ల్యాడ ||

**పాట – 15:** **రెడ్డోరి జీతగాని పాట**

1. **మదన పల్లి సంతలోన** [2] మగ్గాలంగిడికాడ
మగ్గలన్ని తీసుకొని కోపునిండ బెట్టుకోని
నీ వెంట నేనొస్తే నాకు మానం బాదా రెడ్డోరి జీతగాడ !
రెడ్డోరి జీతగాడ అనకే ఓ లమడి లబ్బరు పోలీసుగాన్ని.

2. **పుంగునూరు సంతలో** పువ్వాలంగిడికాడ
పూలన్నీ తీసుకోని కొపునిండ పెట్టుకోని
నీ వెంట నేనొస్తే నాకు మానం బాదా రెడ్డోరి జీతగాడ !
రెడ్డోరి జీతగాడ అనకే ఓ లమడి లబ్బరు పోతీసుగాన్ని

3. **వాల్పేడు సంతలో** వక్కలంగిడి కడ
వక్కలన్ని తీసుకోని తిత్తినిండ పోసుకోని
నీ వెంట నేనొస్తే నాకు మానం బాదా రెడ్డోరి జీతగాడ
రెడ్డోరి జీతగాడ అనకే ఓ లమడి లబ్బరు పోతీసుగాన్ని

4. **చింతపర్తి సంతలో** చీరలంగిడికాడపట్టు చీర గట్టుకోని
నీ వెంట నేనొస్తే నాకు మానం బాదా రెడ్డోరి జీతగాడ
రెడ్డోరి జీతగాడ అనకే ఓ లమడి లబ్బరు పోలీసుగాన్ని

**ముగింపు :** తెలుగులో జానపద సాహిత్యం ఇంకా రావాల్సి ఉంది. ఇంకా అనేక పల్లెల్లోని పాటలు అలాగే రికార్డ్ కాకుండా మిగిలిపోయాయి . వాటన్నిటిని ఆధునిక సాంకేతికత సాయంతో వెలికి తీయాల్సిన అవసరం ఉంది.

**ఉపయుక్త గ్రంథ సూచిక:**

మౌఖిక ఆధారాలు: 1. గుండ్లూరు ఉత్తమ్మ 2.సలాది అలివేలమ్మ 3. గుమ్మడి యశోదమ్మ 4.బత్తిని రత్నమ్మ కొత్తపల్లి గ్రామం , నిమ్మనపల్లి మండలం , చిత్తూరు జిల్లా.

* * * * *

# 'రామ బాణం-రామబాట భారతీయుల ప్రాతినిధ్యపు బావుటా'

- డా.బి.నాగశేషు
అసోసియేట్ ఫెలో
ప్రాచీన తెలుగు విశిష్ట అధ్యయన కేంద్రం
నెల్లూరు 524320
9985509053

ఒక గెలుపు వీరుని కథగా రామాయణం ఎప్పటికీ ప్రజల మనసులను ఆనందింపజేస్తుంటుంది అయితే సీతా పరిత్యాగ ఘట్టం మూలకంగా రాముడు కాస్త అపప్రద మూటకట్టుకొన్నది కూడా వాస్తవమే దానికి కారణాలు చాలా ఉన్నాయి. సీతా పరిత్యాగం చేశాక అతడు వ్యక్తిగా అనుభవించిన మనోవ్యథ చాలా లోతైనది ఆలోతులు,ఆ అగాధాన్ని మనం చదవలేము,దాన్ని ఏ కవీ వర్ణించలేదు.దీన్ని ఇంద్రగంటి శ్రీకాంత శర్మ వివరిస్తూ బాధ్యతగల పాలక పదవిలో ఉన్నప్పుడు వ్యక్తి జీవితమూ, అధినాయక జీవితమూ, సంఘర్షించడం తప్పనిసరి. ఇదే రామచంద్రుని వ్యక్తిగత జీవితాన్ని బాధించినదీ,తీవ్ర విమర్శకు గురిచేసినదీ.

సాదారణ ధర్మంగా మనుషులందరూ తాము విలువలు గా భావించే నైతిక సూత్రాలతోను ఇతరులను మరీ ముఖ్యంగా అధినాయకులను నియంత్రించే ప్రయత్నాలు సర్వకాలాలలోనూ చేస్తూనే ఉంటారు.యుగధర్మాలతోపాటు ధర్మ ప్రతినిధులు కూడా ఈ సందర్భంగా గట్టిపట్టుదలతో ఉంటారు.(పుట14) ప్రభువు ప్రజలను క్రమశిక్షణలోఉంచాలి.తాను క్రమ శిక్షణలోనే జీవించాలి,ఎందుకు?

యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరోః।
స యత్ర్పమాణం కురతే లోకస్తదనువర్తతే॥

కనుక లోకపాలకుడు నిత్యజాగరూకుడై ఉండాలి వ్యక్తిగత రాగద్వేషాలకు గాని సుఖదుఃఖాలకు గాని ఈ కరుకైన ధర్మ సందర్భంలో పరిగణన ఉండదు. ఏ కాలపు ఏ ప్రజాపాలన వ్యవస్థలోనైనా నీతిమంతుడు, ధర్మబద్ధుడు అయిన వ్యక్తి సమూహాభిప్రాయానికి తలవంచక తప్పదుగాక తప్పదు.రామచంద్రుడు త్రేతాయుగంలో సైతం తల వంచక తప్పలేదు.ఒట్టి అనుమానపు భర్తగా సీతా పరిత్యాగం చేయలేదు.అందువల్ల అపప్రదను మూటకట్టుకోవాల్సి వచ్చింది.

"అస్మాకమపి దారేషు సహనీయం భవిష్యతి।
యథా హి కురుతే రాజా ప్రజా తమనువర్తతే॥" (ఉత్తర-43 స-19 శ్లో)

ఉత్తర రామాయణంలోని 43వ సర్గలో 17 వ శ్లోకం వరకు గల సీతా పరిత్యాగ కారణం ప్రజా సమూహ వ్యతిరేకతే తప్ప, ఒక రజకుని అవహేళన అనేది ఒక కారణం కాదని మనం గ్రహించాలి.సీతను గంగాతీర రుష్యాశ్రమాలకు దగ్గరగా వదిలి పెట్టి రమ్మని చెప్పదం కూడా సమీపంలో వాల్మీకి ఆశ్రమం ఉండటం వల్ల తను చూసుకొంటారనే నమ్మకంతోనే.అంటే రాముడు సర్వత్రా సీత గురించి జనం గురించి ఆలోచించాడు తప్పితే ఎక్కడా తాను తప్పు చేసినట్లు అనిపించదు. అందుకే రామాయణం సకలకాలాలకు సమ్మతంగా ఉన్నది.

ఇతిహాసాలలోనే రామాయణం తలమానికమైనది రామాయణం జరిగిందా లేదా రాముడున్నాడా లేదా అనే వితండవాదం పక్కకుపెట్టి చూస్తే కల్పనే అనుకొన్నా అంతగొప్ప గా ఊహించడంకూడా గొప్పవిషయమే కదా.రామాయణం జరిగిందని చాలా ఆధారాలు చచూపిస్తున్నారు కదా, రామునిబాట ఆనాటికీ ఈ నాటికీ నూతనమైనది. ఏది ఏమైనా ఒక సమాజాన్ని నిర్మించే శక్తి,నియంత్రించే బలం రామాయణానికి ఉన్నదని ఇప్పటకీ రుజువవుతూ ఉన్నది.రామాయణం నిత్యపారాయణంగా చాలామంది ఇప్పటికీ చేస్తున్నారు అంటే ఎంతోకొంత నమ్మకమున్నట్లేకదా. రావణాసురుని మరణం అందరూ కోరుకొన్నారు, అందరికీ కంటకప్రాయంగా మారిన రావణాసురుని మరణంకోసం ప్రకృతి కూడా ఎదురు

చూసినట్లుంది అందుకే అందుకే మరణవార్త వినగానే పులకించింది తన్మయత్వం చెందింది.మనం ఏదైనా మంచిని గట్టిగా మనసులో విశ్వశిస్తే ప్రకృతి కూడా ఆ మంచి పని జరిగేలా కుట్ర పన్నుతుందంట. రావణాసురుడి మరణం విషయంలో అదే జరిగి.

'ఈ లోకంలోని చేతన వర్గమంతా నిత్యం పారాయణంచేసి తరించాలనే భావనతో సత్యలోకంనుంచి చతుర్ముఖ బ్రహ్మ, ఆయన ఉపదేశాన్ని పొందిన నారదుడు వాల్మీకి మహాముని ద్వారా రామాయణాన్ని ఈలోకానికి అవతరింప జేశాడంట. (కంకటిపాపరాజు ఉత్తర రామాయణం పుట.VIII మొదటి సంపుటం.)రామాయణంలోని బాల,అయోధ్య,అరణ్య,కిష్కింద, సుందర,యుద్ధకాండలు ఆరు కాక ఉత్తరకాండ ప్రసిద్ధమైంది.సీతాదేవిని పూర్తిగా విడిచిపెట్టిన కథతో ముగిసిన ఈ భాగం ఉత్తరకథ,సంస్కృత సారస్వతంలో ఉత్తరరామచరితం కుందమాల మొదలైన నాటకాలద్వారా కొద్దిపాటి మార్పులు చేర్పులతో ప్రసిద్ధమైఉంది.పద్మపురాణాల్లో ఉత్తరకాండ కథ చాలా పెద్దది.దాదాపు III సర్గల్లో ఉత్తర కథ ఉంది.రామున్ని జీవ లోకరక్షకుడు అంటారు ఎందుకంటే సకల ప్రాణి సమూహానికి చెందిన సమస్త వ్యవహారాన్ని ప్రవర్తింపజేస్తాడు కనుక జీవలోక రక్షకుడు.రామావతారంలో మనిషిని,వానరాన్ని,వాయసాన్ని,రాక్షసుని ఈజాతి ఆజాతి అనే భేదం లేకుండా సర్వజాతులకూ చెందిన ప్రాణులకు రక్షణ ఇస్తానని వాగ్దానం చేశాడు రాముడు.

'సకృదేవ ప్రసన్నాయ తవస్మీతి చయాచతే
అభయం సర్వభూతేభ్యః దదామ్యేతద్వ్రతంమమ'

(కంకంటిపాపరాజు – ఉత్తరరామాయణం. మొదటి సంపుటం, పుట XV)

ఏ ప్రాణైనా యాచించి వస్తే అభయమివ్వడం కదా అవికల వ్రతం అన్నాడు కదా స్వామి ఇదే సర్వలోక రక్షణం.ధర్మాన్ని రక్షించేవాడే రాజు, ధర్మం రెండురకాలుగా ఉంటుంది ఒకటి వ్యష్టిధర్మం,రెండు సమిష్టి ధర్మం. వ్యష్టి ధర్మం వ్యక్తికిచెందినది, సమిష్టి ధర్మం మానవ సమాజానికంతటికీ సంబంధించినది ఇదే కుటుంబ ధర్మంగాను చెప్పుకోవచ్చు.ధర్మాన్ని రక్షించాడు కాబట్టే శ్రీరామునికి అంత పేరు ప్రఖ్యాతలున్నాయి రాముడంటేనే ధర్మానికి ప్రతిరూపం.ధర్మం కోసం తమ్ముణ్ని,భార్యను త్యజించడానికి కూడా వెనకడుగు వేయలేదు.నిగ్రహానికి విగ్రహం రాముడు, లోకానికి అభయహస్తం రాముడు, పాపులకు రామ శబ్ధం పావనం కనుకనే రామ శబ్ధం అజరామరమైనది.రావణున్ని వధించి శ్రీరాముడు పట్టాభిషిక్తుడైనప్పుడు మూడులోకాలకు ఉత్సవంలా ఉన్నది ఆ సందర్భాన్ని కవి ఈవిధంగా వర్ణిస్తున్నారు.

శ్రీరామునిపట్టాభిషేక మహెూత్సవానికి అయోధ్య నగరానికి విచ్చేసినపుడు

సీ. కనఁగల్గె నేఁటికైనను రాము నను చుఁగౌ
సల్యాది జనము లుత్సాహ మొంద
రామ నీకీర్తి యారవిచంద్ర మవుఁగాత
మని వసిష్టుండు దీవన లొసంగఁ
దమరు సేసిన సుధర్మములు నేడు ఫలించె
నని పౌరు లుత్సవమ్మున మెలంగ
సకల దేశాధినాయకులు గానుక లిచ్చి
యలిక కీలితహస్తులై భజింప

గీ. భరత లక్ష్మణ శత్రుఘ్న పవనతనయ
భాను జాంగద జాంబవత్ప్రముఖధన్యు
లుచితమగు నూడిగములు సేయుచును గొలువ
రాముఁడప్పుడు పట్టాభిరాముడయ్యె. (84వ పద్యం. పుట.106 కంకంటిపాపరాజు ఉత్తరరామాయణం)

కౌసల్య మొదలైన ప్రజలు నేటికైనా రాముణ్ణి చూసే అదృష్టం మాకు లభించిందని ఉత్సాహంతో పొంగిపోతున్నారు,వశిష్టుడు నీకీర్తి సూర్యుడు చంద్రుడూ ఉన్నంతవరకూ ఉంటుందని దీవించారు,మేముచేసిన ధర్మాలన్నీ నేటికి ఫలించాయని ప్రజలందరూ వేడుక జరుపుకొంటున్నారు,సకలదేశాలనుండి వచ్చిన అధినాయకులు అనేకమైన కానుకలు ఇచ్చి నమస్కరిస్తున్నారు భరత,లక్ష్మణ,శత్రుఘ్నుడు,హనుమంతుడు సుగ్రీవుడు,అంగదుడు,జాంబవంతుడు మొదలైనవారు సేవలు చేస్తూ కొలుస్తూ ఉండగా రాముడు పట్టాభిషిక్తుడైనాడు.

సీ. కమనీయ రత్నోర్మికలఁబూని సితఫేన
చందనాంగనకుఁడయ్యె సాగరుండు
పైరుపచ్చల తాళి మీఱ మొల్కల గగు
ర్పాటుఁగంచుక మూనె రత్నగర్భ
వినుఉగెంపుఁబతకంబుగనిపింప సురదీర్ఘి
కాచేలయై మించె గగనలక్ష్మి
విమల కోరక మౌక్తికములతోఁజిగురుఉగెం
బట్టుఁబుట్టముఁ గట్టె బహునవాళి
గీ. కుంభికుంభాగ్రశోణ మృత్కుంకుమంబు
దంతరుచి వజ్రహారముల్ దాల్చె దిశలు
సీతతోఁగూడి సరిలేని చెలువ పూని
శ్రీరఘుస్వామి పట్టాభిషిక్తుఁడైన. (85 వ పద్యం. పుట107కంకంటిపాపరాజు ఉత్తరరామాయణం)

శ్రీరాముడు సీతాదేవితో కూడి సాటిలేని సౌందర్యంతో పట్టాభిషిక్తుడవడం చూసి అక్కడి పౌరులే కాక ప్రకృతి కూడా పులకించిపోయిందట.సముద్రుడు కమనీయ రత్నాంగులీయికాలనూ, రత్నాలను విరజిమ్మే తరంగాలనూ ధరించి తెల్లని నురుగు అనే చందనాన్ని పూసుకొన్న శరీరం కలవాడయ్యాడు.భూమి పైరు పచ్చల తాళి అతిశయించేలా మొలకలు అనే గరుకు రవికను ధరించింది.ఆకాశలక్ష్మి సూర్యుడు అనే పతకం కనిపించేలా ఆకాశగంగ అనే చీరను ధరించి అతిశయించింది.అనేకవనాలు స్వచ్ఛమైన మొగ్గలు అనే ముత్యాలతో చిగుళ్ళు అనే ఎర్రని పట్టుపుట్టాల్ని కట్టుకొన్నాయి.దిక్కులలో ఉన్న ఏనుగుల కుంభస్థల అగ్రభాగాలలో ఉన్న ఎర్రటి మట్టినే కుంకుమగా, ఆ ఏనుగుల దంతకాంతులే వజ్రహారాలుగా ధరించాయి.

శా. దిగ్దంతుల్ నిదురించె నిర్భరతఁజెందెన్ భూధరంబుల్ మరు
ద్భుగ్దేవేంద్రుడు భోగనీరీతి సుఖంబుల్ గాంచె యజ్ఞాంగతి
ర్యగ్దాహంబు శమించె నాటవిడు పైన ట్లుండెఁ గూర్మంబు స
మ్యగ్దోర్దండమునన్ ధరాభరము రామక్ష్మావరుం దూనినన్
(86 వ పద్యం పుట.108, కంకంటిపాపరాజు ఉత్తరరామాయణం)

రాముడు రాజ్యభారాన్ని మోయడంతో దిగ్గజాలు హాయిగా నిద్రపోయాయి.పర్వతాలు నిర్భయత్వాన్ని పొందాయి,ఆదిశేషుడు హాయిగా తన భార్యలతో రతిసుఖాల్ని పొందుతున్నాడు,కూర్మానికి కూడా ఆటవిడుపయ్యింది.

సీ. ముసుఁ గేసుకొని మూలమూల దాఁగిన దిశా
ధిపుల కిప్పుడు బయల్ దేఱఁగలిగె
గులుకు లొందక కొండగుహల డ్రిమ్మరు వేల్పుఁ
జెలుల కిప్పుడు చెల్వుసేయఁగలిగె

జపతపంబులు మాని జడవృత్తి దిరుగు మౌ
నులకు నిప్పుడు నిష్ఠ సలుపఁ గలిగె
ననదలై గతిమాలి చనిన ఖేచరులకి
ప్పుడు విమానము లెక్కిపోవఁ గలిగెఁ
గీ. బడగ లెత్తక పడుకులఁ బట్టి యడఁగి
యున్న ఫణిజాతి కిప్పుడు వన్నె గలిగె
దశరథకుమార తిలక నీ ధర్మమునను
దనుజవిభు ద్రుంచి భయము మాన్పినకతమున

(99 వ పద్యం. పుట.121 కంకంటిపాపరాజు ఉత్తరరామాయణం)

ఓ శ్రీరామ నీ బాణంతో రావణున్ని చంపి భయాన్ని పోగొట్టినందువల్ల దేవతలూ,నాగులూ మొదలైన వాళ్ళు నిశ్చింతగా ఉన్నారిప్పుడు.ఇంతదాకా ముసుగు వేసుకొని బిక్కు బిక్కుమంటూ ఆ మూలా ఈ మూలా నక్కిన దిక్పాలకులు ఇప్పుడు ఇక బయటికి వచ్చే అవకాశం ఏర్పడింది. ఇంతకాలం ఒయ్యారాలు దాచుకొని ఉన్న దేవతా స్త్రీలు ఇకపై అందాలు ఒలకబోసుకొనేకి అవకాశం లభించింది.జపతాపాలు మరచిన మునులు తిరిగి జపాలుచేసుకోవడం ప్రారంభించారు అనాథలై దిక్కులేక వెళ్లిపోయిన దేవతలు ఇప్పుడు విమానాలు ఎక్కి తిరిగే అవకాశం లభించింది.ఎప్పుడూ పడగలు ఎత్తకుండా పాతాళంలోనే ఉండే సర్పాలకు ఇప్పుడు వన్నె వచ్చింది. దీనికంతటికీ కారణం నీవే రామా నువ్వు రావణాసురున్ని సంహరించడమే. ఓ రామా నువు మీ నాన్న దగ్గర నేర్చుకొన్నది దుర్మార్గులను శిక్షించి, సజ్జనులను కాపాడటమే కదా,శత్రువును ఖండంచే నెపం దొరికించుకోవడానికే కదా భార్యను ఒంటరిగా వదిలి వేటకు వెళ్ళింది అంటూ శ్రీరాముడి శత్రుసంహార ఇష్టతను మనకు కంకంటిపాపరాజు తెలియజేశారు. చేత్తో నువు విల్లును తీసుకొని బాణం ఎక్కుపెట్టగానే ముల్లోకాలు భీతిల్లుతాయి ఎవరూ మిమ్మల్ని ఎదుర్కోవడం కుదరని పని.భీకరమైన పది తలలుకలిగిన రావణుడు కూడా రావణుణ్ణి బంధు సమేతంగా సంహరించడం నీకే చెల్లును.

కరమున నీవు విల్లుగొని కాండముఁ బూనిన మూఁడులోకముల్
కరము భయం నొందుఁ గడఁకన్ నిను మార్కొన నెవ్వఁడోపు భీ
కరముఖ నిర్గతానల శిఖాపరిదగ్ధ సుపర్వు రావణున్
దురమున బంధుయుక్తముగఁద్రుంపఁగ నీకె తగున్ రఘూద్వహా

(104 వ పద్యం పుట.127. కంకంటిపాపరాజు ఉత్తరరామాయణం)

పది తలల రావణాసురుడే కాదు కుంభకర్ణుడు,ఇంద్రజిత్తు లాంటివాళ్లు కూడా నేల కూలారు నీ దెబ్బకు అంతటి బల పరాక్రముడు నీవు నీవు ఉండటంవల్లే సకల ప్రపంచం శాంతంగా ఉన్నది అని కవి భావన.

జేజేయని జగ మెంచఁగ
జేజేలకు నభయ మొసగి చెలగితివి బళీ
యాజేయ వీరదైతే
యాజేయజయాప్తి నలరుమని యగ్గింపన్. (పుట.108, పద్యం.130, కంకంటిపాపరాజు ఉత్తరరామాయణం)

రామా లోకం మొత్తం నిన్ను జేజే అని పొగుడుతూ ఉండగా దేవతలకు అభయాన్నిచ్చి ప్రకాశించావు. భళీ ఆ రాక్షసులమీద రణరంగ సంబంధమైన జయప్రాప్తితో అలరారవయ్యా అని స్తుతించగానే జేజేలకు అభయమొసగి చెలగితివి బళీ.

అంటూ రామున్ని అందరూ పొగుడుతూ ఉన్నారు. ప్రతి గ్రామంలోను రాముని దేవాలయం తప్పక ఉంటుంది మన దేశంలోనే కాదు ఇండోనేషియా లాంటి విదేశాల్లోను రాముడిని ఆరాధిస్తున్నారు.ఉదాహరణకు ఇండోనేషియా

ఎయిర్ లైన్ పేరు గరుడ, గరుడ అంటే ఆంజనేయుడు, ఆంజనేయుడు ఆరాధించే దైవం రాముడు. ఒక్క రామావతారంలోనే ఎక్కువ హింస జరిగింది కారణం ఆ కాలంలోనే దుష్టులు,రాక్షసులు ఎక్కువగా ప్రజల్ని పీడంచారు.కాబట్టి రాముడ దుష్టులను చంపి శిష్టులను రక్షించడంవల్ల రాముడు దేవుడయ్యాడు.పరాయి దేశాలన్నీ రామున్ని అద్భుతంగా కీర్తిస్తుంటే మన దేశంలోని కొందరు వితండవాదం చేస్తున్నారు.కాబట్టి ధర్మానికి ప్రతిరూపమైన రాముని మార్గం ప్రతి పౌరుడు పాటించాలి,శ్రీ రాముడి బాట అప్పటికంటే ఇప్పుడే ఆయన మార్గం అవసరం పెరిగింది, గాడి తప్పుతున్న నేటి సమాజానికి రామబాణం లాంటి దారి కావాల్సిందే.రామరాజ్యం కావాలి అంటుంటాం అంటే ఆకాలంనాటి పరిపాలన సుభిక్షంగా ఉన్నట్లే కదా, జాతి భేదాలు కుల తారతమ్యాలు రాజుకు ఉండేవి కావు అని చెప్పడానికి నిదర్శనం రాముడు శబరి ఎంగిలి పళ్లను ఇస్తే ఏమాత్రం ఆలోచించకుండా తినేశాడు.ఎన్నో కష్టాలను ఓర్చుకొని అయోధ్యలో నిలదొక్కుకున్నాడు,పట్టాభిషేకం అన్నప్పుడు మురిసిపోలేదు,వనవాసం అన్నప్పుడు బాధ పడలేదు దేన్నైనా ఆశావాద దృక్పథంతో స్వీకరించాడు అది నేటి యువత తెలుసుకొని అలవరచుకోవలసినది.రాముడు అపారమైన ప్రేమ కలిగిన వాడు ప్రజలన్నా,కుటుంబమన్నా ఎనలేని ప్రీతి ఎవరెన్ని మాటలు ఆడినా ఓపికగా అన్ని పడ్డాడు చివరకు విజేతగా నిలిచాడు.

**ఆధారగ్రంథాలు:**

1 జీయర్ ఇంటిగ్రేటెడ్ వేదిక్ అకాడమి 2018. ఉత్తరరామాయణం,కంకంటి పాపరాజు వ్యాఖ్యానం , ఆచార్య. బేతవోలు రామబ్రహ్మం. డా.అద్దంకి శ్రీనివాస్

2 అజో – విభో – కందాళం ఫౌండేషన్ 2010. భవభూతి ఉత్తర రామచరితమ్. తెలుగు వ్యాఖ్య , ఆచార్య. బేతవోలు రామబ్రహ్మం.



# ద్రావిడ భాషలు – భారతీయ సంస్కృతి

- **Dr. G. Sireesha,** Assistant Professor
Department of Sanskrit
Sri Venkateswara University, Tirupati
E-mail: sireeshagundlapalli26@gmail.com

భారతీయ సంస్కృతికి వేదాలే మూలము. ఆ వేదాలలోని అంశాలనే రామాయణ, భారత, భాగవతాది సంస్కృత గ్రంథాలలో కథల రూపంలో వివరించడమైనది. అందుకే "*వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాత్ రామాయణాత్మనా*" (వాల్మీకిరామాయణము 1-4-6) వేదమే వాల్మీకి నుండి రామాయణంగా రూపొందింది అని చెప్పారు.

అట్లే "*భారతం పంచమో వేదః*" భారతము పంచమవేదము అని చెప్పారు. ఇక భాగవతాన్ని గురించి చెప్తూ "*నిగమ కల్పతరోః గలితం ఫలమ్*" (శ్రీమద్భాగవత పురాణం-స్కంధము-1, అధ్యాయము-1, 3వ శ్లోకము) అనగా వేదమనే కల్పవృక్షం నుంచి జారిపడిన పండే భాగవతం అన్నారు. అందువల్ల రామాయణ, భారత, భాగవతాదులు ఇతర కావ్య, పురాణ, ఇతిహాసాలు మొదట సంస్కృతంలో వేద సంస్కృతిని వివరించడానికే వచ్చాయి.

కాలక్రమంలో సంస్కృతం సామాన్య ప్రజలకు దూరమైనది. ప్రాంతీయ భాషలు వాడుకలోకి వచ్చాయి. దక్షిణభారతదేశంలో తమిళము, తెలుగు, మలయాళము, కన్నడము అనే నాలుగు భాషలు ద్రవిడ దేశానికి సంబంధినవి. కాబట్టి ద్రావిడ భాషలుగా పేరుకెక్కాయి.

మన ప్రాచీన సంస్కృతి ఉత్తర భారతంనుండి దక్షిణ భారతానికి ప్రసరించేటప్పుడు పైన చెప్పిన సంస్కృత రచనలు కొందరికే పరిమితం కావడంవల్ల వాటిని సామాన్య జనులకు కూడా అందుబాటులోకి తేవాలని రాజులు, పండితులు మున్నగు ప్రముఖ వ్యక్తులు సంకల్పించారు. ఆ సంకల్ప ఫలంగా మన వేద సంస్కృతిని చాటే ప్రాచీన గ్రంథాలను ద్రావిడ భాషలలో అనువదించే ప్రయత్నం కొనసాగింది.

రాజమహేంద్రవరంలో 11వ శతాబ్దిలో ప్రభువుగా వున్న రాజరాజనేరంద్రుడు సంస్కృతాంధ్ర భాషలలో రెండిటిలోనూ నిపుణుడుగా, కవిగా ప్రశస్తి పొందిన నన్నయ భట్టును ఆహ్వానించి సంస్కృతంనుండి తెలుగులోనికి భారతాన్ని అనువదించమని కోరాడు. ఆ విధంగా ద్రావిడ భాషలలో ఒకటైన తెలుగులోకి వేద సంస్కృతికిని ప్రతిబింబించే మహాభారతం అనువాద ఆరంభం జరిగింది. తరువాత నెల్లూరు వాసి అయిన తిక్కన విరాటపర్వం నుండి 15 పర్వాలను నన్నయకంటే ఎక్కువ తెనుగు తనం కల్గిన తెలుగులోకి అనువదించాడు. పిమ్మట కవిత్రయంలోని ఒకడైన ఎఱ్ఱన నన్నయ అనువదించగా మిగిలిన అరణ్య పర్వాన్ని అనువదించాడు. ఈ ముగ్గురూ రచించిన ఆంధ్ర మహాభారతం ఈనాటికీ తెలుగులో సాటిలేని మేటి గ్రంథంగా ప్రాచీన భారతీయ వైదిక సంస్కృతికి దర్పణంగా భాసిస్తోంది.

ఆ తరువాత పోతనామాత్యుడు వ్యాసుడు రచించిన భాగవతాన్ని మధుర మంజులమైన తెలుగులోకి అనువదించాడు. భాస్కరకవి, మొల్ల, నిర్వచనోత్తర రామాయణకర్త తిక్కన మున్నగు వారు రామాయణాన్ని అనువదించారు. అట్లే తమిళంలో "కంబన్" కవి రచించిన 'కంబరామాయణం' కూడా ప్రసిద్ధమే.

భారతాది గ్రంథాలే కాక, మనుచరిత్ర, వసుచరిత్ర, మున్నగు మహాకావ్యాలను రచించిన అల్లసాని పెద్దన, భట్టుమూర్తి, మున్నగు వారి రచనలలో కూడా భారతీయ సంస్కృతి ప్రతిబింబిస్తోంది. తెలుగులో శ్రీనాథుడనే కవి 'శృంగార నైషధం' మున్నగు గ్రంథాలను రచించాడు. శ్రీహర్షుడు సంస్కృతంలో వ్రాసిన 'నైషధ' మహాకావ్యానికి అనువాదమే 'శృంగార నైషధము'.

విజయనగర సామ్రాజ్యం పరిపాలించిన కృష్ణదేవరాయలకాలంలో పెద్దన మున్నగు అష్టదిగ్గజ కవులు వుండేవారని ప్రసిద్ధి. వారి రచనలు కూడా ప్రాచీన భారతీయ సంస్కృతిని వ్యక్తీకరించుచున్నవి.

కావ్యాలను అటుంచి వాగ్గేయకారుల రచనలను పరిశీలిస్తే వారి రచనలలో కూడా వైదిక సంస్కృతి స్పష్టంగా గోచరిస్తున్నది. మొదటి వాగ్గేకారుడైన అన్నమయ్య వేదార్థాలనే సంకీర్తనలుగా రచించాడు.

సకల వేదములను - సంకీర్తనలు చేసి
ప్రకటించి నిను బాడి - పావనుఁడైన,
ఆకలంకుఁడు, తాళ్లపా -కన్నమాచార్యుల
వెకలియై యేలిన శ్రీ - వేంకటనిలయ! (ఆధ్యాత్మ సంకీర్తనలు - 6 వ సంపుటం, 24 పాట)

అని చెప్పారు. అన్నమయ్య పాటలలో వేదార్థాలు, భగవద్గీత అర్థాలు, పౌరాణిక విషయాలు, నీతి-నియమాలు, లౌకిక కళలు మున్నగు విషయాలు కోకొల్లలుగా గోచరిస్తాయి. అన్నమయ్య తరువాత త్యాగరాజు, రామదాసు, క్షేత్రయ్య మున్నగు వాగ్గేయకారులు కూడా ప్రసిద్ధికెక్కారు. ముఖ్యంగా వారి రచనలలో భక్తియోగం గోచరిస్తుంది. తమిళంలో 12మంది ఆళ్వారులు రచించిన 4 వేల పాశురాలు భక్తి ప్రధానమైన అనేక విషయాలను తెలుపుతున్నాయి. అళ్వారులలో 'గోదాదేవి' ఏకైక మహిళ. ఆమె రచించిన 'తిరుప్పావై' బహుళ ప్రచారంలో వున్నది.

ఇక ఆధునిక కాలంలో కూడా రామాయణాది కావ్యాలను తెలుగులో రచించిన మహామహులు ఎందరో ఉన్నారు. ఉదా॥ విశ్వనాథ సత్యనారాయణ కవి రచించిన 'రామాయణ కల్పవృక్షము' మున్నగు కావ్యములు ఈ కాలములో వెలువడినవే.

పద్యసాహిత్యంకంటే గద్యసాహిత్యానికి వ్యాప్తి ఎక్కువ. గద్య కావ్యాలు కూడా అనేకం వెలువడ్డాయి. గద్య పద్యాలకంటే కూడా గేయ సాహిత్యము విరివిగా వ్యాపించే లక్షణం కలిగియున్నది. అనాదికాలం నుండీ కూడా ఆ గేయసాహిత్యం జానపదసంగీత రూపంలో వ్యాప్తి పొందింది.

"జో అచ్యుతానంద జో జో ముకుంద - లాలి పరమానంద రామ గోవింద"

అని బాల్యం నుండే తల్లులు పిల్లలకు గేయాలు వినిపించడం కద్దు. ఈ గేయ సాహిత్యాన్నే విపులంగా సృష్టించిన వాగ్గేయకారులు అనుదినము ఆరాధింపబడుతున్నారు. ఉదా॥ ఈనాడు అన్నమయ్య సంకీర్తనలు, త్యాగరాజు కీర్తనలు మున్నగు గేయాలు విరివిగా వ్యాపించిన విషయము మనకు తెలిసినదే. ప్రస్తుతము ఈ కాలంలో సినిమా సాహిత్యము కూడా గేయాలకు ప్రాధాన్యం ఇచ్చినది. శృంగారరసం, కరుణరసం మున్నగు రసాలనే కాకుండా సినిమా పాటలు, సాంఘిక సమస్యలను ప్రజానీకానికి తెలియజేస్తున్నాయి. ఆ సమస్యలను పరిష్కరించే పద్ధతిని కూడా సుప్రసిద్ధ గేయకవులు చూపగలుగుతున్నారు.

**మధురభక్తిగా శృంగారం**

అన్నమయ్య వాఙ్మయంలో సమాజానికి అవసరమైన అనేక కీర్తనలు ఉన్నాయి. భోజమహారాజు "శృఙ్గారమేవ రసనాత్ రసమామ నామః" (భోజుని శృంగార ప్రకాశము) అని శృంగార రసమే రసములలో ప్రధానమైనదని కీర్తించాడు. శృంగార రస ప్రధానమైన కావ్యాలు సమాజంలో విస్తారంగా వ్యాపిస్తాయి. భాగవతాది గ్రంథాలు కూడా గోపీకృష్ణుల శృంగారాన్ని వర్ణించాయి. దానిని మధురభక్తి అని తత్త్వవేత్తలు అన్నారు. అన్నమయ్య వాఙ్మయంలో కూడా ఈ మధురభక్తి రూపమైన శృంగారము మనోజ్ఞంగా వర్ణింపబడింది. అన్నమయ్య 32 వేల కీర్తనలు రచించాడని ప్రతీతి. అందులో 14 వేలే లభించాయి. అందులో 12 వేలు శృంగార రస ప్రధానాలు. తక్కినవి ఆధ్యాత్మిక సంకీర్తనలు.

శృంగార సంకీర్తనలలో ఈ క్రింది సంకీర్తన ఎంత మనోజ్ఞంగా ఉన్నదో చూద్దాం.

"ఏమొకొ చిగురుటధరమున - నెడనెడ కస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన - పత్రిక కాదు గదా!" (శృంగార సంకీర్తనలు - అధ్యాయం 5, సంకీర్తన 82)

**సకలదేవతా సమన్వయము**

మనలో అనాదికాలం నుండి వివిధ దేతవలను ఆరాధించే సంప్రదాయం వుంది. విష్ణుభక్తులు, వైష్ణవులని, శివభక్తులు శైవులని, దేవీ భక్తులు శాక్తేయులని ప్రసిద్ధి వహించారు. వారిమధ్య అన్యోన్య కలహాలు జరిగినట్లు చరిత్ర చెబుతున్నది. ద్రావిడ కవులు ఈ కలహాలు తొలగించి వివిధ మతాలమధ్య ఐకమత్యం కూడా సాధించుటకు అవసరమైన సాహిత్యాన్ని నిర్మించారు.

ఉదా ॥ అన్నమయ్య వ్రాసిన

ఎంత మాత్రమున నెవ్వరు దలచిన - అంతమాత్రమే నీవు
అంతరాంతరము లెంచిచూడఁ బిం-డంతే నిప్పటి యన్నట్లు. ॥పల్లవి॥

1. కొలుతురు మిము వైష్ణవులు - కూరిమితో విష్ణు డని
పలుకుదురు మిము వేదాంతులు - పరబ్రహ్మంబనుచు,
తలఁతురు మిము శైవులు - తగిన భక్తులను శివుఁడనుచు
అలరి పొగడుదురు కాపాలికులు - ఆది భైరవుఁడనుచు. ॥ఎంత॥

2. సరి నెన్నుదురు శాక్తేయులు - శక్తిరూపు నీ వనుచు
దరిశనములు (ల?) మిము నానావిధులను - తలపుల కొలదుల భజింతురు,
.................. - యిదియే పరతత్త్వము నాకు. ॥ఎంత॥

(అన్నమాచార్య సంకీర్తనామృతము - పుట. 220)

ఈ విషయము "ఏక మేవాద్వితీయం బ్రహ్మ" అనే వేద వచనముతో సామ్యము కలిగి యున్నది.

ఏకో దేవః సర్వభూతేషు గూఢః
సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా । (శ్వేతాశ్వతరోపనిషత్తు - 6-11)
'సర్వం ఖల్విదం బ్రహ్మ'। (ఛాందోగ్యోపనిషత్తు - 3-14-1)
'ఏమేవాద్వితీయం బ్రహ్మ'। (ఛాందోగ్యోపనిషత్తు - 6-2-1)

అని ఉపనిషత్తు. అందలి విషయాన్ని అన్నమయ్య పై సంకీర్తనలో వివరించాడు. ఉపనిషత్తులు కూడా సర్వమూ ఒకే పరమాత్మ అని చెప్పినవి.

**అన్నమయ్య సంఘ సమస్యా పరిష్కారము**

మన సంఘములో అనేక భేదములున్నాయి. కులభేదాలు, వర్ణభేదాలు, వర్గభేదాలు మొదలగునవి. వీటివల్ల పూర్వం అంటరానితనంవంటి దురాచారాలు ప్రబలినాయి. అవి తగవని కూడా వాగ్గేయకారులు చెప్పారు. సంఘ సంస్కరణ విషయంలో వారు కావించిన ప్రబోధం ఎంతైనా శ్లాఘించదగి వున్నది. ఉదా॥ అన్నమయ్య పాట -

బ్రహ్మ మొకటే పర - బ్రహ్మ మొకటే పర
బ్రహ్మ మొకటే పర - బ్రహ్మ మొకటే. (అన్నమాచార్య సంకీర్తనామృతము - పుట. 211)

ఈ కీర్తనలో అందరూ పరబ్రహ్మస్వరూపులే అని చెప్పినారు.

విజాతు లన్నియు - వృథా వృథా
అజామిళాదుల - కది యేజాతి ? ॥పల్లవి॥

1. జాతిభేదములు - శరీర గుణములు
జాతి శీరరము - సరితోడనె చెడు,
ఆతుమ పరిశుద్ధం జెప్పుదును - అది నిర్దోషం బనాది
యీతల హరివిజ్ఞానపు దాస్యం - బిది యొక్కటె పో సుజాతి. ॥విజా॥
................................ - మీ నామమే సుజాతి

(అన్నమాచార్య సంకీర్తనామృతము - పుట. 202-203)

ఈ కీర్తనలో జాతి భేదములను, కుల భేదములను నిరసించాడు.

ఏ కులజుఁడేమి - యెవ్వడైన నేమి
ఆకడ నాతఁడే -హరి నెరిగినవాఁడు. ॥ఏకు॥
.................. దాసుఁడయినవాడు

(అన్నమాచార్య సంకీర్తనామృతము - పుట. 419, 420)

ఈ కీర్తనలో కులభేదములను నిరసించి భగవద్భక్తి కలిగి యుండడమే ప్రధానమన్నాడు. ఈ సందర్భంలో 'ఆముక్తమాల్యద'లోని 'మాలదాసరికథ'ను మనం సమన్వయించుకోవచ్చు.

తలమేల కులమేల – తపమే కారణము

యెలమి హరిదాసులు –క్ష యేజాతియైన నేమి ?

............................ జనియించి రేమి?

(అన్నమాచార్య సంకీర్తనామృతము – పుట. 206)

అందువలన కులమును, ప్రాంతమును ప్రధానముగా పరిగణించకుండా తపోనిష్ఠనే ముఖ్యముగా పరిగణించాలని అన్నమయ్య నొక్కి వక్కాణించాడు.

**ఉపసంహారం**

ఈ విధంగా అత్యంత పురాతనము, వైదికము అయిన భారతీయ సంస్కృతిని మన సాహిత్యములోని భారత, భాగవత, రామాయణాలు, ఇతర పురాణాలు, కావ్యాలు, శతకాలు మున్నగునవి విస్తృతముగా నిరూపించాయి. సంకీర్తనాసారస్వతము కూడా ఇందులో ప్రధానమైనది. ద్రావిడ భాషలలో తమిళము అత్యంత ప్రాచీనము అంటారు. తమిళాన్ని అనుసరించి తక్కిన మూడు ద్రావిడ భాషలలో కూడా వివిధ శాఖలకు చెందిన సాహిత్యము విస్తరించినది. అందువలన సంస్కృతిని పరిరక్షించ దలచినవారు పైన పేర్కొన్న సారస్వతాన్ని భక్తిశ్రద్ధలతో పఠించాలి. అందలి విశిష్టతలను గ్రహించాలి. శ్రేయోమార్గములో నడచి భగవదనుగ్రహానికి పాత్రులు కావాలి.

* * *

# స్త్రీల జానపద నృత్యాలు

– డా॥ పి. రమాదేవి
అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలుగు శాఖ
యోగి వేమన విశ్వవిద్యాలయం, కడప.

## ఉపోద్ఘాతం

జనజీవితంలో అంతర్లీనమైన జానపద కళలు సాహిత్యంలో ఒక ప్రత్యేక ప్రక్రియ. కొన్ని శతాబ్దాలుగా సాహిత్య రంగంలో తగినంత గౌరవం పొందలేక పోయినప్పటికీ జానపద కళారూపాలు అంతరించిపోలేదు. కారణం అవి జానపదాల్లో పుట్టి పల్లెసీమల్లోని ప్రజల నిత్యజీవితంలో అవి భాజ్యంగా ముడిపడి ఉండటమే కాక, పల్లె ప్రజల శ్రమను తీర్చి వినోదాన్ని కలిగిస్తూ నిజజీవిత ప్రతిబింబాలు కావటం.

శ్రమ ఏ రూపంలో ఉన్నప్పటికీ అది లయబద్ధంగా ఉంటుంది. శ్రమ నుండి పుట్టిన కళలు కూడా లయానుగుణంగానే జీవిస్తున్నాయి.

మానవుడు తన మనోభావాల్ని భాష రూపంలో వెలువరించడానికి ముందే తన భావాభివ్యక్తికి మాధ్యమంగా నృత్యాన్ని ఎన్నుకొన్నాడని చెప్పవచ్చు. మానవుడు సృష్టించుకున్న మొదటి కళారూపంగా నృత్యాన్ని పేర్కొనవచ్చు. ఆది మానవుడు తన సుఖదుఃఖాల్ని, భయాన్నే కాక పుట్టుకలు, చావులు, పెళ్ళిల్లు, పేరంటాలు మొదలైన సందర్భాల్లో నృత్యరూపంలో తన హావభావాల్ని వ్యక్తం చేస్తాడు. ఈ ఆటవిక నృత్యం నుండి జానపద నృత్యం, తర్వాత శాస్త్రీయ నృత్యం పుట్టాయని చెప్పవచ్చు.

"చిత్రవిచిత్ర కార్యకలాపములతో నిండియున్న ప్రకృతి రమణీయకమును చూచి ఆనందపరవశుడైన ప్రాచీన మానవుడు ఆనందాతిశయముతో గంతులు వేయుచు వానిని అనుకరించుచు పాడిన పాటయే మానవ లోకములో దృశ్య కావ్యావిర్భావమునకు అంకురార్పణము. నిదానముగా ఆలోచించి చూచినచో యిందులో రెండు కళాంకములున్నవి. ఆట పాట కాలాంతరములో యీ ఆటపాటలు పొందిన సమిష్టి రూపమే నృత్యగీతం".

తెలుగువారి జానపద కళారూపాలు ఎన్నో ఉన్నాయి. వాటిలో పురుషుల నృత్యాలు, స్త్రీల నృత్యాలు ప్రత్యేకంగా ఉన్నాయి. అయితే స్త్రీల జానపద నృత్యాన్ని వివరించడమే యీ వ్యాసోద్దేశ్యం. నా పరిశోధనాంశమైన 'కడప జిల్లా స్త్రీల జానపద గేయాల కోసం క్షేత్ర పర్యటన చేస్తున్నపుడు పరిశీలించిన, గమనించిన విషయాల్ని యీ వ్యాసరూపంలో పొందుపరచడం జరిగింది. ఈ జిల్లా స్త్రీల జానపద నృత్యాలైన జక్కీకి, జడకోలాటం, స్త్రీల కోలాటం, శ్రీకృష్ణలీలలు, గొబ్బి ఎలాచేస్తారో వివరించిన ఒకటి రెండు పాటల్ని ఉదహరించడం జరిగింది.

## జక్కీకి

జట్టిజాము పాటలను గురించి ఆచార్య తూమాటి దొణప్పగారు'జానపద కళాసంపద'లో వివరించారు. ఈ జట్టి జాము పాటలనే కడప జిల్లాలో 'జక్కిజాము' పాటలని అంటారు. ఈ పాటల గురించి ఆచార్య దొనప్ప గారు యిలా వివరించారు. "జట్టి జాములో గొబ్బియాటలో వలె చుట్టివచ్చుట గాని, కోలాటములోపలె చేతి కోలలు వాడుట కాని, చెమ్మ చెక్కలో వలె గెంతుట కాని ఉండదు. అసలు జట్టిజాము వేయువారు కాలు కదపనక్కరలేదు. తిన్నగా నిలుచుండి ఉభయ పార్శ్వము లందలి ఉద్దికత్తెలతో ఒద్దికలు చెడకుండా ఒకసారి కుడి తట్టునకు, ఒకసారి ఎడమ తట్టునకు పార్శ్వముఖ భంగిమతో ఓరగా తిరిగి ఆయా వైపుల ముందువారి అరచేతులను తన అరచేతులతో తట్టుచూ... పాటలు పాడు ఆట యిది. చేచఱుపులతో కంకణ నివక్వాణము శ్రుతి మేళవించు చుండును'.

సాధారణంగా వ్యవసాయపు పనులు తక్కువగా ఉన్న రోజుల్లో, పండుగ రోజుల్లో యీ నృత్యాన్ని ప్రదర్శిస్తారు. సరి సభ్యులూ పాల్గంటారు. రెండు జట్లుగా విడిపోయి గుండ్రంగా నిలబడతారు. వీరిలో ఒకరు పాట పాడితే మిగిలిన వారు వంతపాడతారు. ప్రతి పాదానికి చివర పాదాంత పదాలుంటాయి. చప్పట్లు కొడుతూ లయాత్మకంగా పాటలు పాడుతూ చక్కని భంగిమలతో నృత్యాన్ని ప్రదర్శిస్తారు. తప్పెట దరువు, మువ్వలు, పాటలకు, నృత్యానికి చక్కని తాళ, లయలతో కలిసిపోతాయి.

1. రెడ్డెల్ల కుచ్చెండ్ల తుమ్మిద
లాయిలో
కుట్టిందే తేలు ”
కలిరిందే కాలు ”
గుడ్డకు నన్నంపద్దు ”
కోతలకు నన్నంపద్దు ”
సొప్ప కింద తేలు ”
బిడ్డేలు కుట్టింది ”
బిడ్డుకాడ్కి ఎక్కింది ”

2. ఊరికి ఉత్తరాన మంచి
మామిడి వనమదిగో రామా
మామిడి వనములో
సక్కని మంచినీల్ల కొలనో ”
కొలను యందు బామల్
కన్యలు జలకమాడబోయిరి ”
వాలవాల యనుచు కన్యలు
వల్లు మరిచిరపుడు ”
అక్కరో వోయక్క
మన చీరెలు ఏవక్కా ”

**జడకోలాటం**

కోలాటం జానపదుల వినోదాల్లో ముఖ్యమైంది. జడకోలాటం ఇప్పటికీ స్త్రీల ఆటగానే మిగిలిపోయింది. ఇది మిగిలిన కోలాటాల కంటే ప్రత్యేకమైంది. ఒక పెద్ద చెట్టు కొమ్మకు తాళ్ళతో తయారు చేసిన “జడకోలాటం బిళ్ళకు చెక్కను అమర్చి, సరి సంఖ్యలో జానప నార తాళ్ళను గాని, నూలుతాళ్ళనుగాని అందేటట్లు వేలాడదీస్తారు. ఆటలో ఉన్న ఉద్దికాళ్లు ఒక్కో తాడు పట్టుకుంటారు. తాడు జారీపోకుండా కింద కుచ్చులు ఏర్పాటు చేస్తారు. ఈ ఆట ఆదేవాళ్ళు కుచ్చు ఒక చేత కోల ఉద్దికాళ్లు ఒక్కోతాడు పట్టుకుంటారు. తాడు జారిపోకుండా క్రింద కుచ్చులు ఏర్పాటు చేస్తారు. ఈ ఆట ఆడేవాళ్లు కుచ్చు మరో చేత పట్టుకొని తాళ్ళు చిక్కుపడకుండా చక్కగా జడ అల్లుకుంటూ లోపలికి, వెలుపలికి తిరుగుతూ కోలాటమాడ్తారు. ఈ కోలాట మాద్తూ జడ అట్లే పద్ధతి స్త్రీల జడను పోలి వుండడం వల్ల దీనికి జడ కోలాటమనే పేరు వచ్చిందని చెప్పవచ్చు. జడ అల్లిన తర్వాత తిరిగి అదే వరుసలో జడ విడివడునట్లు తిరుగుతూ కోలాటం ఆడ్తారు.

మువ్వలు, కోలలు, దప్పు శబ్దాలు, పాటలకు, నృత్యానికి చక్కని తాళ, లయలతో కలిసిపోయి వీనులవిందుగా ఉంటాయి. ఇప్పుడిప్పుడే జడ కోలాటాన్ని స్త్రీ పురుషులు కలిసి వేస్తున్నారు.

“తమ్ముడ లచ్చనా
తరుని సీత లేదురా
తరుని సీత యేదిరా
మన పరనశాలలో లేదురా
మోసమాయెను తమ్ముడా
మాయమొకమురా తమ్ముడా
మొకము యెంబడి పోయినందుకు
అగము కల్గెరా తమ్ముడా
...............

"ఇనమ్మ ఊరిమిల నా ముద్దు సెల్లెల
రాముల తమ్ముడమ్మా నా మరిది
రగు రాముల తమ్ముడమ్మా నా మరిది

**స్త్రీల కోలాటం**

ఇది పురుషులు వేసే కోలాటం కంటే భిన్నమైంది. సరిసంఖ్యలో వలయాకారంలో కూర్చొని ఒకరి చేతులు మరొకరికి ఒకేసారి కొడుతూ చేసే నృత్యం ఇది. ఈ కోలాటంలో స్త్రీలు 'కోలలు' (కర్రలు) వాడకుండా చేతులతోనే కోలన్న వేయడం ప్రత్యేకత. అందరూ ఒకేసారి చప్పట్లు కొట్టడం వల్ల ఆ శబ్దానికి చేతి గాజుల శబ్దం తోడై వినడానికి ఇంపుగా వుంటుంది. పాటల కనుగుణంగా చప్పట్లు కొడ్తారు.

"చింతపూత చింతపూత రాలంగ
చిలకా బిట్టు పెట్టంగా
దండమయ్య దండమ్మ
నా మరిది
దండల్దెచ్చె నా మరిది
అరకట్టాకుల్ తెత్తాడు
చెరోపలికి పోతాడు
సేరొక్కలు తెత్తాడు
....
"కోయిలో కొమ్మ నేరుడో
మా నాన్న వత్తాడు మరపరామంద
కోయిలో కొమ్మనేరుడో
కోయిలో కొమ్మనేరుడో
మీ నాన్న వత్తేను మామే కావల్ల
కోయిలో కొమ్మనేరుడో....

**శ్రీకృష్ణ లీలలు**

విశిష్టమైన జానపద కళారూపం చెక్క భజన. చాలా గ్రామాల్లో చెక్క భజన బృందాలున్నాయి. చెక్క భజన శ్రీరామలీలలు, శ్రీకృష్ణ లీలలు, జడకోపులని మూడు రకాలుగా వేస్తారు. వీటిలో శ్రీకృష్ణలీలల్ని అమ్మాయిలే ప్రదర్శిస్తారు. ఈ నృత్యంచేస్తూ పాడే గేయాలన్నీ శ్రీ కృష్ణుడికి సంబంధించినవై వుంటాయి. అమ్మాయిలే కొంతమంది గోపికలుగా, యశోదగా, కృష్ణుడిగా అభినయించడం ఇందులోని ప్రత్యేకత.

శ్రీకృష్ణుని కొంటెచేష్టలు యశోదకు తెలియజెప్పడం, యశోద కృష్ణుని మందలించగా కృష్ణుడు తనకేమీ తెలియదని చెప్పడం, కృష్ణుని కొంటెచేష్టలన్నీ కళ్ళకు కట్టినట్లుగా నృత్యరూపంలో చూపిస్తారు. కృష్ణుడు గోపికల చీరెలు దొంగిలించి చెటెక్కి కూర్చోవడం, గోపికలు చీరెలిమ్మని కృష్ణుడ్ని బ్రతిమాలడం, కృష్ణుడు చీరెలివ్వనని వారిని ఏడిపించడం, కృష్ణుడు గొల్లభామలిండ్లకు వెన్న దొంగలించడానికి వెళ్ళడం మొదలైన దృశ్యాలన్నీ అభినయిస్తారు.

"తల్లీ తనయుని తప్పులు తెలిపెదము
రాజు బిడ్డలాము వెరసి మీతో సెప్పి తిమి
మీ సిన్ని కిట్టుడికి కొంటే చేష్టలు
యవరు నేర్పినారు తల్లి అమ్మా
అడుగావే తల్లి అడుగావే
తల్లీ తనయుని తప్పులు తెలిపెదమే

యశోద

ఐదు ఏండ్ల బాలుడు వీడు
యెన్ని పనులు నేర్చెనమ్మ
మరుగుపెట్టక మీరు నాతో
మర్మమిచ్చి చెప్పరమ్మ
కిట్న బామలపై నీకు సరసమేలనురా
పడతులపై నీకు పంతమేలనుర

గొల్లభామలు

"రామ రామ అనంతకాలం
రాజ్యమేలుతు వుండర కిస్నా
చీరలిచ్చి చెట్లు దిగర గోపాల కిస్నా
చీరలిచ్చి చెట్లు దిగర

**గొబ్బి:** సంక్రాంతి పండుగను భోగి, సంక్రాంతి, కనుమ పేర్లతో మూడు రోజులు జరుపుకుంటారు. మొదటి రోజైన భోగి సంబరమంతా స్త్రీలదే. భోగిపండుగ రోజు తెల్లవారుజామునే లేచి తలంటుకుని ఇంటి ముందరి భాగమంతా ఆవుపేడతో అలికి పెద్దపెద్దముగ్గులు పెడ్తారు. ఆవుపేడతో గొబ్బెమ్మను లింగాకారంలో చేసి మధ్యలో పూలతో (బంతి, గుమ్మడి) అలంకరించి పసుపు, కుంకుమ బట్లు పెడతారు. వీటిని అయిదు కాని, తొమ్మిదికాని పెడ్తారు. ఈ గొబ్బెమ్మలను గౌరీదేవిగా భావించి వీటి మధ్యలో ఆకువక్కలు, రేగుపండ్లు, చెరకు ముక్కలు, కొంత డబ్బు దక్షిణగా పెడ్తారు. దీపంవెలిగించి అగరొత్తులు వెలిగిస్తారు.

గొబ్బెమ్మల చుట్టూ నిలబడి లయాత్మకంగా చప్పట్లు చరుస్తూ వలయాకారంలో తిరుగుతూ చేసే నృత్యమిది. ఒక అడుగు ముందుకు, ఒక అడుగు వెనకకు వేస్తూ గొబ్బియలో గొబ్బియలో అనే ఊతపదాలతో అందరూ ఒకేసారి గొబ్బెమ్మల మీదుగా చేతులు చరుస్తారు. ఈ నృత్యానికి చేతి చరుపులు, గాజుల శబ్దాలే వాద్యసంగీతం. ఈ నృత్యం కేవలం సంక్రాంతి పండుగ సందర్భంలో మాత్రమే చేస్తారు. ఈ విధంగా గొబ్బెమ్మల చుట్టూ తిరగడాన్నే "గొబ్బి తట్టడం" అని, ఆ సమయంలో పాడే పాటల్ని "గొబ్బి పాటలని" అంటారు. గొబ్బి పదాలను పాల్కురికి సోమన 'పండితారాధ్య చరిత్రలో 'గొబ్బి పదములు వెన్నెల పదములు" అని పేర్కొన్నాడు. తాళ్లపాక అన్నమాచార్యులు "కొలని దోపరికి గొబ్బిళ్ళో యదుకుల సామికి గొబ్బిళ్ళో" అంటూ గొబ్బి పాటలో శ్రీవారిని కీర్తించారు.

1. గొబ్బియాలో సంకురాతిరి వచ్చెనమ్మ గొబ్బియాలో
గొబ్బియాలో సందడితో తెచ్చనమ్మా గొబ్బియాలో
గొబ్బియాలో అందమంతా చిందెనమ్మా గొబ్బియాలో
గొబ్బియాలో అందలమెక్కివచ్చెనమ్మా గొబ్బియాలో
గొబ్బియాలో తోర్నాలు కట్టరమ్మా గొబ్బియాలో
గొబ్బియాలో భోగి పండుగ వచ్చెనమ్మా గొబ్బియాలో
గొబ్బియాలో భోగి జంగం వచ్చెనమ్మా గొబ్బియాలో
గొబ్బియాలో ప్యాదనీల్లు సల్లరమ్మా గొబ్బియాలో
గొబ్బియాలో ముంగిట ముగ్గులు వేయరమ్మా గొబ్బియాలో
గొబ్బియాలో చక్కని రంగులు వేయరమ్మా గొబ్బియాలో
గొబ్బియాలో గౌరమ్మను సేయరమ్మ గొబ్బియాలో
గొబ్బియాలో గొబ్బి గొబ్బిని తట్టరవమ్మా గొబ్బియాలో

ఇలా పాటలు పాడుతూ ఆడుతూ గ్రామీణ స్త్రీలు నిర్మలమైన నవ్వులతో కలిసిమెలసి జీవించే జానపదాలను చూచినపుడు అలౌకికానందం కలుగుతుంది.



# తెలుగువారి జానపద నృత్యాలు

డా॥ తప్పెట రామప్రసాద్ రెడ్డి

జానపద కళలు అతి ప్రాచీనమైన ప్రదర్శన కళలు. ఇవి మానవుని అనుభూతులకు, మానసిక చైతన్యానికి, ఆనందోత్సాహాలకు ప్రతీకలు. అందువల్లనే ఇవి అనంతమైన రూపవైవిధ్యం కలిగి ప్రజా జీవితానికి అత్యంత సన్నిహితంగా ఉంటాయి. ఈ జానపద కళలు ప్రజల మధ్యనే పుట్టి, పెరిగడంవలన అనేక వందల సంవత్సరాల నుండి సజీవంగా ఉన్నాయి. ఇందులో కొన్ని కళలు కనుమరుగైనప్పటికీ మరికొన్ని నేటికీ సజీవంగా మిగిలి ఉన్నాయి. ఈ జానపద సంపద జాతికి గర్వకారణం.

తెలుగు ప్రాంతంలో ఎటు చూసిన వివిధ కులాలకు సంబంధించిన విశిష్టమైన జానపద కళారూపాలు అనేకమున్నాయి. ప్రతి కళారూప సౌందర్యాన్ని వర్ణించనలవికాదు. ప్రతి కళారూపంలోనూ ఆయా కులాలకు సంబంధించిన ప్రగాడ విశ్వాసాలు, సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు, వేషభాషలు కనిపిస్తాయి.

జానపద కళారూపానికి మూలధాతువు ప్రదర్శన. ఇందులో ప్రేక్షకులు అంటే శ్రోతలు, కళాకారులు ఇద్దరూ చాలా అవసరం. ప్రేక్షకుల మధ్య కళాకారులు ప్రదర్శించే కళారూపానికి సందర్భం కూడ తోడవుతుంది. ఈ సందర్భానికి ఎంతో ప్రాధాన్యత ఉంది. కళా ప్రదర్శనలో ప్రేక్షకుల పాత్ర చాలా గొప్పది. వారి స్పందనలకనుగుణంగా మార్పు చెందటమనేది కేవలం జానపద కళారూపాలకే చెల్లింది. అందుకే ఇవి ప్రజా జీవితంలో విడదీయరాని సంబంధం కలిగి ఉన్నాయి. ఈ సంబంధం తరతరాలుగా వస్తున్న వారసత్వ సంపదగా మారింది. జానపద కళల ద్వారా వారసత్వంగా భావ ప్రసారం జరుగుతున్నది. నేటి ఆధునిక ప్రసార మాధ్యమాలైన రేడియో, టివి, ఇంటర్‌నెట్, సినిమా చేస్తున్న పనిని తరతరాలుగా జానపద కళారూపాలు నిర్వహిస్తూ వస్తున్నాయి. అందువల్ల వీటిని జానపదుల సజీవ ప్రచార, ప్రసార సాదనాలుగా పేర్కొనవచ్చు. ఈ జానపదకళలు సామాజికంగా అనేక మార్పులకు లోనవుతుంటాయి. ఆయా స్థల, కాల పరిస్థితులకు అనుగుణంగా రూపాంతరం చెందుతుంటాయి. ఎలాంటి విషయాన్నైనా ప్రజలకనుగుణంగా మలచి చెప్పగలిగే సత్తా జానపద కళలకే సొంతం.

జానపద కళారూపాలను స్థూలంగా నాలుగు వర్గాలుగా విబజించుకోవచ్చు. అవి 1) సంగీత ప్రధానాలు, 2) నృత్య ప్రధానాలు, 3) రూపక ప్రధానాలు, 4) ఇతర కళారూపాలు.

## జానపద రంగస్థలం

జానపద కళలకు, సాహిత్యానికి ప్రత్యేక రచయితలుగాని, గాయకులుగాని, నటులుగాని ఉండరు. అలాగే ఈ కళలను ప్రదర్శించడానికి ప్రత్యేకంగా నిర్మించబడిన వేదికలుగాని, రంగస్థలాలుగాని ఉండవు. ఈ కళలకు సామూహిక తత్వముంది. అందుకే ఎక్కువ మంది ప్రజలు గుమిగూడే స్థలాలే జానపద కళాప్రదర్శనకు వేదికలయ్యాయి. దాదాపు ఈ వేదికలన్నీ ఆకస్మికంగా ఎనుకున్నవే.

రంగస్థలం కొలతల్లో ప్రత్యేకతలుగాని, నియమాలుగాని లేవు. కళాకారులు ప్రదర్శించే కళారూపాన్ని ప్రేక్షకుడు ఎలాంటి ఇబ్బంది లేకుండా తనవితీరా చూడడానికి యోగ్యంగా ఉంటే చాలుననే ప్రాథమిక సూత్రమాధారంగా రంగస్థలాలను ఎంపిక చేస్తారు. ఈ రంగ స్థలాలన్నీ కూడ సహజత్వానికి దగ్గరగా ఉంటాయి. వీధి, రచ్చబండ, కూడలి, దేవాలయం ఇళ్లముంగిట, ఆరుబయట, బహిరంగ ప్రదేశాలు, గ్రామ చావిడి, నడిబజారు లేదా ఎత్తైన ప్రదేశాలలో కళాప్రదర్శన ఏర్పాటు చేస్తారు. ఈ రంగస్థలాలన్నీ కూడ సంగీత నృత్య రూపకాలేవైనా ప్రదర్శించడానికి అనువుగా ఉంటాయి.

చెక్కభజన

భజన సంప్రదాయం అతి ప్రాచీనమైంది. భజనలు అనేక రకాలు. అందులో జానపదుల భజనలు ప్రత్యేకత కలిగి ఉన్నాయి. ఈ భజనల్లో, హరిభజన, తాళభజన, సప్తతాళభజన, పండరి భజన, చెక్కభజన మొదలైనవి ఉన్నాయి.

చెక్కలతో చేసే భజన కాబట్టి దీనికి చెక్కభజన అనే పేరు వచ్చింది. 'చెక్క భజనను' 'పలకల భజన', 'పలకలకోలన్న', 'చిరతలభజన', చిరతల రామాయణం' అనే పేర్లతో వివిధ ప్రాంతాల్లో వ్యవహరిస్తారు. అయితే 'చెక్కభజన' అనే పేరే చాలా ప్రసిద్ధమైంది. తెలుగు నేలపై ఈ కళారూపం బాగా ప్రచారంలో ఉంది. చాలా గ్రామాల్లో ఎంతో శిక్షణ పొందిన చెక్కభజన బృందాలున్నాయి. ఈ కళారూపాన్ని 'శ్రీరామలీలలు', శ్రీకృష్ణలీలలు, 'జడకోపులు' అనే మూడు భాగాలుగా ప్రదర్శిస్తారు. "ఈ భజనను ముఖ్యంగా శ్రీరామనవమి పర్వదినాన తప్పనిసరిగా చాలాచోట్ల ప్రదర్శిస్తారు."

గురువు పాత్ర

గ్రామాల్లో కొంతమంది ఒక బృందంగా ఏర్పడి భజన నేర్పించడంలో బాగా అనుభవమూ, పేరూ వున్న వ్యక్తిని గురువుగా ఎంపిక చేసుకుంటారు. బృందంలో 20 నుంచి 30 మంది కళాకారులుంటారు. గురువు మొదట బృందానికి సాధారణ పరీక్షలు పెట్టి వాటిలో నెగ్గినవారిని ఎన్నుకొని శిక్షణిస్తాడు. పాటల్లోను, నృత్యంలోను ప్రాథమిక ప్రవేశముండి, దేహధారుఢ్యం కలిగినవారికి ఎంపికలో ప్రాధాన్యత ఉంటుంది. గురువు దగ్గర ఎంతో క్రమశిక్షణతో కళాకారులు కళలను అభ్యసిస్తారు. శిక్షకుల్లో ఉత్సాహాన్ని, కళా జిజ్ఞాసను పురికొల్పడంలో గురువు పాత్ర గణనీయమైంది. కళాకారులు గురువుపట్ల ఎంతో భక్తి శ్రద్ధలు ప్రదర్శిస్తారు.

తెలుగునేలపై చాలా పేరు ప్రఖ్యాతులు సంపాదించిన చెక్కభజన గురువులున్నారు. వీరు జాతీయ స్థాయిలోనే గాక అంతర్జాతీయ స్థాయిలో కూడ పేరు సంపాదించి వివిధ దేశాలలో ప్రదర్శనలిస్తున్నారు.

గురువుకు గురుదక్షిణగా కళాకారులు కొంత భృతిని సమర్పించుకొంటారు. గ్రామాల్లో శిక్షణ సమయంలో వారికి భోజన వసతులు ఏర్పాటు చేస్తారు. ముఖ్యంగా రాత్రి వేళలో, తీరిక సమయాల్లోనే శిక్షణ తీసుకుంటారు. ఈ శిక్షణా కాలం రెండు మూడు నెలల వరకూ ఉంటుంది. శిక్షణలో ప్రతి

వ్యక్తిని గురువు శ్రద్ధగా పరిశీలిస్తూ సూచనలిస్తాడు. పదే పదే తప్పు చేస్తున్న వారిని ఒక్కొక్కసారి గురువు దండించడం కూడ జరుగుతుంది. శిక్షణ పూర్తి అయిన తర్వాత 'గజ్జెపూజ' ఉంటుంది. గజ్జె పూజలో భజన చెక్కలను సంప్రదాయ బద్ధంగా పూజిస్తారు. ఆ తర్వాత కళాప్రదర్శనను ఏర్పాటు చేస్తారు.

సాధారణంగా 18 నుండి 45 ఏండ్ల వయసు మధ్యలో ఉన్నవారే శిక్షణ తీసుకుంటారు. ఇటీవల కాలంలో చిన్నపిల్లలు సైతం శిక్షణ తీసుకొని అద్భుతంగా రాణిస్తున్నారు.

భజనస్వరూపం

ఒకప్పుడు భక్తి భావాలకు ఆలవాలమైన ఈ కళాస్వరూపం నేడు సాంఘిక, సామాజికాంశాలపైన విస్తృతంగా ప్రదర్శింపబడుతుంది. అంతే కాకుండా ప్రదర్శన స్వరూపమే రోజు రోజుకు మారిపోతుంది. ఆధునిక ప్రచార సాధనంగా మారిపోయిన ఈ కళారూపాన్ని ప్రజలు విశేషంగా ఆదరిస్తున్నారు. కుటుంబ నియంత్రణ, అక్షరాస్యత, మద్యపాన నిషేదం, పచ్చదనం పరిశుభ్రత మొదలైన కార్యక్రమాలను ప్రచారం చేయడానికి ఈ కళారూపం ఎంతో ఉపయోగపడుతుంది.

అడుగులు

నృత్యంలో వివిధ రకాల గెంతులుంటాయి. వీటిని 'అడుగులు' అంటారు. ఆది అడుగు, రెండో అడుగు, మూడో అడుగు, పర్ణశాల, పద్మవ్యూహం, బేరి, పోట, కత్తెర అడుగు మొదలైన 20 రకాలకు పైగా అడుగులు ప్రచారంలో ఉన్నట్లు తెలుస్తుంది. "ఏ అడుగు మార్పు చేయాలన్న ఆది అడుగు ప్రాణం. కాబట్టి అడుగు మారే ప్రతిసారి మొదటగా ఆది అడుగులోకి వచ్చి తిరిగి కొత్త అడుగులోకి మార్చుకుంటారు. అడుగు వేగం లయబద్ధంగా హెచ్చుతూ, తగ్గుతూ ఉంటుంది. ఈ విధంగా మెల్ల మెల్లగా నృత్య వేగాన్ని పెంచి స్వరాన్ని తారా స్థాయికి పెంచి అందరూ నృత్యం అడుగులను హఠాత్తుగా ఆపి నిశ్శబ్దంగా బంగిమలో నిలబడిపోతారు. వీటినే 'నిలుపులు' అంటారు. ఈ నిలుపులలో మెళకువలను గురువు శిష్యుకు నేర్పిస్తారు.

వేషధారణ

స్త్రీ పురుషులిద్దరూ ప్రదర్శనలో పాల్గొంటారు. స్త్రీల వస్త్రధారణ సాధారణంగానే ఉంటుంది. స్త్రీ పురుషులిద్దరూ నడుముకు తలకు ఎరుపు రంగులో ఉన్న గుడ్డను కట్టుకుంటారు. పురుషులు బనియన్ ధరించి, పంచెను గోచిలాగ కట్టుకుంటారు. దట్టీగుడ్డను ఉపయోగించి గట్టిగా బిగిస్తారు. కళాకారులందరూ మెడలో దండలు వేసుకొని కాళ్ళకు గజ్జెలు కట్టుకుంటారు. కుడి చేతిలో భజన చెక్కలూ ఎడమ చేతిలో చేతిరుమాలు పట్టుకుంటారు. కళాకారులందరూ ఒకే రంగు బట్టలను ధరిస్తారు.

ప్రదర్శనా సందర్భం

పండుగ దినాలు, ఉత్సవాలు, ఊరేగింపులు, జాతర్లు, తిరునాళ్ళు, మొదలైన సమయాల్లో ప్రజలు ఒకేచోట ఎక్కువగా గుమిగూడిన సందర్భంలో కళాప్రదర్శన ఉంటుంది. ప్రేక్షకుల నుంచి ఈలలు చప్పట్లు, అరుపులు మిన్నుముట్టి, కళాకారుల్లో ఉద్వేగాన్ని ఉత్సాహాన్ని నింపుతాయి.

ఈ ప్రదర్శన సాధారణంగా రెండు నుంచి 6 గంటల వరకు ఉంటుంది. శ్రీరామనవమి రోజు ఎక్కువసేపు ఊరేగింపులో పాల్గొని కళాకారులు ఊరంతా తిరుగుతూ ప్రదర్శనలిస్తారు. ఒక్కొక్కసారి 3 గంటలపాటు ఏకధాటిగా భజన చేస్తారు.

కళాప్రదర్శన

ప్రదర్శనా స్థలం మధ్యలో 'గడెదీపం' వెలిగిస్తారు. దాని చుట్టూ వాద్య బృందం ఉంటుంది. దీపానికి దగ్గరలో ఇష్టదైవ పటం ఉంటుంది. కొబ్బరి కాయ కొట్టి అందరూ దేవుని పూజిస్తారు. తర్వాత కళాకారులందరూ వరుసగా వచ్చి గురువు పాదాలకు నమస్కరిస్తారు. హార్మోనియం, డోలు, వాద్యాల సహకారంతో కళారూపం ప్రారంభమౌతుంది. గురువు బృందం మధ్యలో ఉంటాడు. కళాకారులు నృత్యం చేస్తూ అడుగులు వేస్తూ ఒక్కొక్కరు వచ్చి చేరి వర్తులాకారంలో నిలబడుతారు.

గురువు 'రమా రమణగోవిందాహరి' అంటూ చెక్కలను వాయిస్తూ పాట మొదలు పెట్టగానే గురవుతోపాటు కళాకారులందరూ తమ తమ చేతుల్లోని చెక్కలను గట్టిగా వాయిస్తారు. మొదట విఘ్నేశ్వర ప్రార్థనతో ప్రదర్శన ప్రారంభమౌతుంది. రామాయణ, భాగవత, మహాభారతాలకు సంబంధించిన గేయాలనే ఎక్కువగా పాడుతారు. శృంగార, హాస్య గేయాలు కూడా ఉంటాయి. ఆధునిక కాలంలో ఈ కళారూపం ప్రచార సాధనంగా మారిన తర్వాత సందర్భానికి తగిన పాటలను అల్లి పాడుకుంటారు.

కవ్వాయి కట్టెలు

పొడవాటి వెదురు కర్రకు చివరిభాగంలో ఈటె (బాకు) లాంటి ఆకారంలో కత్తిని అమర్చి ఉంటారు. దీనిని 'కవ్వాయి కట్టె' అంటారు. ఈ కర్ర దాదాపు 5 లేదా 6 మీటర్ల పొడవు కలిగి ఎలాంటి వంకర్లు లేకుండా చక్కగా ఉంటుంది. ఈ కర్రకు ఇనుప చువ్వలకు వేసే ముదురు గోధుమ రంగు వేస్తారు. పై భాగంలో ఉన్న ఈటెకు నిమ్మకాయను చెక్కుతారు. ఆకర్షణీయంగా ఉండడానికి ఈటెకు కింది భాగంలో ఎర్రటి గుడ్డను కడతారు. కవ్వాయి కట్టెలను ప్రదర్శించే బృందాలు తెలుగు ప్రాంతంలో కొన్ని చోట్ల మాత్రమే ఉన్నాయి.

ప్రదర్శన సందర్భం

ఒకప్పుడు పులివెందుల ప్రాంతంలో జరిగే పెళ్ళిల్లు, ఊరేగింపులు, పండుగలు, జాతర్లు, తిరునాళ్లలో ప్రదర్శించే ఈ కళారూపం క్రమ క్రమంగా వివిధ ప్రాంతాల్లో బాగా ప్రాచుర్యం పొందింది. రాజకీయ

నాయకుల ఊరేగింపులో ఈ కవ్వాయికట్టె నృత్యాన్ని ప్రదర్శించడం ఓ ముఖ్యమైన ఆకర్షణగా మారిపోయింది.

ప్రదర్శనా విధానం

కళా ప్రదర్శనలో 20 నుంచి 30 మంది కళాకారులు పాల్గొంటారు. బృందనాయకుడు చేసే సూచనలను పాటిస్తూ కళాకారులు కవ్వాయి కట్టెలను రెండు చేతులతో పైకి ఎత్తి పట్టుకుంటారు. డప్పుల దరువుకు అనుగుణంగా లయబద్ధంగా నడుస్తూ, నృత్యం చేస్తూ అనేక విన్యాసాలు ప్రదర్శిస్తారు. గుండ్రంగా తిరగడం, పాములాగా మెలకలు తిరుగుతూ పోతున్నట్లు నడవడం, ఎదురెదురు ఉద్దులు ఒకరి వరుసులోకి ఇంకొకరు మారడం, గుండ్రంగా తిరుగుతూ ఒక్కసారి కర్రలన్నీ పై భాగంలో తాకేటట్లు ఆనించి ఒక గుండులాంటి ఆకారాన్ని ఏర్పరచడం మొదలైన విన్యాసాలు చూడముచ్చటగా ఉంటాయి. నడకలో రౌద్రం కనిపిస్తుంది. కళాకారుల్లో వీరావేశాన్ని కలిగిస్తుంది. సైనికుల కవాతు ప్రదర్శనను తలపిస్తుంది.

కవాతు కట్టెలు అనే పేరు నుంచి 'కవ్వాయి కట్టెలు' అనే పేరు వచ్చి ఉండవచ్చునేమోనని ఊహించవచ్చు. వేగంగా నడుస్తూ సుడులు సుడులుగా తిరిగేటప్పుడు, మెల్ల మెల్లగా వర్తులాకారంగా నిలబడడం మొదలైన విన్యాసాలు చూస్తుంటే గగుర్పాటు కలుగుతుంది. డప్పుల మోత, ప్రేక్షకుల ఈలలు కళాకారులకు ఉత్తేజాన్ని కలిగిస్తుంది. రెండు మూడుసార్లు తిరుగుతారు.

జానపద కళారూపం తప్పెట్లు (డప్పులు)

డప్పు ఒక వాయిద్య విశేషం. దళితుల్లో 'మాదిగ' ఉపకులానికి చెందినవారు అనాదిగా ఈ సంగీత సాధనాన్ని కులపరమైన సాధనంగా ఉపయోగిస్తున్నారు. కడప జిల్లాలో వల్లూరు మండలంలో 'తప్పెట్ల' అనే పేరుతో ఒక గ్రామం కూడా ఉంది. అలాగే తప్పెట్ల వాయిద్యంలో ఉపయోగించే 'తుడుము' పేరుతో ఖాజీపేట మండలంలో 'తుడుముల దిన్నె' అనే గ్రామం ఉండడం విశేషం. ఒక వాయిద్య విశేషం పేరుతో గ్రామాలు ఉండటమే గాక కొంతమందికి ఇంటి పేరుగా కూడా ఉండటం కడప జిల్లా ప్రత్యేకతగా చెప్పుకోవచ్చు. కడప, చెన్నూరు, మోడమీదపల్లె, కమలాపురం, ప్రొద్దుటూరు ప్రాంతాల్లో ఈ ఇంటి పేరు కలిగిన వారు చాలా మంది ఉన్నారు. ఇందులో అన్ని కులాల వారు ఉన్నారు.

'తప్పెట్ల వాయిండం' డప్పులు వాయించడం, దరువు కొట్టడం, పలకలు వాయించడం అనే వివిధ పేర్లతో ఈ బృంద నృత్యాన్ని వ్యవహరిస్తున్నారు. కేవలం పురుషులు మాత్రమే అభ్యసించే ఈకళ తెలుగు ప్రాంతమంతటా ప్రచారంలో ఉంది. ఈ మధ్య కాలంలో అక్కడక్కడ స్త్రీలు కూడా డప్పులు వాయించడం జరుగుతుంది.

సాంస్కృతిక నేపథ్యంః- 'తప్పెట' అంటే ఒక గుండ్రని ఆకారంలో ఉన్న డోలు లాంటి పరికరం. ఇది ఒక చర్మ వాద్యం. మేక చర్మం గాని, పొట్టేలు చర్మంగాని ఒక గుండ్రని చట్రంలో బిగించి దీనిని

తయారు చేస్తారు. వేడి చేసి వాయిస్తే బాగా మోగుతుంది.

ప్రాచీన కాలం నుంచి గ్రామల్లో చాటింపు వేయడానికి ఈ సాధనాన్ని ఉపయోగిస్తున్నారు. ఈ వాయిద్యం నుంచి వచ్చే శబ్దం అందర్ని ఆకర్షిస్తుంది. గ్రామాల్లో చాటింపు వేసేటప్పుడు ప్రజలు ఇళ్లలోనుంచి బయటికి వచ్చి వీధుల్లో వేసే 'దండోర'ను వింటారు. ప్రభుత్వ ఉత్తర్వులు గాని, ప్రజా సంబంధ విషయాలను గాని ప్రచారం చేయడానికి ఈ దండోర ఉపయోగపడుతుంది. రచ్చ బండల దగ్గర ఎక్కువసేపు దండోర వేస్తారు. సామాన్యంగా ఒకే వ్యక్తి మాత్రమే దండోర వేస్తాడు. ఒక్కొక్కసారి గ్రామాధికారి తరపున ఉన్నవ్యక్తి కూడా ఈ దండోర వేసే వ్యక్తితో పాటు అనుసరించి దండోర కొట్టడం ఆపిన తర్వాత విషయాన్ని బిగ్గరగా చదువుతూ అందరికీ వినిపిస్తాడు. ఎవరికైనా విషయం అర్థం కాకపోతే దగ్గరికి వచ్చి ఆయనను అడిగి తెలుసుకుంటారు. ముఖ్యంగా ప్రభుత్వ పథకాల ప్రచారం, ప్రభుత్వ ఉత్తర్వులు, పన్నులు రాబట్టడానికి చేసే ప్రకటనలు, ప్రకృతి వైపరిత్యాలకు సంబంధించిన హెచ్చరికలు, చౌకదుకాణాలకు సంబంధించిన విషయాలను తెలియజేయడానికి ఈ వాద్య విశేషం ఎంతగానో ఉపయోగపడుతుంది.

వేలంపాటలు వేసుటప్పుడు దండోర తప్పని సరి. వేలంపాటను పాడేటప్పుడు ఎవరు ఎంత మొత్తాన్ని పాడారో తెలియజేయడానికి దీనికి ఉపయోగిస్తారు. "గ్రామీణ సమాజానికి వాళ్లకు చిరపరిచితాలైన కళల ద్వారానే ప్రచారం సాగించడం ఉచితమే'" అని ఆచార్య నాయని కృష్ణకుమారి గారు అభిప్రాయ పడినట్లు నేటి ఆధునిక సమాజానికి సైతం ప్రజలకు అవసరమైన అంశాలను ప్రచారం చేయడానికి ప్రాచీన కళారూపాలే ఎంతో ఉపయుక్తంగా ఉన్నాయి. ఒకప్పటి ఆచారాత్మక కళలు ఆ తర్వాత వినోదాత్మకంగా మరియు ప్రచారాత్మకంగా రూపాంతరం చెందాయడానికి ఈ కళారూపమే చక్కని ఉదాహరణ.

ప్రదర్శనా నిర్మాణ నేపథ్యంః-

తప్పెట్లను 'తప్పెట గతులు' అనేపేరుతో సమిష్టి కళారూపంగా ప్రదర్శిస్తారు. ఒకే కళారూపం వ్యష్టిగా మరియు సమిష్టిగా ప్రదర్శించే కేవలం కొన్ని కళారూపాల్లో ఇదీ ఒకటి. ఈ కళారూపం నేటికి గొప్ప వినోద సాధనంగా గ్రామీణులేగాక పట్టణ ప్రజలు కూడా విశేషంగా ఆదరిస్తున్నారు. ప్రతి శుభ, అశుభ కార్యాలకు ఈ కళారూపం తప్పనిసరిగా ఉపయోగపడుతుంది. నరనరాల్లో నూత్న ఉత్తేజాన్ని రేకెత్తించే ఈ వాయిద్య ధ్వని వినగానే ప్రతి మనిషిలో కూడా కొంత చైతన్యం కలుగుతుంది. చాలామంది ఈ ధ్వనికి అనుగుణంగా తమకు తెలియకుండానే అడుగులు వేస్తుంటారు.

డప్పుకు చర్మంతో తయారు చేసిన 'బెల్టు' ఉంటుంది. దానిని కళాకారులు మెడలో వేసుకొని, చంక మధ్యలో కుదురుగా అమర్చుకుంటారు. డప్పును రెండు డబ్బల సహాయంతో క్రమ పద్ధతిలో వాయిస్తారు. ఒకటి వెదురు దబ్బతో తయారు చేసిన సన్నని కర్ర. రెండోది కొంచెం లావుగా రూలు కర్రలాగా ఉంటుంది. రెండు చేతులతో 'జగ్‌లకన్' జతిలో వాయిద్యాన్ని మొదలు పెడతారు. వీటిని 'కోపులు' అనిపిలుస్తారు. 1,2,3,4,5, మొదలైన అడుగుల పేర్లతో ఈ కోపులు ప్రసిద్ధం. కడప జిల్లాలో

దండువారికోపు, పులి అడుగు, గుండంకోపు, మదిలికోపు, మొదలైనవి ప్రసిద్ధమైన జతులు. ఇంకా జిల్లాలో చాలా ప్రాంతాల్లో కళా బృందాలున్నాయి. అయితే ఖాజీపేట మండలం, దుంపలగట్టు గ్రామానికి చెందిన బృందానికి గొప్పపేరు ప్రఖ్యాతులున్నాయి.

గురువు ప్రాధాన్యతః- గురువు ప్రత్యేక శిక్షణ ద్వారా కళా బృందాలను ఏర్పాటు చేస్తాడు. శిక్షణ పూర్తి చేసుకున్న కళాకారులు ఆయనకు గురుదక్షిణ సమర్పించుకుంటారు. తీరిక వేళల్లో, పనిపాటలు లేని సమయాల్లోను ముఖ్యంగా రాత్రిపూట మాత్రమే శిక్షణ ఉంటుంది. కళారూపాన్ని ప్రదర్శించేటప్పుడు ఎక్కువ అనుభవమున్న వ్యక్తినే మిగతా బృంద సభ్యులు అనుసరిస్తారు. ఆయన చేసే హెచ్చరికల ద్వారా ఎవరైనా వరుస తప్పి పోయిన సందర్భంలో వెంటనే జతులను సవరించుకుంటారు. ఈ అనుభవం కల్గిన కళాకారుని దగ్గర మిగతా సభ్యుల దగ్గర ఉన్న వాద్య సాధనం కంటే భిన్నమైన వాద్య విశేషముంటుంది. దానిని 'తుడుము' అని వ్యవహరిస్తారు. దీని చప్పుడు మిగతా వాటికంటే భిన్నంగా ఉంటుంది. ఆకారంలో కూడా చాలా తేడా ఉంటుంది. ఇది మిగతా డప్పుల కంటే చిన్నగా ఉంటుంది. పై భాగంలో డోలు లాగ ఉండి కింది భాగంలో సమతలంగా ఉంటుంది. ఇది కుంభాకారంలో ఉంటుంది. దీనిని వాయించడానికి చెప్పుల ఆకారంలో ఉన్న జంతు చర్మంతో తయారు చేసిన తుడుము డబ్బలను ఉపయోగిస్తారు. రెండు చేతులలో రెండు 'తుడుము డబ్బలను' ఒకేసారి వాయిస్తే శబ్ద తీవ్రత అధికంగా ఉంటుంది. కళాప్రదర్శన వినోద పరాకాష్టకు చేరుకున్నప్పుడు దీనిని రెండు చేతులతో వేగంగా కళాకారులు వాయిస్తారు. మిగతా సమయాల్లో వరుసలో జతిని బట్టి ఒక్కచేత్తో వాయిస్తారు. మెడలో బెల్టు సహాయంతో వేలాడదీసుకొని పొట్టమీద పెట్టుకొని దీనిని వాయిస్తారు. తుడుమును వేగంగా వాయించేటప్పుడు ప్రేక్షకుల ఆనందం అంతా ఇంతా కాదు. దీనిని వాయించే కళాకరుడు బృందం మధ్యలో నిలబడి అలసిపోయిన మిగతా కళాకారులకు ఉత్సాహం మోకాళ్లను వంచి, రెండు చేతులతో వేగంగా తుడుము వాయిస్తాడు. బృంద సభ్యుల్లో ఉత్సాహం కల్గించడానికి, వరుసలు మార్చడానికి, గతులు సవరించుకోవడానికి ఈ వాద్య విశేషం ఎంతగానో ఉపకరిస్తుంది.

కళా ప్రదర్శనః-

ఆధునిక కాలంలో ఈ కళాకారుల వేషధారణలో కూడా కొంత మార్పు వచ్చింది. ప్రోత్సాహం, ఆదరణ ఎక్కువౌతున్న కొద్దీ కళాకరులు ఒకే రంగు దుస్తులు ధరిస్తున్నారు. పంచెను సైకిల్ కట్టులాగ కట్టుకొని, కాళ్లకు గజ్జెలు ధరించి తలకు ఎర్రటి తలపాగను చుట్టుకుంటారు. మెడలో పూసల దండలు వేసుకుంటారు. కళా ప్రదర్శనలో 10 నుంచి 15 మంది సభ్యులు పాల్గొంటారు. ప్రదర్శనకు ముందుగా చెత్తగడ్డితో మంటలు వేసి, ఆ సెగలో పలకలను 'కాక' పెట్టుకుంటారు. పలకలను కాలివేళ్లపైన పెట్టుకొని చర్మం బిగుతుగా అయ్యేవరకు 'కాక' పెడతారు. తర్వాత శృతి చూసుకొని ప్రదర్శనకు సిద్ధమౌతారు. ఆధునిక కాలంలో ప్లాస్టిక్ డప్పులు వచ్చాయి. వాటికి కాక అక్కరలేదు. కేవలం స్క్రూలు సవరిస్తే సరిపోతుంది.

ఇప్పుడు ఈ కళ రంగస్థలంపైన కూడా ప్రదర్శింపబడుతుంది. ఈ రంగస్థలంపైన చేసే ప్రదర్శనలో 1) వృత్తాకార వరుస 2) ఎదురెదురు వరుస 3) ముందుకు వెనకకు మారే వరుస 4) ఇరు ఉద్దుల వరుసస 5) వృత్తిలోపలికి, వెలుపలికి మారే వరుస 6) మోకాళ్ల మీద కూర్చొని చేసే వరుస 7) పిరమిడ్స్ మొదలైన రకాలున్నాయి. మొదటి బృంద సభ్యులు ఒకరి వెనక ఇంకొకరు డప్పులు వాయిస్తూ వేదిక మీదకి వస్తారు. ఆ తర్వాత వృత్తాకారంలో నిలబడుతారు. ఇలా నిలబడేటప్పుడు జతి ఆది తాళం, జామ్తక, తక తక, చప్పుడుతో నాలుగు అడుగులను రెండు సార్లు వేస్తారు. అంటే మొత్తం ఎనిమిది అడుగుల్లో నృత్యం సాగుతుంది. తర్వాత ఎదురెదురు వరుసలో నిలబడి ముందుకు వెనకకు కదులుతూ నృత్యంచేస్తారు. రెండు వరుసల్లో వృత్తాకారం లోపల ఒక వరుస, బయట ఒక వరుస నిలబడి తమ తమ వరుసలను మార్చుకుంటూ నృత్యం చేస్తారు. కూర్చోని చేసే వరుసలో ఒకేసారి అందరూ గుండ్రంగా తిరుగుతూ అడుగులు వేస్తారు. చూపరులను ఈ దృశ్యం ఎంతో ఆకట్టుకుంటుంది.

చివరగా పిరమిడ్ విన్యాసాలను ప్రదర్శిస్తారు. మొదటి ఆరుమంది కళాకారులు నిలబడుతారు. వారి భుజాలపైన ముగ్గురు కళాకారులు వారిపైన ఇద్దరు, వారిపైన ఒక కళాకారుడు నిలబడి 'జాం జాం జాం' 'జగ్లకన్', జగ్లకన్' జతులలో వాయించడంతో ప్రదర్శన పూర్తి అవుతుంది.

కొన్ని ఇతర కళారూపాల ప్రదర్శనకు కూడా ఈ వాద్యం తప్పనిసరి. కర్రసాము, కత్తిసాము, కీలుగుర్రం, పులివేషం, నామాల సింగడు, కవ్వాయి కట్టెలు, చెక్కభజన, కోలాటం మొదలైన కళారూపాల ప్రదర్శనలో ఈ వాయిద్యం ప్రేక్షకులను విశేషంగా ఆకర్షిస్తుంది. పండుగలు, జాతర్లు, ఉత్సవాలు, ఊరేగింపులలో ఈ కళారూపం తప్పనిసరిగా వుంటుంది.

వివిధ ప్రజా ఉద్యమాల్లో ప్రజలను చైతన్య పరచడానికి డప్పుల సహాయంతో ఉద్యమ గీతాలను ఆలపించడానికి కూడా ఉపయోగిస్తున్నారు. అందుకే తెలుగు ప్రాంతంలో అనేక ఉద్యమ పార్టీలు ఈ కళారూపాన్ని తమ సొత్తుగా భావిస్తున్నాయి. ఈ కళారూపం నేడు సంగీతం, నృత్య, సాహిత్యంతో కలిసి సమాహార కళగా రూపాంతరం చెందింది. శాస్త్రీయ కళాలకు దీటైన కళారూపమిది. ఇలాంటి ప్రజా కళలే మానవ సమాజాభివృద్ధిలో తమవంతు పాత్రను పోషిస్తున్నాయి. అందుకే శాస్త్రీయతకు పునాది జానపద కళలేనని ఒప్పుకోక తప్పదు.

జానపద వినోద క్రీడ – కర్రసాము

'కర్రసాము' అంటే కర్రతో చేసే వ్యాయామం. నియమిత కొలత కలిగి వంపు లేకుండా చక్కగా ఉన్న వెదురు కర్రను ఎన్నుకొని, దానితో చేసే సామును కర్రసాము అంటారు. కర్రను తిప్పుతూ వివిధ రకాల భంగిమలతో లయబద్ధంగా అడుగులు వేస్తూ ప్రదర్శించే క్రీడ కర్రసాము. ఊరేగింపులు, జాతర్లు, తిరునాళ్లు, పెండ్లి ఊరేగింపులు, పండుగ సమయాల్లో ఈ కళను ప్రదర్శిస్తారు.

చారిత్రక నేపథ్యం

ఈ కర్రసాము విద్యను మానవుడు ఎప్పుడు అభ్యసించడం ప్రారంభించాడో తెలుసుకోవడం చాలా కష్టం. చారిత్రక దృష్టితో పరిశీలిస్తే మానవుడు అనాదిగా కర్రను వివిధ పనులకు ఉపయోగిస్తున్నాడు. మొదట ఆహార సంపాదన కోసం వేటాడేటప్పుడు, వేటాడిన జంతువును మోసుకొని వచ్చేటప్పుడు కర్రను ఉపయోగించేవాడు. బాణాలను, అంబులను తయారు చేయడానికి, వ్యవసాయ పనులకు, గృహనిర్మాణానికి, వంటచెరుకుగా కూడ కర్ర ఉపయోగపడుతూ వచ్చింది. ముఖ్యంగా ఆత్మ సంరక్షణ కోసం కర్రసాము అభ్యసించి ఉండవచ్చు. ఆ తర్వాత నేడు వినోద క్రీడగా రూపాంతరం చెందినట్లు తెలుస్తుంది.

కర్రసాములో అనేక విన్యాసాలున్నాయి. వ్యష్టిగానే కాకుండ సమిష్టి కళారూపంగా కూడ ఈ విద్యను ప్రదర్శిస్తారు. ఒకేసారి అనేక మందితో వీరోచితంగా పోరాడే క్రీడగా నేడు అవతరించింది. దేహధారుడ్యాన్ని పెంచే చక్కని వ్యాయామంగా కూడ దీనిని అభివర్ణించవచ్చు.

కర్రసాము శిక్షణ

కర్రసాములో శిక్షణ ఇచ్చే గురువులు తెలుగుదేశంలో పలు ప్రాంతాలలో ఉన్నారు. వీరు 2 లేదా 3 నెలల పాటు శిక్షణ ఇస్తారు. కర్రని శరీరానికి తగలకుండా తిప్పుతూ శత్రువును ఎదుర్కొని తనను తాను రక్షించుకొనే విధానాన్ని శిష్యులకు నేర్పుతారు. ముఖ్యంగా సాయంకాలం ఈ శిక్షణనిస్తారు. మహిళలు కర్రసాములో శిక్షణ తీసుకోవడం అరుదు. పురుషులే ఎక్కువగా ఈ క్రీడను అభ్యసిస్తారు.

ప్రత్యర్థుల నుంచి తనకు ఎలాంటి గాయాలు తగలకుండా తప్పించుకోవడం, అలాగే వారిని ఓడించి తనలోని పోరాట పటిమను నిరూపించుకోడానికి ఈ శిక్షణలో గురువు శిష్యులకు మెలకువలను నేర్పుతాడు. ప్రదర్శనా సమయాల్లో కూడ గురువు శిష్యబృందం వెంట ఉండి ఎప్పటికప్పుడు లోటుపాట్లను తెలిపి సవరిస్తుంటాడు. అందుకే శిష్యులకు గురువుపట్ల అమితమైన భక్తి, ప్రేమ ఉంటుంది. శిక్షణలో కఠినమైన నియమాలుంటాయి. కళాకారులు ఉడాన్ (పల్టీ) కొట్టి కర్రను ఒడుపుగా అందుకొని కళను ప్రదర్శిస్తాడు. ముందుగా గురువుకు నమస్కరిస్తాడు.

కర్రసాములో వివిధ విన్యాసాలు

1) కర్రలతో నడవడం 2) రెండు కర్రలను రెండు చేతులతో తిప్పడం 3) కర్రలకు అగ్గి అంటించి తిప్పడం 4) తాడుతో కర్రలకు రెండు చివరల రెండు రబ్బరు బంతులను కట్టి తిప్పడం 5) నేలపై పడుకొని కర్రను తిప్పడం 6) కర్రను అరచేతి మధ్యలో నిలబెట్టి డప్పు దరువుకు అనుగుణంగా అడుగులు వేయడం 7) చాలామంది ప్రత్యర్థులతో పోరాడుతూ కర్రను తిప్పడం 8) కర్రను కుడిచేత్తో పట్టుకొని నేలమీద కూర్చొని గుండ్రంగా తిప్పుతూ కాళ్ళకు తగలకుండా ఎగురుతూ తప్పించుకోవడం మొదలైన విన్యాసాలను శిక్షణలో నేర్చుకుంటారు.

ప్రదర్శనా విధానం

కళాకారులు బనియన్ ధరించి పంచెను సైకిల్‌కట్టు కట్టుకుంటారు. తలకు ఎర్రని గుడ్డను కట్టుకుంటారు. డప్పుల మోత వినిపిస్తుండగా, డప్పులు వాయించేవారికి ఎదురుగా వచ్చి ఒక్కొక్క కళాకారుడు వారి కర్రను నేలపై ఉంచుతారు. వెనుకకు వెళ్ళి భూమాతకు నమస్కరించి పరుగెత్తుకుంటూ వచ్చి గాలిలో 'ఉడాన్' (పల్టీ) కొట్టి నేర్పుగా కర్రను అందుకుంటారు. తర్వాత గురువు దగ్గర ఆశీర్వాదం తీసుకొని కళా ప్రదర్శన మొదలుపెడతారు. ప్రేక్షకులు కళాకారుల చుట్టూ వలయాకారంలోనిలబడుతారు. ప్రదర్శనలో సరిసంఖ్యలో 6 మందిగాని 8 మందిగాని కళాకారులు పాల్గొంటారు. డప్పుల వాయిద్యానికి అనుగుణంగా అడుగులు వేస్తూ కర్రసాము చేస్తారు. మొదట కళాకారులు ఎవరికివారు ఇతరులతో సంబంధం లేకుండా తగినంత దూరంలో నిలబడి తమ విద్యను ప్రదర్శిస్తారు. ఈ సమయంలో వేగం హెచ్చినపుడు కర్ర కనిపించని పరిస్థితి కూడా ఏర్పడుతుంది. చేతులలో కర్రను మార్చుకుంటూ, శరీరానికి అన్ని వైపులా కర్రను గిరగిర తిప్పుతుంటే ప్రేక్షకుల హర్షధ్వానాలు మిన్నుమిట్టుతాయి. ఈలలు, కేకల సందడిలో సాగే క్రీడ చూపరులను విశేషంగా ఆకట్టుకుంటుంది. కొంత మంది బృంద సభ్యులు కర్రల సహాయంతో ప్రేక్షకులను నియంత్రిస్తుంటారు. ఉద్వేగానికి లోనైన కళాకారులను బృంద సభ్యులు తమ చేతిలోని కర్రలను అడ్డుపెట్టి ప్రదర్శన నిలిపేటట్లు చేస్తారు.

ప్రత్యేక విన్యాసాలు

కర్రసాము ప్రదర్శనలో కర్రను తిప్పుతూ, చంకల మధ్యలో, కాళ్ళ మధ్య నుండి కర్రను తీస్తూ, శరీరానికి తగలకుండా విన్యాసాలు చేస్తారు. వేగంగా తిరిగే కర్రను గాలిలోకి ఎగరవేసి తిరిగి దానిని పట్టుకొని యథా ప్రాకారం తిప్పే విన్యాసం అద్భుతాన్ని, విస్మయాన్ని కల్గిస్తుంది. కొంతమంది కళాకారులు బొటనవేలు సందులలో కర్రను పట్టుకొని, కర్రలతో నడుస్తూ డప్పు వాద్యానికి అనుగునంగా అడుగులు వేస్తారు. ఇలా రకరకాల విన్యాసాలు ప్రదర్శించిన తర్వాత కర్రసాములో చివరి ఘట్టంగా పోరాట క్రీడ మొదలవుతుంది.

కర్రసాము ప్రదర్శన అనేక రకాలుగా సాగుతుంది. ఈ కళాప్రదర్శనలు అన్ని ప్రాంతాల్లో ప్రదర్శింపబడుతున్నాయి. ఇందులో 3 రకాలు ప్రదర్శనలున్నాయి. 1) బాణా కర్రలు 2) బాణావైరి 3) అగ్గిబరాట

బాణా కర్రలు

వాద్యగతికి అనుగుణంగా అడుగుల వేస్తూ కర్రను వేగంగా తిప్పడం మొదటి దశ. తర్వాతి దశలో ఇంతకు ముందు చెప్పినట్లు వివిధ విన్యాసాలు ప్రదర్శిస్తారు. నిష్ణాతులైన కళాకారుల ప్రదర్శనలో ప్రేక్షకులు చిన్న చిన్న రాళ్ళతో కర్రను తిప్పే కళాకారుని కొట్టినప్పటికీ ఆ రాళ్ళు తగలకుండా తప్పించుకుంటారు. దీనిని బట్టి కర్ర తిరిగే వేగాన్ని మనం అంచనా వేసుకోవచ్చు. ఒకొక్కసారి కర్ర తిప్పేటప్పుడు అది శరీరానికి తాకడంతో కళాకారులకు చిన్న చిన్న గాయాలవుతుంటాయి. వాటికి బండారు (కుంకుమ పసుపుల మిశ్రమం) పూసి కట్టుకడతారు. గురువు సూచనతో బణాకర్రల ప్రదర్శన ఆగిపోతుంది.

బాణావైరి

ఇది కర్ర విద్యలో రెండవ ఘట్టం. వైరి పక్ష్యాలతో వీరోచిత పోరాటం లాగా జరిగే ఈ అద్భుత ఘట్టాన్ని చూడడానికి ప్రేక్ష సమూహం ముందుకు దూసుకొని వస్తుంటుంది. వారిని నియంత్రించడానికి బృంద సభ్యులు నానా తంటాలు పడుతుంటారు.

ఈ ప్రదర్శనలో కళాకారులు జట్లు జట్లుగా ఏర్పడి, జట్ల మధ్య కొంత దూరం ఉండేటట్లు నిలబడుతారు. ఇందులో 3 నుంచి 5 జట్లు పాల్గొంటాయి. కర్రను మధ్యలో పట్టుకొని ఎడమవైపుకు ఒకసారి, కుడివైపుకు ఒకసారి తిప్పుతూ అప్పుడప్పుడు నేలపైకి వంచుతూ, డప్పుల వాద్యానికి అనుగుణంగా చిందులేస్తూ ఎదురెదురు కళాకారులు దగ్గరికి వస్తుంటారు. 'జగ్‌లకన్' జతిలో వాయించే వరుసలు కళాకారులకు మంచి ఊపునిస్తాయి.

మొదట జట్టులోని ఒక సభ్యుడు ఇంకొక సభ్యుని కర్రతో కొట్టడానికి ప్రయత్నిస్తాడు. ఎదుటి వ్యక్తి కర్రను మధ్యలో పట్టుకొని అడ్డంగా పెట్టి దెబ్బ తగలకుండా తప్పించుకుంటాడు. కొట్టే వ్యక్తి లయబద్ధంగా చిందులువేస్తూ ముందుకు కదులుతూ కుడివైపు నుంచి ఒకసారి, ఎడవైపు నుంచి ఇంకొకసారి ఇలా మార్చి మార్చి కొడుతూ, అప్పుడప్పుడూ గాలిలోకి ఎగిరి పల్టీలు కొడుతూ కర్రను 'టపా టపా'మని కొడుతూ విన్యాసాలు ప్రదర్శిస్తాడు. ఇదే విధంగా ఇతర కళాకారుడు కూడ విద్యను ప్రదర్శిస్తాడు. చివరగా ఇద్దరూ దగ్గరికి వచ్చి ఒకేచోట నిలబడి గుండ్రంగా తిరుగుతూ అడుగువేస్తూ కర్రలతో యుద్ధం చేస్తారు. గురువు సైగతో ఆ ఘట్టం ముగుస్తుంది.

అగ్గిబరాటా

బాణా కర్రలకు రెండువైపుల బట్టలు చుట్టి కిరోసిన్‌లో ముంచి వెలిగించి కర్రలను బాణాకర్రల విద్యగా ప్రదర్శిస్తారు. వెదురు దబ్బలతో చక్రంలాగా తయారు చేసి దానికి అక్కడక్కడ మంటలు పెట్టి విన్యాసాలు ప్రదర్శిస్తారు. నేలపై పడుకొని కర్రను తిప్పడం, మంటలు శరీరానికి తగలకుండా తప్పించుకోవడం అత్యంత సాహసంతో కూడిన విద్యాప్రదర్శన. కొందరు కళాకారులు అగ్గిబరాట తర్వాత అనేక విన్యాసాలు ప్రదర్శిస్తారు.

కర్రలకు రెండు చివరల రెండు బతులను కట్టి బాణాకర్రలను ప్రదర్శించడం, సన్నని పొడవైన ఇనుప రేకులను బెల్టులాగా కత్తరించి వాటిని తిప్పడం మొదలైన ప్రదర్శనలు కూడ చేస్తారు.

డా॥ తప్పెట రామప్రసాద్ రెడ్డి,
అసోసియేట్ ప్రొఫెసర్, తెలుగుశాఖ,
యోగి వేమన విశ్వవిద్యాలయం, కడప.
సెల్ : 9440531520

# భారతీయ సిద్ధాంతాలలో అచలతత్త్వ భూమిక

డా॥ వి.త్రివేణి
అసిస్టెంట్ ప్రొఫెసర్,
తెలుగు అధ్యయన శాఖ, తెలంగాణ విశ్వవిద్యాలయం,
నిజామాబాద్ - 503322
ఫోన్ : 9951444803; Email : telugutriveni@gmail.com

మనిషి ఆలోచన సరణికి సంబంధించిన ప్రతి పార్శ్వం సాంస్కృతికం. ఆధ్యాత్మిక తత్త్వ బోధను తనదైన అంతర్ముఖంతో ఆవిష్కరించిన అచలతత్త్వం సాంస్కృతిక ఉద్యమంలో ఒక భాగం. తెలంగాణ ప్రాంతానికి చెందిన శ్రీమద్రామడుగు శివరామ దీక్షితుల చేత ఆవిర్భవించబడి, దాదాపు దక్షిణ భారతదేశమంతా వ్యాపించబడిన అత్యున్నత తత్త్వం అచల సిద్ధాంతం. ఇది తెలంగాణ ఆధ్యాత్మిక సంస్కృతిలో భాగమైన ఒక విశిష్ట శాఖ.

అద్వైతం, విశిష్టాద్వైతం, ద్వైతం, శుద్ధాద్వైతం, సత్యాద్వైతం, నింబాద్వైతం, త్రైతం, కర్మ జ్ఞాన ధ్యాన భక్తి యోగాలు, ప్రాణాయామాదులు, యమనియమాదుల వంటి సాధనలు, పరాశక్తి, బ్రహ్మ, పరబ్రహ్మ, జీవబ్రహ్మైక్యం, ఆత్మదర్శనం వంటి జ్ఞానమార్గాలు ఆధ్యాత్మిక సాంస్కృతిక సమాజానికి నూతనమైన శమచైతన్యాదులను అందించాయి. అందులో అచలతత్త్వం పాత్ర అత్యంత కీలకం.

అచల పరిపూర్ణధ్యానంలో అచలం 'సనాతనం' అని తెలుస్తుంది.

శ్లో ॥ పూర్వమేవ నిరాలంబం । ఆగ్నేయం నిర్గుణం తథా ॥
దక్షిణే నిత్య శుద్ధంచ । నైఋత్యే నిరుపద్రవం ॥

శ్లో ॥ పశ్చిమం నిష్కళంచైవ । వాయవ్యేచ నిరంజనం ॥
ఉత్తరేచ నిరాకాస । మీశాన్యేనిర్మలో భవేత్ ॥

శ్లో ॥ ఊర్ధ్వమేవ నిరాకారం । అధశ్చ నిర్వికారక ॥
అంతర్బహిశ్చ సర్వత్ర । అచలోయం సనాతన ॥

పూర్వం - నిరాలంబం, ఆగ్నేయం - నిర్గుణం, దక్షిణం - నిత్యశుద్ధం, నైఋతి - నిరుపద్రవం, పశ్చిమం - నిష్కళం వాయువ్యం-నిరంజనం ఉత్తరం - నిరాకాసం ఈశాన్యం - నిర్మలం ఊర్ధ్వం - నిరాకారం, అధశ్చం - నిర్వికారం అంతరం - బహిరం, సర్వత్రం-అచలం. సర్వదిక్కులలో ప్రతిబింబించేది అచలం. ఈ అచలం సనాతనం.

'అచలం' పద వివరణ అక్షరాన్వయంలో తెలుపబడింది.

అ- అభావం శివం అశివం నవిశ్యతే

చ- చలాచల శరహిత కేవలాత్మః

ల- లక్ష్యాలక్ష్య రహితాతీతం కేవలం

ము- మూలాలీల రహితమె పరిపూర్ణం

అచలం పదస్వరూపంలో గాని, స్వభావంలో గాని పూర్తిగా మిగతా దార్శనిక సిద్ధాంతాలతో విభేదిస్తుంది. అచల తత్త్వం ప్రకారం జీవుడికి గుణాలుంటాయి. తాను చేసుకొన్న కర్మల వల్ల మరల జన్మ ఉపాధులను పొందుతున్నాడు. జనమరణాదులను అనుభవిస్తున్నాడు. ప్రకృతిని అనుసరిస్తున్నాడు. అందువల్ల జీవుడు పరబ్రహ్మం కాదు. గుణములు లేనివాడు, జన్మాదులు పొందనివాడు, మూల ప్రకృతిని అనుసరించనివాడు పరబ్రహ్మం. ఈ పరబ్రహ్మమే అచలం.

అచల తత్త్వాన్ని ప్రతిపాదించిన వారు శ్రీమద్రామడుగు శివరామ దీక్షితులు. వీరు క్రీ.శ. 18వ శతాబ్దంలో తెలంగాణా ప్రాంతంలోని నల్లగొండ జిల్లాసమీపంలో సూర్యాపేట గ్రామ శివారులో ఒక బ్రహ్మణ కుటుంబంలో జన్మించారు. బాల్యం నుంచి చతుర్వేదసారాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. అందులో గల 1. ప్రజ్ఞానం బ్రహ్మ 2.అహం బ్రహ్మాస్మి 3. తత్త్వమసి 4. అయమాత్మాబ్రహ్మ – అనే నాలుగు మహా వాక్యముల సారంతో తృప్తి చెందక, వీటికి అతీతంగా బ్రహ్మమొకటి ఉండి ఉండవచ్చుననే ఉద్దేశంతో సద్గురు అన్వేషణ కోసం దేశాటనను ప్రారంభించారు. అదే సమయంలో పండరీపుర క్షేత్రంలో సద్గురు శ్రీధరస్వామిని సేవించి, ఆ స్వామి కృపచేత 'సర్వం అచలం, అది నిరాకారం, నిరామయం' అని తెలుసుకొన్నారు. పరబ్రహ్మ స్వరూపం బట్టబయలని, పరమపదం స్వచ్ఛమైందని గ్రహించి అచల సిద్ధాంతమనే ఆధ్యాత్మిక తత్త్వాన్ని రూపొందించారు. పండిత పామరులకు సైతం అందుబాటులో ఉండేటట్లుగా, అతి సామాన్యులకు సైతం అర్థమయ్యే విధంగా శ్రీమద్రామడుగు శివరామదీక్షితులు గురు స్థానాన్ని వహించి, శిష్యకోటికి జన్మరాహిత్యానికి సంబంధించిన అచల తత్వాన్ని బోధించారు. నాటినుంచి అచల తత్త్వం బహు ప్రాంతాల్లో విస్తరించి సాంస్కృతిక చైతన్యంతో పాటు సామాజిక పరివర్తనను కలిగించింది. స్వచ్ఛమైన దార్శనికతత్త్వాల్లో ఇది ఒక ఆధ్యాత్మిక ఉద్యమం.

తత్త్వశాస్త్ర ఆవిర్భావానికి భారతదేశం ఆదిగురువు. ప్రపంచ దేశాలన్నింటికి మార్గదర్శనం భారతదేశం. భారతీయ దార్శనిక తత్త్వాలు సాంస్కృతిక శాఖల్ని పరిపుష్టం చేసి మానవులందరికి అచంచలమైన ఆధ్యాత్మిక భావనలను ప్రేరేపించాయి. కాని విదేశీయుల పాలన సామాజిక సాంస్కృతికాంశాల్లో అనేక మార్పులు సంభవించాయి. భక్తితత్త్వ ఆధ్యాత్మిక బోధనలపైన ఆంక్షలు విధించబడ్డాయి. ప్రచారాలపై నిషేధాలు ఏర్పడ్డాయి.

తెలంగాణలో అసఫ్‌జాహి పాలనలో తాత్త్విక విషయాలను యోగులు సాధువులు బహిరంగంగా వెల్లడించలేక పోయారు. అందుకోసం అంతర్ముఖమైన సాధనా ప్రవృత్తిని అనుసరించారు. గృహస్థ జీవనంలోనే ఉండి యోగులుగా తమ జ్ఞానాన్ని సమాజపరం చేయడానికి ఎందరో ప్రయత్నించారు. వారిలో భక్త రామదాసు, రాకమచర్ల వెంకటదాసు, మన్నెంకొండ హనుమద్దాసు, బీబీపేట హనుమద్దాసు, చిదానందయోగి వైశ్యరత్న శ్రీబాగయ్య గారు చెప్పుకోదగ్గవారు. వీరందరు సమాజ శ్రేయస్సునాకాంక్షించి భక్తి తత్త్వసంకీర్తనలను అందించిన వాగ్గేయకారులు. వారు రచించిన సంకీర్తనల్లో గానీ, శతకాల్లోగానీ, కావ్యాల్లో గానీ, జానపద ప్రదర్శన కళల్లో గానీ తమ భక్తిని, తత్వాన్ని అంతర్లీనంగా అందించటానికి అనేక ప్రయత్నాలు చేశారు. తత్త్వప్రచారానికి తమకు అనువైన మార్గాన్ని అనుసరించారు.

తెలంగాణలో నిజాం పాలనలో అష్టకష్టాలు పడి కూడా మట్టిలో మాణిక్యంలా వెలుగొందిన ఆధ్యాత్మిక గురువులు తమ తత్త్వ బోధతో నాటి ప్రజల్లో ఆత్మానందాన్ని కలిగించారు. కడగండ్ల లాంటి గ్రామీణ జీవితం, తిండి గింజలకు నోచుకోని దౌర్భాగ్యం, రజాకార్ల దాష్టీకం, ప్రజల అవిద్య, అజ్ఞానం వంటి తెలంగాణ జీవన శైలిని అధ్యయనం చేసిన తత్త్వబోధకులు లౌకిక జీవన పోరాటాల నుంచి ముక్తిని పొందే శాంతి మార్గాన్ని

ఉపదేశించారు. తెలంగాణా విభిన్న రాజకీయ, చారిత్రక, సామాజిక పరిస్థితుల కారణంగా అచల తత్త్వం, మిగతా ప్రాంతాల కంటే తెలంగాణా ప్రాంతంలో అధికంగా ప్రచారాన్ని పొందింది.

అచల తత్త్వం ప్రతిపాదనకు బీజం పడింది తెలంగాణ ప్రాంతంలోని నల్లగొండ సమీపంలోనే, ఎందుకంటే శ్రీమద్రామడుగు శివరామదీక్షితులు సూర్యాపేట ప్రాంతానికి చెందినవారు కావడం. అక్కడే అతని వంశీకులు నివాసం ఉన్నట్లుగా, అతని సమాధి కూడా అక్కడ ఉన్నట్లుగా తెలుస్తుంది. అటు తర్వాత హైద్రాబాదు, రంగారెడ్డి, మహబూబ్‌నగర్, మెదక్, కరీంనగర్, నిజామాబాదు, వరంగల్లు, అదిలాబాదు, ఖమ్మం వంటి తెలంగాణా జిల్లాలన్నింటిలో ఈ తత్త్వం విస్తరించింది. క్రమంగా అచల ఆధ్యాత్మిక ఉద్యమం దక్షిణ భారతదేశమంతా వ్యాపించిందని తెలుస్తుంది. తెలంగాణా జిల్లాల్లో చాలా పల్లె ప్రాంతాల్లో, చాలా కుటుంబాల్లో ఈ అచల తత్త్వాన్ని అనుసరిస్తున్నారు. మా తాతగారు శ్రీవంగరి వెంకయార్యులు, మా పెద్దనాన్నగారు శ్రీనారసింహార్యులు, మా నాన్నగారు శ్రీ నారాయణార్యులు అచల పరిపూర్ణ బోధను స్వీకరించి, గురు పీఠాన్ని అధిష్టించారు కూడా.

యాజ్ఞవల్క్యుడు, జనకుడు, శుకుడు, సాందీపనీ, ఈశ్వరుడు, అంబికాశివయోగి, వేమనయోగి, శ్రీధరస్వామి, శివరామ దీక్షితులు, కంబలూరు అప్పబ్రహ్మం... ఇలా వీరందరూ అచల తత్త్వవాదులు, అచల వేదాంతులు, అచల పరిపూర్ణయోగులు. వీరితో పాటు వీరబ్రహ్మేంద్ర స్వామి, సిద్ధప్ప ఈ కోవలోకే చేరుతారు. ఇస్లాంలో భాగమైన 'చిస్తీ' లు కూడా అచల పరిపూర్ణులే అని కొందరు భావిస్తారు.






మొదట అచల పరిపూర్ణానికి అర్థం చెప్పుకుంటే 'అచలం' అనగా చలనం లేనిది, కదలనిది, చలించనిది, స్థిరంగా ఉండేది. 'పరిపూర్ణం' అనగా నిండుగా ఉన్నది. అంతటా పూర్ణమైనది. పూర్ణం కంటే కూడా దృఢంగా ఉన్న నిండుదనం. స్పష్టమైన అర్థ వివరణతో గల అచల సిద్ధాంతం ఒక భ్రాంతిరహిత సిద్ధాంతం. లేని మాయా/ఎఱుక అనేది భ్రాంతి సహిత సిద్ధాంతం. గురుతులేనిది గురుపదం. గురుతు సహితమైంది లేని మాయా/ఎఱుక. సూర్యోదయం అయితే చీకటి ఎలా లేకుండా పోతుందో గురుబోధ వల్ల లేని మాయా/ఎఱుక లేకుండా పోతుంది. సచల మతాలు సచల సిద్ధాంతాలు గురుతు సహితమైనటువంటివి. అచల తత్త్వం గురుతులేనిది. సాధనారహితమైంది.

అచల సిద్ధాంతం మూడింటిని గూర్చి తెలియజేస్తుంది 1. అచలం 2. ఎఱుక 3. జగత్తు. ఎప్పటికీ ఉన్నది అచలం. ఎప్పుడూ లేనిది ఎఱుక, కల లాంటిది జగత్తు.

**1. అచలం :** ఎప్పటికి ఉన్నది అచలం. చెప్పడానికి, చూపించడానికి వీలు కానిది. అనుభూతికి, ఊహకు అందగరానిది. తాను లేకపోవుట, లేనని జాగ్రత్త నొందుట మాత్రమే పరిపూర్ణ స్థితి. అదే అచలం.

'పుట్టుట గిట్టుట లేకను
పుట్టెటి గిట్టెటి యెఱుక పోడిమియు యెఱుకన్
చట్టువలె కదలకుండును
బట్టబయల్ యిట్టి దెరిగి భావింపదగున్' (శుద్ధ నిర్గుణ తత్త్వ కందార్థము)

జనన మరణాలు లేనిది పరమ పదం. జనన మరణాలు పొందేది ఎఱుక. ఏమి ఎఱుగక ఎఱుగడానికి రూప నామాలు లేక ఉండేది అచలం. అది స్థిరమైంది. పరిపూర్ణమైంది. ఏమి లేనిది, ఏమి కానిది, గ్రహించేది లేనిది, తెలిసిందంతా లేనిది, లేనిదంతా తెలుసుకొనేది అచల పరిపూర్ణ తత్త్వం. అందుకే 'లేనిది' అనగా ప్రకృతి. అది అసత్యం, అనిత్యం. 'ఉన్నది' అనగా బ్రహ్మం. అది సత్యం, నిత్యం. ఇంద్రియాలకు ఏదైతే తోచటం లేదో, పంచతన్మాత్రలకు ఏదైతే అందటం లేదో అదే అంతటా ఉంది. అదే పరిపూర్ణం.

సంకల్ప భ్రాంతిలో ఉన్న మానవులు సమస్త రూప నామాలతో ఎఱుకను కలిగి మరుపు చేత ఈ ప్రకృతి అంతా సత్యమని భావిస్తున్నారు. కాని మానవులు అనుసరిస్తున్న సంకల్ప భ్రాంతి అంతా కల. కల నుంచి మేల్కొంటే, కల అనుభవం ఏమీ ఉండదు. కలలో తోచే జగత్తు, కలలో తోచే శరీరాలు మేల్కొన్న తర్వాత ఏమీ ఉండవు. అలాగే ఈ కనిపించే జగత్తు, ఈ కనిపించే శరీరాలు కూడా కల. ఈ కల ఎలాంటిదంటే సర్వభ్రాంతి అధ్యారోపం వంటిది. భ్రాంతి సహిత విధానమంతా లేనిది. భ్రాంతి రహిత విధానమంతా ఉన్నది. ఉన్నది ఉన్నట్లు, లేనిది లేనట్లు, ఉలుకు లేక పలుకు లేక ఉన్నదే అచలం. సమస్త రూప నామాలన్ని భ్రమ, మాయ, మరుపు. మరుపు నుంచి మేల్కొని చూస్తే అంతా ఏమీ లేదు. అదే అచలం.

**2. ఎఱుక :** ఎప్పుడూ లేనిది ఎఱుక. ఎరిగేది, వినేది, చూచేది, తెలిసేది ఎఱుక. ఎఱుకంటే సంకల్పం. సంకల్పమంటే కల్పన. కల్పన అంటే లేనిది. ఎప్పుడూ లేనిది, కాని ఉన్నట్లుగా అనిపిస్తుంది. ఉన్నట్లు అనిపించేది ఎప్పుడూ లేనిది. అదే మాయ. ఈ మాయ ఎండమావుల వలె, కుందేటి కొమ్ములవలె, గొడ్రాలి బిడ్డవలె, రజ్జుసర్ప భ్రాంతివలె, ఆకాశ పుష్పాల వలె లేకనే ఉన్నట్లు అనిపిస్తుంది. ఈ మాయ కలలో తోచే శరీరాల వంటిది. కలలో తోచే శరీరాలకు ఎలా మూలంలేదో, ఈ కనిపించే శరీరాలకు అలా మూలం లేదు. ఈ కనిపించే శరీరంలో ఉన్న చైతన్యం కలశరీరం వంటిది. ఈ గుర్తెరిగే చైతన్యం కలశరీరం వంటిది. అందుకే కల శరీరాలకు, ఈ శరీరాలకు భేదం లేదు.

'నేను' అన్నదానిని అద్వైతం 'ఆత్మ' అని, విశిష్టాద్వైతం ' ఈశ్వరుడు' అని, ద్వైతం 'జీవుడు' అని పేర్కొన్నాయి. ఇన్ని నామములతో ఉన్న నేను అన్నదానిని అచలం 'మాయా/ఎఱుక' అంటుంది. ఈ మాయా స్వరూపులే అందరూ. సమస్త లోకాలు, లోకేశులు, లోకస్థులు అన్నీ మాయా ఎఱుక. ఇవన్నీ సమస్త రూప నామములు కలవి. శాశ్వతం కానివి. అయినా ఇవి ఉన్నట్లు అనిపిస్తున్నవి. ఈ ఎఱుకయే మాయ. ఈ ఎఱుక స్వజాగ్రత లేక అజాగ్రత అన్న మరుపులో నిలిచి ఉంటుంది. ఈ మరుపుతోనే తన్ను తాను మరిచి, ఈ మరుపుతోనే సమస్త కర్మలు చేసి, ఈ మరుపుతోనే ఒక శరీరాన్ని వదిలి, ఈ మరుపుతోనే వేరొక శరీరంలో జన్మించి, మళ్ళీ ఈ మరుపుతోనే కర్మలను అనుభవిస్తూ ఉంటుంది. ఈ మరుపు ఎంతవరకు ఉంటుందంటే ఎఱుకకు స్వజాగ్రత్త కలుగనంతవరకు ఉంటుంది. ఇది నిజమని ఎవరు భావిస్తారో అట్టివారికి జన్మరహితం కాదు.

చింతల తోటన నెఱుకే
వింతల పుట్టిల్లనంగ వెలసిన దెఱుకే
తంతుల పేటన నెఱుకే
పంతములకు చూడ మూల బలమది యెఱుకే ।
(జగజ్జనన స్థలమన్ననెఱుకే । భ్రాంతులకెల్లన్।)     (శుద్ధ నిర్గుణ తత్త్వ కందార్థము)

**ఎఱుక విధానం –** సంకల్పాలకు మూలమైంది, వింతలకు పుట్టినిల్లు, పంతములకు కారణంగా సర్వరూపులతో జగత్తు అంతా తానేనని, మరియొకటి లేదని, తనకు కలిగిన మరుపుతో తాను సత్యమని భావిస్తూ ఉన్నదే లేని మాయా/ఎఱుక.

**ఎఱుక ఉత్పత్తి –** టెంకాయలోకి నీరు వచ్చినట్లుగా మనకు తెలియకుండానే మరుపులో ఎఱుక ఉత్పత్తి అవుతుంది.

**ఎఱుక లయం –** ఏనుగు మ్రింగిన వెలగకాయలను గుజ్జు లేకుండా విసర్జించినట్లుగా ఎఱుక అనుభవంతో లయం అవుతుంది. ఏదైతే కనిపిస్తుందో, అది లేనే లేదనే నిరసన వ్యక్తం అవుతుంది. సర్వభ్రాంతిని తొలగిస్తుంది. ఈ భావనను అచల సిద్ధాంతం కలిగిస్తుంది.

**ఎఱుక స్వరూపం –** అరటి స్తంభం పొరలన్నీ తీసివేస్తే చివరకు మూలమే ఉండదు. అలాగే లేని మాయా ఎఱుక మన మరుపుతో అరటి స్తంభం వలె అనిపిస్తుంది. అచల బోధ భ్రమ అనే బీరచిక్కును విడదీసి, ఎఱుకను ఏమీ లేనిదని తెలిపి, సంకల్పమనే కూకటివేళ్ళను పెరికివేస్తుంది. ఇలాంటి విచారణ అచలేతర సిద్ధాంతాలకు లేదు.

**3. జగత్తు :** జగత్తు ఉన్నట్లు, ఇది సత్యమని, ఇది నిత్యమని అనిపిస్తుంది ఈ లేని జగత్తు కేవలం భ్రమల చేతనే సత్యంగా ఉన్నట్లు అనిపిస్తుంది. ఈ కనిపించే శరీరాలకు మూలం ఉన్నట్లు చెప్పడం కేవలం భ్రమ. స్వప్నంలో దేహాలకు మూలం లేనట్లు, ఈ గుర్తెరిగే దేహాలకు మూలం లేదు. దేహి(ఆత్మ) కలది మేడిపండు వంటిది. దేహిని కలిగిన దేహం పరాప్రకృతికి చెందిన వేపకాయ వంటిది. దేహి దేహములు సత్యమని భావించటం భ్రమ. అలాంటి వారు ఎన్నటికీ గురుపదం ఎరుగరు.

ఈ జగత్తు కల జగత్తు. ఈ గుర్తెరిగే దేహాలు కలలో కనిపించే మూలంలేని దేహాలు. అంటే కలలో కనిపించే జగత్తుకు జాగ్రత్తలో గుర్తెరిగే జగత్తుకు తేడా లేదు. ఈ పూర్ణ సిద్ధాంతం తెలియని వారందరు నిద్రావస్థలో కనిపించిన జగత్తు మేల్కొన్న తర్వాత ఏమీ లేదని గ్రహించి కూడా ఈ గుర్తెరిగే జగత్తును మాత్రం సత్యమని భ్రమిస్తారు. కాని కలలో కనిపించే జగత్తు బాహ్య జగత్తు. బాహ్య జాగ్రత్తలో గుర్తెరిగే జగత్తుకు తేడా ఏమీలేదని తెలుసుకోవాలి. కల జగత్తు వంటిదే ఈ గుర్తెరిగే జగత్తు. కాని ఈ జగత్తు సత్యంగా అనిపిస్తుంది. ఈ మరుపునే అజాగ్రత్త వల్ల సమస్తం సత్యమని అనిపిస్తుంది. అందుకే ఎరుక భావాన్ని తెలుసుకొని భ్రాంతి రహితం కావాలని అచల తత్త్వం బోధిస్తుంది.

**భ్రాంతి :** సమస్తం లేకనే తోచేది భ్రాంతి. ఇది అధ్యారోపం. రజ్జుసర్పభ్రాంతిలో రజ్జువు (తాడు) మీద సర్పం అధ్యారోపితమౌతుంది. దీనినే భ్రాంతి అంటారు. ఈ లేక తోచే లేని మాయా/ ఎఱుక ఎండమావుల వలె భ్రమరూపంగా తోచుతుంది. ఎండమావులు లేనివి అయినా నీళ్ళవలె ఏ విధంగా ఉన్నట్లు అనిపిస్తుందో, ఆ

విధంగా సర్వజగత్తు సర్వరూపు నామాలు లేనిది అయినా ఉన్నట్లు అనిపిస్తుంది. పరిపూర్ణం మినహా సమస్త రూప నామాలు మాయే. అట్టి మాయే భ్రమ. భ్రమ లేనిది బ్రహ్మం (అచలం)

**బ్రహ్మం :** భావింపరానిది బ్రహ్మం. అది అవాఙ్మానస గోచరం. మనస్సుకు, వాక్కుకు, జ్ఞానానికి అగోచరం. సమస్త రూప నామాలు లేని పరిపూర్ణం తెలుసుకొన్నప్పుడే జన్మరాహిత్యం పొందగలం. బ్రహ్మం చేరగలం.

అచల తత్త్వం ద్వైతాద్వైత విశిష్టాద్వైతాలకు అతీతమైంది. జీవుడిని, బ్రహ్మను–ఒకటిగా చూపేది అద్వైతం. జీవుడిని, బ్రహ్మను –భక్తితో చూపేది విశిష్టాద్వైతం. జీవుడిని, బ్రహ్మను–రెండింటిని వేరుగా చూపేది ద్వైతం. జీవుడిని గాక, బ్రహ్మను గాక కేవలం 'అచలం' మాత్రమే చూపేది అచలతత్త్వం.

అచలతత్త్వం త్రిగుణాతీతమైంది. త్రిగుణాలు త్రిమూర్త్యాత్మక స్వరూపమైనవి. ఆ స్వరూపం ఓంకారం. ఓంకారంలోని అకార–ఉకార–మకారాలే గుణత్రయం. రజో గుణం బ్రహ్మ, తమోగుణం రుద్రుడు(శంకరుడు), సత్వగుణం విష్ణువు. త్రిగుణ రూపనామాలతో ఉన్న ఈ సమస్తం అచలం కాదు. గుణ రూప నామాదులు లేనిదే అచలం. అఖిలం అచలం. అదే పరిపూర్ణం.

అచలతత్త్వం సాంఖ్యానికి అతీతమైంది. పిండబ్రహ్మాండాల ఉత్పత్తి సాంఖ్యంలో చెప్పబడింది. 'బ్రహ్మారో అవ్యక్తం।అవ్యక్తో మహత్। మహత్ మదాహంకార।మదాహంకారో పంచతన్మాత్రాని। పంచతన్మాత్రో పంచభూతాని। పంచ భూతేభ్యో సర్వం జగత్।' ఇది జగత్తు ఆవిర్భావ క్రమం. బ్రహ్మం నుంచి అవ్యక్తం (మూల ప్రకృతి). అవ్యక్తం నుంచి మహత్తు. మహత్తు నుంచి అహంకారం, అహంకారం నుంచి పంచతన్మాత్రలు, పంచ తన్మాత్రల నుండి పంచభూతాలు, పంచభూతాల నుంచి జగత్తు సృష్టించబడిందని సాంఖ్యం చెబుతుంది. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనే పంచతన్మాత్రల నుంచి ఆకాశం, వాయువు, అగ్ని, జలం, పృథివి అనే పంచభూతాలు సృష్టింపబడ్డాయి. శబ్దం నుంచి ఆకాశం, స్పర్శ నుంచి వాయువు, రూపం నుంచి అగ్ని, రసం నుంచి జలం, గంధం నుంచి పృథివి ఆవిర్భవించాయి. జగత్తు ఆవిర్భావం, జగత్తుయందు గుణక్రియ రూప నామబేధాలతో జీవుడు ఉద్భవిస్తున్నాడు. ఆ జీవుడు ఏదో ఒక దేహాన్ని ఆధారంగా చేసుకొని నిలయమై ఉంటాడు. జీవుడు దేహంలో ఉన్నంతవరకు అతడు చైతన్య స్వరూపుడు. అందుకే జీవుడు ఎఱుక. జీవుడికి దేహానికి మధ్య సచ్చిత్ సంబంధం ఉంటుంది. సత్–జీవుడు, చిత్–దేహం, జీవుడు–చైతన్యుడు. దేహం–జడం. చైతన్యం లేనిదే దేహం లేదు. దేహం లేనిదే చైతన్యంలేదు. చైతన్యం కానీ, జడం కానీ ఈ రెండునూ అచలం కాదు. అచలం నిర్గుణమైంది. నిరాకారమైంది. స్వచ్ఛమైంది. శుద్ధమైంది. అనిర్వచనీయమైంది. 'పల్కులేనిదే బ్రహ్మమూ। బ్రహ్మమని పలికేదే – ఇక శూన్యమూ' అని అంటారు అచల తత్త్వవేత్తలు.

కర్మ, జ్ఞాన, భక్తి, యోగాలకు అతీతమైంది అచల తత్త్వం. కర్మయోగానికి అతీతమైంది అచలం. ఆగామి, సంచిత, ప్రారబ్ధ కర్మల వల్ల కర్మబంధాలు ఏర్పడుతాయి. అచలానికి కర్మలే లేనప్పుడు కర్మబంధాలు ఏర్పడటం అసంభవం. జ్ఞానయోగానికి అతీతమైంది అచలం. ఈ తత్త్వంలో జ్ఞానం అంటే ఎఱుక. అందుకే అచలం జ్ఞానరహితమైంది. నవవిధ భక్తిమార్గ యోగానికి అతీతమైంది అచలం. భక్తియోగమంతా మనఃస్థితికి చెందింది. ఈ భక్తి సాధనతో కూడింది. కాని అచలం అనుభవంతో కూడింది.

ఇవే గాక ముద్రలు, ధ్యానం, రాజయోగంలో తారకం, సాంఖ్యం, అమనస్కం వంటి భావనలు అచల తత్త్వ పరిధిలోకి రావు. అచలతత్త్వం సాధనచతుష్టయ సంపత్తిని గ్రహించగలగాలి. అవి –

**1. నిత్యానిత్య వస్తువివేకం –** రూప నామక్రియలు గల అంతర్ బాహ్య ప్రపంచమంతా అనిత్యం. రూప నామాలు లేక సర్వవిలక్షణమై ఉన్న బ్రహ్మం నిత్యం.

**2. ఇహాముత్రార్థ ఫల భోగ విరాగం –** ఇహపర భోగాలిచ్ఛగింపక పాప పుణ్యముల యందు పడకుండా ఉండటం. స్త్రీలను, ధనధాన్య వస్తు వాహనాది గృహారామ క్షేత్రాదులను, పరలోక మందుగల స్వర్గ వైకుంఠ కైలాసాదుల యందలి, సాలోక్య సామీప్య సాయుజ్య విదేహాది పదవుల యందు గల భోగాలపై ఇచ్ఛ లేకుండా ఉండటం.

**3. శమాది షట్కసంపత్తి –** శమం, దమం, శాంతి, తితీక్ష, శ్రద్ధ, ఉపరతి వంటి సాధనలను అనుసరించటం.

శమం – ఆంతరింద్రియ నిగ్రహం

దమం – బహిరింద్రియ నిగ్రహం

శాంతి – అరిషడ్వర్గాలను అణచడం

తితీక్ష – సుఖ దుఃఖాలను సహించడం

శ్రద్ధ – గురు వాక్యనిష్ఠ, గురు భక్తి కలిగి ఉండటం.

ఉపరతి – కర్తృత్వం లేని కర్మ ద్వారా  ఆత్మ నెరుగడం.

**4. ముముక్షుత్వం –** మోక్షాపేక్ష తప్ప ఇతరాపేక్ష లేకుండుట. ముముక్షత్వం. సర్వకాల సర్వావస్థల యందు జనన మరణ భ్రాంతి రహిత మోక్షమందు ఇచ్ఛ కలిగి ఉండటం ముముక్షత్వం.

అచల తత్త్వవేత్తలు చతుష్టయ సాధన సంపత్తిని కలిగి భ్రాంతి రహిత స్థితిని పొందాలని అచల తత్త్వం బోధిస్తుంది.

అచల వాదులు గురువును దైవంగా భావిస్తారు. గురువుకు దేహముండదు. రూపముండదు. గుణముండదు. అఖిలానికి ఆత్మ గురువైతే, ఆత్మకు అచలమే గురువు. గురువులకు గురువైంది పరిపూర్ణ బ్రహ్మం. పరిపూర్ణ పరబ్రహ్మాన్ని నిరూపించే ప్రయత్నంలో తమకు అచల తత్త్వాన్ని బోధించిన గురువులను పూర్తిగా విశ్వసించి, వారినే అచల పరిపూర్ణులుగా స్వీకరిస్తారు. అచల పరిపూర్ణ యోగులు ఆచరణలో అన్నీ ఆదరిస్తారు. కాని అన్నిటా ఉంటూనే ఆ నిరాకార గురు (పరిపూర్ణ) తత్త్వంలో జీవించడమే అచల పరిపూర్ణ ఆచరణాత్మక జీవనయోగం.

అచల పరిపూర్ణులు అన్నిటా ఉండి, అందరితో కలిసి ఉండి కూడా తామరాకు మీద నీటి బొట్టుగా, అద్దమందు రూపంగా, బురదలో కుమ్మరి పురుగుగా, నాలుకకు నెయ్యిగా, బొబ్బరకు చింతపండుగా, చల్లలో వెన్నగా ప్రపంచంలో సకల వ్యవహారాలు చేసి కూడా కల జగత్తుకు అంటడం లేదు. సత్సంగంలో నిస్సంగం అంటే ఇదే. క్రింది ఉపనిషద్వాక్యం పరిశీలిద్దాం.

సత్సంగత్వే నిస్సంగత్వం। నిస్సంగత్వే నిర్మోహత్వం।
నిర్మోహత్వే నిశ్చల తత్త్వం। నిశ్చల తత్త్వే జీవన్ముక్తిః॥

సత్సంగత్వం వల్ల నిస్సంగత్వం, నిస్సంగత్వం వల్ల నిర్మోహత్వం, నిర్మోహత్వం వల్ల నిశ్చల తత్వం ఏర్పడుతుంది. ఈ నిశ్చలమే 'అచలం'గా భావించవచ్చునేమో!

చావు పుట్టుకలు లేక, తనకు తాను స్వతస్సిద్ధమై ఉన్న, ఈ ఉత్త బట్టబయలు తప్ప ఏమీ లేదు. సకల కాలాలు లేవు. సకల దేశాలు లేవు. సకల వస్తువులు లేవు. కలలో కనపడిన గజము మేల్కొని చూడగా ఎలా లేదో మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం ఏమీ లేదని గురు ముఖంగా విచారించాలని అచల తత్త్వం బోధిస్తుంది.

'ఈ ఉత్త బట్టబయలు ఏమి లేదు' అనే ద్వాదశాక్షరిని చక్కగా అవగాహన చేసుకొని, తర్వాత కలలో తోచిన శరీరాలు ఏవిధంగా కనిపిస్తాయో, ఆ విధంగానే 'మూలం లేని ఈ గుర్తెరిగే శరీరమేమీ లేదు' అనే షోడశాక్షరిని సదా మరువకుండా ఉండవలననే గురు వాక్యాలను తప్పక ఆచరించవలెనని ఈ తత్త్వం తెలియజేస్తుంది. ఇదే జనన మరణ భ్రాంతి రహితమైన అచల సూత్రం. ఇదే పరిపూర్ణం. చివరగా పరిపూర్ణాన్ని ఉపనిషదుదాహరణంతో ముగిద్దాం.

శ్లో॥ ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే

పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమే వావశిష్యతే॥

**అర్థం** : అది పూర్ణమే, ఇది పూర్ణమే, పూర్ణం నుంచి పూర్ణమే పుడుతుంది. పూర్ణానికి పూర్ణం కలిపినా, పూర్ణం నుంచి పూర్ణం తీసివేసినా పూర్ణమే మిగులుతుంది. అదే అచలం.

* * *

# పుట్టపర్తి నారాయణాచార్యులు-సాహిత్య సేవ

- డా॥వి. కృష్ణవేణి, తెలుగు విభాగాధిపతి
శ్రీ పద్మావతి మహిళా డిగ్రీ మరియు పి.జి. కళాశాల
తిరుపతి. చరవాణి :9441948530
Email:drvkrishnaveni@gmail.com

పుట్టపర్తి నారాయణాచార్యులు 14 భాషలు నేర్చిన బహుభాషాశాస్త్రవేత్త. గంభీరమైన కంఠంతో అనర్గళంగా ఉపన్యసించే వాక్కు, తెల్లటి దుస్తులతో ఎదుటివారిలోని మంచిని హంసలా స్వీకరించే స్వచ్ఛత వీరిది. గిన్నీస్‌బుక్ ఆఫ్ ది రికార్డులకు ఎక్కవలసిన అద్భుతమైన ధారణ వీరి సొంతం. శివపార్వతుల తాండవానికి గానం అందించిన గానగంధర్వుడు. పరమవైష్ణవుడైనా కులమతాలకతీతంగా శిష్యగణానికి విద్యనేర్పిన గురువు. సాక్షాత్ సరస్వతీపుత్ర బిరుదును శివయోగులతో, శివుని నివాసస్థలమైన హిమాలయాల్లో పొందటం ఎందరికి లభించే భాగ్యం? అందుకనే బహుశ లక్ష్మీకటాక్షం ఒక అడుగుదూరంలోనే ఉండిపోయింది. అత్తాకోడళ్ళయిన లక్ష్మీసరస్వతులు వైరిభావాన్ని పుట్టపర్తి వారిపైన చూపారేమో అన్నట్లుగా వారి పేదరికం కొనసాగింది.

జీవనగమనంలో, రచనల్లోని విభిన్నత్వ భావాలను పరిశీలిస్తేనే పుట్టపర్తి నారాయణాచార్యుల వారి కళాకృషిలోని ఔన్నత్యాన్ని ఆకళింపు చేసుకోవచ్చు. అందుకే వారి సాహిత్యంలోని కొన్ని భిన్న అంశాలకు, మూర్తిమత్వానికి గల పోలికలను పరిశీలించడం ముఖ్యం.

'ఋషి కాలేనివారు కవికాలేరు' అనే వేదవాక్యాన్ని నిరూపించారు ఆచార్యుల వారు. వైదిక వంశంలో పుట్టడం వలన వైష్ణవాచారులను నిష్ఠగా పాటించేవారట. నిత్యం అష్టాక్షరి మంత్రం జపిస్తూ భగవంతుని కైంకర్యంలో కాలం గడిపి కాలం విలువ తెలిసినవారు పుట్టపర్తివారు. వారి కుమార్తె శ్రీమతి నాగపద్మినిగారు తమ అయ్య గురించి వివరిస్తూ...

"ఇంట్లో పడసాల (హాలు)లో పెద్ద పెద్ద అంగలు వేస్తూ అష్టాక్షరి జపం కొనసాగించే వారిని చూస్తుంటే మహాగంభీర సాహితీశిఖరాన్ని చూస్తున్నట్టుండేది?" (మా నాన్నగారు-పుట 260) ప్రముఖ రచయిత, పుట్టపర్తివారి ప్రియశిష్యులు శశిశ్రీగారు, తమ గురువుగారి ఆధ్యాత్మిక మంత్రోచ్చారణ గురించి విపులంగా వివరించారు... (భారతీయ సాహిత్య నిర్మాతలు). చిన్నవైన సన్నని రాళ్ళను ఒక జోబిలో వేయి వేసుకొనేవారట. అష్టాక్షరి మంత్రం పఠిస్తూ రాళ్ళను లెక్కించి ప్రక్క జేబులోకి మార్చేవారని, అలా రోజుకు లక్షసార్లు మంత్రపఠనం ఆచరించేవారట. కొన్ని కోట్లసార్లు మంత్రాన్ని జపించారని తెలుస్తోంది.

మనసును చిత్తంలో లయం చేయడానికి మంత్రోచ్చారణ అద్భుత ఆచరణ. కలియుగంలో మంత్రోచ్చారణకున్న అమోఘ ఫలితం గురించి భగవద్గీతలోనూ చెప్పబడింది. ఆ మంత్ర జప ఫలితం అనుభవంలోకి రాలేదన్న దుఃఖంతో ఆత్మహత్యాయత్నానికి కూడా పూనుకున్న ఆవేశపరులుగా ఆచార్యులవారు కనిపిస్తారు. అంటే ఫలితం వెంటనే రావాలనుకునే మనస్తత్వం వీరిది.

రామకృష్ణ పరమహంస జీవితంలోనూ ఇటువంటి ఆవేశం కన్పిస్తుంది. కాళీమాత ప్రసన్నతకోసం, మాతప్రత్యక్షం కావాలని అహర్నిశలు పూజిస్తాడు రామక్రిష్ణ పరమహంస. ప్రతిరోజు ఉదయం నిద్రలేచిన వెంటనే మాత ప్రత్యక్షం జరగలేదని తలను నేలకు బాదుకొని ఏడ్చేవారంట. 'తల్లీ ఇంకోరోజు నా జీవితంలో వృథా అయింది. ఎప్పుడు ప్రత్యక్షమవుతావు' అని (శ్రీరామకృష్ణ పరమహంస జీవితచరిత్ర).

అయితే ఆ ఆవేశమే పుట్టపర్తి జీవితంలో వరమయింది. స్వామి శివానంద సరస్వతివారిచే 'సరస్వతీపుత్ర' బిరుదు ప్రధానం జరగడానికి అవకాశం లభించింది. సాహిత్య కర్షక వృత్తిని చేపట్టి పలు కావ్యాల పంటలు పండించడానికి దోహదమయింది.

పుట్టపర్తివారు ఈశ్వరున్ని భక్తితో పూజించి, భక్తుల పాలిట భోళాశంకరుడైన శివుడిని ప్రసన్నం చేసుకొని ఆవిష్కరించిన గేయకావ్యం 'శివతాండవం'. ఈ కావ్యం వ్రాసేరోజుల్లో ప్రొద్దుటూరులోని అగస్తేశ్వరాలయంలో రోజూ 108 ప్రదక్షిణలు చేసేవారట. చాలా పురాతన విశాలమైన ఆ ఆలయంలో ప్రదక్షణ చేస్తుండగా ఒక కొమ్మ విరిగి పుట్టవారి ఎదురుగా పడిందని, అలౌకిక ఆనందంతో వీరు...

**'ఆడెనమ్మా! శివుడు**

**పాడెనమ్మా! భవుడు'**

– అంటూ కవితావేశం ఉప్పొంగిందని ఆచార్యులవారు ఒక ఉపన్యాసంలో ప్రస్తావించారు. భూలోకం ఆ శివతాండవానికి పరవశించింది. పుట్టపర్తివారు ప్రతి వేదికపైనా ఈ గేయం పాడుతూ అర్ధనారీశ్వరుని నాట్యమాడించారు.

వైష్ణవారాధ్యుడైన పుట్టవార్తివారు శివారాధనలో లీనమై శివతాండవం రాయడానికి ఒక కారణం శివకేశవుల అభేదాన్ని లోకానికి చాటడానికి కావచ్చు. మరో కారణం హిమాలయాలు, ఋషికేశ్‌లలో సన్యాసుల సాంగత్యం, స్వామి శివానంద సరస్వతుల వారివద్ద చేసిన శిష్యరికం అయివుండవచ్చు.

తాతాచార్యుల వంశస్థులుగా శ్రీకృష్ణదేవరాయల వివిధ గాథలను పూర్వీకుల నుండి వినటం మూలంగా, రాయలవారికి గల శివకేశవుల అభేదభావాన్ని ఆకళింపు చేసుకొని వుండవచ్చు. శ్రీకృష్ణదేవరాయల వంశస్థులకు విరూపాక్షుడు కులదైవం. రచనలు చేసింది 'ఆముక్తమాల్యద' వంటి విష్ణుభక్తుల కథలు. వైష్ణవ శైవ ఆలయాలకు లెక్కలేనన్ని దానాలు ఇవ్వడం రాయలవారి గొప్ప మనసుకు తార్కాణం. బహుశా ఆ గుణం మెచ్చికూడా శివునికి సంబంధించిన రచనలు పుట్టపర్తివారు చేశారు.

రచయితలు సాధారణంగా సున్నిత మనస్కులై ఉంటారు. భావావేశాన్ని వెంటనే వెల్లగక్కుతారు. అలాగే చిన్నపాటి పొగడ్తలకు ఉబ్బితబ్బిబ్బులవుతారు. అందుకనే పుట్టపర్తివారి వివిధ రచనల్లో ఆ సున్నితత్వం కన్పిస్తుంది.

చారిత్రక అంశాలపై పరిశోధనలో కూడా ఈ అంశాలు ఉపకరిస్తాయి. చారిత్రక కట్టడాలను చూసినపుడు చరిత్రకారుల పరిశీలనలకు, కవి పరిశీలనకు తేడా ఉంటుంది. కవి స్పందన ఏ రీతిలో ఉంటుందో పుట్టపర్తి వారి 'మేఘదూతము' ఒక్క కావ్యం చాలు. అలాగే కవి వేదనకు వారి 'పెనుగొండ లక్ష్మి' గొప్ప తార్కాణం.

పుట్టవార్తివారు ఏ ఊరికి వెళితే ఆ ఊరికి సంబంధించిన ప్రత్యేకతలపై సాహిత్యాన్ని అందించారు. అంతేకాకుండా చదివిన గ్రంథం గొప్పతనాన్ని ఆస్వాదించడం, ఆ భాషలో రచనలు చేయడం, ఆ రచయిత ఔన్నత్యాన్ని దర్శించడం పుట్టపర్తివారి ప్రత్యేకత. ఈ గుణమే వివిధ రచనలకు దారితీసింది.

త్యాగరాజ సుప్రభాతం, సాక్షాత్కారము, షాజీ, పాద్యము, శ్రీనివాస ప్రబంధము, జనప్రియ రామాయణము, పండరీ భాగవతము, శ్రీసాయిలీలామృతము... మొదలైన వివిధ రచనలు ఇందుకు ఉదాహరణలు.

'సాధనమున పనులు సమకూరు ధరలోన' అనే వేమన వాక్యానికి నిలువెత్తు సాక్ష్యం పుట్టవర్తివారు. సాటిలేని ఏకాగ్రత, మేటిఅయిన వీరి ప్రతిభను ప్రశంసించని వారు లేరు.

తిరుమల రామచంద్రవారు 'హంపి నుండి హరప్పాదాకా' – స్వీయచరిత్రలో తన సహధ్యాయుల గొప్పతనాన్ని వివరించే సందర్భంలో పుట్టవార్తివారి గురించి ప్రస్తావించారు.

"పుట్టపర్తి నారాయణాచార్యుల గురించి చెప్పనక్కరలేదు. గొప్పకవి. ఈ యుగకవి అని నా విశ్వాసం. వాసిలోను, రాశిలోను అతని కావ్యాలు మిన్న. 'శివతాండవం' దేశమంతా మారు మ్రోగినట్టుంది. అతని జనప్రియ రామాయణం. అధ్యాత్మిక రామాయణంలాగ క్రొత్త ఛందస్సులో నడుస్తుంది. మేఘదూతము ఆధునిక ఆంధ్ర చారిత్రక గీత. పండరీభాగవతం ప్రాచీన ద్విపదకావ్యాల్లో ఏమాత్రం తీసిపోని ద్విపద కావ్యం. అతడు నటుడు, గాయకుడు, సంగీత నాట్య శాస్త్రజ్ఞుడు. గొప్ప ధారణశక్తి గలవాడు. సంస్కృత కాదంబరిలోని నాలుగైదు పుటలు ఏకధాటిగా అప్పగించేవాడు. ఒకసారి రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారి ఆంధ్రనాటకోపన్యాసాలు అనే రెండువందల పుటల పుస్తకాన్ని ఒకరాత్రి చదివి మరుసటిరోజు సభలో అప్పగించాడు. అతని ధారణకు అంతా భయపడేవారు" (పుట 252).

ఆంగ్లభాష రాదని హేళన చేసినందుకు, రాత్రికి కంఠస్థం చేసి ఉదయం ఆంగ్ల నిఘంటువును అప్పచెప్పారని కొందరు సాహిత్యకారుల భాష్యం. శశిశ్రీగారు వీరి సాధన గురించి తాను ప్రత్యేకంగా చూసిన అంశాలను 'భారతీయ సాహిత్య నిర్మాతలు' అనే గ్రంథంలో వివరించారు. తెల్లకాగితాలను పుస్తకాల రూపంలో కుట్టించి ఎర్రసిరా కలంతో చిన్న చిన్న చీమల్లాంటి అక్షరాలతో పుస్తకాల నుండి గ్రహించిన అంశాలను వ్రాసుకొనేవారని, ముదిమి వయస్సులోనూ మేడపైకెక్కి గోడకు పద్యాలను అప్పజెప్పేవారని తెలిపారు.

పదిసార్లు చదివినదానికన్నా ఒక్కసారి వ్రాయడం మిన్న అన్నది అందరికీ తెలిసిన విషయం. వల్లెవేయడం వల్ల జ్ఞాపకశక్తి మెరుగుపడుతుంది. చదువరులు బాల్యంలో వల్లెవేసిన ఎక్కములు ఏ వయస్సులోనైనా మరవలేరు. మన వేదాలు, మంత్రాలు వల్లెవేయటం ద్వారానే నేటికీ సజీవంగా మిగిలి ఉన్నాయి.

వ్రాయటం, వల్లెవేయటం అనే ఈ రెండింటిపై పట్టు సాధించారు పుట్టపర్తి నారాయణాచార్యులవారు.

పుట్టపర్తి వారిలో కనిపించే మరో భిన్నత్వం స్వామి అరవింద్ ఘోషలకు శిష్యులుగా మారడం. కాస్తంత జ్ఞానం అబ్బగానే తమంతటి వారులేరనుకొనే స్వభావం మానవ నైజం. అందుకు పూర్తి భిన్నంగా తనో సాహితీవేత్త, బహుగ్రంథకర్త అయినా మరొకరివద్ద శిష్యరికం చేయడం అనే అంశంలో ఒద్దికైన శిష్యుడు పుట్టపర్తి వారిలో కన్పిస్తాడు. 1944లో వెలువడిన 'పాద్యం' అనే లఘు పద్యకావ్యం అంతా గురువుకు చేసే సుశ్రూష గురించిన అంశాలున్నాయి.

తే.గీ॥ భాష్ప పూర్వంబుతో నీకు పాద్యమిత్తు
నను కొనెదగాని, ప్రతిజల కణముగూడ
బరమ పూతంబు – దమ పేరు – పలుకదేమొ
యన్న సందేహమున రిక్తుడై నిలుతును

**భావం :** నా కన్నీళ్లే, ఓ స్వామి నీ పాదాలు కడుగుటకు 'పాద్యం'గా ఇవ్వాలని వుంది కానీ, పరమపూతమైన స్వామీ ఈ జలంలోని ప్రతికణం నీ పేరు పలుకకపోతే ఎలా? అనే సందేహమే నన్ను ఇలా శూన్యునిగా నీ ముందు నిలిపింది. (భారతీయ సాహిత్య నిర్మాతలు, పుట 30).

ఒక గురువుపై శిష్యునికి వుండవలసిన అంచంలమైన భక్తివిశ్వాసాల గురించిన 'పాద్యం'లో వివరించడం వల్లనేమో అరవింద్ ఘోష్ స్వామిని గురస్థానంలో ప్రతిష్టించుకున్నారు పుట్టపర్తివారు. తన కుమారునికి కూడా గురువు పేరునే నాకరణంగా స్వీకరించడం ఇందుకు నిదర్శనం.

75 సం॥ల వయస్సులో కూడా ఉర్దూభాషను నేర్చుకోవాలన్న అభిలాషతో తనకన్నా వయస్సులో చిన్నవాడయిన ఉర్దూ ఉపాధ్యాయుని ఇంటికి ఆరునెలలు వెళ్ళి పాఠాలు చెప్పించుకోవడం నారాయణ చార్యులలోని ఒద్దికయిన శిష్యుడు దర్శనమిస్తాడు.

కవిత్వం ఒక భావావేశం. రచనలు దాదాపు ఒకటి లేదా రెండు రంగాలలో ఇమిడిపోతాయి. కానీ పుట్టపర్తి వారి కవితాపటిమ ఆధ్యాత్మిక, భావ, విప్లవ కవిత్వాలలో మెండుగా కనిపిస్తుంది. అందునా ఆధ్యాత్మిక భావ జగత్తుల్లో మునిగినవారికి బహుదూరం విప్లవ సాహిత్యం. భగవంతుని సేవలో తరించాలనే తపన పరులకు బహ్య ప్రపంచం చాలా చిన్నదిగా కనిపిస్తుంది. పేదల కష్టాలకు హృదయం ద్రవించని వారికి భగవంతుని దర్శనం మృగ్యం అని గ్రహించారు ఆచార్యులవారు. అందుకే ఈ విరుద్ధ భావాలు పుట్టపర్తివారి రచనలలోనూ, వ్యక్తిత్వంలోను కనిపిస్తాయి.

పండరీ భాగవతం, శివతాండవం, శ్రీనివాస ప్రబంధము, జనప్రియ రామాయణం వంటివి ఆధ్యాత్మిక కావ్యాలు. తిక్కన, పోతన, శ్రీనాథుల భక్త్యావేశం ఈ రచనల్లో కనిపిస్తాయి.

షాజీ, ప్రబంధ నాయికలు, రాయలనాటి రసికతా జీవనము, వసుచరిత్ర, సాహితీ సౌరభము...మొదలైనవి భావకవిత్వ వీచికలు, విప్లవ యోగీశ్వరుడు, సిపాయి పితూరీ, అగ్నివీణ, మేఘదూతము వంటి రచనలు విప్లవభావాలకు తార్కాణం.

వీరి మేఘదూతములో కారల్ మార్క్స్ 'దాస్ కాపిటల్', విశ్వనాథలోని భావకవిత్వ 'కిన్నెరసాని' భావాలు కలబోతగా కనిపిస్తాయి.

అవేశం, విప్లవ భావాలయితే...

అటు చూడవోయి! య
క్కటిక మూనగ దోయి!
కంకరను గొట్టుచున్నాడూ పొట్టతో
డొక్కలేర్చడు బిల్లవాడూ వాని కను
గ్రుడ్లులోని కన్నీరు – కొంచెము దిగజారి
కాయగాచిన వానికరమె గాల్చుచునుండె – మేఘదూతము

భావకవిత్వ ధోరణులు....

గలగలని చిఱునాదు
మొలనూలి మంజీర
తెలినీటి నగవు మంజీరా మదదిగ్ధ
లలిత యానంపు మంజీరా వగలాడి
యద్దానిమిసుకు చత్రాకార కుచతలము
లందు గనుమోడ్చి కొ, మ్మ అగడియసేపైన – మేఘదూతము

ఆచార్యుల వారి గురించి ఆచార్య జి. నాగయ్యగారు వివరిస్తూ "పుట్టపర్తి నారాయణచారార్యులు సరస్వతీపుత్రులు, మహాకవి, పద్మశ్రీవంటి బిరుదాంకితులు శతాధిక గ్రంథకర్త. 14 భాషాల నేర్పరి. బహుభాషావేత్తలు. సద్విమర్శకులు. ఆయన సంప్రదాయంలో పుట్టి, భావకవిగా పెరిగిన అభ్యుదయం వైపు తన దృష్టిని సారించిన ఆధునికులు" (తెలుగు సాహిత్య సమీక్ష–2–పుట–667)

సంప్రదాయం, ఆధునికతల మధ్య పయనం ఈ మాటల్లో వ్యక్తమవుతుంది.

క్షేత్ర సాహిత్యానికి పునాది వేసినవారు పుట్టపర్తి నారాయణాచార్యులు. రాయలవారి వేసవి విడిది గబ్బిలాల పాలవడం గాంచి మనసు ద్రవించి బాల్యంలోనే సాహిత్యకోటను సొంత ఊరిలో స్మరించుకోవడం 'పెనుగొండ లక్ష్మి' ఒక విలక్షణత. ఆ కావ్యం పాఠమై పరీక్ష తప్పడం మరో విశిష్టత. ముందు తరాలవారు చారిత్రక కావ్యాలు వ్రాయడానికి స్ఫూర్తిగా నిలవడం అత్యంత ప్రాముఖ్యత నిచ్చే అంశం.

'హంపి క్షేత్రము' కొడాలి సుబ్బారావు గారు, 'రామచంద్రుని హంపియాత్ర' గంటి సోమయాజిగారు, 'దక్షారామము' – ఇంద్రగంటి హనుమశాస్త్రిగారు వంటి వారికి మార్గదర్శకులయ్యారు.

'పెనుకొండలక్ష్మి' గురించి డా॥ సి.నారాయణరెడ్డి గారు వివరిస్తూ "ఈ కావ్యమును పుట్టపర్తినారాయణా చార్యులుగారు తన పంద్రెంద్రవయేట వ్రాసిరట. వారి పందొమ్మిదవ యేట ఇది ప్రచురింపబడినది. " 'హంపీ క్షేత్రము'న కంటెను 'పెనుగొండలక్ష్మి' పదునైదేండ్లు పెద్దదియే." అని పుట్టపర్తి వారే స్వయంగా వ్రాసుకొనినారు. అనగా ఈ కావ్యము 'క్షేత్ర ప్రశస్తి'కి చెందిన కావ్యాలలో మొట్టమొదటి దనవలసివచ్చును. ఇది కవిగారు చిన్ననాట వ్రాసినదైనను క్షేత్ర ప్రశస్తికి చెందిన మిగిలిన కావ్యములకు ఏ మాత్రము తీసిపోదు." (ఆధునికాంధ్ర కవిత్వము – పుట – 383).

'పెనుకొండలక్ష్మి'లో కవివేదన మన కళ్ళకు కట్టినట్లు ఉంటుంది.

పగతుర యెడంద నిప్పుకల్ రగులబెట్టి
యదధిగర్భంబు నుడివడి హోరుమనగ
తెనుగు ఢంకాలు మ్రోగిన దివ్యభూమి
కనుము తమ్ముడా జీర్ణంబు గగనమహాలు (పెనుకొండలక్ష్మి – గగనమహలు)

మాతృభాషకాని భాషలో నిఘంటవును కూర్చడం ఎంతో కష్టతరం. గ్రేస్ దొరగారి కృషిని నేటికి మరువం. అలాగే పరిభాష మళయాల నిఘంటువును సమకూర్చిన ఘనత పుట్టపర్తి వారికి చెందుతుంది.

పేరు ప్రఖ్యాతులకు ప్రాకులాడనివారు అరుదు. అటువంటి అరుదైన వ్యక్తిత్వం పుట్టపర్తి వారిలో కనిపిస్తుంది. ఏదైనా రచన మొదలెడితే కొన్నిసార్లు ఏకధాటిగా వ్రాసేవారట. మరికొన్నిసార్లు అగిపోయిన రచన కొనసాగింపుకు కొన్ని సంవత్సారాలు తీసుకొనేవారట. ఒక రచన బయటకు రావడానికి చాలా కాలం పట్టేదట. చాలా రచనలు ముద్రణకు నోచుకోలేదు.

ఒక్క పుస్తకం వ్రాసిన రచయిత రచనపై ఎం.ఫిల్; పిహెచ్.డిల పరిశోధన గావించే విశ్వవిద్యాలయాలు సరస్వతీపుత్రుని రచనలపై చిన్నచూపు చూసిందేమో అనిపిస్తుంది. 'వ్రాసినవి ఇతరులకు దానం చేయడంలోకొన్ని, ముద్రణ కాక కొన్ని కాలగర్భంలో కలిసిపోయా'యనే వారి పుత్రికల వేదనకు అర్థం వుంది.

కేరళ రాష్ట్రం త్రివేంద్రంలోని కేరళ విశ్వవిద్యాలయంలో ఇటిమాలజిస్ట్‌గా బాధ్యతలను 3సం॥ల చేసి, తర్వాత వదిలేశారు. ఢిల్లీలోని కేంద్రసాహిత్య అకాడమీకి చెందిన బహుభాషా గ్రంథాలయానికి లింగ్విస్టిక్ లైబ్రేరియన్‌గా సేవలు అందించడానికి నియమితులై, అక్కడి అధికారాలను తృణ ప్రాయంగా త్యజించారు. బడి పంతులుగా కడప గడ్డన బ్రతుకునీడ్చిన బహూబాష వేత్త వ్యక్తిత్వం విలక్షణం కాక మరేమిటి?

కుటుంబ ఆర్థిక స్థోమత గురించి పుట్టపర్తి నాగపద్మినిగారు ఇలా వివరించారు.

"తిరుమాస్కురు, ఢిల్లీ ఉద్యోగాలు వదిలి కడపలో 'శ్రీరామకృష్ణా హైస్కూలు'లో వంద రూపాయల జీతపు తెలుగు పండితులుగా స్థిరపడటం, ఆర్థికంగా సంసారానికి చాలా ఇబ్బందికరం...." (మానాన్నగారు – పుట-261).

పుట్టపర్తివారి విభిన్న భావాల గురించి అక్కిరాజు రమాపతిరావుగారు ఈ విధంగా తెలిపారు.

"ఆయన కవితా రచనలో నన్నయగారి నాద మాధుర్యం కూడా వుంది. పద్యంలో పదంలో, గేయంలో అక్షరరమ్యత సాధించారు. ఈ శతాబ్ది తెలుగు కవులలో వారిది ఒక విశిష్టమైన వ్యక్తిత్వం. ఒక విలక్షనమైన సాహితీ మూర్తిమంతం. పదిమంది సమూహంలో ఇట్టే పోల్చుకోదగిన ప్రతిభ ఆయనది" (తెలుగు సాహిత్యా చరిత్ర – పుట – 414)

"పెనుగొండ లక్ష్మి" నుండి "పద్మశ్రీ" వరకూ సాగిన వీరి సాహిత్య జీవన పయనం ఎన్నో ఒడిదుడుకులకు, ఆటుపోటులకు లోనయినట్లు అర్థమవుతోంది. ఒత్తిలా కాలిపోయి సాహిత్యాలోకానికి వెలుగునింపిన కర్మయోగి పుట్టపర్తి నారాయణాచార్యులు. తెలుగువాడి ఖ్యాతి తెలుగోడికి పట్టనట్టు – రాయలసీమ రత్నమయిన పుట్టపర్తి వారి రచనలను ఇకనైనా బూజుదులపడానికి విశ్వవిద్యాలయాలు, పరిశోధకులు, ప్రభుత్వం వారు పూనుకుంటారని ఆశిద్దాం.

**ఉపయుక్త గ్రంథ సూచి**

1. ఆధునికాంధ్ర కవిత్వము – డా॥ సి. నారాయణ రెడ్డి.
2. ఆంధ్రకవుల చరిత్ర – కందుకూరి వీరేశలింగం.
3. జనప్రియా రామాయణము – (బాలకాండము) – పుట్టపర్తి నారాయణాచార్యులు.
4. తెలుగు సాహిత్య సమీక్ష – 2 – ఆచార్య జి. నాగయ్య.
5. తెలుగు మణిదీపాలు – సంపాదకులు – మండలి బుద్ధ ప్రసాద్.
6. పుట్టపర్తి నారాయణాచార్యులు – డా॥ పుట్టపర్తి నాగపద్మిని.











**Compilation of Papers**
**presented in**
**International Conference**
**organised by**

**Department of Tamil**
Sri Venksatesara University
**Dravidian University**
**UVeS Iyer Library**
**Na Subbu Reddiar 100 Educational Trust**

**On the eve of**

**DIAMOND JUBILEE OF**
(1960 – 2020) **DEPARTMENT OF**
**TAMIL, SVU** (19 – 22 Feb 2020)

**Honouring Tamil Thatha**
**on his 166th Birthday (19 Feb 2020)**

| Dates | Place |
|---|---|
| 19 & 20 Feb 2020 | Department of Tamil, SVU [AP] |
| 20 - 22 Feb 2020 | Dravidian University [AP] |

# PAPERS ON ENGLISH
# [PAPERS 18 <::> 120 PAGES]

## Index

# John Donne's Modernism and Medievalism

**P Aiswarya Lakshmi**
Assistant Professor of English
New Prince Shri Bhavani Arts and Science College
aiswaryasakthi17@gmail.com

*****

The dominating characteristic of Donne is intellectuality, and this may partly account for the lack in him of some essentially mystical qualities, more especially reverence, and that ascension of thought so characteristic of Plato and Browning. These short comings are very well illustrated in that extraordinary poem, *The Progresse of the Soul.* The idea is a mystical one, derived from Pythagorean philosophy, and has great possibilities, which Donne entirely fails to utilize, for , instead of following the soul upwards on is way, he depicts it as merely jumping about from body to body, and we are conscious of an entire lack of any life or grandeur of thought. This poem helps us to understand how it was that Donne, though so richly endowed with intellectual gifts, yet failed to reach the highest rank as a poet. He was brilliant in particulars, but lacked the epic qualities of breadth, unity and proportion, characteristic destined to be the distinctive marks of the school of which he is looked upon as the founder.

Apart from this somewhat important defect, Donne's attitude of mind is essentially mystical. This is especially marked in his feeling about the body and natural law, in his treatment of love and in his conception of woman. The mystic's postulate if we could know ourselves, we should know all is often on Donne's lips are for instance in that curious poem written in memory of Elizabeth Drury, on the second anniversary of her death. It perhaps best expressed in the following verse:

**"But we know our selves least; mere outward shews**
**Our minds so store,**
**That our souls, no more than our eyes disclose**
**But form and colour. Only he who knows**
**Himself, knows more"**

*-(Ode: Of Our Sense Of Sinne).*

One of the marked characteristics of Donne's poetry is his continual comparison of mental and spiritual, with physical processes. This sense of analogy prevailing throughout nature is with him very strong. The mystery of continual flux and change particularly attracts him, as

it did the Buddhists and the early Greek thinkers, and Nettleship's remarks about the nature of bread and unselfishness are skin to the following comparison:

> **"Dost thou love**
> **Beauty? (And beauty worthy'st is to move)**
> **Poor cousened, *that* she, and *that* thou,**
> **Which did begin to love, are neither now;**
> **Next day repaires (but all) last dayes decay.**
> **Nor are, (although the river keepe the name)**
> **Yesterdaies waters, and to-daies the same."**
>
> *-(Of the Progresse of the Soul. The Second Anniversarie, II. 389-96)*

Donne believes firmly in man's potential greatness and the power within his own soul:

> **"Seeke wee into our selves in our selves; for as**
> **Men force the Sunne with much more force to passe,**
> **By gathering his beames with a chrystall glasse;**
> **So wee, if wee into ourselves will turne,**
> **Blowing our sparkes of virtue, may outbourne**
> **The straw, which doth about our hearts sojourne."**
>
> *-(Letter to Mr. Rowland Woodward).*

And although, in the *Progresse of the Soul*, he failed to expression to it, yet his belief in Progress is unquenchable. He fully shares the mystic's view that "man, to get towards Him that's Infinite, must be great." -*(Letter to the Countess of Salisbury).*

In his treatment of love, Donne's mystical attitude is most clearly seen. He holds the Platonic conception that love concerns the soul only, and is independent of the body, or bodily presence; and he is the poet, who, at his best, expresses this idea in the most dignified and refined way. The reader feels not only that Donne believes it, but, that he has in some measure experienced it; whereas with his imitators, it degenerated into little more than a fashionable 'conceit'. *The Undertaking* expresses the discovery he has made of this higher and deeper kind of love; and in the *Ecstasy* he describes the union of the souls of two lovers in language which proves his familiarity with *the* description of ecstasy given by Plotinus. The great value of this spiritual love is that it is unaffected by the time and space, a belief which is nowhere more exquisitely expressed than in the refrain of his little song, *Soul's Joy*—

> **"O give no way to griefe,**
> **But let beliefe**
> **O mutuall love,**
> **This wonder to the vulgar prove**
> **Our Bodyes, not wee move."**

In one of his verse letters to the Countess of Huntingdon, he expresses how true love cannot be desired:

**"Tis love, but with such fatall weaknesse made,**
**That it destroyes it selfe with its owne shade."**

He goes still further in the poem entitled *Negative Love,* where he says that love is such a passion as can only be defined by negatives, for it is above apprehension, and his language here is closely akin to the description of the One or the Good given by Plotinus in the sixth Ennead." -(*Caroline F. E. Spurgeon)*

Donne's mind had a medieval cast. Medieval logic, medieval theology, medieval cosmology, all worked in his mind, and through them he sought to achieve his intellectual and spiritual liberation. His passion for knowledge, even of the esoteric kind, was a Renaissance trait in him. He was both medieval and modern; he displayed the modern spirit in his skepticism, introspection, self-consciousness and self-analysis, and was interested in the empirical science then developing.

The scholastic philosophy of the Middle Ages had so much to do with the mental make-up of Donne. What were the subjects of study in the Middle Ages? Grammar, Rhetoric and logic were studied and they were known as the *Triviumi*: Music, Arithmetic, Geometry and Astronomy were studied, and they were known as *Quadrivium.* The Trivium and the Quadrivium were the basis of all learning in the Middle Ages. Aristotelian logic and metaphysics came to be diligently studied and cultivated, and finally invaded theology because of the fact that the learned men in that age were churchmen, and that they could not help applying Aristotelian logic to the subject of religion. John Erigena and other Irish Divines introduced philosophy and metaphysics into the discussion of questions of religion as early as the ninth century. And this was the method, afterwards followed by the schoolmen. Scholastic philosophy developed in the twelfth and thirteenth centuries. The schoolmen were Aristotelians; they drew their logic and metaphysics originally from the Latin translations of the works of Aristotle, made from the Arabic. It cannot be denied that the commentaries of Arabic doctors had some influence upon scholastic philosophy. It was an instrument of thought and reasoning that soon came to be applied to the study and examination of the Christian religion. We find it first in Lanfranc and Anselm. Abelard, however, applied it to skepticism. In any case the spirit of the Aristotelian philosophy expended itself upon religious speculation. "The scholastic logic became the universal instrument of thought and study; every branch of human learning was attempted to be pursued by its assistance and most

branches were more or less affected by its influence in regard to the forms which they assumed."

Peter Lombard published his *For Books of Sentences* about the middle of the twelfth century. It founded the system of what is called the Scholastic Theology. Donne was familiar with scholastic philosophy and theology, his early education being entrusted to Jesuits. At Oxford he is said to have studied Spanish, and particularly such Spanish mystics at St. Teresa and Luis de Granada, at Cambridge he had an opportunity of exercising his uncompromising logical faculty, which his early Jesuitical training had developed, for Cambridge was then a centre of religious controversy, and the final result was that he renounced the old faith, the faith of his "dear and pious parents". The schoolman's logic (which he was so skilled in applying) played an important part in his revolt. After all Donne was an individualist. He had read Augustine and Aquinas, and their ideas had been the groundwork of much of his thought but they could have no hold upon him. "Even in the days of his later sanctity he twisted them to his own uses, transforming them at the demands of his own convulsed, tortured and casuistical being into strange and fantastic shapes. He was, in short, a Protestant in the deepest and most stringent sense of the word, a man who claimed the rights and responsibilities of discovering truth and of ordering his life in relation to divine and demonical forces for himself. And his position was complicated by the fact that he was reared as a Catholic, and so expressed his own unique and eccentric problems in terms of the Fathers, the schoolmen, and the medieval jurists."

The point is that Donne made use of the material supplied by scholastic philosophy and scholastic theology, to which is to be set down the complexity of his poetry; he just put into use the traditional matter of medieval philosophy and psychology, medieval cosmology and scholasticism in his poetry and it was but resurrecting medievalism in poetry. But it may be doubted whether his heart was really in it. His main interest was the quest of truth. And so far as his personal being was concerned, his scholastic logic made a sad work of all this stuff. There seems to be a duality in him: he adopts medieval material in his poetry, but he rejects it in his personal life. His convulsed, tormented soul did not seem to have rest and peace even when he embraced Anglicanism. It was a soul divided against itself. If we read his inner being, as reflected in his poetry. He cannot be affiliated either to the Middle Ages or to the Renaissance. Donne is Donne a being with an obsession.

It would be better to illustrate the medieval cast of his thought from one or two of his poems. "We may take *A Nocturnall upon S. Lucy's Day*. It sketches the setting of the scene midnight, the shortest day, the winter solstice then the conceit of St. Lucy's 'unmasking' for only seven hours and the ironical comparison of the sun to a flask of spent gun-powder. The line 'The world's whole spa is sunk', emphatically suggests the deadness of the season, followed by the medical metaphor ascrinbing the fall of the sap to the earth's dropsy.

'Quintessence' with the alchemists of the Middle Ages made us familiar is, in medieval philosophy, the fifth essence of which things are composed, the other four being earth, air, fire, and water at first considered immaterial, but later material and capable of extraction, Love here extracts the quintessence, and when the lover says that he is 'every dead thing,' he means that he is the quintessence of all negations and 'privation' is also used in its strict philosophical sense of 'absence' of a quality and the lover speaks of his being 'rebego'. As we see here, in this poem, Donne draws upon ideas and concepts, supplied by metaphysics, cosmology, natural science, medicine, and alchemy as they were known in the Middle Ages. In *The Extasie* too we have to deal with the same or similar set of ideas and beliefs, current in the Middle Ages.



(☺)(☺)(☺)(☺)(☺)

# The Influence of Sangam Akam Poetry on Contemporary Women's Poetry in English

**Ms Shruti Sareen**
PhD Scholar
Department of English, University of Delhi
shrutanne@gmail.com
*****

In this paper, I will briefly try to trace the influence of Tamil Sangam poetry on modern day Indian women's poetry in English, in the work of a few poets such as Priya Sarukkai Chabria (Tamil, based in Pune), Sharanya Manivannan (Sri Lankan and Indian Tamil, based in Bangalore/Chennai), in a few stray poems by Tishani Doshi (Gujarati-Welsh, based in Chennai) and Aditi Rao (from Andhra Pradesh, based in Delhi), and by other poets such as Rochelle Potkar (Goan, based in Bombay), Margaret Mascarenhas (part Goan, now posthumous), Uddipana Goswami (Assamese, based abroad), Monica Mody (Bihar, based abroad), Annie Zaidi and several others. While some, such as Chabria may admit to consciously being influenced by Sangam poetry, others may have subconsciously imbibed its influence and perhaps it is not deliberate at all on the part of the poet. However, I can trace some patterns and similarities with Sangam poetry, in some places where Sangam rules of akam poetry are quite accurately followed and in others where the basic Sangam technique of objective correlation to signify emotional states through landscapes may have been further stretched and where poets have extended the metaphors and have used it in their own ways. As there is a lot of such objective correlation between emotional states and landscapes in love poetry, I will only be able to mention these very briefly in this paper and I cannot undertake a thorough discussion of each poem. I must also mention that this influence does not exclusively come from Sangam poetry. As Priya Sarukkai Chabria mentions, Kalidasa's Rtusamhara and its changing seasons and objective correlation of these has also influenced her profoundly. Influences may also come from Western culture, where symbols of flowers and water, for example, are abundantly found in love poetry. However, here I shall try to limit myself to the theme of the conference, and the prescribed length required. I will also briefly discuss how the Tamil Sangam concept of thozhi or thorzi and the corresponding sakhi figure in Sanskrit literature which loosely translates in English as a very close female friend of the girl, albeit non- sexual, is in play in some of these present day poems in English.

In this context, it is first essential to go back to classic Tamil Sangam poetry[1] where it has been the tradition to describe various aspects and moods of love through metaphors of nature and landscape, as Tamil poets such as Sharanya Manivannan and Priya Sarukkai Chabria show a strong presence of these traditions in their poetry. Sangam poetry functions according to specific landscapes such as deserts, rain or mountains to represent various stages and forms of love such as meeting, parting, mourning, and unrequited love. These rules are laid out in the ancient Tamil grammar, Tholkappiyam, which consists of three books defining rules for phonology, morphology, syntax, rules of grammar, and also of literature. The last of the three, Porulathigaaram, is divided into several parts which lay down injunctions of how to behave in private and public life, how to expose secret love, how to behave as a united couple and how to act while revealing the love before kith and kin. It also shows how to describe various feelings and the metaphors to be used for them. Tamil Sangam poetry has traditionally been divided into the akam and the puram. The akam is the inner, domestic sphere of the home, the domain of the woman. These poems usually deal with love, emotions, and the realm of the inner. Puram poems, however, are located in the public sphere, the arena of the man, and are usually about victory in war, conquests, and praises to the kings. The akam poems are characterized by various landscapes named after the specific flowers and trees of the region which correspond to the various moods. These implied metaphors which require a detailed understanding of the flora, fauna, climate and their symbolism are known as *eraichi*. The connections of these allusions to nature are not explicitly described within the poems themselves. Here, the mountainous region or kurinji, named after the white kurinji flower of the region, is supposed to show the secret union of lovers at night. Forests with lakes, waterfalls, rivers, bamboos, teak and sandalwood trees abound in this landscape. The entire landscape is manufactured so as to express the particular emotion and to serve as a metaphor for it. The forests or mullai are supposed to be the place where the lover waits for his beloved to appear. Here the anxious heroine grieves over separation. These forests are once again replete with waterfalls, teak and sandalwood trees. Mullai, or the jasmine flower, is the main flower of the forest. The croplands, or marutham, are the place where the girl displays a mixed show of coquetry and moodiness as the lover visits her. It is also associated with lovers eloping with each other. This shows that rebellion and dissent were present in ancient Tamil society, and rules of patriarchy and caste were not always

